# ADVERTISERS' INDEX

49
సంచిక

# ఆంధ్రపత్రిక

సంవత్సరము
1958-59

## విలంబి ఉగాది సంచిక

## విషయానుక్రమణిక



## త్రివర్ణ చిత్రములు

రాధాకృష్ణులు : అల్లు సూర్యారావు
[ముఖచిత్రం]

స్వామిసన్నిధికి : శ్రీ గరిమెళ్ల విశ్వనాథం

సనాతనులు : శ్రీ రణవీర్ శాక్జానా




నూత్న సృష్టి

చిత్రకారుడు : శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ

శ్రీ శ్రీ

# ప్రస్తావన

సూర్యకుటుంబ గ్రహకూటమి ఈ విశాల విశ్వంలో బిందుప్రాయమైనది. విశ్వానికీ సూర్య కుటుంబానికీ ఉండే అంతరాన్ని అవగతం చేసుకోవటానికి ఒక్క విషయాన్ని గమనించితే బోధపడుతుంది. సూర్యునికీ భూమికీ వున్న దూరం 9 కోట్ల 30 లక్షల మైళ్ళు. సూర్యుని కాంతి భూమిని చేరుకోవటానికి ఎనిమిది నిమిషాలు పడుతోంది. శక్తివంతమైన దూరదర్శిని సహాయంతో చూస్తే దూరదూరాంతరాలలో మనకు అనేక నక్షత్రాలు కనుపించుతాయి. ఆ నక్షత్ర రాశిలోని కొన్నిటి కాంతి భూమిమీద పడటానికి అనేకకోట్ల సంవత్సరాలు పడుతుంది. విశ్వమును గురించిన ఈ ఊహ మనకు విభ్రాంతిని కలుగజేస్తుంది. మహావిశ్వంలో ఈ భూగోళం ఎంత ? ఈ భూగోళం మీద జీవించుతుండే మానవుడు ఎంత. కాని, శారీరకంగా ఈ మానవుని ఉనికి స్వల్పమైనదైనా మానసికంగా ఇతని శక్తి అజేయమైనది. విశ్వవ్యాప్తి కావటానికి మానవుడు చేస్తున్న ప్రయత్నానికి గత సంవత్సరంలో ప్రాతిపదికలు ఏర్పడినాయి. విశ్వావరణ పరిశోధనకు అనువుగా గత అక్టోబరు 5 వ తేదీన ఒక కృత్రిమగోళాన్ని రష్యనుశాస్త్ర విజ్ఞానవేత్తలు ఆకాశపథంలోకి విసిరారు. ఈ కృత్రిమగోళం మరొక చంద్రగ్రహంవలె భూమిచుట్టూ తిరగటం యావత్ ప్రపంచాన్నీ తన్మయులను చేసింది. విశ్వవిజయానికి ఇది మానవుడు విజయవంతంగా చేసిన తొలి దండయాత్ర. ఆనక అమెరికనులుకూడా ఈ ప్రక్రియను సాధించి మరొక గోళాన్ని వదిలారు. ఉభయత్రా తీవ్రతరమైన పరిశోధనలు సాగుతున్నాయి. ఇది ఎంతైనా ఆహ్లాదించవలసిన విషయం. కాని ఇది ఎంత సంతోషించవలసిన విషయమో అంత భయపడవలసినదిగా కూడా వుంది. ఈ క్షణంలో మానవుడు ఒక్క తప్పటడుగువేస్తే ఈ భూగోళం ధ్వంసమైపోతుంది. మానవుని సహనశీలతకు ఇది పరీక్షాసమయం.

భగవంతుణ్ణి వరాలు కోరరాదంటారు. ఎందుచేతనంటే ఈ జగత్తు సుఖదుఃఖాల ద్వంద్వం. ఇందులో ఫలానిది మంచి అనీ, ఫలానిది చెడు అనీ లేదు. కర్త యొక్క మానసిక సంస్కృతినిబట్టి మంచిని చెడుగానూ, చెడును మంచిగానూ ప్రవర్తింపచేయవచ్చు. తన మనస్సేమిటో మనిషికి ఇంతవరకు ఆవగింజలో అర్థభాగంకూడా బోధపడలేదు. అందుచేత నిజంగా ఏది అత్యంత ప్రయోజనకరమో మనం సరీగా నిర్ణయించలేము. ఈ పరిమితులను గమనించే పెద్దలైనవారు, సర్వజ్ఞత్వం వహించటం మంచిదిగాదనే హెచ్చరికగా సర్వజ్ఞుడైన భగవంతుణ్ణి ఇది నాకు కావాలని అర్థించకూడదన్నారు. మనం మనమంచికి ఉపకరించుతుందని ఏదో ఒకవరం కోరుకుంటాం; దాంతోపాటు సంక్రమించే ఇతర అనర్థాలను మనం ఊహించలేక చివరికి అది 'భస్మాసురంగా' తయారుకావచ్చు. ఇపుడు సరిగా అదే ప్రమాదం కనుపించుతూవుంది.

ఈ మహా విజ్ఞానాన్ని భగవంతుడు ప్రసాదించాడంటే శాస్త్ర విజ్ఞానవేత్తలు అంగీకరించకపోవచ్చు. పోనీ మానవుడే సాధించాడని అందాం—తగూ లేదు. కాని ఇది అప్రధృష్యమైన మహాశక్తి. దీన్ని మానవ కళ్యాణంకొరకు ఉపయోగించుకోగలిగితే ఇది భూమిని స్వర్గంగా మార్చుతుంది. తప్పటడుగువేస్తే ఈ భూమి వుండదు. భూమిసంగతి యేమైనా జీవరాసి వుండదు.

గత సంవత్సర పరిణామాలను గమనించితే ఉభయ విజిగీషు మండలాలు ఈ ప్రమాదాన్ని గుర్తించి కయ్యానికి కాలుదువ్వే పద్ధతికి కొంత స్వస్తి చెప్పినట్టే కనుపించుతుంది. పైకి ఎట్టి మేకపోతు గాంభీ

త్నాలు వహించినా జయమనేది ఉభయత్రా ఆదరించింది. తాత్కాలికంగా ఇది నిజానికి సంతోషించవలసిన సంగతే. కాని విద్వేషసంయుక్తమైన భీతి చిరకాలం ఇలా వుండటం మంచిదికాదు. ఉభయ విజీషు మండలాలూ ఏదైనంత త్వరలో ఈ పరిస్థితిని సరిదిద్దుకోవాలి. ఇట్టి సామరస్యభావం యేర్పడటానికి కొంత ప్రయత్నం జరుగుతూవుండటం ముదావహం. ఈ నూత్న వసంతంలోనే అధినాయక సమావేశం జరుగుతుందని ప్రపంచ ప్రజాహృదయం మధుమయం కాగల అవకాశం యేర్పడగలదనీ ఆశించుదాం.

ఇట్టి సమావేశం ఫలించుతుందా అని నిరాశావాదులు ఆశంకించవచ్చు. ఈ సమావేశం తక్షణ ఫలితాల నివ్వకపోయినా ఉభయత్రా సుహృద్భావం పెంపొందటానికి వాతావరణం ఏర్పడి తీరుతుంది. 'జనీవా సమావేశం' చెప్పుకోదగిన ఫలితాల నేమీ సాధించలేకపోయినా ఇట్టి వాతావరణాన్ని కొంత కలుగజేసిందనటం నిర్వివాదం. జనీవా సమావేశమే జరుగకపోయివున్నట్లయితే, ఇప్పుడు పునః ఇట్టి ప్రయత్నం జరగటానికి అసలు ఆస్కారమే వుండేది కాదు.

ప్రపంచావధిని యుద్ధంసాగే ఆస్కార మేమీ లేకపోయినా, అజ్ఞానంగా ప్రవర్తించితే చిన్ని చిన్ని రాజ్యాలు తమలో తాము కలహించుకుని ఈ అగ్రరాజ్యాలకు బానిసలుగా తయారయ్యే ప్రమాదం ఒకటి వ్యాపించుతోంది. ఈ కలహాలకు వెనుక అగ్రరాజ్యాలు ఆడుతున్న నాటకాలు ఎలాంటివో సర్వులకూ తెలుసు.

'కాశ్మీర్' తగాయిదా అంటూ ఒకదాన్ని సృష్టించి, ఏడనెడా సమిధలు వేస్తూ, ఆ సెగడు ఆరకుండా శ్రద్ధ తీసుకుంటున్నారు. గోవా సమస్య నొకదాన్ని అలాగే చచ్చిన గేదెదూడను ఈడ్చుకువచ్చినట్టు వ్యయప్రయాసల కోర్చి యీడ్చుకువస్తున్నారు. ఇండోనేషి దూలో చిచ్చుపెట్టారు. జర్మన్ సమస్యను 'శిష్యా ఇది అసంభవం' అనే ధోరణిలో పరిపోషించుకొస్తున్నారు. సువర్ణసరా ప్రాంతంలో రెచ్చగొట్టబడిన కల్లోలం నిజంగా ప్రమాదభరితమైనది. ఈ పద్ధతిని తగాయిదాలు రెచ్చగొట్టినందువల్ల అజ్ఞానంలో పడిన ఈ అల్పరాజ్యాలు పాడైపోతేపోవచ్చుగాని, ఇందువల్ల భవిష్యత్తులో ఈ అగ్రరాజ్యాలు బావుకోగలిగిందేమీ లేదు—వట్టి చేతిచమురు భాగోతం తప్ప. మెదడున్న వాడెవడైనా ఈ విషయాన్ని తేలికగా వూహించగలడు. మరి దేనికయ్యా ఈ ఆర్భాటాలన్నీ అంటే—యేమి చెబుతాం? అందుకే "బావా నీచిచ్చు నీకు వదలదు" అన్నాడు మహాకవి.

ఇలాంటి వెఱ్ఱిమొఱ్ఱి పిల్ల పిచూరీలలో యిరుక్కుంటే దెబ్బతినేది చిన్నరాజ్యాలు కనుక ఈ చిన్న రాజ్యాలు తెలివిగా సంచరించవలసి వుంది.

కొన్ని కొన్ని చిన్నరాజ్యాలలో ఇట్టి వివేకం పొడసూపుతూ వుండటం ముదావహం. ఇరువాగులవారి చేతులలోను ఇరుక్కోకుండా తమలోతాము ఏకమై ఆత్మరక్షణకొరకు బలాన్ని చేకూర్చుకోవాలనే అభిలాష ఒకటి చిన్న రాజ్యాలలో కలుగుతోంది. సిరియా-యీజిప్టు సమైక్యత దీనికి నాందిరూపంలో కనుపించుతోంది.

ఆ యీ విషయాలను అవగతం చేసుకుంటే అంతర్జాతీయ పరిస్థితి కొంత శాంతిముఖమైనట్లే మనం లెక్కవేయవచ్చు.

ఈ తరుణంలో అంతర్జాతీయంగా ఇట్టి ప్రశాంత వాతావరణం ఏర్పడటం భారత జాతీయ పురోగమనానికి ఎంతైనా అవసరం. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక దిగ్విజయం కావటానికి, ధనరూపంలో నైతేనేమి, యంత్రాలరూపంలో నైతేనేమి, సాంకేతిక విజ్ఞాన రూపంలో నైతేనేమి మనం విదేశాలనుంచి ఎంతో సహాయాన్ని పొందవలసివుంది. అంతర్జాతీయంగా ఏదైనా కల్లోలం వ్యాపించి ఎవరి యిల్లు వారే చక్కబెట్టుకోవలసిన దుస్థితి యేర్పడితే ఈ కార్యక్రమాని

కంతకూ అఘాతం ఏర్పడుతుంది. అందుచేతనే మనం సర్వదా శాంతిని వాంఛించుతున్నాం. అంతర్జాతీయ శాంతిని వాంఛించటమేగాక, సహించరాని ఏదో అమానుష పరిస్థితి ఏర్పడితేతప్ప, మనం ఏచిన్న తగాయిదాలలోనూ తలదూర్చేదికూడా లేదు. ఈ విషయాన్ని మన నాయకులు దినదినం ప్రపంచానికి చాటిచెప్పతూనే వున్నారు. మన పురోగమనాన్ని సహించలేని కొందరు, యిష్టంవచ్చిన ప్రసంగాలుచేసి మనలను రెచ్చగొడుతున్న మాట నిజమే. కాని మన సహనశక్తికే అలాంటి పరీక్ష వచ్చినప్పుడు మనం మరింత అప్రమత్తులమై వ్యవహరించవలసివుంది.

ద్వితీయ ప్రణాళికా నిర్వహణలో, గత సంవత్సరం, కొన్ని యీతిబాధలు కనుపించినాయి. ముఖ్యంగా విదేశీ చెల్లామణీ విషయంలో పెద్ద చిక్కేయేర్పడింది. కాని గత రెండు మాసాలలోనూ పరిస్థితి చాలా చక్కబడ్డది. అసలు ఈ పరిస్థితి యేర్పడటానికి, విజిగీషు మండల దేశాలు మన విదేశాంగ విధానాన్ని సక్రమంగా అవగతం చేసుకోకపోవటం ప్రధాన కారణం. కాని అట్టి పరిస్థితి ఇప్పుడు చాలా మారింది. మన విధానం నేడు సర్వులకూ విస్పష్టమైపోయింది. అందుచేతనే తాహతుగల అన్ని దేశాలూ ఇంతో అంతో మనకు సాయపడటానికి ప్రయత్నించుతున్నాయి. ద్వితీయ ప్రణాళిక నిర్విఘ్నంగా కొనసాగగలదు.

పన్నుల భారంవల్ల వ్యక్తిస్వామిక పారిశ్రామిక రంగం క్రుంగిపోయే పరిస్థితి యేర్పడినట్లు ఆర్థిక వేత్తలు అనేకమంది విమర్శించుతున్నారు. ఈ విషయమై పునరాలోకన జరిగి పరిస్థితి చక్కబరచగలరని తలచవచ్చు. జరగవలసింది సర్వతోముఖాభివృద్ధిగాని, అది వ్యక్తిస్వరంగమా, ప్రభుత్వరంగమా అనే ప్రసక్తి ప్రయోజనరహితమైనది. ఈ ప్రణాళికా నిర్వహణ సాధ్యంకావటానికి, ప్రజా సహకారం పరమ సాధనం. సకల భారతదేశమూ ఏకవ్యక్తిగా కృషిచేస్తేనేతప్ప ప్రయోజనంలేదు. ఈ విషయాన్ని గ్రహించలేని కొందరు లేనిపోని విపరీతాలను రెచ్చగొట్టటానికి ప్రయత్నించుతున్నారు. ముఖ్యంగా 'అధికార భాషా వివాదం' అనర్థదాయకమైనది. ఈ వాదాల యుక్తాయుక్తతను గురించి ఇప్పటికే అనంతఘోషగా వుండి గనుక ఇక్కడ తిరిగి చర్చించవల్సిన ప్రయోజనంలేదు. కాని ఆంగ్లభాషకు స్వస్తిచెప్పాలనుకోవటం కేవలం అజ్ఞానాంధకార ప్రవేశానికేనని హెచ్చరిక మాత్రం చేయకతప్పదు. ఏదో రకంగా ద్వంద్వయుద్ధం చేయాలనే సంకల్పంవుంటే ఆ సర్దా తర్వాత తీర్చుకోవచ్చును. ప్రణాళికా పరిసమాప్తివరకైనా ఈ సద్యాటలకు స్వస్తిచెప్పటం మంచిది. ఇదంతా తోచీ తోచని వ్యర్థ కార్యక్రమం. తప్పేవరిదని యోచించకుండా ఆలోచిస్తే మతంపేరా మట్టిపేరా తగాయిదా తెచ్చుకునేగదా దేశాన్ని రెండుగా చీల్చుకుని లక్షోపలక్షల అమాయిక ప్రజను గంగా సింధు నదులలో నిర్దాక్షిణ్యంగా ముంచివేశాం. తప్పెవరిదైతే నేమి? ఈ భాషా వివాద సమస్యను ఇంకా ఇలాగే కొనసాగించదలిస్తే తిరిగి యీ దేశానికి అదే దుర్గతి పడుతుంది.

ఈ విషయాన్ని ఇలా యోజించగానే మౌలానా అజాద్ నామం స్ఫురణకువచ్చి విషాదం కలుగుతోంది. నాడు దేశానికి అలాంటి దుర్గతి పట్టకుండా అరికట్టడానికి ప్రయత్నించిన మహామహులలో ఆజాద్ ఒకరు. ప్రాచ్య విజ్ఞానవేత్తలలో అంతవాడు మరొక డెవరూ కనుపించడు. విద్యామంత్రిగా ఆయన నిర్వహించిన పాత్ర ప్రశంసనీయమైనది. అసలు ఆయనకు రాజకీయములందు ఆసక్తి తక్కువ. తొలుదొల్త ఆయన రాజకీయరంగంలోకి ఉరికింది, 'కిలాఫత్' ఉద్యమంలో దేశవిభజన ఆ విజ్ఞానఖని హృదయానికి ఎంత క్షోభను కలిగించిందో మనం ఊహించలేము. ఆమహామహుని అస్తమయం భారతీయ విజ్ఞానరంగంలో ఒక దివ్యతార అస్తమయం.

ప్రణాళికా లక్ష్యాలను దృష్టిలో వుంచుకుని మన ఆంధ్రప్రభుత్వంకూడా శక్తివంచన లేకుండా కృషి

చేస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరం, స్వరాష్ట్రం లేకపోవటంవల్ల యేర్పడిన యీతిబాధ లన్నీ తీరి యిప్పుడిప్పుడే కొంచెం తలెత్తుకోగలుగుతున్నాం. స్వల్పలాభ నష్టాలకేమి—సరిహద్దు తగాదాలనేవి తీరిపోవటం మనకు చిక్కు దీసుకున్నట్టుగావుంది. ఈ వ్యవహారంలో ఆంధ్ర మద్రాసు ముఖ్యమంత్రులు ప్రదర్శించిన దూరదృష్టి ప్రశంసనీయమైనది. మనం సరిహద్దు ప్రజలం. ఎప్పటికైనా కలసిమెలసి బ్రతుక వలసిన వాళ్ళం. అల్పసంఖ్యాకుల రక్షణకైకూడా తగు యేర్పాట్లు త్వరలో జరుగగలవని ఆశించుదాం.

పూర్వం రాష్ట్రంలేని కారణంగా కేంద్రంలో మన మొరాలించే నాధుడెవడూ వుండేవారుకారు. ఇప్పుడు ఆ స్థితి మారిందని చెప్పవచ్చు. మనలోని ప్రతిభావంతులను కేంద్రంగుర్తించి ఉపయోగించు కోవటానికి ప్రయత్నించుతోంది. శ్రీ కొత్తా రఘు రామయ్యగారికి తొలుదొల్త కేంద్ర మంత్రివర్గంలో స్థానం ఇచ్చారు. నిన్న మొన్నగా శ్రీ బెజవాడ గోపాల రెడ్డి, శ్రీ అహమ్మద్ మొహియుద్దీనుల నియామకంతో ఇప్పుడు కేంద్ర మంత్రివర్గంలో మనవారు ముగ్గురు కను పించుతున్నారు. ఆంధ్రుడే లోకసభ సభాపతిగా వ్యవహరించుతూ, ఒక మహత్తర సంప్రదాయాన్ని నెలకొల్పు తున్నారు. నాయకులలోనేగాక ఉద్యోగి వర్గాలలో కూడా మనవారి ప్రతిభావిశేషములను కేంద్రం గుర్తించుతున్న సూచన లున్నాయి. మన రాష్ట్రమునకు ప్రధాన కార్యదర్శిగా పనిచేసి అనేక దుర్ఘటకార్యాలను సాధించిన శ్రీ పుల్లారెడ్డిని రక్షణశాఖలోకి తీసుకున్నారు. సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా మన ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు నాయుడుగారి నియామకం, అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శిగా శ్రీ సత్యనారాయణరాజుగారి నియామకం, వీటన్నిటికీ తలమానికములైనవి. ఈ ఉగాది పండుగనాటికి ఇట్టి పరిణామం రావటం సర్వాంధ్రప్రజలకూ హర్షదాయకంగా వుంది.

కాని ఈ సంతోష సమయంలో 'ఆంధ్ర—తెలంగాణా' నినాద మొకటి రాజధానిలో విషవాక్కులా వినిపించుతూ వుండటం చాలా విచారకరం. ఈ వాతావరణాన్ని వెంటనే పరిష్కారం చేసుకోకపోతే సిద్ధాన్నం కూలదోసుకున్న వాళ్ళమవుతాం. వెనక కొందరు 'రాయలసీమ - ఆంధ్ర' అంటూ ఇలాగే అర్థంలేని నినాదాలుచేసి చిరకాలం మన భాగ్యోదయానికి అడ్డు నిలిచారు. ఈనాడు తిరిగి అదే చరిత్ర పునరావృత్తమవుతోంది. బాధ్యతగల ప్రతిఒక్కరూ ఈవిషయాన్ని గుర్తించి భావిభాగ్యోదయంవైపు దృష్టిసారించ గలరని ఆశించుదాం. ఇట్టి చర్యలు ప్రజాబాహుళ్యం హర్షించేవి కాదు.

మనలోవున్న ఈ స్వల్పవ్యగ్రతలు సమసిపోవటానికి ఈవేళ తలంటిపోసుకుని మరింత వేపపూప్రసాదం స్వీకరించుదాం. శుభం.



# విశాలాంధ్రము

శ్రీ జ్ఞానానందము

తొలఁగఁ జీకటిరేలు వెన్నెలల కాంతుల్ నిండె నీనాఁడు నీ
వలపుల్ బిడ్డలు స్వీయరాష్ట్రమును సంపాదించి నీ పూజకై
నిలువన్ జొచ్చిరి గోలుకొండ పురిలో నీమేల్మి యాశీస్సుతో
వెలయన్ దన్పుము; ముద్దుగుఱ్ఱలను తల్లీ! ఆంధ్ర రాజ్యేందిరా!

ఎన్నాళ్ళైనదొ? యన్నదమ్ములకు నేఁడీ దివ్యసంధాన సం
పన్నత్వంబు లభించి నీ చలువ గర్భం బెంతగాఁ బండెనో
మన్నికలై జగనొబ్బగండలయి బ్రహ్మాండమ్ము చేమొక్కఁగాఁ
గొన్నంజాలెడి గున్నలెల్ల నొకచోఁ గూడంగ నాంధ్రావనీ!

ఈ జగానేలలో నిబ్రహీం కుతుబుషా
  శారదాంబకు మేలి చీరఁగట్టె
ఈ పుణ్యభూమిలోనే యన్న గోపన్న
  భద్రాద్రి శ్రీరామభజనఁ జేసె
ఈ యోరుగలు త్రోవనే కళావేత్రి మా
  చల్దేవి దివ్య లాస్య మొనర్చె
ఈ కాకతీయ రాజ్యేందిరాంగణములో
  భక్తపోతన్న కావ్యమ్ము వ్రాసె

ఈ పసిండినేలనే, బ్రహ్మనాయుండు
బాలచంద్రు తాండ్ర పాపరావు
నీ పదాంబురుహాపు నీడలో మెలగిరి
దివ్య కల్పవల్లి! తెలుగు తల్లి!

పురివిప్పునే? నేఁడు గిరిమీఁద నాంధ్రావ
  ప్రత్యగ్రమైన సాహిత్య బర్హి
వికసించునే? నేఁడు సకలాంధ్ర వనవాటి
  ప్రేమార్ద్రభావచాంపేయ సుమము
తనియించునే? నేఁడు తెనుగు పెత్తనదారి
  కడుపు మాడిన బిచ్చగాని క్షుత్తు
విదళించునే? నేఁడు ముదురు బుఱ్ఱల మేధ
  కశ్మలంబైన వర్గాల పోరు
చివురులెత్తునే? నేఁడు సుస్నిగ్ధచిహ్న
దివ్యచైతన్య భావనోద్దీపిక తరు
లీ-మహాంధ్రాన నాజన్మ భూమిలోన
అనుపమోజ్జ్వల పికవాణి! తెనుఁగురాణి!

ఈ, నా తెలంగాణ బృహదాంధ్ర భూమికిన్
మకుటాయమానమై మనలునాఁడు
ఈ, నా మహాగౌతమీనదీతోయమ్ము
చవిటి పఱ్ఱకుయాత్ర సలుపునాఁడు
ఈ, నా ప్రశస్థభాష యెనలేని గౌరవా
భరణకిరీటమ్ముఁ దాల్చునాఁడు
ఈ, నా తెలుగు జాతిలో నైకమత్యమ్ముఁ
గలుపుగోలుతనమ్ము వెలయునాఁడు

తొల్లి కాకతీయవల్లభుల్ చాళుక్య
నృపులు విజయ నగర పృథివి పతులు
మఱియు రెడ్డి దొరల పరిపాలనపు సౌఖ్య
ములరగలదు నేడు తెలుగుతల్లి!
అలసిపోతివి తొంటి గోలుకొండ సులతాను
కలుషితంబైన రక్షణమువలన

నలిగిపోతివి తెన్గు కాలమన్న మా 'కన్న'
కరడుఁ గట్టిన మతాంతరమువలన
విసిఁగిపోతివి యల్ల ముసునూరి ప్రోలయ్య
బాధాకరపు మృత్యుగాథ వలన
వణకిపోతివి రణప్రౌఢుండు కాపయ్య
తలపులో జనియించు వలపు వలన

అయిదు వందలేండు లామీద జరిగిన
సంకులంపు సమర చరితమ్ము
తెలుగు భాగ్యపురిని తొలికోడి కూసెను
ఎగురనిమ్ము తెలుగు పృథు పతాక

ఇట నాగావళి వంశధార శబరీ యీ కృష్ణగోదావరీ
చటులోత్తుంగ తరంగ తుంగ విచలత్ చంపావతీ పెన్నయు
త్కటమం జీరయుఁ గిన్నెరమ్మయును బంగారమ్ముఁ బండింప నీ
చిటికూనల్ సుఖియింత్రు గావుత! కళాశ్రీ! ఆంధ్ర రాజ్యేందిరా!








సరసము, తేలిక, దిట్టము.

అయిన

ఈ ట్యూబ్ సైకలర్

మడత కుర్చీలు

ఇండ్లు, ఆఫీసులు, హోటళ్లు, బళ్లు, వైద్యశాలలు వగైరాలకు ముచ్చటగా అమరును. అందమైన రంగుల్లో అందజేయబడును.



డిస్ట్రిబ్యూటర్లు:

అడిసన్ & కంపెనీ (ప్రైవేట్) లిమిటెడ్,

158, మౌంట్ రోడ్,

మద్రాసు-2

శ్రీ

# భారత లక్ష్మీ బ్యాంకు

## లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : మచిలీపట్టణం.

సెంట్రల్ ఆఫీసు : మద్రాసు.

(స్థాపితం : 1929) ... (షెడ్యూల్డు : 1945)

—(౦)—

**బ్రాంచీలు:**

మచిలీపట్టణం, గుడివాడ, నూజివీడు, నర్సాపురం, రాజోలు, గవర్నరుపేట (విజయవాడ), కాకినాడ, రామారావుపేట (కాకినాడ), విశాఖపట్టణం, బొబ్బిలి, కావలి, గూడూరు, మద్రాసు, విజయవాడ.

**ఫిక్సెడు డిపాజిట్లు:**

ఫిక్సెడు డిపాజిట్లు సం॥రం కు నూటికి రు. 3½ మొదలు రు. 4½ వడ్డీతో అంగీకరింపబడుచున్నవి.

కరెంటు, సేవింగ్సు, షార్టునోటీసు, కాల్ డిపాజిట్లు అంగీకరింపబడుచున్నవి.

మా మూడు సం॥ ముల క్యాష్ సర్టిఫికేట్లు ఒక ప్రత్యేకత

ధాన్యము, అపరాలు మొదలగు అన్ని సరకుల హామీపై అప్పులు యివ్వబడును.

అన్ని రకములయిన బ్యాంకింగ్ వ్యాపారములు జరుపబడును.

వివరములకు మా బ్రాంచీలకు వ్రాయప్రార్థన.

| | |
|---|---|
| పి. వి. రాఘవరెడ్డి, బోర్డు ఆఫ్ డైరెక్టర్ల అధ్యక్షులు. | సి. ఎన్. సీతారామయ్య, సెక్రటరీ. |



తుమ్మెద పుష్పంచేత ఆకర్షింపబడినట్లే
ప్రజలందరు ఆకర్షింపబడుతున్నారు

**ప్రెసిడెంట్**
టాయిలెట్సుచే

వెజిటబుల్ హెయిర్ ఆయిల్
టాల్కము పౌడరులు &
స్నో



రజేద్ ట్రేడింగ్ కం.,
మద్రాసు.

A.S.











బీ
వు
డీ
భా
టు




S. ISMAIL & SON. WASHERMENPET








# జీవనగంగ

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

స్టేషన్లో బండి తప్పి ఆగింది!

ఆ స్టేషను ఆవరణలో ప్రయాణీకుల రద్దీ పల్చబడింది. స్టేషను మాస్టరు దీపాలు ఆర్పేసి పడక వాల్చబోతుంటే ఒక స్త్రీ కంఠం వినిపించింది. కళ్ళజోడు సవరించుకుంటూ ఆయన ఇవతలికి వచ్చి "ఏం కావాలమ్మా?" అంటూ ఆ స్త్రీని ప్రశ్నించారు.

ఆమె నుదుటిమీద కంటా కప్పుకున్న ముసుగుని ఇంకా ముందుకు లాక్కుంటూ "పట్నంపోయే బండి ఎన్ని గంటలకు వస్తుందండి" అంది.

ఆయన క్షణం ఆగి "అర్ధరాత్రి రెండుగంటల వరకూ ఏ బండీ లేదు. మీతో ఎవరన్నా ఉన్నారా? ఒక్కరే వెళ్తున్నారా?" అంటూ ప్రశ్నించారు.

ఆమె సమాధానం చెప్పకుండానే వెనక్కి తిరిగింది.

స్టేషన్నుంచి కనుమాపుమేరలో మట్టిదిబ్బలు తప్పించి ఇల్లన్నది కానరావటంలేదు. కంపెనీలో జిల్లాలో పలుకుబడీ, డబ్బూవున్న జమీందారు పైవాళ్ళ ప్రాపకంతో ఆ వూరిలో స్టేషను కట్టించాడు. అంతకు తప్పించి అక్కడ బండి ఆగితే దిగేవారూ తక్కువే ఎక్కేవాడూ తక్కువే. అక్కడక్కడ చెదురు వాటుగా భూతంలా తలలు విరబోసుకుని ఝాంఝ్ అంటూ మూలిగే వృక్షాలు ఆ నిశ్శబ్దాన్ని, ఏకాంతాన్ని మరింత భీతావహం చేస్తున్నాయి. పక్క గ్రామంలో సంతచేసుకుని తిరిగి వచ్చేవాళ్ళతో ఆ పూట స్టేషను కొంత కిలకిలలాడింది.

చలిగాలి ఉండీ ఉడిగీ ఒక్క విసురు విసురుతోంది.

తను అనవసరంగా చొరవతీసుకుని అధిక ప్రసంగం చేసి నందుకు స్టేషనుమాస్టరు మనసులోనే నొచ్చుకుని తలుపులు వేసుకుని దీపం తగ్గించి పడుకు వాల్చారు.

ఆయన్ని వూళ్ళోఅంతా మాస్టర్జీ! అని పిలుస్తారు. కొత్తగా బదిలీమీద ఆయన ఈ పల్లెటూరు పోవాల్సివచ్చింది. పిల్లాజల్లా వున్నవాడు...ఇంకా పెళ్ళికెదిగిన ఆడపిల్ల లున్నారు. పెద్ద చదువులు చదువుతూన్న మొగపిల్లలు పట్నంలో వున్నారు...వయస్సు మీద పడుతున్నా, శక్తి వుడుగుతున్నా ఈ రాత్రి డ్యూటీలూ, పొగలు డ్యూటీలు చెయ్యక తప్పటంలేదు. ఇంతవరకూ ఒక పెద్ద కూతురు పెళ్ళిమటుకు ఆయన చెయ్యగలిగాడు. ఆ అప్పుతీరేసరికి ఆలోచనలూ, బెంగతో తల పండిపోయింది. అంతా చేస్తే పుట్టింటికి వచ్చినప్పుడల్లా ఆ మొగుడ్ని తల్చుకుని ఆ పిల్ల కన్నీరే. పుత్రవాడు తెలివైనవాడే. ఏమిటో ఖర్మ! అప్పులు తీర్చలేక ఒక చెంప బాధపడుతూంటే కూతురు కాపురం ఇలాంటిదయిపోయిందనే బెంగ పరలోకానికి తీసికెళ్ళింది. అయినా కష్టాలలో రాటుదేరిన మనిషి కాబట్టి మనసు రాయి చేసుకుని కూతుర్ని కంటిపాపలా చూసుకుంటూ వచ్చారు. కష్టాలమీద కష్టాలు వచ్చాయి. భార్య బెంగపడిపోయి అన్నం ముట్టని సమయాలున్నాయి. నవ్వుతూ, పేలుతూ వాతావరణం మార్చటానికి ఆయన హుషారుచేస్తూ వుండేవాడు. ఇప్పుడు కూతురు ఇక్కడే వుంది. తను చేసిన చాలా తెలివైన పనుల్లో ఈ పెద్దకూతుర్ని స్కూల్ ఫైనల్ దాకా చదివించటం ఒకటి. చదువు మానిపించమని భార్య ఒకటే పోరుపెట్టేది. చదువుకున్న ఆడపిల్లలకి చూసిచూసి సంబంధాలు కలుపుకోవటానికి ఎవరిష్టపడతారంటూ ఆరాటపడి పోయేది. బంధువులు కూడా వ్యంగ్యాలతో హెచ్చరికలు చేసారు. ఒకటి రెండు సంబంధాలు ఇదే మిషతో తప్పిపోవటంకూడా జరిగింది. అయినా కూతురు చదువు అలా కొనసాగవలసిందే అనే పంతం నెగ్గించుకున్నాడు. ఇప్పుడా చదువే ఒక ఆయుధంలా అక్కరకు వచ్చింది. తన కాళ్ళమీద తను నిలబడే అర్హత ఆమెకు ఇప్పుడు వుంది. ఆమాటే తనంటే భార్య అంటుంది "మీరేమైనా చెప్పండి. చదువుకున్న ఆడది మొగుడితో ఏం కాపురం చేస్తుంది. ఆడదంటే ఎంత అణకువ, ఒద్దిక ఉండాలి. ఇది మాటంటే పదిదేనా "అవి అందరూ అనుకుంటున్నారు" అని. నిజానికి వాళ్ళమీదా వీళ్ళమీదా పెట్టి అంటుందిగాని దాని అభిప్రాయంకూడా అదే అని మాస్టర్జీ అనుకుని చిన్నగా నవ్వుకుని 'ఎవరెల్లా అనుకుంటేనేం నాకూతురు నా పరువు నిలబెట్టింది. నాకు భారం కాలేదు. స్త్రీలోకానికంతా వన్నె తెచ్చింది' అని సమాధానం చెప్పారు.

మాస్టర్జీ నిద్రపట్టక అటూ ఇటూ రెండుమార్లు ఒత్తిగిల్లారు. గడియారం పదకొండు గంటలు కొట్టింది. బయట చీకటి కాటుకలాగుంది. శ్మశానంవైపునించి నక్కకూతలు వినిపిస్తున్నాయి. ఉన్నట్టుండి ఆయనకి ఇందాకటి స్త్రీ గుర్తుకువచ్చి చప్పున లేచి కిటికీ రెక్కలు తెరిచి బయటికి చూసారు.

ప్లాట్ ఫారంమీద హరికేన్‌దీపపు గుడ్డి వెలుతుర్లో బెంచీమీద ముడిచిపెట్టుకొని వుంది. పక్కనే ఒక సంచీ తప్పించి మరేమీ సామాను ఉన్నట్టులేదు. ప్లాట్ ఫారంమీద ఇంకెవరూ ప్రయాణీకులుకూడా లేరు. పక్కగదిలోంచి పోర్టరు గుర్రుపెట్టి నిద్ర పోతున్నాడు.

ఆయన హృదయం ఒక్కమారు కుదిపినట్లయిపోయింది. చప్పున తలుపు తెరిచి అటువైపు నడవబోయారు. ఉన్నటుండి ఏదో తట్టినట్టయి చేతిలో దీపం అక్కడే పెట్టి లోపలికివచ్చి 'వెంకన్నా' అని పిలిచారు. ఒకటి రెండుమార్లుపిలిస్తేగాని వాడు లేవలేదు.

వాడు తేలుపుతీసుకుని ఆదరా బాదరాగా అవతలికివచ్చి గబగబా గంటకొట్టేశాడు.

మాస్టర్జీ నవ్వుతూ "ఇంకా బండివేళ కాలేదురా. ఇప్పుడింకా పదకొండు గంటలే అయింది. నేను లేపింది గంటకొట్టటానికి కాదురా" అన్నారు.

తను చేసిన పనికి సిగ్గుపడుతూ "బండివేళయిందనుకున్నాను" అంటూ నసిగాడు.

"సరిగాని ఆ దీపం పుచ్చుకుని నా వెనకాలేరా!" అంటూ ఆయన ముందుకు నడిచారు.

వెంకన్న దీపం పెద్దదిచేసి కళ్లు నులుపుకుంటూ ఆయన్ని అనుసరించాడు.

తనవైపు వస్తున్న ఈ ఇద్దర్నీ చూసి ఆమె లేచి నిలబడింది.

మాస్టర్జీ కొద్ది దూరంలో నిలబడి "మీరు ఇలా మంచులో ఒంటరిగా కూర్చోవటం అంతమంచిది కాదు. బండి రావటానికి ఇంకా చాలా వ్యవధానం వుంది. మీతో కూడా ఎవరూ ఉన్నట్టు లేరు?" అన్నారు.

"నేను ఒక్కతినే వెళ్తున్నాను." అంది ఆమె.

ఆ దీపపు వెలుతుర్లో ఆమె ముఖం వైపు పరిశీలనగా చూసారు మాస్టర్జీ. ఆ ముఖం నిగారించి బరువుగా వుంది. వయస్సు ఇరవై పైనే వుండవచ్చు.

ఆమె ముఖం నీడలోకి తప్పుకుని "ఇప్పుడు టైము ఎంతవుతుందండి" అంది.

"పదకొండు గంటలయింది. పెద్దవాణ్ని కాబట్టి చెబుతున్నాను. ఇలా ఒంటరిగా ఉండటం మంచిది కాదమ్మా. ఎక్కడ చూసినా దోపిడీలు, దుర్మార్గాలూను మన జాగ్రత్తలో మనం వుండటం మంచిది. బండి వచ్చేవరకూ ఆ గదిలో వచ్చి కూర్చో. నేను ఇక్కడ స్టేషను మాస్టర్ని, ఇతను పోర్టరు. నీకేం భయం లేదు. నా పెద్ద కూతురుకూడా ఈ బండికే పెనిమిటి ఉన్న ఊరు వెళ్తోంది. నీకు ఆమె తోడు వుంటుంది. "అంటూ మాస్టర్జీ ఆమె అభిప్రాయంతో నిమిత్తం లేకుండానే 'వెంకన్నా ఆ పంచీ తీసుకో" అంటూ పురమాయించి వెనక్కు తిరిగారు.

ఆమెకూడా ఆయన్ని అనుసరించి గదిలోకివచ్చి కూర్చుంది. పోర్టరు వెంకన్న చుట్టచుట్టుకుంటూ గుమ్మంలో చతికిలబడ్డాడు. వాడికి నిద్ర తేరిపోయింది.

మాస్టర్జీ టేబిల్ ముందు కూర్చునిఆవులించి "మీది ఈ వూరేనా అమ్మా" అంటూ పలకరించారు.

"కాదు. ఇక్కడ అన్నగారి దగ్గరకు వచ్చాను."

ఆయనేం చేస్తున్నారు.?"

"పిల్లలకి చదువు చెబుతూంటాడు"

"మరి మీరు ఒంటరిగా వచ్చారేం ?"

ఆమె సమాధానం చెప్పలేదు. ఆయన రొక్కించలేదు. ఆయన ఈమెను గురించి కొంతవరకు అర్థం చేసుకోగలిగారు...

"ఇంతవయసు వచ్చిందా ! ఈ ఏభైఏళ్లల్లోనూ ఎంతో ఖర్చు చేసాను. ఎన్నో కష్టాలు పడ్డాను" చలించకుండా నిలబడ గలిగాను. అంతా అదేమాట అంటారు. కాని నేను గర్వించే ఒకే ఒక మంచి పని నా కూతురికి చదువు చెప్పించాను...లోకులంతా కాకులు కూసినట్టు కూసినా నేను జంకలేదు, ఆఖరికి ఇంటిఇల్లాలే నన్ను ఆడిపోసుకుంది. నేను చలించలేదు. చివరికి కష్టసమయలలో ఆ చదువే శ్రీరామరక్షలా కాపాడి పరువు దక్కించింది. పిల్లాజల్లా వున్నవాణ్ని. నేనుమటుకు ఎంతకాలమని దాన్ని పోషించగలను. పోషించినా దాని మనసుకు ఏం తృప్తిగా వుంటుంది. లోకులేమంటారు ? అది, దానికొడుకు హాయిగా పట్నంలో గౌరవంగా కాలక్షేపం చేస్తున్నారు. ఓర్వలేని వెధవలు- చుట్టాలే సుమా... నానా ఆడ్డమైన కూతలూ కూసారు. లేనిపోనివన్నీ కల్పించి నాకు ఆకాశరామన్న ఉత్తరాలు యేసారు. నేను నమ్ముతానా ? నా బిడ్డ నిప్పులాంటిది. దాని రెక్కల్తో అది శ్రమించి డబ్బు గడించుకుంటోంది."—అంటూ అంతుపట్టకుండా, తుదీ, మొదలూ లేకుండా ఎత్తుకున్నారు మాస్టర్జీ !

"అమ్మాయిగారు ఈ బండికి వెళ్తున్నారా అయ్యా!" అన్నాడు వెంకన్న.

"అవున్రా. అల్లుడు తిక్క కుదిరి ఇన్నాళ్ళకు జాబురాసాడు. ఏదో ఉద్యోగంకోసం చూస్తున్నాట్ట! తప్పకుండా దొరుకుతుందనీ, అమ్మాయిని పంపించమనీ జాబురాసాడు."

"నమ్మతగ్గ మాటలేనా బాబూ !"

"నమ్మాలి నాయనా. ఏంచేస్తాం. అయినా పోయేదేముంది ? వెలుంది. అబద్ధం అనితెలుస్తే దానికి ఏం చెయ్యాలో తెలుసు. దానికి మనం తెలివి చెప్పక్కర్లేదు వెంకన్నా."

"అమ్మాయి ప్రెయినింకూడా వ్యాసయింది".

"అలాగా బాబూ" అంటూ సంతోషం వ్యక్తంచేసాడు వెంకన్న.

ఈ మాటల్లో అక్కడవున్న మూడోవ్యక్తి పాలొనకపోవటం మాస్టర్జీ గమనించి "అమ్మ పట్నంలో మీ వారు ఉద్యోగం చేస్తున్నారా ?" అన్నారు.

'లేదు' అన్నట్టుగా ఆమె తల అడ్డంగా వూపింది.

"మరి అక్కడ చుట్టాలెవరన్నా వున్నారా ?"

అవునన్నట్టుగా ఆమె తలవూపింది.

## 2

సరోజ కన్నవారు వున్నవారు కాకపోయినా పుట్టినింట వడిపోసో ఏటవరకూ అల్లునా కారంగానే పెరిగింది. పుట్టినింట గారంగా పెరిగినా మెట్టినింట ఒద్దికగానే మసులు కుంది. గారంగా పెరిగిన పిల్లకదా అని వూరువూరూ తిరిగి పల్లెపల్లె గాలించి మనసుకు వచ్చిన వరుడ్ని వెతికి తెచ్చి కూతురు మెళ్ళో మూడుముళ్ళూ వేయించాడు తండ్రి. కాని పాపం! సరోజకివే పురిటాళ్ళయి

పోతాయని ఎవరనుకుంటారు వూహించగలరు. వరుడు ఇంటర్మీడియేటు వరకూ చదువుకున్నాడు. రూపసి! ఈడూ జోడూ అన్నీ అమరాయి. పెళ్ళికొడుకు చక్కగా చదువుతున్నాడని తప్ప దొరికిన వరుడు చవకబారువాడని ఆయన తెలుసుకోలేక పోయాడు.

కాపరాని కెళ్ళిన తర్వాత సరోజకి అత్తపోరూ, ఆడబడుచు పోరూ తప్పలేదు. వాళ్ళు మొగవాడి భార్యా విముఖత్వాన్ని ఆసరాగా తీసుకుని సరోజమ్మని వూదరబెట్టి వుక్కిరిబిక్కిరిచేశారు. ఆమె సహనంతో భరించింది. భర్త అనాదరణని కూడా ఆమె పెద్దమనసు చేసుకుని నిభాయించుకుంది. దేముడు అత్తగార్ని ఏడాది తిరక్కుండానే తీసుకుపోయాడు. ఆడబడుచు కాపరానికి వెళ్ళిపోయింది. పైకి లోకంకోసం ఏడ్చినా సరోజమ్మ అత్తగారి పరలోకయాత్రతో ఒక విధంగా తెరిపిన పడింది.

కాని క్రమక్రమంగా సరోజమ్మ జీవితం బరువెక్కి సాగింది. ఆమె తలచుకున్నవీ, ఆశించినవీ అన్నీ బుగ్గయి పోయాయి.

భర్తనిగురించి చెడువార్తలు అలా అలా చెవిని కూడా పడ్డాయి! మావగారు చాటుగా కొడుకుని మందలిస్తూనే తన ఎదుట అతడ్ని గురించి ఉన్నవీ లేనివీ గొప్పగా చెబుతూండేవారు.

సరోజమ్మ భర్త అర్థరాత్రీ అపరాత్రీ ఇంటికి చేరేవాడు. అయిన దానికీ కానిదానికీ ఆడదాని మీద చెయ్యి చేసుకునేవాడు. ముసలాయన ఏమీ చెయ్యలేక తనగది విడిచి ఇవతలికి వచ్చేవారు కారు.

ఇలాంటి రోజుల్లోనే వారంరోజులు జబ్బుతో తల్లిపోయిందని జాబువచ్చింది. కంటికీ కడివెడుగా ఏడ్చింది సరోజమ్మ. భర్త చూసికూడా చూడనట్టు నటించాడు. ముసలాయన మటుకు ఓదార్చాడు. కొడుకుతో చెప్పి పుట్టింటికిపంపే ఏర్పాటు చేస్తానన్నాడు.

"అంత తేలిగ్గా ఆయన వప్పుకుంటారా" అనుకుంది సరోజమ్మ. అనుకున్నట్టు కాకుండా ఆశ్చర్యకరమైన వార్త మావగారు చెవిని వేసారు. 'ఒక నెల్లాళ్లు వుండిరామ్మా! వాడికి చెప్పాను. వప్పుకున్నాడు" అని.

కాని పుట్టినింట వున్న నాలుగురోజులూ నిప్పులమీద వున్నట్టే మసిలింది. ఆమెమనసు పెనిమిటిమీదకే పోయింది. తను ఆశించింది ఒకటయితే—పర్యవసానం మరొకటయే ప్రమాదం ఆమె శంకించింది. ఆ శంక నిజమయింది. రెండువుత్తరాలు రాసినా భర్త జవాబురాయలేదు. ఆమె తండ్రితో పోరుపెట్టి, ఘర్షణపడి నెలతిరక్కుండానే పెనిమిటిదగ్గరకి వచ్చేసింది.

గుమ్మంలో అడుగుపెట్టగానే ఆలనా ఆదరణా లేకపోగా "ఎందుకింత త్వరగా కొంపలు మునిగిపోయినట్టుగా వచ్చిపడ్డావు" అన్నాడు భర్త.

మంచయినా చెడయినా అదే పలకరింపు. మళ్ళీ ముఖమెత్తి ఎన్నడూ ఆమెని అతను పిలవలేదు. చనువుతీసుకున్నా నోరు మెదపలేదు.

అనేక రాత్రులు కాళ్ళు కాయలుకాచేలా నిలబడి భర్తకోసం ఎదురుతెన్నులు చూసింది. "ఎవరికోసం అలానిలబడి చూస్తు న్నావ్ఫుడే" అన్నాడొకనాడు. ఆమె హాయిగా నవ్వులు చెరుస్తే సేసుకుంది.

'ఎంత పాపం చేసాయింది' అనుకుంటూ పిల్లతండ్రి ఒకోటా ఒకోటా చిన్న సంగతులన్నీ గుంటలు చెపుతు చెయ్యగా పెద్దపెద్దవిగా తప్పించుకున్నాడు. కన్నబిడ్డ స్వభావం తెలుసు గనక మాస్తోన్నా ఇంతా ఆశించుచేసుకుని పెద్ద కథనచేసాడు.

"అయితే అవిడి అమాయకు రాలనుకున్నాను. ఇలాంటి తెంపరి బుద్ధులున్నాయని తెలియదు. ఉన్నదేదో తనివి తీర్పించి నీకూతురు నీచెవిని వేసింది." అన్నాడు అల్లుడు.

"నే విన్నదంతా నిజం కాదని నువ్వు ఋజువు చెయ్యగలిగితే పిల్లనిచ్చుకున్న వాడ్ని నాకంటె సంతోషించేవాడింకొకడుంటాడు. నువ్వు ఋజువు చెయ్యి" అన్నాడు పిల్లతండ్రి.

"నాకవసరం లేదు."

"అయితే నా అనుమానం నిజమని ఋజువు చేసేదా?"

"ఏమిటండీ! మీరు చాలా అసభ్యంగా మాట్లాడుతున్నారు"

నమ్మతగినంత ఋజువులతో, ఆధారాలతో వచ్చిన పిల్లతండ్రి రవంతయినా ఈ నటనకి లొంగకుండా "అయితే కొలనుగట్టు వీధిలో..." అంటూ ఆపేసారు.

ఆడబిడ్డ నిలువెల్లా కంపిస్తూ పారిపోయి వంటగది గుమ్మానికి అంటుకుపోయింది. చిరిపి దీపం పెట్టినట్టుండే ఆమె ముఖంలో మనసుపడే ఆందోళన తాలూకు నీలి ఛాయల్ని గమనిస్తూనే అతగాడు నేర్పుగా "ఓహో అదా! లోకం అలాగే అనుకుంటూంది. మీరూ అదే నమ్మారన్నమాట. స్నేహమన్నది మొగవాళ్ళు మొగవాళ్ళతోనే గాని ఆడవాళ్ళతో చెయ్యకూడదనే సిద్ధాంతంపట్ల పట్టుదలగల వాళ్ళంతా నా ప్రవర్తనకి తప్పు పట్టవచ్చునేమోగాని నాబోటి సంస్కారుల కిది అభ్యుదయం. ఆమె కొలను గట్టుమీద నివసించే ఒంటరి మనిషయినా ఆమె హృదయం చాలా విశాలమయింది. సంస్కారం గల మిత్రురాలు. ఆమెతో సాహిత్య విషయాలు చర్చించటమంటె నాకు మహాప్రీతి. ఆమె కెంతో అనుభవం వుంది. ఆమె కెన్నో రహస్యాలు తెలుసు. ఆమె కవితాగానం చేస్తే పొద్దు పొడిచిందీ, సంజె కమ్మిందీ తెలియకుండా ఎన్ని రోజులైనా అలా వినాలనిపిస్తుంది. పామర జనానికి మామీద నిందవెయ్యటం తప్పించి మమ్మల్ని అర్థం చేసుకునే సంస్కారం ఎక్కడేడిసింది. మీరూ వాళ్ళల్లో ఒకరై పోయారు"

పిల్ల తండ్రి నెత్తి బాదుకున్నాడు. కూతుర్ని పుట్టింటికి వొచ్చెయ్యమన్నాడు. ఆమె వప్పుకోలేదు. "ఆడదాన్ని నేను పౌరుషం చూపిస్తే పరిస్థితి మరింత విషమించటమే గాని చక్కబడుతుందా" అంది.

ఆయన వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే సరోజమ్మ తండ్రిని కూడా పోగొట్టుకుంది. ఇహ 'నా' అని అభిమానించేవాడల్లా ఒక్క దిక్కుమాలిన అన్నగారు. తను కాపరానికి రాక ముందు అంతా తనభర్త

గురించి ఘనంగా చెప్పుకుంటూంటే అనుకునేది ఈ అన్నయ్యకి ఆయన ప్రాపకంతో మంచి ఉద్యోగం ఇప్పించాలని. ఇదే తలపుకు వచ్చి సరోజమ్మ కన్నీరు కార్చేది.

ఉన్నట్టుండి వూరంతా గుప్పుమని అందరినోటా అదేమాట విని పించి 'ఆరాధాబాయి, పద్మనాభం మారేజి చేసుకున్నారని' ఆరో జల్లా మావగారు ఇల్లు విడిచి వీధి ముఖం చూడ లేదు. సరోజమ్మ వంటగదిలో దేవుడిముందు పడి తల బాదుకుంది.

ఎన్నిరోజులైనా భర్త ఇంటిముఖం చూడలేదు. వూరంతా చెప్పుకున్నది నిజమని నిర్ధారణ జరిగిం తర్వాత 'నేనే వెళ్ళి అనుగు తాను' అంటూ ఒకనాడు ఒళ్లు తెలియని ఆవేశం తెచ్చుకుంది సరోజమ్మ.

"వద్దమ్మా! నా మాట విను" అన్నారు మావగారు.

"అది ఆ యింట్లో వుంటే ఆ యింటి గుమ్మం నే తొక్క నంటూ" ఉత్తరం రాశాడు తండ్రికి. ఆయనకంటె ముందుగానే ఆ వుత్తరం కోడలు చదివింది. ఆయ నేమంటారు? కడుపు తీపి చంపుకో లేక ఒక మంచి మనిషికి అన్యాయం చెయ్యలేక ఆయన సతమత మయి పోయారు.

ఇలాంటి సంకట సమయంలో సరోజమ్మ ఎవరికీ చెప్పి పెట్ట కుండా అన్నగారి వూరు వెళ్ళిపోయింది. నాలుగు రోజులు ఆదరం గానే జరిగింది. ఐదోనాడు వదినగారు చాటుగా పొరుగమ్మతో అన్న మాటలు విన్న తర్వాత ఆమె మర్యాదగానే అక్కడ్నించి వెళ్ళి పోవటం మంచిదనుకుంది. అన్నతో చెప్పింది. అతనూ ఎక్కడికి వెళ్తావు? అనయినా అడగలేదు. ముఖం తప్పించుకుంటూ "పోనీ నాలుగురోజులుండరాదూ?" అన్నాడు.

ఆమె సమాధానం చెప్పలేదు. చేతిసంచీ తీసుకుని వచ్చేసింది' కాని ఎక్కడికి వెళ్తుంది తను? ముందు కర్తవ్యం ఏమిటి?—జన సంచారం పల్చగావున్న వీధి వార ఆమె నడుస్తూ ఈ ప్రశ్నలు వేసు కుంది. వాటికి సమాధానాలంటూ లేనప్పుడు అవే ప్రశ్నల్ని పదే పదే వేసుకుని దిగులుతో అనుగు పడక నడివీధిలో నిలబడి పోయి నలువైపులా చూసింది. ఒకవైపు కాలవగట్టు ఎత్తుగా కనిపించింది. మరోకవైపు ఎత్తయిన కొండలు. ఒకవైపు వూరు. నాలుగో వైపుకు ఆమె చూసింది. పొగలు చిమ్ముకుంటూ పరుగెడుతున్న రైలుబండీ కనిపించింది.

# 3

సరోజ అంతవరకూ చెప్పి వెక్కి వెక్కి ఏడ్చేసింది.

మాస్టర్జీ చప్పున కుర్చీలోంచిలేచి "నీ గాథ వినటానికి చాలా బాధగా వుందమ్మా! నువ్వు ధైర్యంగా వుండాలి. మనసు రాయి చేసుకోతల్లీ! ఈ బాధ నాకు తెలుసమ్మా! నేనూ అనుభవించాను" అన్నారు.

ఆమె తెప్పరిల్లి కళ్ళు తుడుచుకుంది.

గడియారం పన్నెండుగంటలు కొట్టింది! పోర్టరు వెంకన్న నిద్రమయివుతో తూలుతున్నాడు. 'వెంకన్నా' అంటూ పిలిచారు మాస్టర్జీ.

"అయ్యా!" అంటూ ఉలిక్కిపడ్డాడు వెంకన్న.

"చిన్నమ్మగారు వస్తున్నారేమో చూడు. ఒకగంట ముందు గానే రమ్మన్నాను."

వెంకన్న లేచి సేషను బయటికి వెళ్ళాడు.

"అయితే ఇప్పుడిక్కడ్నుంచే వస్తున్నావా అమ్మా."

"లేదు."

మాస్టర్జీ ఆశ్చర్యంగా "మరయితే ఎక్కడ్నించి?" అన్నారు.

దీపం ఉన్నట్టుండి భగ్గుమని మండింది. మాస్టర్జీ ఒకమారు దీపాన్ని కుదిపారు. తిరిగి దీపం కుదురుగా వెలగసాగింది.

"ఆ తర్వాత చాలాకథ నడిచింది. మీరు నన్ను క్షమిస్తా నంటే చెబుతాను" అంది ఆమె.

"నే నెవరమ్మా క్షమించటానికి. నీకు నే నేదైనా వుపకారం చెయ్యగలిగితే అప్పుడు నాకు క్షమించే అర్హతవుంది. ఫర్వాలేదు చెప్పు." అన్నారు మాస్టర్జీ.

వెంకన్న ఆవులిస్తూ మత్తుగా "రావటం లేదయ్యా! అంటూ గుమ్మానికి చారబడ్డాడు.

"నేను ఆత్మహత్యకే పూనుకున్నాను."

మాస్టర్జీ ముందుకు వంగి ఆశ్చర్యంగా వినసాగారు.

"కాని...అలా చేసినా బాగుండి పోయేది. జీవితంలో రెండు విధాలా చెడ్డాను. జీవితంలో ఒకేసారి ఉద్రేకం తెచ్చుకున్నాను. ఆ ఉద్రేకంతోనే సర్వనాశనం అయిపోయాను. లోకం అంటే ఇప్పుడున్న అనుభవం అప్పుడు నాకు లేక పోయింది. "ఆమె క్షణం ఆగి" ఆకలితో కడుపు దహించుకపోతోంది. మంచి నీళ్ళతో కడుపు నింపుకోగలనా. తిరిగాను...తిరిగాను అత్తవారి వూరువెళ్ళాను. నా యింట నా పెనిమిటి వుంపుడు కత్తెతో వుండటం చూశాను. ఏమి చెయ్యాలో పాలుపోక, ఆకలితో మాడి వూరంతా తిరిగి అన్నగారి దగ్గరకువచ్చాను. అన్న అత్తవారింటికి వెళ్ళాడని తెలిసింది. ఈ వూరు రావటం ఇది మూడో మారు. ఇక్కడ్నించి పట్నం వెళ్లాను. జీవితం బజారునపడం తర్వాత మానాభిమానాల్ని చంపుకోక తప్పలేదు...కడుపు కోసం...నాకు చేతనయింది...వంట చెయ్యటానికి ఒక ఆసామీ ఇంట్లో కుదురు కున్నాను. ఆయన పెద్ద కొడుకు పట్నంలో చదువుకుంటున్నాడు. నేను వున్న నాలుగు మాసాల్లో అతనెప్పుడూ అక్కడికి రాలేదు. అతనికీ ఈ తండ్రికీ పడదని అంతా చెబుతూండేవారు. అంతా చెప్పుకునే మాటలు వింటుంటే నాకు భయంగావుండేది. కాని మాటల్లో ఆయన చాలా పెద్ద మనిషిగా కనిపించేవారు. ఒక్క భోజనం వేళ మినహాయించి తతిమ్మా వేళల్లో ఆయన నా గది చాయలకైనా వచ్చేవారు కాదు. ఇంటి బాధ్యతంతా ఆయన పూర్తిగా నామీదే వుంచారు. అంతా నేనే చూసుకునే దాన్ని. ఒకొక్కప్పుడు ఆయన పన్ల మీద వూరు విడిచివెళ్తే ఒక్కతెనీ చూసుకునే దాన్ని ఆ లంకంత కొంపనీ. ఆ యింట్లో వెండి సామాను చాలా వుండేది. నన్ను అంతగా నమ్మారు ఆయన. ఆయన పోలాండా చూస్తే ఆయనపట్ల నాకు సదభిప్రాయమే

వుండేది. ఆయన భార్యపోయి చాలా కాలమయింది. అనిస్మి తల్చుకుని ఆయన భోజనం దగ్గర అప్పుడప్పుడు కన్నీళ్లు పెడుతూవుండేవాడు. ఆయన దగ్గర తండ్రి భావంతోనే మసులుకునేదాన్ని. కాని... ఒకనాటి రాత్రి... నా జీవితంలో మిగిలివున్న ఒకేఒక్క విలువైన ఆస్తినీ... ఆయన... ఆ... దుర్మార్గుడు అపహరించాడు... జీవితంలో ఇక నాకు మిగిలిందేముంది? "—సరోజ క్షణం ఆగి నోట పెగలని స్థితినించి తెప్పరిల్లి వణికే పెదాలతో... 'నిన్ను పెళ్ళిచేసుకుంటాను. నీకు అన్యాయం చెయ్యను' అని చెప్పి నన్ను పూర్తిగా వుపయోగించుకుని... ఆయన పరువు దక్కించుకోవాల్సిన సమయం వచ్చేసరికి రైలు ఎక్కించి సగం దూరంలో—చెప్పకుండా దిగి వెళ్ళిపోయారు. అప్పటికి నేను మామూలు మనిషినికాను. నాతోపాటు మరోక జీవికూడా నాలో వుంది. అలాగే అన్నగారింటికి వచ్చాను. ఈ పల్లెటూళ్లో గుట్టుగా పాఠాలుచెప్పుకుని నాలుగురాళ్లతో సంసారంగడుపుకునే అన్నగారు ఆశ్రయమివ్వటానికి అంగీకరించలేదు. "నీతోపాటు నన్నుకూడా ఆకలితో చావమంటావా చెల్లీ, పిల్లలుకలవాడ్ని. ఇది పల్లెటూరు. ఈ రహస్యం బయటికిపొక్కకే ఇంకేమైనా వుందా?" అన్నాడు. అవును నిజమే, మాట్లాడకుండా వచ్చేశాను. ఇదీ నా చరిత్ర"—అంటూ ఆమె ముగించింది.

మాస్టర్జి బరువుగా నిట్టూర్చి "నిన్ను ఇంకేం ప్రశ్నలు వెయ్యమంటావమ్మా! కాని ఇలాంటప్పుడు నీ కేమనిపిస్తూంటుంది?"

"మా నాన్న నా చిన్నతనంలో నెత్తిమీద పెట్టుకుని పెంచాడు. నేను కావాలన్నది ఎక్కడ్నించయినా, ఎంత శ్రమయినా తెచ్చి నాకు ఇచ్చేవాడు. నే కోరిందల్లా ఆయన మారుమాట చెప్పకుండా అమర్చిపెట్టేవాడు. పల్లెత్తుమాట నన్ను ఆయన ఎన్నడూ అనలేదు. అంత గారంగా పెరిగాను. పుట్టిన రోజువస్తే బంధు బలగాన్నంతా పిల్చి నాన్న విందుచేసేవాడు. ఖరీదైన బట్టలు కుట్టించేవాడు. నాకు ఏ లోటూ జరగకూడదని తాపత్రయ పడుతూండేవాడు. ఇప్పుడనుకుంటున్నాను. నాన్న నాకు చదువు చెప్పించివుంటే? నా జీవితం మరోకవిధంగా వుండి వుండేది. నా అన్నపంచని నలుగురి పిల్లలకి చదువుచెప్పినా నా పొట్ట గడిచిపోయేది."

"నా అల్లుడు నా కూతుర్ని నానా హింసా పెట్టాడు. అదోకరకం పిచ్చి. ఉద్యమాలజ్వరంతో నిక్షేపంలాంటి ఉద్యోగం వూడగొట్టుకుని సంసారం చెయ్యలేక పారిపోతే, నా కూతురు పిల్లలకి చదువు చెప్పుకుని పరువుగా బ్రతికింది. అప్పుడు ఆమె నాకు రాసిన ఉత్తరం ఇక్కడేవుంది." అంటూ ఆయన జేబులోంచి ఒక ఉత్తరంతీసి సరోజముందు వుంచారు. అందులో ఆయన సిరాతో గుర్తు పెటినభాగం చదివింది.

"ఆయన ఇంతకాలంగా ఇన్ని ఉద్యమాలలో పనిచేశారు. కాని ఈ ఉద్యమాలేవీ ఆయన ముడుచుకుపోయిన మనస్సుకి తెలివిని కలిగించలేకపోయాయి. ఒక ఆడది సంపాదిస్తూంటే అది సహించరాని విషయంగా మదనపడే ఆయన చాలా మారవలసి వుంది. ఉద్యమాలు వ్యక్తి వికాసం కలిగించాలి. అంతేగాని కేవలం ఉద్రేకాన్ని రెచ్చగొట్టేవి ఉద్యమాలు కావు—తెలివిలేని అభిమానాలు పెంచుకోవడానికి సంపాదన సుఖంగా సాగుతుందనుకున్నాను. ఏమీ లాభం లేదు. ఆయన మాట్లాడలేదు. కాని సాయంత్రం నేను ఇంటికి వచ్చేసరికి ఇంట్లో ఆయన లేరు. ఒక చీటీ రాసిపెట్టి వెళ్ళారు. అందులో ఇలా వుంది. 'ఆడదాని సంపాదనమీద బ్రతికే దౌర్భాగ్యం నాకు అక్కర్లేదు. ఎలాగో నేను బ్రతకగలను... నాకోసం ఆలోచించవద్దు.' ఆ రోజల్లా ఏడ్చాను. సరోజ వుత్తరం మడుస్తూ "ఆమె సుఖం నేను చూడగలనా మాస్టర్జీ?" అంది. ఆమె ముఖం కన్నీటి చారికలతో నిగాదించి వుండటం గమనించి మాస్టర్జి "అమ్మా! ఈజీవితం ఒక గంగాప్రవాహం లాంటిది" ఆ స్తికులు, సదాచారపరాయణులు, అదేగంగను పవిత్రంగా నెత్తిన చల్లుకుంటారు; దప్పికగొన్న వాడు ప్రక్కనే నీళ్ళు తాగి ప్రాణం నిలుపుకుంటారు; కొండ అంచుని తాకుతూ, సోయగంతో సుళ్ళు తిరుగుతూ మలుపుతిరిగే ఆ ప్రవాహం కవి హృదయంలో పాటలు పాడిస్తుంది; అదే వాహిని, కాలు జారితే ఈతరాని అభాగ్యునికి మృత్యుముఖంగా కనిపిస్తుంది. ఈ జీవితంకూడా అలాంటిదే. అన్నిరకాల రుచులూ ఈజీవితంలో లభ్యమవుతాయి. వాటిలో అమృతత్వమూ వుంది, విషప్రాయమూవుంది. అయితే వాటిలో ఏది కావాలో ఎంచుకునే హక్కు మన చేతిలోనేవుంది. జీవితం విలువ తెలిసినవారు సుఖశాంతులు కలిగివుంటారు. తెలియనివారు..."

"అయ్యగారూ చిన్నమ్మగారు వచ్చారు."

నిలువెల్లా జలదరించినట్లయి సరోజ చేతిలో వుత్తరం జారి కింద పడిపోయింది!!!

* * *

కొద్దిరోజుల తర్వాత పెద్దకూతురువద్దనుంచి మాస్టర్జీకి ఒక వుత్తరం వచ్చింది.

అవుత్తరంలో ఆమె చాలా విషయాలు రాసింది. అఖర్ని రాసిన నాలుగుపంక్తులూ మాస్టర్జీ గంభీరముఖంతో అతి వుత్సాహంగా చదివారు. సరోజని గురించి ఆమె రాసింది. "సరోజకి నాఅన్నవాళ్లంటూ ఈ పట్నంలో ఎవరూ లేరు. ఆమెకున్నదల్లా ఒక్కఅన్నగారే. అతని ఆదరణ కూడా ఆమెకు లేకుండాపోయింది. ఆమె దారిపొడుగూతా బండి ఆగినప్పుడల్లా అక్కడ దిగిపోతానంటూ కూచుంది. అలా ఆమె ఎందుకంటుందో ఆమెకే తెలీదు. ఆమె పూర్తిగా జ్ఞాపకంలేని పిచ్చిమాటలు మాట్లాడింది. ఆమె రెండుచేతులూ పట్టుకొని నేను అభయం ఇచ్చాను. ఆమె కన్నీరు తుడిచాను. ఆమెకు ధైర్యంచెప్పాను. ఈవూళ్ళో మన యింటిదగ్గరే ఒక పుణ్యాత్మురాలు ఒక శిక్షణాలయం ఏర్పాటుచేసింది. అక్కడ స్త్రీలకు అన్నిరకాల చేతిపనులూ నేర్పుతారు. సరోజని అందులో చేర్పించాను. అక్కడ కుట్టుపని నేర్చుకుంటోంది. నాతోపాటు నాలుగు మెతుకులు తిని మన ఇంట్లోనే వుంటోంది. ఇక కొద్దిరోజుల్లో ఆమె స్వతంత్రంగా జీవించే అర్హత సంపాదించుకుంటుంది." అంటూ రాసింది.

మాస్టర్జీ సంతోషాతిశయంతో ఆ వుత్తరాన్ని హృదయానికి హత్తుకుని "నువ్వే ఒక వుద్యమానివి తల్లీ" అంటూ ఇంకా ఏదో అస్పష్టంగా గొణుక్కున్నారు. ఆ మాటలు బండి రాకను సూచనగా పోర్టరు వెంకన్న కొడుతున్న గంటల రణగొణధ్వనిలో మిళితమైపోయాయి. స్టేషను ఆవరణలో చెట్లన్నీ ఝుంఝుమంటూ గోల చేశాయి!"

—◆◆◆—

# లోకాలోకము

శ్రీ సి. నారాయణరెడ్డి

ఆకసము బీజ ప్రదాతగ
అవనియే ఒక ఆద్యమాతగ
కానగల్గిన మానవునకు జ
గజ్జనాళి ఒకే కుటుంబము.

నింగి లోపల లేవు ఎల్లలు
నీరధిని కనరావు ఎల్లలు
ఎందుకీ ధరణీ తలమ్మున
ఇరుకు వాడలు ఇనుప గోడలు

అన్ని జాతుల కొకే సూర్యుడు
అన్ని నేలల కొకే చంద్రుడు
అయినచో జాత్యహంకారము
ఆటవిక తత్త్వమ్ము కాదా ?

ఏ కులము వెన్నెలది ? తెమ్మెర
లెట్టి జాతికి చెందినట్టివి ?
అట్టిదే కద మానవత్వము
అన్నిటికి ఎత్తైన సత్యము.

ఊహలే రెక్కలుగ జేసి మ
హోన్నతముగా ఎగిసి చూచిన
వసుధయంతయు కన్పడును పసి
వాడు విసిరిన బంతి పోలిక.

ఒక అహంత మనస్సులో వే
రూరు తొల్తగ; దాని బాహిర
శాఖలే 'నా దేశమిది నా
జాతి యిది' యను భావరేఖలు.

ఆత్మ పాల సముద్రమటు నిం
డార విచ్చిన దండి మనిషికి
విశ్వగోళము పండు వెన్నెల
వెన్నెలారిగిన పంటపొలమగు.

మనసు నంటిన అహంభావము
మంచు మాదిరి కరగిపోయిన;
మనిషి లోపలి దేవతాత్వము
మణీ ముకురము వోలె భాసిలు.

స్నేహ పవమానము అగస్త్య ఋ
షీంద్రు పోలిక సాగిపోయిన
నెత్తి బిగిసిన గిరులు సైతము
మెత్తబడి మును సాగిలంబడు.

మనుషులందరు అన్నదమ్ముల
మాదిరిగ జీవించగల్గిన;
మర్త్యలోకమె దివ్య పదవికి
మారుపేరై పరిమళించును.

చంద్రమండల మందుకొన ధీ
శక్తులను వెచ్చించు కన్న;
మానవుని దేవతగ మార్చెడు
మార్గమును కనుగొనుట మిన్న.



# మన మహానటులు

## శ్రీ ఆమంచర్ల గోపాలరావు

ఆంధ్రుల కళాప్రీతికరమయినది నాటక రంగస్థలము. నిజముగా నాటక రంగస్థలమనునది ధనముతో కూడినది. అందుచేత అపరిమితముగా ధనము వెచ్చించి, మహారంగ స్థలములను నిర్మింపజాలని దేశములందు, ఈ నాటక రంగమంతగా నభివృద్ధి కాలేదు. అయినప్పటికిని అనేక విధములుగా జీవితాంశములను విస్తార్య మొనర్చి అనుభావించి, మానవుల నుత్తేజింపజేయుటకు నాటక రంగ మొక మహాయాన మగుటం జేసి, ప్రతి జాతి, ప్రతి దేశము తన చేతనయినంతవరకు రంగస్థలముల నిర్మించుకొని తగురూపముల నాటకములను ప్రదర్శించుచునే యున్నారు.

మన ఆంధ్రదేశమును సయితము బీద దేశములందే నేడు మనము లెక్కించుకొనవచ్చును. ఇతర దేశము లందుగాని, ఇతర ప్రాంతము లందుగాని, నిర్మింపబడ్డ మహారంగస్థలములను ఆంధ్రము నిర్మింప లేదు. మన దేశమందు నాటక ప్రదర్శనములు సయితము, అనంతముగా ద్రవ్యమును వెచ్చింపగలిగిన, ఇతర దేశస్థుల నాటకము లందు కానవచ్చు, ఆడంబరములను పొందజాలక పోయినవి. సామాన్యముగా మన ఆంధ్ర నాటక ప్రదర్శనములన్నియు, కవి, నటుల మీదనే ఆధారపడి ప్రదర్శితములైనవని చెప్పక తప్పదు. ఈ నాడు సయితము మన నాటక ప్రదర్శనములన్నియు అదే రీతిన జరుగుచున్నవను మాట కూడ వాస్తవము.

అయినప్పటికీ మన నాటక రంగస్థలము నిజముగా అతివన్నె కెక్కినది. మన దేశమందు ఏ ఇతర ప్రాంత నాటకములకు మన నాటక ప్రదర్శనములు తీసిపోలేదు. ఇంకను, ఇతర ప్రాంత నాటక ప్రదర్శనములకన్న మిన్నయయినవనియే చెప్పవచ్చును. నిజముగా మన నాటక రంగస్థలమును, ఏ పరికరములు లేకయే అద్వితీయ మొనర్చినది మన నటులేయని చెప్పక తప్పదు. పరికరములు, ఇతర ఆడంబరములు లేక, మన నాటక రంగమును ఇంత ముందుకు తెచ్చిన, మన మహానటులు నిజముగా చిరస్మరణీయులు.

ఇట్టి మహానటులు మన ఆంధ్రయందెంత మందియో జన్మించి తమ ఛాయలను మన నాటక రంగమందు నిల్పి, కళాకాంత మొనర్చిరి. అయినను, మన మహానటులకును, ఇతర ప్రాంతముల నటులకును ఒక గొప్ప భేదము కానవచ్చును. ప్రతి దేశమందును నాటక కళ కలంకారప్రాణములైన నటులందరును, నాటకమే వృత్తిగా జేసికొని, తమ జీవితమంతయు ఆ కళకే ధారవోసి, ఉత్తీర్ణత గాంచిరి. కాని బీదదేశమయిన మన ఆంధ్రదేశము, తన కళాకారులను పూర్తిగ పోషించుకొనలేదు. ఈవిషయము నాటికి నేటికి సత్యమనియే చెప్పవచ్చును. అందుచేత మన నటులందరు, సామాన్యముగా ఇతర వృత్తులను జీవనాధారములనుగా జేసికొని, నాటక కళకు తమ సేవచేసిరను మాట వాస్తవము.

ఇందు ముఖ్యముగా, మన దేశనాయకులైన కొండా వెంకటప్పయ్య, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, టంగుటూరి ప్రకాశం గార్లను గూర్చి చెప్పక తప్పదు. వీరందరు మన నాటకరంగమును అలంకరించినవారే. వీరు ముగ్గురు, తమ చిన్న తనములందు స్త్రీ పాత్రలు ధరించి, ప్రజల మనస్సుల నానాడు చూరకొనిరి. కాని తర్వాత, నాటక రంగమును మించిన దేశసేవ వారి దృక్పథమందున పడిన కారణమున, దేశ నాయకులై, మన స్వాతంత్ర్య యుద్ధమున మనల నడిపి, మన దేశమునే తరింపజేసిరి. అందుచేత మన దేశమందే నటులను స్మరింపకున్నను ఈ మహానటవర్గమును స్మరింపక తప్పదు.

### తాడిపత్రి రాఘవాచార్యులుగారు

వీరసమాన ప్రతిభావంతులు. నిజముగా ఆంధ్రదేశమందేగాక హిందూదేశమంతటిలోను అగ్రస్థానము వహించిన నటశేఖరుడు. వీరొకనాడు కలకత్తాయందు చాణక్యపాత్ర ప్రదర్శించినపుడు, కవిశేఖరుడైన రవీంద్రనాథ ఠాకూరు, వీరి నటనా పరిణతికి అచ్చెరువొంది, "హిందూదేశమందు నటుడన్నవాడున్న, అతడితడే, ఇతడేయని యనెను." నిజముగా అంతర్జాతీయముగా ఎన్నదగిన నటులలో వీరిని పేర్కొనవచ్చును. వీరు ఒకతరి ఇంగ్లండునకు వెళ్ళి తన నటనా ప్రభావమును బెర్నార్డుషాకు ఎరిగింప కుతూహలపడిరి. వెంటనే ఆ కవియొద్దకు వెళ్ళి, ఆంగ్లమున కొంత నటించెను. బెర్నార్డుషా, తన సహజ విదూషకత్వమును ప్రదర్శించుచూ, నీవెందుకు నటుడవైతివి? న్యాయవాదికనే యుండకపోతివా? యని వ్యంగముగా నవ్వెను. శ్రీ రాఘవాచారిగారికది ఇంపుగా లేదని మరి చెప్ప నక్కరలేదు. ఆరాత్రి ఆచారిగారికి నిద్దురపట లేదు. మరుసటిదినము మరల వీరు బెర్నార్డుషావద్దకు వెళ్ళి, తెలుగున నటించి, అతి రసవంతముగా, అనేక భావములను అనుభావించిరి. అప్పుడు బెర్నార్డుషా ఆశ్చర్యమునకు మితి లేకపోయినది. ఏభాష సహాయ్యము లేక, వట్టి శబ్దముల సాహాయ్యముతోడను, చేష్టలతోడను, కండ్లతోడను, భావములన్నింటిని, ఇంత గంభీరముగా ప్రదర్శింపగలిగిన, నటుడు, వట్టి నటుడేగాక మహా సృష్టికర్తయగు గొప్పకళాకారుడే అని నుడివెను.

నిజముగా, రాఘవాచారిగారి నటనాకౌశలము, అభినయమునుమించి సృజనా ప్రాబల్యమును వహించిన మహాకళ. వీరు తెలుగునందేగాక, కన్నడము, హిందీ, ఉరుదు, ఇంగ్లీషు భాషలన్నిటిని సాధించి, అన్నిరంగములందును, బ్రహ్మాండముగా నటించిరి.

వృత్తికి వీరు న్యాయవాది. అనాడు నిజముగా, కోర్టులందు నెలకు రెండుమూడు వేలకు పైగా వీరార్జించుచు, గొప్ప న్యాయవాది యని పేరుబడసిరి. కాని నటుడుగా వీరి కీర్తిని జగమెరిగినది. వీరు అనేక నాటకములందు ముఖ్యపాత్రలను నిర్వహించెడివారు. రాము దాసు, బాహుకుడు, పఠాను, రాజరాజ నరేంద్రుడు– మొదలయిన అనేక పాత్రలు, ఈయన అద్వితీయముగ నిర్వహించెడివారు.

కాని వీటన్నిటిని మించి, సావిత్రియందలి యముడు, ప్రహ్లాద యందలి హిరణ్యకశిపుడు అని చెప్పకతప్పదు. ఆనాటివరకు, అంతే కాదు. నేడుకూడ యముడన్న నరలోక కంటకుడని, హిరణ్యకశిపుడన్న కఠోర రాక్షసుడని, సామాన్య ప్రజాభావము. అనేక గొప్ప నటకులుసయితము ఆ పాత్రలను అవ్విధముగానే ప్రదర్శించి నాడు మన్ననలనందుచుండిరి. కాని శ్రీ రాఘవాచారిగారు యమపాత్ర ప్రదర్శనము, మన తత్వమును ప్రదర్శించినది. యమునన్న ధర్మరాజు న్యాయస్వరూపుడతడు.

ఈ విధముగనే హిరణ్యకశిపుడెంత రాక్షసుడయినను, తన భార్యను అతిగా ప్రేమించిన భర్త, కొడుకును ప్రేమతో పెంచెడి తండ్రి, విష్ణువిద్వేషమే అతని దుర్గుణము. ఈ భావములన్నియూ, రాఘవాచారిగారి ప్రదర్శనములందు ఉట్టిపడుచుండెడివి.

నిజముగా మన నాటకరంగము నలంకరించిన మహానటులలో కూడ అగ్రగణ్యుడని, శ్రీ రాఘవాచారిననవచ్చును. నిజముగా,




ఆకులిత

చిత్రకారుడు : శ్రీ చేబూరి రాధాకృష్ణ.

నాటకముగాని, నేడుగాని, సంగీతము నటుల కతిసాహాయ్యముగ నుండి నది. అందుచేత అనేకమంది నటులు, సంగీతసహాయ్యముననే, తమ పాత్రలను రసవంతమొనర్చుచుండెడివారు. సంగీతముగాని నటున కొనాడు మన రంగస్థలమే కాదు, ఏ రంగస్థలమందును తావుండెడి కాదు. రాఘవాచారిగారికి సంగీతముసలేరాదు. అయినప్పటికిని, కృతితప్పకుండ అనేక పాటలను, పద్యములనుకూడ అతిరసవంతముగా నాటకరంగమందు వారనుభవించెడివారు. వారి పాటలో కాని, పద్యములో కాని, సంగీతము లేదని ఎవ్వరికినీ అనిపించెడిదికాదు. ఏలనన, పాత్రలో పూర్తిగా లీనమయిన, రాఘవాచారిని మరచి, ఆ పాత్ర జీవితమును సామాజికులు దర్శించుచు, అందే లీనమయిపోయెడివారు. వీరు, మన నాటకరంగమునకు నవ్యతర్కములను కల్పించిన మహా స్రష్టి కర్త.

## హరిప్రసాదరావుగారు

వీరు గుంటూరు పురవాస్తవ్యులు. భరతనాట్యమునకు ప్రసిద్ధి కెక్కిన కూచిపూడి సంప్రదాయమునకు చెందినవారు. విదేశము లందును, ఇతర ప్రాంతములందును రాఘవాచారివలె ప్రసిద్ధిచెంద కున్నను, మన ఆంధ్రదేశమంతటను, వీరు అద్వితీయయశస్సు గడించిరి. వీరి నటనాపద్ధతి, రాఘవాచారి పద్ధతివలెగాక మరొక రీతిగ నుండును. రాఘవచారి, పాత్ర నిర్వహించుటకుముందు, ఆ పాత్ర విషయ సర్వస్వమును ఆమూలాగ్రముగ నెరిగి, బుద్ధి నుపయోగించి, పాత్రస్వరూపము నవగాహనము చేసికొని, యా స్వరూపమును వ్యక్తీకరించుచుండెడివారు. కాని హరిప్రసాదరావుగారు, తాను నిర్వహింప వలసెడి పాత్రను సూక్ష్మముగా నెరిగి, యందులోనే లీనమయి యా పాత్రను తానే అనుభవించెడివాడు. ఇది నాట్యకళ యందలి యోగపద్ధతి యని మనమనవచ్చును.

వీరు సయితము, రాఘవచారికవలెనే, వేషధారణను ఇతర ఆడంబరములను, అంత లెక్కచేసెడివారుకారు. వీరు పెద్దయయిన తరువాత, నాటె దుస్తులేవి వీరికి చాలకయుండెడివి. అవి వేసికొనినంతనే చినిగిపోయెడివికూడ...ఒక్కొక్కప్పుడు ఆ దుస్తు చాలదని, సగముగా కుడచించి, ధరించి, వీరు పాత్ర నిర్వహించెడివారు. కాని వీరు నాటకరంగమందు నిలచి పాత్రను నిర్వహించునపుడు, దుస్తులనుచూచు అవకాశ మెవ్వరికిని యుండెడిదికాదు. ఆ పాత్రను అనుగమించుటే ద్రవపరమావధి.

వీరు సయితము, రాఘవాచారిగారికి వలెనే, సంగీతమున కంత ప్రాముఖ్యము నిచ్చెడివారుకారు. ఒక్కొక్కప్పుడు పద్యమునే తాళము కల్పించి పాటగాను, పాటను, తాళము తప్పించి పద్యముగాను చదివెడివారు. ఇవన్నియు, చిత్రవిచిత్రములైన పాత్ర జీవనవిశేషములేయని సామాజికులకు తోచెడివి. అంతేకాని, ఏ వ్యంగ్యభావము ఇందు గోచరించెడిదికాదు.

హరిప్రసాదరావుగారి, హరిశ్చంద్రపాత్ర చాలదినుతి కెక్కనది. కాని సారంగధర, నలుడు, బాహుకుడు మొదలయిన అనేక పాత్రలను నాటరరంగమందు వీరద్వితీయముగ అనుభవించెడివారు. ఇట్టి నటుడు, మరల మరొకడుండగలడాయను సందేహముగ వీరి నెరిగిన ప్రతివారిని బాధించును.

## కందాడై శ్రీనివాసన్‌గారు

పేరును జూచి వీరరవ వారని భ్రమించ వచ్చును. వీరిది నెల్లూరు. వీరు వృత్తిని బడిపంతులు, కాని మన దేశమందు నాటకరంగమునకేగి వినోదము సల్పిన మహా కళాకారుడు.

నాడు నెల్లూరునందు మహాపండితులైన వేదము వేంకటరాయ శాస్త్రిగారుండెడివారు. గొప్పనాటకములను రచించుట, వారి శిష్యులచే యా నాటకములను ప్రదర్శించుట, నాటి నెల్లూరి సాంఘిక జీవితమునందొక ప్రధాన భాగము.

కందాడై శ్రీనివాసన్‌గారిని, దొరసామయ్యంగారని కూడా వ్యవహరించెడివారు. వీరి పంథా, రాఘవాచారి, హరిప్రసాదరావుల, పంథాలకు వేరయినది. కళలందు పండితభావము వీరిదనవచ్చును. నిజముగా నాటక రంగమున పాత్రరసవంతముగ నిర్వహించుటకు, ప్రేక్షకులందరు రసికులుగా ఉండవలెనని వీరి అభిప్రాయము. వీరి జీవితమందీ అభిప్రాయమును పలుమారులు సూచించెడివారు.

వీరు, నాటకము లాడునప్పుడు, వేషధారణ, ఇతర ఆడంబరములకు, అభినయకళకిచ్చినంత ప్రాముఖ్యమిచ్చెడి వారు. వీరు ఎక్కువగా రాజుపాత్రలను నిర్వహించెడివారు. నిజముగా, వీరు రాజు పాత్రనరించి, రంగస్థలమున నిలిచినంత, నిజముగా రాజేవచ్చి నిలచెనన్న భ్రమకలిగించెడివాడు. మన కావ్యములందలి రాజలక్షణములను ఉడుపులను, సర్వమువీరు ఆమూలాగ్రముగ పఠించి, ఆ రీతిగనే రాజపాత్రను ప్రదర్శించెడివారు. ఆ పయిన, వీరి సహజమైనశీవి, రాజును మించియుండెడిది.

నిజముగా దుష్యంత పాత్రకు వీరిది పెట్టిన పేరు. ఒకనాడు నేను కీర్తిశేషులయిన యడవల్లి సూర్యనారాయణగారితో ప్రసంగించుచుంటిని. కందాడై శ్రీనివాసన్‌గారి దుష్యంతపాత్ర చర్చకు వచ్చినది. యడవల్లివారు వెంటనే, కళ్ళు మూసికొని, కందాడై శ్రీనివాసన్‌గారిని ధ్యాన మొనర్చుచున్నరీతి ఒక నిమిషము అట్లె నిమగ్నులై కూర్చొని ఇట్లనెను. "అయ్యా, ఆయన నిజమయిన దుష్యంతుడు. కాళిదాసు వారి నటనను చూచి దుష్యంతపాత్ర సృష్టించెనేమోయని సందేహము. నేను దుష్యంతపాత్ర నిర్వహించుటకు వారి అడుగుజాడల నడచుటకే ప్రయత్నిస్తుంటాను. కాని నాకిప్పటికి తృప్తిలేదు." నిజముగా యడవల్లి సూర్యనారాయణ గారన్నట్లే కందాడై శ్రీనివాసన్‌గారి దుష్యంతపాత్ర, కాళిదాసు భావనను సంపూర్ణముగ ననుకరించుచుండెడిది.

వీరు దుష్యంత పాత్రయేగాక, ప్రతాపరుద్రుడు, బొబ్బిలి యుద్ధమందు రంగారావు, తానీషా మొదలయిన రాజపాత్రలను ధరించెడివారు. వీరియందు చిత్రమయిన విశేషమేమన, వీరు ఒక స్త్రీపాత్ర, ఎరుకలసాని పాత్ర కూడ అద్వితీయముగ నిర్వహించెడివారు.

వీరిది నిజమైన కళాహృదయము. దేశభక్తి వీరికి మెండు. 1921వ సంవత్సరములో, గాంధీ నినాదం దేశమంతట మారు మ్రోగినప్పుడు దేశమాత పిలుపు వీరు నిరాకరించలేదు. రెండు సంవత్సరములు జైలువాసము చేసిరి. నిజముగా వీరిని చక్రవర్తిగానే ఎగిరిన నెల్లూరి ప్రజలెల్ల వీరి కారాగారవాసమును నిజముగా సహింప

వాలకపోయిరి. వారు అస్తంగతులైనపుడు నెల్లూరు నగర ప్రజలం దరు ఏకముగా స్మశానవాటిక కేగి వీరిని స్వర్గమునకు చక్రవర్తిగా సాగనంపుచు వీడ్కోలునిచ్చిరి.

## మంజులూరి కృష్ణరావుగారు

వీరు వృత్తికి డ్రాయింగుమాష్టరు. కాని నాటకరంగమందు వీరికి కేళీవిలాసము. స్కూలులో వీరివద్ద డ్రాయింగు చెప్పించుకొను బాల బాలికలెవ్వరిని ఇటి మహత్తర నటుడా వీరు, అని భ్రమింప జేయరు. నిజము, నాట్యరంగము వదలి, బయట వీరితో సంభా షించునప్పుడు వీరిని నటుడు అను అవకాశముకూడ ఇచ్చెడి వారు కారు.

కాని వీరిని నాడు ఎరుగనివారు ఆంధ్రదేశమున లేరు. వీరికి సంగీత మసలేరాదు. విడిగా పద్యము పాడమన్న కూడ, సంకోచించి ఏదో విధముగ చదివెడివారు. కాని కృష్ణరాయబార నాటకమున, కృష్ణపాత్ర ధరించి, అద్భుతముగ నిర్వహించెడివారు. నిజముగ భారతమందలి కృష్ణుడే ప్రత్యక్షమయినట్లు ఆనాడు ప్రేక్షకులు భావించెడివారు. కృష్ణపాత్రకు పద్యములు మెండు. కాని వీరు పద్యమును రాగయుతముగా శ్రావ్యముగా చదివిరా లేదా యను విమర్శ నాడు ప్రేక్షకులకు తోచెడిదికాదు. వీరి పాత్ర నిర్వహణ యందు ఒక గొప్పవిశేషముండెడిది. మనము గ్రంథములందు వివిధ మొనర్చుకొనలేని సూక్ష్మభావముల నెన్నింటినో వీరు నాటకరంగ మందు, అతి సునాయాసముగా, స్పష్టముగా ప్రకటిత మొనర్చు చుండెడివారు.

నిజముగా ప్రతాపరుద్రీయమందు, పిచ్చివాని పాత్రకు వీరిది పెట్టినదిపేరు. నాటక కళయందొక విశేషముకలదు. కవి ఉద్దేశించిన భావములేగాక, అతీతభావములను సయితము సృష్టించుటకు, నటునకు అవకాశమున్నది. ఆ అవకాశమును గుర్తించి, ఉత్తమ భావములను సృష్టించిన నటుడే నిజ కళాకర్త. మంజులూరు కృష్ణా రావుగారు ఈ శ్రేణికి చెందిన మహా కళాకర్త యనుటకే సందేహ మును లేదు.

## యడవల్లి సూర్యనారాయణగారు

వీరి పేరెరగని వారెవ్వరు ఆంధ్ర దేశమున నాడు లేరనియే చెప్పవలయును. సత్యవంతుడు, దుష్యంతుడు, నలుడు మొదలయిన పాత్రలను వీరద్భుతముగ నిర్వహించెడివారు. నాట్యరంగమందు నిజముగా స్వేచ్ఛావిహారము సల్పిన నటుడితడనియే చెప్పవలెను.

వీరి నటనాకౌశలమునకు తోడై మంచి శ్రావ్యసంగీతము గూడ నుండెడిది. మైలవరం థియేటరులో వీరు పాడిన పాటలెల్ల, ఆంధ్ర దేశ మంతట అబాలగోపాలం పాడుచుండెడివారు. వీరి నటనయందు విశేషమేమన, ఒక నిర్దిష్టమైన శైలి, వారు ఏ వేషము వేసినను, వీరి నటనా పరిణతి యంతయు ఆ శైలినే అనుకరించు చుండెడిది. నిజ ముగా యడవల్లి సూర్యనారాయణగారి ప్రవేశ నిష్క్రమణములే యూతని నెరుకపరచు చుండెడివి. ఇట్టి విశ్చితశైలి యుండుటే ఒక కళావిశేషము. నిజంగా ఆంధ్ర నాటకరంగము నలంకరించిన మహా కళాకారులలో ఇతడొక్కడని చెప్పకొనక తప్పదు.

## నెల్లూరి నాగరాజరావుగారు

మన నాటకరంగ స్థలమునకు వన్నె తెచ్చిన కళాకారులలో నెల్లూరు నాగరాజరావొకరు. వీరుకూడ డ్రాయింగు మేష్టరే. పిల్లంగ్రోవి వాయించెడివారు. పాట కచేరీలు కూడ చేసేవారు. వీరి కంఠ సంగీతజ్ఞానము పాండిత్యము ఉండెడిది. కాని, పిల్లనగ్రోవి వాయించుట వలననో, లేక మరేకారణము చేతనో వీరికి పాటపాడు టకు సరియాయిన గాత్ర ముండెడిది గాదు. అందుచేత రంగస్థలముపై వీరెప్పుడు పాటకుగాని, పద్యమునకుగాని ప్రాధాన్య మిచ్చెడి వారు కాదు.

నిజముగా వీరి నటనాకౌశలము, మరెవ్వరికిని తీసిపోనిది. వీరు పైత మనేకపాత్రలను ధరించెడివారు. షరాను, కంసుడు, శివాజీ, బాహుకుడు, పాపారాయుడు మొదలయిన అనేక పాత్రలను వారు ధరించెడివారు. వీరెప్పుడు రంగస్థలముపైకి వచ్చినను, వీరిని గుర్తిం చుటకు వీలయ్యెడిదికాదు. నిజముగా వేషధారణయందు వీరి ప్రజ్ఞ అమితము. ఇంతేగాక వీరినటనా కౌశలము సయితము అపరిమితము. అందుచేత ప్రేక్షకులు వీరి వేషముచూచి నిజముగా విస్మయము లయ్యెడివారు.

## మాధవపెద్ది వెంకటరామయ్యగారు

మన నాటకరంగ మలంకరించిన అఖండ నటులలో వీరిని పేర్కొనక తప్పదు. వీరి నటనయందు కూడ శైలీ ప్రాధాన్యత యుండెడిది. దుర్యోధనుడు, రంగారావు, శివాజీ, మొదలయిన అనేక పాత్రలను వీరద్వితీయముగా నిర్వహించెడివారు, సంగీతము వీరికి సయితమురాదు. అయినప్పటికి ఎన్ని పద్యములున్న పాత్ర యయినను, అతిసునాయాసముగా రసవంతముగ వీరు నిర్వహించెడి వారు. వీరి నటన కూడ శైలీప్రాధాన్యముగుటం జేసి, ఏ పాత్రధరిం చినప్పటికిని, వెంటనే వీరిని ప్రేక్షకులు గుర్తింప గలిగెడివారు. అయినప్పటికిని పాత్రాభినయమందు, ప్రేక్షకులు వెంటనే వీరిని మరిచిపోయి పాత్రలో లీనముగుచునే యుండిరి.

గతకాలమందు మహానటులెందరో మన రంగస్థలమునకు రూపు మిచ్చిరి. వారందరిని పేర్కొని, వారి గుణగణముల వర్ణించుటకు ఒక వ్యాసమే కాదు, ఒక మహాగ్రంథము సయితము చాలదేమోయని అనిపించును. అయినప్పటికి, మన కత్రిపితికరమయిన నాటకరంగ స్థలమును కలచికొనినపుడెల్ల వీరందరు స్మరణకు రాకమానరు. నిజ ముగా ఆంధ్రమునకు వీరెన్నటికిని చిరంజీవులనియే అనుకొన వలయును.

# యామాసామాయా

'జమదగ్ని'

అనగనగా ఒక చీమ.

ఆ చీమ కో తలకాయ ఉంది.

ఆ తలకాయలో 'నే' నుంది.

ఈ 'నేను' ఇంతపని చేస్తా ననుకోలేదు.

కాని చేసేసింది.

తీరా చూస్తే ఇంత చేసింది తానే.

ఆ సంగతి తెలిసేటప్పటికే ఇంతయింది.

ఇంతవుతుందని తెలిస్తే చెయ్యకనే పోను.

అలా తెలిస్తే ఇంకేం?

సంసారంపోయి సారమే దక్కేది.

చీమ పాపం నడుస్తోంది.

దారిలో బెల్లం కనిపించింది.

అదేమిటో దానికి తెలియదు.

దగ్గరకుపోయి చూచింది. ఊరికే చూడడంకాదు.

రుచి చూచింది.

మహా రుచిగా ఉంది.

రుచిగా ఉంది కదా అని తిన్నంత తిని ఒక్కొక్క అణువే చేరవెయ్యడం మొదలు పెట్టింది.

అంతా చేరవేసుకున్నాక సావకాశంగా తిందా మనుకుంటూ ఎన్నిసార్లు తిరిగిందో లెక్కలేదు.

ఇది తిరుగుతూనే ఉంది.

అది తరుగుతూనే ఉంది.

కాని ఎంతసేపటకీ అయిపోవడంలేదు.

పైగా గడ్డగడ్డగానే ఉన్నట్లు కనిపిస్తోంది.

చీమ మధ్యలో ఒకసారి ఆగి అటూ ఇటూ చూచింది.

గడ్డవైపు చూస్తే పట్టరాని కోపం వచ్చింది.

మొదట్లో ఎంత ఉందో ఇప్పుడూ అంతే ఉన్న ట్టుంది.

ఇంతసేపు తిరిగినా తరగలేదే! ఏం చెయ్యాలి దీన్ని?

భారియవైపు చూస్తే తన కళ్ళను తానే నమ్మ లేక పోయింది.

నలుసుమీద నలుసుగా నలుసుమీద నలుసుగా అంతా బెల్లం నలుసులతో నిండిపోయి ఉంది.

చాలా ఉందే ఇది!

ఇంత చేరవేసిందీ తానే గదా!

ఈ నడకతో ఈ ఒంటితో ఇంతపనిచేస్తే తనకే గనక ఎగిరేశక్తి ఉన్నట్లయితే ఈ గడ్డంతా ఈపాటికి బారియలో ఉండిపోయేది గాదూ!

ఆ ఊహ వచ్చిందో లేదో దాని ఆయుష్కాలం అయిపోయింది.

వెంటనే దోమయి కూమంది.

అటూ ఇటూ ఆడుతున్న రెక్కల్ని చూచుకుని ఎగిరిపడింది దోమ.

ఎగురుతూ ఉంటే మరో అద్భుతం తోచింది.

ఓహో! అదీ సంగతి!

ఈ రెక్కలలో సంగీతంకూడా వస్తుంది కాబోలు.

రెక్కలూ, సంగీతం! ఇంక లోటేమిటి? అను కుంటూ తిరగసాగింది దోమ.

చీమగా ఉన్నప్పుడు చేరవేసుకోవడానికి రెక్క లుంటే బాగుండే దనిపించింది. ఇప్పుడు తీరా అవి వచ్చాక చేరవెయ్యడమే అవసర మనిపించడంలేదు దోమకు.

పైగా ఒంటిని బట్టి రుచీ మారింది.

ఇప్పుడు దాని రుచి అంతా బెల్లంలో కాదు నల్లలో ఉంది. అదైనా నిలవుంటే బాగుండదు.

తయారయే చోటి నుంచే సరాసరి ఆస్వాదిస్తే దాని మజా ఇంతా అంతా కాదు.

అందులోనూ పశువుల నెత్తురుకంటే మనుష్యుల నెత్తురు రుచికి రుచీ, సులువుకు సులువూ! దానికి దీనికీ సాపత్యమే లేదు.

పల్చన గావడంచేత గాబోలు మనిషి చర్మంలో దాని ముల్లు ఇట్టే గుచ్చుకు పోతుంది. వెచ్చ వెచ్చగా చెరుకుపాకంలా ఎంతైనా పుచ్చుకోవచ్చు.

కాని ఒక్కటే చిక్కు.

పశువుల్లోకంటె మనుష్యుల్లో ప్రమాదం ఎక్కువ.

చిన్న పిల్లలు ఊరికే అటూ ఇటూ దొర్లుతారు గాని పెద్దవాళ్లు మాత్రం అలా ఊరుకోరు. సరిగ్గా తాను వాలినచోటే తమకే దెబ్బ తగుల్తుం దనైనా లేకుండా గట్టిగా చరుచు కుంటారు.

అమ్మో! ఆ గురి చెప్పతరం కాదు! ఇప్పటికే ఒకటి రెండుసార్లు చచ్చేటంత పనయింది.

తన ఒళ్లేగనక పెద్ద ఒళ్లయితే వీళ్లేం చెయ్య గలరు?

అలా అనుకుంటూనే దోమ దెబ్బతిని చచ్చి సామజమై అవతరించింది.

దోమెక్కడ! సామజ మెక్కడ!

ఎంత ఒళ్లు వచ్చింది తనకి!

ఇప్పుడు మనిషిచెయ్యికాదుగదా, కొండ వచ్చి మీదపడ్డా తనకేం పరవాలేదు.

అంతేకాదు, మరో సౌలభ్యం వచ్చింది.

అప్పటి ముల్లు కంటే ఇప్పటి తొండం ఎంతో బాగుంది. దీంతో నెత్తురేం కర్మం, మనుషుల్ని మనుష్యుల్నే పీల్చెయ్యవచ్చు!

ఏనుగయిన వెంటనే పూర్వస్మృతితో అలా అనుకుందిగాని పాపం ఒంటి మార్పుతో రుచి మార్పు వచ్చిందన్న సంగతి ఇంకా తెలియలేదు దానికి.

పైగా ఇప్పుడది ఉన్నచోట నరవాసనే లేదు. అంతా మహారణ్యం!

అమాంతం ఒక ఎత్తైన చోటికిపోయి చుట్టు పక్కలంతా పరకాయించి చూచింది ఏనుగు.

తన ఒళ్లుగూడా ఒకసారి చూచుకుంది.

దానికి పరమానంద మయింది!

నిజానికి దాని ముందు నిలవ గలిగే ప్రాణి ఏముంది? అన్నీ అల్పప్రాణులే!

కోరి ఇంత శరీరం తెచ్చుకున్న తాను సాధించ లేం దేముంది ఈ జగత్తులో?

సంతోషాతిశయంతో పాడాలనుకుని గొంతెత్తింది ఏనుగు. ఒళ్లు తెలియని మైకంతో పాడేసింది.

ఆ మంద్ర గంభీర నిర్ఘోషం విని అల్పప్రాణు లన్నీ హడలిపోయాయి. మృగరాజుకూడా వెనకెక్కడో నిలబడి విన్నదే కాని ముందుకు రాలేకపోయింది.

ఈ విజయానికి ఏనుగుకు ఎక్కడలేని అహంకారమూ వచ్చింది.

కాని ఎందుకో తృప్తి కలగ లేదు.

క్రమక్రమంగా తానుపాడిందానికంటే ఎవరైనా పాడితేనే బాగుంటుందనిపించింది.

దాంతో ఎటునుంచైనా సుతిమెత్తని సంగీతం వినిపిస్తే అందులో లీనమై ఒళ్లు మరిచిపోయేది.

అటువంటి సమయాల్లోనే కాస్త తృప్తి కలిగేది.

తక్కినప్పుడెందుకో పట్టి చిరాకు!

ఆ చిరాకుతో నాలుగాకులు తినడానికి చెట్టంతా పడగొట్టేది.

నెత్తు రెలాగూ లేదు, ఆకులేనాయ్ తినవలసింది. చిగురాకులు తింటే సరిపోదూ, చెట్టునలా ఉంచి!

ఊఁహు—చాలేదికాదు దాని తత్వానికి.

పైగా అడిగేవాడు లేడు. దానికి తోడు ఒకరు తన్నేం చెయ్యగలరని పట్ట పగ్గాలు లేని పొగరు మోతు తనం.

దాంతో అరణ్యాన్నంతటినీ చితకులు చితుకులుగా విరిచి పోగులు పెట్టసాగింది ఏనుగు.

ఒకరోజున దాని కాహుతయిన పెద్దచెట్టుకు ఒక ఎండుకొమ్మ ఉన్నది.

ఆ కొమ్మ విరగడంతో దాంట్లోనుండి ఒక కందిరీగ ఝూమ్మంటూ బైటికి వచ్చింది.

లేచింది మొదలు ఝూంకారంచేస్తూ అది ఎగురుతూ ఉంటే దాని స్వరూపస్వభావాలు ఏనుగుకు తెలియలేదు కాని సంగీత సమాధి లభించింది.

తొండం పైకెత్తుకుని ఒళ్ళంతా ఊగిసలాడించు కుంటూ పరవశమైపోయింది.

ఆ పారవశ్యంతోనే కందిరీగ ఎటుపోతే అటే పోయింది ఏనుగు.

దాన్ని చూస్తూ కాదు నాదం మాత్రమే వింటూ.

కంధిరిగకు ఈ ధ్యాసే లేదు. తన పాటేమో తానేమో!

విడదియ్యరాని గమన గానాలతో అది వీర విహారం చేస్తోంది.

అంతలో ఏమయిందో ఏమిటో ఏనుగుకు బైటి సంగీతం లోపల వినిపించ సాగింది.

వట్టి సంగీతమైతే బాగానే ఉండేది.

కాని అదికాదాయె! ఇదేదో లోపల తొలి చేస్తోంది!

ఏనుగు నిలవలేక పోయింది.

ఆ బాధ తప్పించుకోవాలని పరుగెత్తింది.

పరుగెత్తితే పోయేదా అది, లోపల ప్రవేశించిన బాధాయె!

ఉద్రేకపడి పరుగెత్తిన కొద్దీ మరీ మరీ అతిశయించిం దా బాధ.

ఏం చెయ్యడానికీ తోచలేదు ఏనుగుకు.

తొండం తెంపేసుకుందా మని ప్రయత్నించినా తెగలేదు.

చేసేదిలేక కుప్పకూలిపోయి ప్రాణ నిర్యాణ సమయంకోసం ఎదురు చూచింది.

అంత ఒళ్ళూ దాని కిప్పుడెందుకూ పనికిరాలేద పాపం!

స్వాస్థ్యం లేకపోవడంతో అదికావాలి ఇది కావాలి అన్న కోరికలు నశించాయి, ఇప్పుడు వేధిస్తున్న ఈ బాధ వదిలితేచాలునన్న వాంఛ తప్ప.

మరి ఈ బాధ ఎందుకు వచ్చింది?

ప్రాణం పోతోందొక ప్రక్క. మరో పక్క లోపల నుండి అస్పష్టంగా వినిపిస్తోంది సంగీతం.

ఏమిటో అర్థమున్నట్టుందే!

శివ శివా! ప్రాణం తీసేస్తోంది పాడు సంగీతం!

యా మా సా మాయా!

యా మా సా మాయా!

యా మా సా మాయా!



# అవతారం

**శ్రీ యస్వీ జోగారావు**

"ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే"

అది హిమాలయము కాదు మహిమాలయము.

అది పరమేష్ఠి చరాచర సృష్టి శిల్పకల్పనాపటిష్ఠతకు పరాకాష్ఠ.

అది పురాణదంపతులు జగత్పితరులు నగు పార్వతీ పరమేశ్వరుల చిరంతన పరంధామము. కామవాసనలు నశించిన వారి ప్రేమకది పరసీమ.

శివదేవుని అభయహస్త శుభముద్రలచే ఆదిగర్భేశ్వరి యగు అపర్ణ తపఃఫలముగా సంభవించి శాంభవతేజము జగమఘాతుకముగా విజృంభించిన రంగభూమి.

భగీరథ ప్రయత్నమున దివినుండి దిగిన గంగాభవాని తరంగ తాండవ ప్రథమభంగిమ కది యాధారపరిధి.

అది దేవతాత్మ.

పూర్వాపరసాగరాంతర పరివ్యాప్త మహీమండల మానదండము.

సృష్టిలో నెల్ల స్వచ్ఛతకు, సౌందర్యమునకు, ఔన్నత్యమునకు, ఆధిక్యమునకు అనుత్తమోపమానము.

అది అనేక నదీమతల్లులకు పుట్టినిల్లు.

ఓషధుల నిధి.

రత్నముల నిక్షేపము.

అప్సరసల కాటపట్టు.

సిద్ధుల తపోనిష్ఠ కధిష్ఠానము.

గంధర్వుల గానవిద్యాసాధనకు నిదానము.

విరహవిధుర హృదయు లగు యక్షప్రేయసీ ప్రియుల రాయబారులకు మధ్యేమార్గ ప్రపాశాల.

*　　　*　　　*

అట నవిముక్తమువలె నొక విశాల వివిక్త ప్రదేశము.

అది యొక పచ్చని పర్వతోపత్యక. నలువంకల పంక్తులు తీరిన పర్వతములు—ఉత్తుంగ శృంగములు—కైలాస, కాంచన గంగా, గౌరీ శంకర నందాదేవీ, ధవళ త్రిశూల శైలరాజములు,... ఆ పర్వతసానువులపై పరమేశ్వరు నొడలినుండి దిగజారు నాగులవలె నదులు, వాగులు. సాంద్రాతిసాంద్రమగు నొక భూరికాంతార భూమి నావరించియున్న ఆ గైరిక ప్రాకారము నడుమ నదీజలముల బొదివిపట్టు మనోహరమైన మానససరోవరము.

అట అనా డెప్పటియట్ల ఉదయగిరి శృంగముపై ఉష స్ఫురణమైనది. కాని పరమేష్ఠి ప్రతిభ నవనవోన్మేషశాలిని. ప్రకృతి రామణీయకము నిత్య ప్రత్యగ్రము.

ఆ నాడెందులకో ప్రకృతి భగవతి యొగప దుల్లాసవ నవసరించినది.

పుడమితల్లి పచ్చి పురిటాలివలె కడుపు చుమ్మలు చుట్టి కొన్నది.

సరిత్తుల సరోవరముల సాగరముల జలదేవతలు దాసక్రీ లాడుకొనిరి.

తొలినాటి చరమ సంధ్యావేళ అగ్నిభట్టారకు నంతరం ముఖం దంతర్భవించిన రేపుమాపుల రూపురేకలు దీర్చు కాం పుంజము నలవోక అకళించుకొని ఉదయభాస్కరు డున్మత్తు జగత్తు నొక క్రొత్తపోకడతో రకరకముల రంగు రంగుల పో ణింపులతో మావణించినాడు.

అంతదాక శిశిర విశీర్ణము లయ్యు హాతాద్వసంత సంత పముతో వింతగా చిగిర్చిన మ్రాకులపై, మ్రాకుల నాశ్రయిం కొనలు సాగి వనలెత్తిన క్రొందివెలపై తావుల్ కొల్లగొనుచు వె జల్లుచు చల్లనిగాలి రివటలు చక్కిలిగింతలు పెట్టుచు పోయినవి.

ఆకస మకాలపర్జన్య గర్జాస్ఫూర్తి ప్రకటించినది.

ఆ వేళ విధాత, అప్పటికే అనేక మూకజీవరాసుల జాతకవ శేర్పరిచిన నేర్పరి ఒక్క అనిదంపూర్వ నవ నవ జీవపదార్థ సృ సంకల్పము చేసి, అంతర్ముఖుడై యోగసమాధిలో నున్నాడు. స ధర్మచారిణి వాణి చేదోడు వాదోడు కాగా ఆత్మసాక్షాత్కార పొందిన మహాయోగివలె లేచి సంకల్పసిద్ధి పొందినా డతడు.

ఆనాడట పుడమితల్లి యొక క్రొత్త పురుడు పోసుకొన్నది.

*　　　*　　　*

అయ్యది స్నుషమా సుభగమైన శుభసమయమున, ఆ ప్రాక్ వ్యక్తి జీవన ప్రభాతవేళ అధోభాగము హిమావదాతమై ఉపరిత మరుణారుణ కుండలిత శిలామండలమై, శిఖరాంచలము సదో భ్యుదిత బాలభానుకిరణ కమనోజ్జ్వలమై హిమనిర్ఝరోపక్రమ ర జీయమై శశాంక శేఖరుని జటాజూటమువలె గన్పట్టుచున్నది గౌ శిఖరము.

ఆ గిరిశేఖరముపై నదియొక విశాల శాద్వల తలము. చుట్టుప చెట్లుచేమలు నేలను నేసియున్నవి. పుడమి యొడలి పులకలవ నవోద్భిదము లెసలెస పొడసూపుచున్నవి.

అట నొకచో చీనాంశుకపు చికిలిచుచ్చు విసనక్రలవ నున్న వాలము లెత్తి మేతలు మేయుచు, గాలికి వాలుగా వెన

కాళ్ళపై నిలబడుచు గగనమూయుచు పొత్తిళ్లలో నొత్తుగా పెరిగిన బొమ్మపచ్చికలలో కాళ్లు విప్పనకై జొనుపు కొనుచు గడ్డిదుబ్బులలో కొమ్ములతో నొరాడుచున్న చమరీమృగముల వాలకములు, చర్యలు చక్షుశ్యాపువులుగా నున్నవి.

మరియొకచో పొదరింట్ల పొంత నక్కినిక్కి చూచుచు పొక్కిలి జాలెనుండి జారు మదపంకము పరిమళములు పరిసరములకు పంచిపెట్టెదు చిరుకొరల చిటిపొటి కొమ్ముల కస్తూరీ మృగవారము.

వేరొకచో సారవిస్ఫురములు సన్నగా సౌజ్ఞాయిరాగము లాలపించుచున్నవి.

ఒక వల్మీకనితంబమునుండి పిపీలికలు బారులు దీరి శిఖరాభిముఖముగా బోవుచున్నవి. వల్మీక శృంగములపై చిరుగాలి పోసులకు తెలిపోనములు లేచి పడగలు విప్పి యాడుచున్నవి.

ఒక రసాలసాలముపై ఫలగ్రహణ పరాయణములై కిశోర వానరములు శాఖాచంక్రమణములు చేయుచున్నవి.

అల్లంత దూరాన మానసకాసారమున కలహంసలు పద్మినుల పజ్జ జేరి తత్ప్రియబాంధవుని ప్రణయ సందేశములు నివేదించుచున్నవి.

అప్పట నా వేళ ముచ్చటగా జరిగిన దొక ప్రాక్తన మహావ్యక్తి జీవన ప్రస్తావన.

* * *

అట నొక ఊడలమ్రి నీడలో ఉపవిష్టుడై ఊర్ధ్వముఖుడై యోజనవ్యగ్రుడై ఒంటరిగా నొక వ్యక్తి.

ఆ వృషిశాఖలనుండి వ్రేలాడు ఋషిపక్షుల విలక్షణ వీక్షణము లతని యూర్ధ్వదృష్టుల నాశ్చర్యముగా బలుకరించుచున్నవి.

అతడు దిగంబరుడు.

ఆకస మతని చుట్టు నావరించుకొనియున్నది. దహారమునుండి సహస్రారముదాక అతని అంతరంగపు టంతరాళ మంతయు నాక్రమించి యున్నది. ఆ వడుము నతని మనుగడ.

తారెదు ప్రాగ్దిక్కునది. బాగమంచు పటాపంచలైనది. అత డేదో సుదీర్ఘముగా నాలోచించుచున్నాడు.

ఒకింతసేపు నలువంకల కలయజూచి తావురు మనుచున్న ప్రకృతిని జూచి తన యొంటరితనమును దలచి భయభ్రాంతుడై యొక పెనుబొబ్బ పెట్టినాడు. ఆ బొబ్బలో నతని మనస్సు 'నే నెవడ'ను నొక ప్రశ్న మేళవించినది.

ప్రకృతి ప్రతిధ్వనించినది.

మరుక్షణము తన నిరంతరోచ్ఛ్వాస నిశ్వాసములచే నిత్యనూత్న మగుచున్నట్లున్న ప్రకృతిపరిణామ రామణీయకమును జూచి అంతలో నాశ్చర్యచకితుడు, నంతలో నానందపరవశుడు నగుచున్నాడు.

అర్ధనిమీలితనేత్రుడై ఆ ప్రకృతిగతమైన తన మనుగడ యాదము నన్వేషించుచున్నాడు.

'నే నెవడను?

ఎక్కడనుండి నా రాక?

ఎక్కడికి పోక?

ఎట్లు వచ్చితిని?

ఎందులకు?

ooooooooooooooooo

అంతు పట్టని దా ప్రశ్న పరంపర.

ఆలోచించిన కొలది అతనిలో ఆరాట మెక్కువగుచున్నది. హఠాత్తుగా తా నెక్కడనుండియో తెక్కలూడి యిక్కడ పడిపోయినట్లు బుజము లొకపరి తడుముకొనినాడు.

పక్షులు కిలకిల లాడినవి.

ఆం! తన వెనుకేదో జారిపోయినట్లు నడుముక్రింది తడుముకొన్నా డొకపరి.

కిశకిశోరములు కిచకిచ లాడినవి.

ఏమిటీ పక్షులు!

ఏమిటీ జంతువులు!

ఏమిటీ చెట్లు, చేమలు! కొండలు, కోనలు! నదీనదాలు!

కొన్ని చలనములేనివి!

కొన్ని చలన మున్నను చైతన్యము లేనివి!

కొన్ని చలనములేకయే చైతన్యవంతములు!

కొన్ని చలనమును, చైతన్యమును గలవి,

తనవలెనే కనులు, చెవులు, ముక్కునోరును గలవి,

కాని తన్ను బాయ వేమి!

అవి యేవేవో ధ్వనుల నొనర్పగల్గుచున్నవి

కాని తన్ను పలుకరించ వేమి?

పోనీ మరి తన్నంతి పలుకరించుటకు గూడ పట్టించుకొని పక్షులు, జంతువులు వాని మానవని పొక అల్లంతి దూరమునుండియే తనవంక తదేక దృష్టితో నట్లు చూచుచున్న వేల!

ఈ లోకములోనికి తన రాక వానికిని అచ్చెరువు కలిగించినది కాబోలును!

ఈ ప్రకృతికిని తనకు నేమిటి సంబంధము?

ఈ ప్రకృతి కింత యంద మెక్కడినుండి వచ్చినది?

ఈ అంద మంతటిని తనదిగా నేల చేసికొనరాదు?

ఇదంతయు తన యనుభవమునకు వచ్చు టెట్లు?

అస లిదంతయు తన యనుభవమునకు రావలె ననిపించు టేల?

ఏమిటీ కోరిక?

ఎక్కడ దీని ఉత్పత్తి?

ఈ ప్రకృతి తనది కావలెనన్న ఏమి చేయవలె?

అస లిది యిప్పుడు తనది కాదా?

మరి యెవరిది?

దీనికి వేరే ఒక అధికారి యున్నాడా?

ఉన్నాడు కాబోలు!

అతడు తనకంటె నధికుడా?

కాబోలు!

అతనికి నాలుగేసి చేతులును బుర్రలు నుండునా యేమి!

ఉన్నవి కాబోలు!

కాను నతని ప్రకృతిలోని యొక భాగమా?

మరి యత డెక్కడనుండి యూడిపడినాడు? ఎప్పుడు?

ఏడీ అతడు?

ఎక్కడున్నా డిప్పుడు?

ఎటు చూచినను అతని జాడయైన నగపడదేమి? బయట?

తన లోపలగాని దాగొని యున్నాడా అతడు?

లేక యేదో మాయ క్రమ్మినదో మరపు వచ్చినదో కాని యున అతడే కాడా?

అంతకంత కనంత ప్రకృతి రహస్యములగురించి అంతులేని యాలోచనలు వింత వింత విచికిత్సలు చెలరేగుచున్న నతనిలో.

ఛండ గభస్తి మండల పిచండిలమైనది నభస్సు.

అతడు క్రమ క్రమముగా సమాధ్యవస్థలో ప్రవేశించినాడు.

మార్తాండ మండలము నొక పరివేష మావహించినది.

మధ్యాహ్నము గడచినది. సాయంతనమైనది. చీకటి పడినది.

అతడు లేవలేదు.

దినములు, మాసములు, వాసరములు గడచినవి.

అతడట్లే యుండెను.

ఎండలు కాసినవి. గాడ్పులు వీచినవి.

మెయిళ్ళు మెరసినవి. వానలు కురిసినవి.

అతడు చలింపలేదు.

అతని చుట్టును పుట్టలు బలిసినవి.

గుబురుగా పెరిగిన అతని కొప్పులో పిచ్చుకలు గూళ్ళు గటుకొన్నవి.

అతడు చలింపలేదు.

ఒక ఆషాఢవాసర ముషఃకాలమున అకస్మికముగ గగనము గర్జించినది.

గిరి గహ్వరములు మారెలు గిచ్చినవి.

అతనిలో హఠాత్తుగా నొక బాహ్యస్పృహ కలిగినది.

కుబుస మూడ్చిన నాగువు వలె పుట్టనుండి బయల్వెడలినాడు.

సుందరతరము లయిన ప్రకృతి స్ఫురణల బరికించినాడు.

అతని కిప్పుడేమి చేయుటకును దోచలేదు.

అట్లు కింకర్తవ్యతా మూఢుడై యున్న అతనిలో నప్పటి కప్పుడొక కర్తవ్యబోధ యంకురించినది.

అతని యంతరంగమున అగ్నిభట్టారకు డొకపరి యావులించినాడు.

సమాధి భ్రష్టుడయిన యోగివలె అత డటు నిటు చూచినాడు.

అల్లంత దూరమున నొక యామ్రశాఖిక పై నొక బాలవానరం ఫలాస్వాదనము చేయుచున్నది.

ఆ చెట్టు కొమ్మలనుండి ఇంక ననేక ఫలములు గుత్తులు గుత్తులుగా వ్రేలుచున్నవి.

అతడొక రాయితీసి ఒక గుత్తికి గురిచూచి విసరినాడు.

ఒక పండు త్రుళ్ళి ఎచ్చటనో పడింది.

పండు పడిన దెస కతడు పరువెత్తినాడు.

ఆశ్చర్యము! అటనొక శాఖచ్ఛాయ—నొక శిలాతలమున సుఖాసీనయై మరియొక వ్యక్తి.

ప్రకృతి యందు మంతటికి ప్రతినిధివలె నున్నది.

ఆ వ్యక్తికి దనకు నాకార పరిమాణములలో నించుకంత భేద మున్నను నది యేమిటో ఆ వ్యక్తిని జూచుటతోడనే అతనికి తన యొంటరితన మంతయు బోయినట్లనిపించెను.

ఆశ్చర్యముతో నత డొక్కపరి నిట్టూర్చినాడు.

ఆ అవ్యక్త మధురధ్వనిలో 'ఇంత కాలము నీకోసమేనా నే నెదురుచూచు చున్నది!' అను భావ మపహ్నుత మైనది.

ప్రకృతి ప్రతిధ్వనించినది.

అతని గొంతుచెర విడినది.

అపహ్నుతభావ ముపన్న మైనది.

ఆకాశవాణితో నతని యంతర్వాణి జడపు కాయభారముల మార్గమధ్యమున అతని జిహ్వాగ్రమున వాణి యావహించినది.

అతని మూగసైగల కర్థము లేర్పడినవి.

అర్థములకు శబ్దసంకేతము లేర్పడినవి.

అత డాశించిన ఫల మామెయొడిలో బడియున్నది.

అత డామెను దాని పండిమ్మని యడిగినాడు.

ఆమె ముసిముసి నవ్వులు నవ్వుచు, సిగ్గులు చిలుకరించుచు ఇరువురమును బంచుకొంద మన్నది.

అతడు సమ్మతించినాడు.

ఇరువురును పండు పంచుకొని యారగించినారు.

టెంకదగ్గర తగవు తెగలేదు.

అస లది కొరుకబడలేదు.

అట్లని దానిని పారవేయుటకు వారికి మనస్కరించలేదు.

అట మట్టిలో నొక చిన్న గోయి తీసి అందు దాచివైచినారు

ఇరువురు నెదురెదురుగా గూర్చుండి యొకరినొకరు తెగాడి చూచుకొనుచున్నారు.

ఉండి యుండి 'నీవెవ్వరు'వని యడిగినా డతడు.

ఆమె తెలతెలబోయినది.

ఉందు మిపుడే తెలిసికొనివచ్చి తెలిపెదనన్నట్లుగా ఎచటికో లేచిపోయినది.

సాయంకాలమైనది. ఆమె రాలేదు.

చీకటిపడినది. ఆమె రాలేదు.

ఆమె రాకున్న తన కెందుల కీయారాటము!

ఆమెకు దనకు నేమి సంబంధము!

ఏమిటీ చీకటి!

ఇంత వెలుగు నొక్కపరి యెట్లంతర్ధానమైనది!

అరె అదేమిటా వెలుగు!

చిత్రము! వెలుగువెంట చీకటి! చీకటిలో వెలుగు!

చల్లని వెలుగు!

వెలుగునకును వేడియు జలువయు గలవా!

ప్రకృతి ఏమింత ప్రశాంతముగా నున్నదిప్పుడు!

కాని తన మనస్సులో నేమిటీ కలవరము!

చల్లని వెలుగులో వెలుగు చలువను తన యొడలు పులకరించియు భావనాడిలో వేడి యినుమడించుచున్న దేమి! ఆ వేడి వెలుగు తనలోనే లీనమై అంతరించినదా!

చల్లని వెలుగులో ప్రకృతి సౌందర్య మంతకంత కగ్గలముగు చున్నట్లున్న దేమి!

అసలా ప్రకృతి సౌందర్య మినుమడించుచున్నదా? లేక తన కేనో యట్లనిపించుచున్నదా?

ఆ చల్లని వెలు గెక్కడనుండి వచ్చుచున్నది?

ఆ తెల్లని బిళ్ళనుండా?

ఆకసమునుండియే కాక ఆ సరస్సులోను అట్టిబిళ్ళ యొకటి

అగపడుచున్న దేమి!

ఆమె ఏది? ఎక్కడికి పోయినది?

ఆ చీకటి వేళ గాని తనలో ప్రవేశించి దాగొన్నదా!

ఆకస మంతట నేమిటీ లెక్కలేని చుక్కలు!

ఒక్క మాదిరివే అన్ని చుక్కలా!

ఆ చుక్కల కన్ని కాంతులా!

ఆ చుక్కల కాలంబ మెక్కడ?

ఆకాశ మెంత విశాలమైనది!

శూన్య మెంత సుందరమైనది!

* * *

తూరుపు రూపురేకలు బహుధా విభ్రాన్త వికస్వరములైనవి.

అతని యూహావిహంగము లాగా వైహాయస పథముల విహరించుచున్నవి.

అంతలో ఆకసమున నొక మూల నొక యాషాఢ మేఘము మూల్గిన సవ్వడి.

అది యేదో తన్ను పల్కరించుచున్న దనుకొనినాడా వెర్రి బాగులవాడు.

తానును దానితో నేదో మాటలాడ బోయినాడు—

"ఏదీ నా ఎదలోపలి యెద

మధురాతి మధుర ఫలప్రద—

నా గుండెలు ఝల్లన

చల్లని చూపుల వెలుగుల

వెల్లువ వెదజల్లిన వేకువ—

నా గొంతుకలో నవవసంతము

నావిష్కృత మొనరించిన

దేవత—

ఏకడ! జొచ్చినదో!

ఆకసమున చుక్కలలో!

చీకటిలో నా చిత్తములో!

ఎవరో నా యెద తట్టిన స్వామీ

నా సొద నా మొర

నీవైనా నివేదించుమి'

రివ్వున నొక గాలి రివటు మొగిలు మువ్వ్యోనికి మోసుకొని పోయినది.

అప్పుడా మొగిలు మువ్వనుండి యూడిపడి నట్లామె అతని యెదుట సాక్షాత్కరించినది.

అతని సంతోషమున కంతులేదు.

కాని అషాఢమేఘు డొక యార్భాటము చేసినాడు. ఉండి యుండి ప్రళయోద్దండముగ నొక్క యురు మురిమినాడు.

ఇరువురును బెగ్గడిల్లి యొకరినొకరు బిగ్గ కవుంగిలించుకొనినారు.

ఆ క్షణమున వారి తనువుల నణు వణువున శతకోటి విద్యుత్తులు ప్రసరించినవి.

ఉరు ముడిగినను ఆ పట్టినపట్టు వదల వారట్లే సొక్కిసోలి కనుమూసిరి.

నిద్దురలో నిద్దరికి నొక్కటే కల వచ్చినది—

వారు నాటిన విత్తు మొలకెత్తినది

ఆ మొక్క పెరిగి శాఖోపశాఖలై మూడు పూవులు నారు కాయలుగా నొక మహావృక్షముగా రూపొందినది.

అది పరిపక్వ ఫలప్రచురమై ఆకాశ కోశములకు విస్తరిల్లినది.

అనేక జీవరాసుల కాశ్రయమైనది.

కాని పాపము కలి ప్రవేశించిన కొలది కాలములో నొక యకాల ప్రళయ ఝంఝ దానిని సమూలముగా గంపింప జేసినది.

క్షేమము లాక్రోశ మొనర్చినవి.

పక్షులు విలవిల లాడినవి.

కలలో మనస్సు కలగుండు వడి ఇరువురు నిదుర చెదరి మేల్కాంచిరి.

నభస్సు మొగము సుమస్సు నవ్యరోచిస్సుల నలం[illegible]చున్నది.

ఇరువురు నొకరి నొకరు చూచుకొనిరి.

ఆమె కెక్కడినుండియో చెప్పలేని సిగ్గు వచ్చిపడినది. చర చర నొక సమీపస్థ కుధరగుహాకుహరమున ప్రవేశించినది.

ఆ వెలుగులో నొక మరుగులేక ఇక నిప్పుడామె తన యెదుట తనువు జూపింప జాలదని యతడు గ్రహించినాడు.

అతనిలోను ఏదో సిగ్గు అంకురించినది.

నేడిట్లు సిగ్గు పొడసూపుటకు మూలకారణము నిన్న రాతిరి పన్నివేళమనియు నతడు గ్రహించినాడు.

ఆ పన్నివేళముతోనే అతనిలోని చైతన్య మంతయు పూర్తిగా ఆవిష్కృతమైనది.

ఈ లోకములో తానొనర్పవలసిన పను లనేకము గలవని గ్రహించినాడు.

సూర్యునివంక చూడగలిగినంత మేరకు మొగమెత్తి చూచుచు నొక కర్తవ్యబోధ కెదురుచూచుచున్నాడు.

అతనిచుట్టు నొక మహాతేజస్సు వెలిగిపోవుచున్న దిపుడు.

ఆవేళ గగనమార్గమున కొందరు గంధర్వ యక్ష సిద్ధ విద్యా లటు పోవుచుండిరి.

అందరు నతనిజూచి యాశ్చర్యచకితులైరి.

'అతఁ డెవఁడో?' యను నొక పెద్దప్రశ్న యుదయించినది

'ఒక నూత్నపశువిశేష' మని యొకరి తర్కము.

'కాదు కాదితడు పశుపతిసమాను' డని వేరొకరు.

'ఇతడు మానవుడు'.

'కాదు కాదు దైవసమానుడు.'

'ఇతడొక నవ్య ప్రజాపతి'

'కాదు ప్రళయరుద్రుడు'

'ఇతడొక మహర్షి!'

'ఇతడొక మహాకవి!'

పరిపరివిధముల పరుగులెత్తుచున్నవి వారి యూహలు.

ఒక సిద్ధు డనతిదూరముననున్న యొక మానవునివైపు, కన్నెదుట నున్న యొక కిన్నరునివైపు నొకపరి పరికించి యానందము చూపు నిగిడ్చి,

'ఇతడు న...ర...డు' అని వక్కాణించినాడు.

'అవునవును. ఇటీవల బ్రహ్మగారు రమ్యతముగా నొక అపూర్వ వ్యక్తిని. సృజించినారనియు, ఆ వ్యక్తి చరిత్ర భూలోకమున గొన్ని యుగములపాటు చిత్రముగా ప్రవర్తిల్లగలదనియు, ఆ మహా చరిత్రను సంగ్రహించుటకు ప్రత్యేకముగా చిత్రగుప్తుడను నొక గొప్ప యుద్యోగి నియుక్తుడైనాడనియు వింటి'నని యందులోనొకండొక సిద్ధుడు.

'ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు
పితర్మాతర్యది హోప బ్రువే వాం
భూతం దేవానా మవమే అవోభిః
విద్యామేషం వృజనం జీరదానుమ్.'

# శాంతిదూత: తిక్కన

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

కవిబ్రహ్మయని కీర్తింపబడిన తిక్కన సోమయాజి క్రీ. శ. పదమూడవ శతాబ్ది ప్రథమ పాదమునందు జన్మించి, ఇంచుమించు ఆ శతాబ్దము చివరవరకును ఇహలోక పవిత్ర యాత్ర సాగించి యుండునని పరిశోధకులు నిర్ణయించి యున్నారు. ఈ మహాకవి కాకతి గణపతిదేవుని రాజ్యకాలమున పుట్టి, రుద్రమదేవి పరిపాలనమును, రెండవ ప్రతాపరుద్రుని రాజ్యారంభకాలమును జూచి యుండెనని చెప్పవచ్చును. ఈతని యేలికయు విక్రసింహ పురపాలకుడును అగు మనుమసిద్ధిరాజు శాసనములు క్రీ. శ. 1256 - 1262 నడుమ కానవచ్చుచున్నవని వీరేశలింగం పంతులుగారు వ్రాసియున్నారు. తిక్కనామాత్యుడు రచించిన రెండు గ్రంథములలో మొదటిదగు నిర్వచనోత్తర రామాయణము మనుమసిద్ధి జీవితకాలమున వ్రాయబడి అతనికి కృతియొసంగబడినది. ఈ కాలముననే అభినవదండియని ప్రసిద్ధివడసిన మూలఘటిక కేతనకవి దశకుమార చరిత్రను వ్రాసి తిక్కనామాత్యునకు కృతిసమర్పించెను. ఈనాటికే తిక్కనకు ఉభయ కవిమిత్రుడను బిరుదుండినట్లు తెలియుచున్నది. ఉభయకవిమిత్ర బిరుదమొక్కటే తిక్కనామాత్యుని హృదయమున కెక్కినట్లు తోచుచున్నది. నిర్వచనోత్తర రామాయణమునందును ఆంధ్రమహాభారతమునందును గూడ సోమయాజి దీనిని సముచిత వినయ గర్వములతో వాడుకొనెను. ఈతని రెండు గ్రంథములందును ఆశ్వాసాంతగద్యము ఇంచుమించొక్క రీతి నేయున్నది. నిర్వచనోత్తర రామాయణమున "ఇది శ్రీమదుభయకవిమిత్ర, కొమ్మనామాత్యపుత్ర, బుధారాధన విధేయ, తిక్కన నామధేయ" అనియు, మహాభారతమునందు "ఇది శ్రీ మదుభయకవిమిత్ర, కొమ్మనామాత్యపుత్ర, బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి" అనియు ఈతడు వ్రాసికొనెను. భారతరచనా కాలమునకు సిద్ధించిన సోమయాజి బిరుదముతో అనుప్రాస సామ్యమునకై వచ్చినమార్పు తప్ప వేరుమార్పేమియు లేదు. బుధారాధన విధేయుడు బుధారాధన విరాజియయినాడు. ఆహా! కవిబ్రహ్మ ఎంతటి స్థిరచిత్తుడు! వినయశీలుడు! మనుమసిద్ధికడ మంత్రియై, అతని చినవునకు గురియై ఆ రాజుచే

ఆ. వె. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలి శంఖములును
గంబగట్లు భూమి కానిక గాఁగ తెం
పెసఁగు రాచ పదవు లెల్లఁ బడసె.

ఇట్టి మర్యాదల నందుచు జీవితము మూడు పూవులును ఆరు కాయలును అగుచుండిన నిండు జవ్వనంబున యందును అదే మిత భాషిత్వము, అనహంకృతి. ఈ సమయమునకు అనగా 1260 ప్రాంతమునకు తిక్కనామాత్యుడు ముప్పదియైదు లేక నలుబది సంవత్సరముల నడివయస్సున నుండియుండును. దీనినుండి మహాభారత రచనా కాలమునకు మరలుదము. అందలములు గొడుగులును లేవు. ఆ సుధామయస్వప్నము కరగిపోయినది. కాని తిక్కన యందు చలనము లేదు. అతడొక సంతృప్తి సాగరము. భోగములాతని చిత్తవృత్తి నంటవు. భగవద్గీతయందు చెప్పినట్లు

'అపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి, న కామ కామీ.'

తిక్కన సోమయాజి ఇట్టి స్థితప్రజ్ఞుడు. ఆశ్రయమిచ్చిన రాజవంశము అధికారము గోల్పోయినను, తన మంత్రిపదవికి భరత వాక్యము చెప్పినను అతడు చింతాక్రాంతు నిబద్ధుడు కాలేదు. ఆరంభమునుండియు అతని భౌతికేతర సంపత్తియైన పితృభక్తియు ఉభయకవి మైత్రియు, బుధారాధన తత్పరతయు, అతని వెంటనుండ ఇక వానికి చింత యేమి? నిక్కపు యోగియొక్క నిర్లిప్తత గల మహాపురుషుడు గనుకనే తిక్కన శాంతిదూత కాగలిగినాడు.

తిక్కన కాలపు ఇతర కవి శేఖరులలో పేర్కొన దగినవాడు అథర్వణాచార్యుడను పండితకవి. ఈతడు కూడ మహాభారతము నాంధ్రీకరించుటకు పూనుకొని విరాటోద్యోగములను భీష్మపర్వమును గూడ వ్రాసినట్లు లక్షణ గ్రంథములలో లభ్యములగు పద్యములను బట్టి తెలియవచ్చుచున్నది. మార్కండేయ పురాణమును రచించిన మారనకవి తిక్కన సోమయాజి శిష్యుడైనట్లు భావింపబడుచున్నది. తిక్కన కేతన మారనలు వేదమార్గ ప్రియులైన కవులు. అథర్వణాచార్యుడు జైన మతానుయాయి అని చెప్పబడుచున్నది. తిక్కన సోమయాజికి కొంచెము సమకాలికుడో, అర్వాచీనుడో అయినవాడు పాల్కురికి సోమనాథ కవి. శివకవి వతంసమైన ఈతడు మొదటి ప్రతాపరుద్రుని కాలము వాడని ఇదివరలో భావింపబడినను రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడనియే పలువురు నేడు తలంచుచున్నారు. ఈతడు తిక్కన శిష్యుడయిన మారనకు సమకాలికుడు కావచ్చును. దీనికొక్క అంతర నిదర్శనమును చూపవచ్చును. తిక్కన సోమయాజి తన మహాభారతములో హరిహరనాథ తత్త్వమును విస్తరించి ప్రతిపాదించినాడు. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో హరిహరతత్త్వమును సువిశదముగ ఖండించినాడు. తిక్కనసోమయాజి ఇష్టదైవము కృష్ణాంత మీతని దృష్టి నాకర్షించెననియు దానిని హర్షింపక పాల్కురికి సోమనాథుడు శివకేశవాభేదమును

నిరసించెననియు ఊహింపవచ్చును. ఈ యంశమును ముందు వివరింతును.

శాంతి దూత కాదగిన తిక్కనామాత్యుని తొలిజీవితములోనికి కొంత తొంగిచూతము. ప్రారంభ జీవితములో భోగలాలసులై, ధన దాసులై, కుపిత దారాభ్రూ భంగ భీరువులై, ఉత్తర జీవితమున పవిత్ర యోగులయినవారు పలువురు కలరు. కథలు విశ్వసనీయములైనచో వేమనకవి ఇట్టివాడందురు. తిక్కన సోమయాజి తొలిజీవితము దీనికి భిన్నముగా నుండినట్లు విస్పష్ట నిదర్శనములుగలవు. నిర్వచనోత్తర రామాయణమును, దశకుమారచరిత్రయు ఇచ్చట మనకు సాక్ష్య గ్రంథములుగా ఉపయోగపడగలవు, చిత్రమేమన నిర్వచనోత్తర రామాయణముకన్న దశకుమారచరిత్రయే తిక్కనామాత్యుని కీర్తి హంసకు సరోవరము కాదగియున్నది. నిర్వచనోత్తర రామాయణమునందు బ్రహ్మజ్ఞానియు భక్తవరేణ్యుడును కాదగిన భారతతిక్కన కన్పించుటయే లేదు. ఈ గ్రంథము నందాతడు తననుగూర్చి చెప్పుకొనిన దింతయే.

"అమలోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుడన్ గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రి కమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁ దిక్కాంకుండ
సన్మాన్యుడన్."

ఏమిరాజసము "ఉభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారఁగుడ, కళావిదుఁడ"అని యెలుగెత్తి చెప్పుకొనుటయా అని సామాన్యముగ తోచును. కాని ఇది గర్వప్రోక్తి కాదనియు, మన పూర్వకవుల ఆత్మవిశ్వాసపూర్వక సత్సంప్రదాయమేయనియు నిరూపింపవచ్చును. ఆదికవియైన నన్నయభట్టారకుడుకూడ 'ఉభయ భాషా కావ్యరచనాభిశోభితుడ' అని చెప్పుకొనియున్నాడు. మహాభారత తిక్కనయందు మనము ప్రధానముగ చూచు లక్షణములు నాలుగు (1) వైదికమార్గనిష్ఠమగు వర్తనము. (2) భేదము లేని భక్తి (3) కావ్యరసమునాసేవించుట (4) బ్రహ్మానందస్థితిని బడయగోరుట ఈ యంశమును క్రిందిపద్యము ప్రకటించుచున్నది.

వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి మది నిర్మలవృత్తిగ జేయుచుండు వ
త్పాద నిరంతర స్మరణ తత్పర భావము కల్మి నాత్మ న
హ్లాదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు
దప్పుడున్.

మరియు స్వప్నమునందు ప్రత్యక్షమైన హరిహరనాథదేవుని తిక్కన ఇట్లు అభ్యర్థించెను.

ఉ. "ఇంతకు నేర్పునీవు నొక యింతటిలోన మదీయవాణి న
త్యంత విభూతిఁ బెంపెసగ నట్టి వినుం గొనియాడఁ జేత నా
నెంతటి పెద్ద నీకరుణ నిట్లు పదస్థుఁడనైతి నింక బా
హ్యాంతర దుఃఖముల్ దొలఁగునట్లుగఁజేసి సుఖాత్ముఁజేయవే.

వ. అని యుపలాలితుండగు డింభకుండు దన కొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి"

ఇది మహాభారత తిక్కనగారి హిమాలయ శృంగ సమున్నతమైన ఆధ్యాత్మిక సంపద. దీనికి ప్రాతిపదిక నిర్వచనోత్తర రామాయణమునందు గలదేమోయని వెదుకగా అట్టి దేమియు కానరాకున్నది. దీనియందు ప్రాపంచిక కవియైన వ్యక్తి కన్పించుచున్నాడు. కవిత్వము సంధాతనికిగల గొప్ప శ్రేయమేదియో తెలియరాదు. నిర్వచనోత్తర రామాయణ పీఠికయందు కవిత్వము యొక్క బహిస్స్వరూపమును గూర్చి యాతడు కొంత విస్తరించియున్నాడు. అది తిక్కనయే చేయ నక్కరలేదు. లౌకికుడైన ఏ కవి శేఖరుడైన చెప్పవచ్చును. అలంకార గ్రంథములు మున్నే చెప్పియున్నవి. కావ్యమునందు చమత్కారము కల్పించుటయే కవిలక్షణమైనట్లు ఇప్పటి తిక్కన భావనగా గోచరించుచున్నది. తన గ్రంథమును నరాంకితము చేయుటలో అతనికి సందేహ లేశమును లేదు. పైగా ఉత్సాహమే కన్పించును. మనుమసిద్ధి తిక్కనతో నిట్లనెనట.

ఏ నిన్ను మామ యనియెదు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీ నర్హుఁడ వగు దనినను
ధా నాయకు పల్కు చిత్తమున కింపగుచున్.

దీనికిని, 'కవిత్వమొక దివ్యకళ, అదియొక ఆరాధన విశేషము, కవిత్వముచే జననమరణ దుఃఖరూపమైన సంసారమునే యధిగమించి మోక్షమును సాధింపవచ్చును' అను నీ మహత్తర లక్ష్యములకును ఖండాంతరముల వ్యత్యాసముగదా! స్వప్న సాక్షాత్కారమును గ్రహించిన హరిహర నాథదేవుడు తిక్కనతో నేమనుచున్నాడు?

"పారాశర్యుని కృతియయి
భారత మను పేరఁబరగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్.

తెనుగు బాస వినిర్మింపఁ దివురు టరయ
దివ్య పురుషార్థ తరు పక్వఫలము కాదె."

ఈ భావమునే సోమయాజి మరలయుక్తి చెప్పినాడు. "అని పూని యాదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రకాశించుటయు నొక్కయారాధన విశేషం బగుటం జేసి."

ఇట్టి మహాద్భుత చిత్తవృత్తికిని చమత్కారమే సర్వథా ఆరాధ్యమను లౌకిక చిత్తవృత్తికిని పోలిక యెక్కడ? ఆ తిక్కన యేనా అని సందియము జనించును. తన ప్రథమ కావ్యరచనా కాలమునందు కూడ తిక్కనామాత్యుడు భక్తి భావభరితుడుగా నుండెనను అంశము ఒకింతమాత్రము గోచరించును. ఉత్తరరామాయణ రచన నిట్లు సమర్థించుకొన్నాడు.

ఎత్తఱి నైనను ధీరో
దాత్త నృపోత్తముఁడు రామ ధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట
నుత్తర రామాయణోక్తి యుక్తుఁడనైతిన్.

ఇది భక్తి విశేషమో లేక కావ్యముయొక్క ఉజ్జ్వాత్తత వదిగిన కథానాయకుడు లభించుటచే గల్గిన లౌకిక కవి సంతోషమో నిర్ణయింపలేము.

అయినచో భారత రచనాకాలమునకు తిక్కన సోమయాజి యందు గన్పించు మానసిక విప్లవము ఆకస్మికముగ సంభవించిన దేనా? అది వార్ధక్య ఫలితమా? అతడును లోకసామాన్య కవులవలె యౌవనమునందు రాగారూఢుడై వార్ధకమున యోగారూఢుడైన వాడా? అను ప్రశ్నలు జనించును. నిర్వచనోత్తర రామాయణ మీ విషయముపై మాకిభావము వహించుచున్నది. తిక్కన "మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుడు" అను ఒక్కమాట మాత్రము వజ్రపుతునకవంటిది మనకు లభించును. తిక్కన జీవితమున కద్దముగానున్న ఈ తెరను కేతనదశకుమార చరిత్ర మొకింత తొలగించును. ఒకింతయేమి, బట్టబయలుగనే చేయును. చూడుడు—కేతనవాక్యములు. "అతండు జాతకర్మ ప్రముఖ సంస్కారానంతరంబున వేదాది సమస్త విద్యాభ్యాస విభాసి యగుచు; వేదాది ప్రకట విద్యాభ్యాసాపాదిత మహత్వునకు; అనూనతపస్స్వాధ్యాయాది సుకృతపరిపాకునకున్; అతుల సత్య త్యాగశీలంబులం బారీణుండు; సకలాగమార్థతత్త్వవిచారోదారుడు; జనసుత వివేక క్షాంతి సంపత్తి సౌమ్యాత్మునకు; అంతరద్విషన్నిర్మథన ప్రభావ మననీయ వివేక విశాల బుద్ధికిన్; అనితర గమ్య వాఙ్మయ మహార్ణవ కర్ణధార;" మన్నగునవి తిక్కనామాత్యుని వేదవిద్యా సంపత్తిని శీలనైర్మల్యమును సూచించు విశేషణములు. ఇక నాతని నైష్ఠికతనుగూర్చి కేతన చెప్పునది చిత్తగింపుడు.

"అధ్వరాబ్జ దిననాథునకున్; యాగ విద్యాభిరామ; సత తాధ్వర క్రియాకర్మఠ పాణిపద్మునకు; మఖసంతోషిత మరుత్సమాజునకున్,"

ఒక పద్యమునం దిట్లు వర్ణించెను.

"చతురానన సన్నిభునకు
సతత స్వాహా స్వధాది శబ్దవ్యయ సం
స్కృత హవ్య కవ్య సంత
ర్పిత మఖశిఖిముఖ నిలింప పితృవర్గునకున్".

అనగా తిక్కనామాత్యుడు వేదాది విద్యల నభ్యసించి తద్గత జ్ఞానమును మనస్సున ధరించుటేకాక బ్రాహ్మణునకు విహితమైన కర్మపరాయణత్వమును అతిశయశ్రద్ధతో ఆనుష్ఠించినవాడని చెప్పదగి యున్నది.

మహాభారత రచనాకాలమునకు తిక్కన యజ్ఞముచేసి సోమయాజి యనబరగెనన సామాన్యముగ భావింపబడుచున్నది. కాని దశకుమారచరిత్ర రచనా కాలమునకే ఆతడెన్నియో మఖముల నాచరించినట్లు కేతన తెల్పుచున్నాడు. మరియు ఒకపద్యమున తిక్కనామాత్యు నిట్లు సంబోధించినాడు—"బుధ విరాజి తిక్కన యాజీ!" ఇది భారతమందలి "బుధారాధన విరాజి తిక్కన సోమయాజి" పదములను దలపించుచున్నది. ఇచ్చట యాజి యను విశేషణముచే తిక్కన సోమయాగముచేసి సోమయాజి యనబరగెనో లేదో నిశదముకాలేదు. అతడింకను పాకయాజియో హవిర్యాజియో కావచ్చునేమో. ఇది విచారింపవలెను. ఈనాటికే తిక్కనామాత్యుడు మహాభారత రచనా కుతూహల దోహలియై యుండెనని కేతన వాక్యమువలన తోచుచున్నది. సప్తమాశ్వాసాంతమున తిక్కన నిట్లు సంబోధించినాడు.

"భరను కరుణభావా! భారతామ్నాయ సేవాదరణ!"

ఇంతటి వైదికసంపత్తి గలవాడైన తిక్కన, దానిని నిర్వచనోత్తరరామాయణములో ఏల కప్పిపుచ్చెనో! ఆత్మప్రశంసా విముఖుడగుటచేత నే కావచ్చును. నన్నపార్యుడు "అవిరళ జప హోమతత్పరుడు" అని చెప్పుకొనలేదా! మన ప్రాచీనులు తమ ఆధ్యాత్మికసంపత్తిని ధనధాన్యాదులకన్న ఎక్కువ గోప్యముగ నుంచుకొనెడివారు. శ్రీరామకృష్ణ పరమహంస చరిత్ర యందిటి సన్నివేశమొకటి తెలియవచ్చుచున్నది. తిక్కన ఈ సంప్రదాయమును పాటించెనేమో!

ఆంధ్ర మహాభారత రచనా కాలమునకు తిక్కన మాన సాంబరమున జ్ఞానచంద్రుడు షోడశ కళా విరాజమానుడై వెలుగ జొచ్చెను. భారతాంధ్రీకరణ సంకల్ప మాతనికి మనుమసిద్ధి రాజ్యకాలముననే కలిగినట్లు తోచును. కేతన తన దశకుమార చరిత్ర యందు దీనిని అస్పష్టముగ సూచించియే యున్నాడు. దశకుమార చరిత్రము తిక్కనామాత్యుడు మంత్రిగానుండిన కాలముననే రచింపబడి యుండుట తథ్యము. ఇప్పటికే తిక్కన భారతాంధ్రీకరణమును సంకల్పించి పంచమ వేదమును శ్రద్ధాభక్తులతో పఠించుచుండి యుండును. పూజ్యమూర్తియైన భారత సంహిత ఆతని మనసునందు ఒక అపూర్వ పరిణామమును ఆవిష్కరింప జేయుచుండెను. దేశమునందు మత కల్లోలము అశాంత పరిస్థితి చెలరేగు చుండెను. శివుడే పరదైవమనియు విష్ణువే పరదైవమనియు తత్త్వజ్ఞులు వివాదపడు చుండిరి. ఈ వివాదము శాస్త్ర రంగముతో ఆగిపోలేదు. తెర్కమునకుతోడు కర్కశ ఖడ్గములు పరపతుకు విభేదనమునకు కడంగు చుండెను. పాల్కురికి సోమనాధుని పండితారాధ్య చరిత్ర యందలి వాద ప్రకరణమును చూచినచో అప్పటి యుద్ధిక్షమత వాతావరణము మనకు కన్నులకు కట్టినట్లు ప్రత్యక్షమగును.

"వెండియు నొకవాఁడు దండిత వాది
పండితారాధ్యు దఖండిత కీర్తి
పనడవోలను మహాసద్భక్తి మహిమ
దనరాక వర్తింప దర్పస్తవమున
వరపతియగు వెలనాటి చోడనికి
గురుఁడగు బొద్దుండు గుటిలుండు
కలుషంబు వట్టిల్లగా నిటులనియె
లోకంబనఁగ నీవ లోకేశ నీకు
గురులగు వార సద్గురులును లోక
గురులును గాక యే గురులును గురులె?
బొద్ధ దర్శన పట బద్ధుండు గురుఁడొ?
శుద్ధ వైదిక శైవ బద్ధుండు గురుఁడొకో?
వారికి నాకును వాదమిప్పింపు
నే నెటువంటి యారాధ్యు

గీరాద్యు పండితు గిండితు సెలుఁగ
వటునూతుగాని మీ యాచార్య ప్రతిభ
యిటు విల్వగాఁ బంపు మెస సేయ" కనుతు
బ్రహ్మ మర పాపుల బౌద్ధ వాదులను
సతతాపరాధుల జైనవాదులను
ప్రౌతకర్మభ్రష్ట సన్న్యాసులను, వి
నీతి వర్జితుల నద్వైత వాదులను
జిహ్మస్వభావుల బ్రహ్మవాదులను
భ్రాంత చిత్తులఁ బాంచరాత్ర వ్రతుల
దైన్య స్వభావుల మాన్యేతరుల జ
ఘన్య స్వభావుల శూన్యవాదులను
నిర్మిత కర్ముల నిర్దేవులను న
ధర్మ ప్రవర్తుల కర్మవాదులను"

ఈ విధముగ పాల్కురికి సోమనాథుని కాలమునందు మత రంగమున వివాదపడు లెక్కలేనన్ని వాదము లుండెను. బౌద్ధులు జైనులు, సన్న్యాసులు, అద్వైతవాదులు, బ్రహ్మవాదులు, అవేద వాదులు, పాంచరాత్రులు, అంతరాలికులు, ఏకాత్మవాదులు, అభేద వాదులు, శూన్యవాదులు, కౌలవాదులు, కర్మవాదులు, నాస్తికులైన చార్వాకులు, ప్రకృతివాదులు, ప్రచ్ఛన్న బౌద్ధులైన మాయా వాదులు, 'శబ్దం బ్రహ్మ' యను శబ్ద బ్రహ్మవాదులు, పురుషమాత్ర సైకవాదులు, ద్విపురుషైక కలితవాదులు, స్మార్తులు, యోగశాస్త్ర భ్రమితులు రసమంత్రవాదసిద్ధులు, సకలతార్కికులు, ఆగమికులు, నక్షత్ర పాఠకులు వీరందరును పాల్కురికి సోమనాథునిచే యథా యోగ్యముగ నమస్కారములతో పేర్కొనబడిరి. దీనిని బట్టియే అప్పటి భావకల్లోలము సువ్యక్తము కాగలదు. వీనిలో అన్నియు ప్రసిద్ధ వాదములు కాకపోవచ్చును. వారి యను యాయి వర్గమును అల్పాల్పమై యుండవచ్చును. మొత్తముమీద వీరందరును అన్యో న్యము నిందించుకొనుచు, ద్వేషించుకొనుచు రాజావలంబనము దొర కినచో దండనీతిచే పరవాదులను అణగద్రొక్కుచు, లేనిచో తామే దౌర్జన్యమునకు పూని రక్తపాతము చేయుచు అమాయికులైన ప్రజ లను ప్రతారణ సేయుచు దేశము నందశాంతిని ప్రబలచేయుచుండిరి.

ఇట్లు బౌద్ధ జైన శైవ పాంచరాత్రాది తిమి తిమింగల మకర నికరముచే క్షుభితమైన మతమహా సముద్రమునందు తిక్కన సోమ యాజి చల్లని జాబిల్లియై ఉదయించెను. తిక్కన కాలమునకుఅనగా పదుమూడవ శతాబ్ది మధ్యమునకు బౌద్ధ జైనములు, శైవ వైష్ణవము లతో పోరాడి క్షీణసత్వము లయ్యెను. వారి యనుయాయివర్గము సన్నగిల్లెను. శైవవైష్ణవములు రెండు మాత్రమే మిగిలిన చిన్న చేప లను గ్రసించి ప్రబల తిమింగలములై అన్యోన్యము స్పర్థించు చుండెను. ఈ రెండు ప్రబలమతములను సమన్వయముచేసి ఏకగ్రంథి యందు కూర్చుట మానవునకును భగవంతునకును చేయదగిన ముఖ్య సేవయై తిక్కన సోమయాజికి భాసించెను. ఏ సమయమందుతిక్కన గారికీ భావము మెఱపు మెఱసినట్లు తోచెనో అది ఆంధ్ర జాతికిని దక్షిణహిందూదేశమునకును ధన్యమైన ముహూర్తముగదా! ఆ మహా నీయుని ఈ దివ్య సంకల్పముచే మత సంగ్రామము, ఔద్ధత్యము సన్నగిల్లి, అన్నదమ్ముల కదుపు చలువగా జన్మించిన ప్రేమ ప్రభావ మున లోకమునందలి యెందరో తల్లుల కడుపు చల్లబడెను.

తిక్కనామాత్యునకు హరిహరాద్వైతబుద్ధి ఎట్లు కలిగెను? ఎప్పుడు కలిగెను? అతడు మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైకశీలుడు గదా! దశకుమార చరిత్రయందు తరచు కేతన, కృతినాథుని శివభక్తి తాత్పర్యమును పొగడుచుండును.

"చిత్తనిత్య స్థిత శివుడెవ్వఁడనిన, పీఁపను శిరమున కర్దమైన వాఁడు; అథవ చరణాంభోజన్యస్త చిత్తుఁడు, సోమభృద్భక్తి మత్తుఁడు, పూజార్పిత రాజశేఖరుఁడు మున్నగు విశేషణములను తిక్కన యొడ నాతడు తరచు ప్రయోగించెను. అయినను తిక్కన హరి భక్తివర్జితుడు కాడని దశకుమార చరిత్రయే చెప్పుచున్నది. ఒకటి రెండు స్థలములలో మాత్రమే కేతన దీనిని సూచించెను. "శ్రీకాంతచరణ యుగళీ శోకనద మధువ్రతునకు; హరిచరణ కమలోపాస్తి కృతస్వస్తి" అని రెండు చోటుల మాత్రమే తని విష్ణు భక్తియు వర్ణింపబడినది. దీనినిబట్టి తిక్కనామాత్యుడు బమ్మెరపోత రాజు మున్నగువారివలె సాధారణ శైవుడనియు పాల్కురికి మున్నగు వారివలె వీరశైవుడు కాడనుయుట తెల్లము. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే, శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయగ్ం శివః" అను ప్రాచీనోక్తిని సంపూర్ణముగ విశ్వసించినవాడు తిక్కన సోమయాజి. శివాయ విష్ణురూపాయ యనునది అర్వాచీన కాలపు శ్లోకమనియు దీనికి వేదప్రామాణ్యము లేదనియు కొందరు చెప్పు చున్నారు. కావచ్చును. ఐనను "ఏకం సద్విప్రా బహుధావదన్తి" అను సత్యము వేదకాలముననే మహర్షులకు భాసించుటచే శివకేశవా భేదము వారికి తెలియని యంశముకాదు. వ్యాసకృత మహాభారతము నధ్యయనము చేసిన తదుపరి తిక్కనకీ యభేద భావము బలపడ జొచ్చెను. భారతారంభముననే సోమయాజి దీనినిట్లు ప్రకటించెను.

"విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ
ష్ణ ద్వైపాయనుఁ డర్థిలోకహిత నిష్ఠన్ బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన
యామ్నాయమున్."

చతుర్విధ పురుషార్థముల తత్వములను సమన్వయించుటలో భారతమువంటి గ్రంథము లేదని తిక్కన ప్రశంసించుట సముచితముగ నున్నది.

ఇట్లు భారతామ్నాయ పఠనముచే ఈతని యందు అభేద భావము నిరూఢమగుచుండగా ఒక దివ్యసన్నివేశము కలిగెను.

"హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానా రసా
భ్యుదయోల్లాసి విరాటపర్వమట యుద్యోగాదులం గూడఁగాఁ
బదియేనింటెఁడనుంకు భాస జన సంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారగన్"

అని చింతించుచు ఒక్కనాడు నిద్రింపగా భగవంతుడగు హరిహరనాథు డాతనికి స్వప్నమునందు ప్రత్యక్షమై అనుగ్రహించి మహాభారత కృతిపతిత్వమును తన కిమ్మని కోరెను. ఇంతకు మున్ను తిక్కన రచించిన యొక శ్లోకమా దేవదేవుని మెప్పువడపెనట. ఆ శ్లోకమిది.

"శక్తిమష్టి మాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియా యాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

ఓ ప్రభూ ! నీవు ఎముకలహారము (కపాల మాలిక) అలంకార విధి యందెక్కువ సమ్మతమా లేక కౌస్తుభరత్నమా? నీవు రుచి యందు కాలకూటముపై మక్కువ యధికమా ? లేక యశోదా జీవి చనుబాలు ప్రీతికరమా ? ఈ శ్లోకమునందు వ్యంగ్య మర్యాదచేత శివ కేశవా భేదమును కవి ప్రతిపాదించినాడు. భగవంతుడు అలంకార ప్రీతికిని, రుచిభేదములకును అతీతుడు. అతడు ద్వంద్వాతీతుడు. అతడు సుందరుడు, వికటస్వరూపుడు, అత డమృతస్వరూపుడు, కాలకూటమయుడు, అతడే శివుడు, అతడే కేశవుడును అను మహత్తర సత్యము తిక్కన సోమయాజి మనోవీథిని మెఱపు మెఱసి నట్లయ్యెను. అధీత వేదుడును, అధిగత పరమార్థతత్త్వుడును అగు తిక్కనామాత్యున కిదియొక నూతన సత్యము కానిమాట నిజమే. అతనికాలపు లోకమున కిది విప్లవాత్మకమైన సత్యము. లోకహిత నిష్ఠుడగు ఆతడీ దివ్యభావమును తనకవిత్వరూపమున ప్రకాశింప దలంచెను.

హరిహరనాథ భావన తిక్కన స్వోపజ్ఞకమా ? లేక అతడు దాని నెవ్వట నుండియైన ఎరవు తెచ్చుకొనెనా యని విచారింప దగును. పాల్కురికి సోమనాథుడు తిక్కన సోమయాజికి పూర్వు డని కొందరును పరుడో లేక సమకాలికుడో యని కొందరును తలచు చున్నారు. పండితారాధ్య చరిత్రమునందు సోమనాథుడు హరిహర తత్త్వము నెత్తుకొని పరిహసించి విశేషముగా ఖండించినాడు. అతడిట్లు వ్రాసెను.

"హరి గుహాసురు ద్రుంచె నదియాదిగాఁగ
హరి హరుఁడన నొప్పెనంతియు కాక
హరుఁడగునే హరికి యట్లయ్యెనేని
నొగి లక్ష్మియును గౌరియును సర్ధమర్థ
మునకెక్కి నలువదే హరిహరాంగునకు
కుండక హరిహర గుళ్మమీఁదటను
పందియు నందియుఁ బరగంగ వలదె
హరియును హరుఁడు
పరియుని కొలఁచు దాసరుల ఫాలముల
తిలకంబు నిడుబొట్టు దిరుమన్ను భూతి
వలదె వారికి కాకి వ్రాతల పగిది"

అని హరిహర తత్త్వమును కొంత పరిహసించి, ఈసడించి దానికిట్లు వ్యుత్పత్తి కల్పించినాడు. గుహాసురు డనువానిని సంహరించు సంద ర్భమున విష్ణువు ఆ కార్యమునకు చాలక హరుని ఆయుధములను వేషమును ప్రార్థించి పుచ్చుకొని గుహాసురుని చంపెనట. అట్లు హరవేషము వేసికొనుటచే హరిహరరూప మేర్పడెను గాని హరి యొన్నడును హరుడు కాలేడని సోమనాథుడు వాదించెను. మరి యొక వ్యుత్పత్తి కల్పించుచు హరిని హరించినవాడు (సంహరించిన వాడు) హరిహరుడు అనబరగు ననియు శివుడు నరసింహ రూపమున నున్న విష్ణువును సంహరించుటచే అతనికి హరిహరసంజ్ఞ కలిగె ననియు సమర్థించుకొనెను. ఇట్టి కల్పనయందొక అనౌచిత్యముకూడ కలదని యాతడు విస్తరించెను.

"హరి గొన్న యర్థంబు నద్రిజ గొనునె
హరి యద్రిసుత గొన్న యర్థంబు గొనునె"

ఈ కడపటి పంక్తులు ఆంధ్ర మహాభారత ప్రారంభమున తిక్కన సోమయాజి రచించిన హరిహర స్తుతి పద్యముపై వ్యాఖ్యయేమో అనిపించును.

"శ్రీ యన గౌరి నాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై, హరిహరంబగు రూపముదాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్."

ఈ పద్యమునందు లక్ష్మీపార్వతులను హరిహరు లేకమూర్తి లోనే ధరించిరని యన్వయించుట అనౌచిత్య ప్రసంగమగును. హరు డలంకరించిన యర్ధదేహమును పార్వతి గొనుట సంభావ్యము కాదు. అట్లే హరుడు గొన్న యర్ధదేహమును లక్ష్మి యలంకరించదు. ఇక నేమన ఆ భగవంతుడు పర్యాయమున శివరూపుడు. పర్యాయమున విష్ణురూపుడు. సామాన్య భక్తులా భగవంతుని ఏదోయొక రూపము ననే ఆరాధింతురు. ఇక్కడ లక్ష్మీపార్వతు లటే సామాన్యవ్యక్తులు. హర రూపముతో నొక్కరిని, హరి రూపముతో నొక్కరిని ఆ భగవంతుడు రంజింపచేయును. తత్త్వమారసినచో అతనియందు భేదము లేదు. గీతయందు భగవంతుడు సెలవిచ్చియే యున్నాడు.

"యే తథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహం"

ఇక నొకింత జ్ఞానాధి రూఢులయిన వారు హరిహరా భేదమును తెలిసికొని వైదిక మార్గమున అతనిని ఆరాధింతురు. వారు "విష్ణు రూపాయ నమశ్శివాయ" యను చేర్పున అభేదవాదులు. కాని బ్రహ్మజ్ఞానసంపన్నుడైన తిక్కన అంత టితో తృప్తిపడడు. అత డభేదమును గుర్తించుటతో ఊరుకొనడు. హరిహరనాథునకు వెనుకనున్న పరతత్త్వమునే యారాధించును. హరిహరనాథుడు సాకారపరబ్రహ్మము. జ్ఞానియైన తిక్కన దీనిని గూడ అధిగమించి నిరాకారనిరంజనమైన పరతత్త్వమునే కొల్చును. ఆధ్యాత్మిక శ్రేణియం దన్ని మెట్లో కలవని ఈ పద్యమున తిక్కన సూచించినాడు. లక్ష్మీపార్వతులచే సూచితులైన సాధారణభక్తులు. వీరు భేదవాదులు. హరిహర రూపాఽభేదము నుపాసించు వైదిక ధ్యాయులు. సాకారబ్రహ్మము నధిగమించి పోగల జ్ఞాని శేఖరులు. ఇట్టి శుద్ధజ్ఞానమునకు భక్తి యలవడినచో బంగారమునకు తావి యబ్బి నట్లేగదా. తిక్కనసోమయాజి జ్ఞాన వైరాగ్యభక్తులను మూడింటిని అను భావములోనికి తెచ్చుకొనిన మహాజ్ఞాని. అట్టి మహానియు డాంధ్రభారతమును రచింపబూనుట ఆంధ్రుల మహోత్కృష్ట పుణ్యఫలమని నొక్కి వక్కాణింపవచ్చును.

హరిహరారాధన తిక్కనకు ముందే కన్నడదేశమున నుండినట్లు నిదర్శనములు గలవు. ఆంధ్రదేశమునం దిది యెంత ప్రాచీనమో పరిశోధించి నిర్ణయింపవలెను. తెనుగు రాష్ట్రమునందు హరిహర

యను స్థలమునందు హరిహరేశ్వరాలయము ప్రసిద్ధమైయున్నది. ఈ యాలయమునందలి యొక శాసనమునుబట్టి, పోలాళ్వదండనాథుడను వాడు దీనిని క్రీ. శ. 1228 ప్రాంతమున పునరుద్ధరించినట్లు తెలియు చున్నది. ఇతడు హోయిసలరాజు రెండవనరసింహునకు సేనా పతిగా నుండెనట. శాసనమునుబట్టి హరిహరేశ్వరాలయము పోలాళ్వ దండనాథునకు చాలకాలమునకు ముందే నిర్మింపబడెననియు, అతడు దానిని పునరుద్ధరించెననియు చెప్పబడుచున్నది. హరిహరేశ్వర విగ్రహము 6 అడుగుల ఎత్తుగలిగి వామపార్శ్వమున శంఖ చక్ర చిహ్నిత మైన విష్ణుని యర్ధరూపమును, దక్షిణభాగమున అక్షమాలయు త్రిశూల మును గల హరరూపమును ఉండెను. విష్ణుని యర్ధమున కిరీటమును. శివుని సగమున జడలును చంద్రవంకయు చెక్కబడెను. కాని విచిత్రమేమనగా కన్నడకవులలో ప్రసిద్ధులైన వారెవరును హరిహరే శ్వరుని ప్రశంసయైన చేయలేదు. పదుమూడవ శతాబ్దమునకు చెందిన కన్నడకవులలో మూడవ కవిచక్రవర్తియనబరగిన 'జన్న' కవియు 'యశోధరకావమ్' (అచ్చ కన్నడకావ్యము—మన అచ్చతెనుగు వంటిది) అను కావ్యము వ్రాసిన ఆండయ్యయు, శబ్దమణి దర్పణ మను ప్రసిద్ధ వ్యాకరణము వ్రాసిన కేశిరాజును, 'అభినవ దశకుమార చరిత' (తెనుగులో కేతన దశకుమార చరిత్ర వంటిది) అను చంపూకావ్యము వ్రాసిన చౌండరస కవియు ప్రసిద్ధులు. వీరిలో మొదటి ముగ్గురును జైనులు. చౌండరస తన కావ్యమును పండరీక్షేత్రమునందలి విఠోబాదేవున కంకితమిచ్చెను. ఆ యుగ మున కన్నడ శివకవులలో పేరెన్నికగన్నవారు హరిహరుడు, రాఘవాంకుడు, కెరెయ పద్మరస మున్నగువారు. వీరందరు వీర శైవులో వైష్ణవులో, జైనులో అయినవారు. కవిబ్రహ్మ తిక్కన సోమయాజివలె అద్వైతామృతమును సేవించినవారు కారు.

ఆంధ్ర కర్ణాటదేశములు ప్రాచీనకాలమునుండియు చరిత్ర యందును సంస్కృతియందును అక్కచెల్లెండ్రవంటివి. కనుక హరిహరేశ్వర ప్రతిమలు ఆంధ్రదేశమునందును ఉండియుండుట సంభావ్యమే. నెల్లూరునందు ఇప్పుడు రంగనాయకస్వామి ఆలయ మున్నస్థలమున పూర్వము హరిహరనాథాలయము ఉండెడిదని చెప్పుదురట. పాల్కురికి సోమనాథుడు హరి హర గుళ్ళను పేర్కొని వానిమీద పందియు నందియు రెండును ఉండవలదాయని హేళనచేసెను. ఈ యంశమును స్థాపించుటకై శాసనములను పరిశీ లింపవలెను. తిక్కన సోమయాజి కాలమునకే హరిహరారాధన అక్కడక్కడ ఆంధ్రదేశమునందును ఉండియుండవచ్చును. అప్రసిద్ధ మైన ఈ భావనకు ప్రస్ఫుటరూపమిచ్చి మహాకవిత్వ సహాయమున ఆంధ్రజాతియొక్క జీవరక్తము లోనికి ప్రసరింపజేసిన మహనీయుడు తిక్కన. ఆంధ్రులు అన్యమత సహనము సంతరించుకొనిరని పుణ్యము కట్టుకొన్న ధన్యాత్ముడు తిక్కన సోమయాజి. మరియు అద్వైతము ఆంధ్రదేశమునందు విస్తారముగ నెలకొనుటకు కృషిచేసిన మహాత్ముడు కవిబ్రహ్మ తిక్కన.

తిక్కన సోమయాజి హరి హర కల్పనము లోకోత్తర కావ్య సౌరభమును వెదజల్లుచుండును. దానినిగూర్చి సవిస్తరముగ చెప్పు టకు సమయము చాలదు. తిక్కనయందు కర్మ, భక్తి, జ్ఞానమార్గములు మూడును త్రివేణీ సంగమము అయినవి. అతడు కుమారిలునివలె కర్మవాది. శంకరునివలె అద్వైతవాది. శ్రీరామానుజునివలె భక్తి వాది. ఎంతటి మహోన్నత ధీనిధి! భారతారంభమునందు హరిహర నాథుని సాకారమూర్తినిగూర్చి అద్భుతమైన చిత్రణము కావించినాడు.

కరుణాకరము పొంగి తొలకరించినట్లున్న
శశిరేఖ పచ్చదనము చూపు
హరినీలప్రభలు శంకరుని చంద్రకళ ముడి
నతిశాఖీ ధవల పంకజము మెఱయు
సుతీర్థమైన చెలువున నెఱసిన లోకర
క్షణమునంగ గళంబు ఛాయపోఁడిమి
బ్రహ్మాదిదేవులెంచు భాసురంబగునా నా
రమ్మునఁ గౌస్తుభ రత్నము మెఱపు
సురనదియును గాళిందియు చెరసినట్టి
కాంతిపూరంబు శోభిల్ల కాంతమూర్తి
నా మనంబు నానంద మగ్నముగఁ జేయ
నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు.

హరిహర మూర్తియందలి సమానాంశములన్ని కవిత్వపు ప్రావరణము దానిపై గప్పి మనయందు భక్తి భావమును రేకెత్తిం చుట తిక్కన యవలంబించిన రీతులలో నొక్కటి.

కం॥ హరిహరనాథునకు, మరు
త్సరిదాకల్పిత మనోజ్ఞ చరణశిరస్సురి
దరమూర్తికి, భావనత
త్పరయుక్త భక్తపరతంత్రునకున్.

ఇచట మందాకిని హరికి చరణభూషణమగుటయు ఈశ్వరునకు శిరోభూషణమగుటయు ప్రశంసింపబడినది. అట్లే మరియొక పద్యమున—

కం॥ అజగవశార్ఙ్గాలంకృత! భుజగర్వ నిరస్త దైత్య భూమస్తుత్యా!
త్రిజగద్ధారణనిత్యా! భుజగసమాచరిత శయన భూషణకృత్యా!

ఇచట హరిహరనాథుడు అజగవము (పినాకము) శార్ఙ్గము ధరించి దైత్యులగర్వ మణంచెననియు, సర్పరాజు అతనికి శయన మును భూషణమును ఆయెననియు చమత్కారముగ కవి వర్ణించి నాడు. కేవల కవితా చమత్కృతి హేతువులైన చిత్రములతో ఆడు కొను సామాన్య కవిగాడు మహాకవి తిక్కన. అతడు కవిలోక బ్రహ్మ యగుటచే భావ వీథిలోనికి అనంతకాశమున కెగిరిపోవుచు మనలను వెంటగొనిపోవును.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అను వేదవాక్యమును లేఖ్యమైన కవిత్వంలో నెట్లు చెప్పెనో చూడుడు.

కం॥ త్రిభువన శుకద్భుత పంజర
విభవ మహితునకు, సమస్త విష్టపనిర్మో
క భుజంగపతి కఖిల జగ
దభిన్నరూపునకు భావనాతీతునకున్.

త్రిభువనములను శుకమునకు హరిహరనాథుడు పంజరమని యును, హరిహర నాథుడను భుజంగ పతికి సమస్తభువనములు కుబుసమువంటివనియు అనగా లోకములను లోపలను వెలుపలను భగవంతుడు వ్యాపించియున్నాడనుటకు కల్పించిన రూపకములు లోకోత్తర కవితా కల్పనములు. వ్యంగ్యవైభవముతో తిక్కన సోమ యాజివర్ణించిన హరిహరనాథ రూపమునే నాచనసోముడు తన ఉత్తర హరివంశమునందు వాక్యసంపదచే విస్తరించినాడు.

"అభ్రంకషంబైన యాలపోతు నితండు
త్రుంచి వాడితండు పెంచినాడు."

ఇత్యాదిపద్యములు వాచ్య చమత్కార శోభితములు.

ఇట్లు లోకోత్తరభావనాలంకృతుడై, కర్మిష్ఠియు, జ్ఞానియు, భక్తుడై సమకాలీన జనులకును ఆంధ్రభాష యున్నంతకాలమును ప్రపంచమునకును శాంతిసందేశ మొసగు మహనీయుడు కవి బ్రహ్మ తిక్కన సోమయాజి.



# పాణినీయప్రవృత్తి-స్ఫోటవాదము

శ్రీ నీలకంఠశాస్త్రి కౌండిన్య

## భాష

ప్రాణివర్గము తమ యన్తఃకరణము నందలి భావవిశేషములను బరస్పరము దెల్పుకొనుటకు సాధనమగు ధ్వని మనుష్యతిర్యక్కులకు సమానమేయైనను నియ్యది వ్యక్తావ్యక్తభేదముచే ద్వివిధమై యొప్పుచున్నది. ఈ రెండింటియందును సకల వర్ణవిలసితము లగు వ్యక్తవాక్కులే భాష యనియు నయ్యవి మానుషమాత్రగతములే యనియుఁ బతంజలి భగవానుఁడు దన "వ్యక్తవాచాం సముచ్చారణే" (పా. 1-3-48) సూత్రభాష్యమున నిట్లు పేర్కొని యున్నాఁడు.

"వ్యక్తవాచా మితి కిమర్థమ్? వరతను సంప్రవద న్తికుక్కుటాః। ఏవం తర్హి వ్యక్తవాచా మిత్యుచ్యతే। సర్వ ఏవ హి వ్యక్తవాచః। తత్ర ప్రకర్షగతి ర్విజ్ఞాస్యతే సాధీయో యే వ్యక్తవాచ ఇతి। కే చ సాధీయః? యేషాం వాచి అకారాదయో వర్ణా వ్యజ్యన్తే। నచైతేషాం వాచి అకారాదయో వర్ణావ్యజ్యన్తే"

అభిప్రాయ బోధకములగు నవ్యక్తధ్వనులు విశ్వమునందలి పశుపక్ష్యాదుల కన్నింటికి నొకే విధమున నొప్పుచున్నను మానుషకృతములగు వ్యక్తధ్వనులు మాత్రము ఆయాయిదేశములందుఁ బలువిధములుగ నున్నవి. కాని మనుజులలోఁగూడఁ దమకుఁ గల్గిన హర్షవిషాదాద్యవస్థలను బ్రకటించు ధ్వనులు మాత్రము జనసామాన్యమున కంతకును ఒకే విధమున నున్నట్లు లోకమునఁ గానవచ్చుచున్నది. అనఁగా భారతదేశమున నొకానొకఁడు దనకుఁ గల్గిన క్రోధమోదములను బ్రకటించునపు డెట్టి హుంకారాదులను జేయునో యట్టివానినే యన్యదేశీయుఁడుగూడఁ జేయును. భాష యెఱుఁగనివాఁడుగూడ నట్టి ధ్వనులనుబట్టి వాని యవస్థను ఊహింపఁగలఁడు. దీనినిబట్టి యభిప్రాయ బోధక ధ్వనులు మనుజులలోఁగూడఁ గృత్రిమాకృత్రిమ భేదముచే ద్వివిధములుగా నున్నవని చెప్పవచ్చును. వీనిలోఁ గృత్రిమములే స్పష్టతగల్గి మనుజునిఁ దిర్యక్కులనుండి వేఱుసేయుచు భాషాశబ్దవాచ్యము లగుచున్నవి. కావున భాష యనునది కల్పితమే గాని సహజ మెంతమాత్రము కాఁజాలదనునది సార్వజనీనమగు సిద్ధాన్తము.

## భాషాశాస్త్ర ద్వైవిధ్యము

భాషాతత్త్వకోవిదులు విభిన్నములుగాఁ గన్పడునట్టి భాషలయందలి సమాన ధర్మములను బ్రదర్శించి యేకత్వమును నిరూపించుటచేతను, భాషను విపరీతములగు భేదముల నందకుండ బంధించుటచేతను దేశకాల కృతమగు భాషావైషమ్యమును దూరీకరింపఁజేయఁగలరు. ఈ ద్వివిధములగు భాషాశాస్త్ర ప్రక్రియలలో మొదటి దానిని నిరూపించు ప్రక్రియ పాశ్చాత్యులచే నవలంబింపఁబడినది. ఈ ప్రక్రియ ననుసరించు భాషాతత్త్వవేత్తలు ఒక దేశమునం దగపడు ననేక భాషలకుఁ బృథక్కుటుంబముల నేర్పఱచి యవ్వాని యనైక్యమును సాధించుటచేఁ దత్ప్రియాత్మైక బుద్ధులగు కొందఱు జాతి మతైక్యమును గలవారయ్యు నొకరి నొకరు ద్వేషించుటయు మనకు నేఁ డగపడుచున్నది. ఇఁక రెండవ భాషాశాస్త్ర ప్రక్రియ భాషానియంత్రణమును భాషా శోధనమును గావించుటకై యవలంబింపఁబడుచున్నది. ఇట్టివియే పాణినీయాది వ్యాకృతులు. నేఁటి కాలమునందు వ్యాకరణ మనఁగా నిట్టిదేయని పరిగణింపఁబడుచున్నది గాని మొదటిది వ్యాకరణముగాఁ బరిగణింపఁబడుట లేదు.

## భాషోత్పత్తి

కొందఱు వైయాకరణులు తమ వ్యాకరణ గ్రంథములకు ముందు వ్యవహారమును నిర్వహించు నీ భాష యెట్లు పుట్టినదని చర్చించిరి. వానిలో బహుశాస్త్రవేత్తల స్తుతులకుఁ బాత్రమైనట్టిదియు మంబగు పాణిని ప్రదర్శితపద్ధతినిఁ గొంచెము ప్రస్తుతింతము. పాణిని తన భాషయగు సంస్కృతమునఁగల పదము లన్నియు ధాతుజన్యములనియు ధాతువులకు మాత్రము మూలభూతములగు పదము లేవియు లేవనియుఁ శక్తిచ్ఛేష్టాదికముచే ధాతువు లేర్పడి యుండెననియుఁ జెప్పుచు ధాతువునకు ధాతుత్వము సకల భాషను ధరించుటచేతనే గల్గినదని చెప్పెను. కావుననే "సర్వే శబ్దా ధాతూత్పన్నా" యనెడి సిద్ధాన్తమిం దిమిడియుండెను. "ఉణాదయో ఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని" అను మున్నగు పరిభాషలు అవ్యుత్పత్తి పక్షము నాశ్రయించి బయల్వెడలినను బ్రధానముగా నా పరిభాషల ప్రయోజనము శాస్త్రప్రక్రియా మాత్రోపయోగిత్వమే యని చెప్పక తప్పదు.

## ఆర్యవ్యాకృతులు

లోకములో నెపుడు భాష సర్వవ్యవహారయోగ్యమును సకలాంగ సంపూర్ణము నగునో యపుడే యా భాషను నియతములగు నిబంధనములచే సంస్కరింపవలసియుండును. అనఁగా నే దేశమునందు నే వ్యాకృతులు ఎప్పటినుండి వెలువడుచుండినవో యప్పటికే యా దేశమునందలి యా భాషలు సకలాంగ పరిపుష్టిని సర్వజన సంపూర్ణవ్యవహార యోగ్యతను గల్గియున్నవని చెప్పవచ్చును. ఈ విషయము నే వేఱొకవిధముగాఁ జెప్పినచో దేశమునందలి వ్యాకరణాతిశయముచేతనే యా భాషయొక్క యతిశయము స్పష్టమగునని చెప్పవలయును.

పై నిదానమునుబట్టి చూచినచో మనదేశమున వ్యాకరణము లేనాఁడు బయల్వెడలినదో చెప్పుట మన బుద్ధికందరాని విషయమై యున్నది. వ్యాకరణ ప్రసక్తి—

"వాగ్వై పరాచీ అవ్యాకృతావదత్, తే దేవా ఇదం అబ్రువన్, ఇమాం నో వాచం వ్యాకురు ఇతి, సః అబ్రవీత్ వరం వృణై మహ్యంచ ఏవ ఏష వాయవే చ సహగృహ్యాతాం ఇతి!-తామింద్రో మధ్యతః అవక్రమ్య వ్యాకరోత్ తస్మాదిదం వ్యాకృతవాగుద్యతే॥ (తై. సం. 6-4-7) అనెడి యజుర్వాక్యముచేతను,

అథశిక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణః స్వరః, మాత్రాబలం, సామ సంతానః (తై. ఉ. 1-1) అను నుపనిషద్వాక్యముచేతను భారతదేశమునం దార్యులకు వ్యాకరణ జ్ఞానమనాద్యవచ్ఛిన్నమై యుండుటచేతను దీని కాలపరిమితి దుస్సాధమని చెప్పకతప్పదు. అందుఁబాణినీయము లౌకిక వాఙ్మయమును వలెనే వైదికవాఙ్మయమును గూడ సమగ్రముగ సాధించుటచే వేదాంగవ్యాకరణముగా నుండ నర్హతగల్గియున్నది.

## పాణినికిఁ బూర్వవ్యాకర్తలు

పాణినికిఁబూర్వము పెక్కులు వ్యాకరణము లుండె ననుటలో, సందేహము లేదు. పాణిని దనవ్యాకరణమున—

"అ దాచార్యాణాం" 7-3-49, వాసుప్యాపిశలేః 6-1-92 ఉదీచా మిఞ్ 4-1-153, యజుష్యేకేషాం 8-3-104, తృషిమృషి కృషేః కాశ్యపస్య 1-2-25, ఓతో గార్గ్యస్య 8-3-20, లోపశ్శాకల్యస్య 8-3-19, తృతీయాదిషు భాషిత పుంస్కం పుంవద్గాలవస్య 7-1-74, ఈ 3 చాక్రవర్మణస్య 6-1-130, ప్రాచాం ష్ఫ తద్ధితః 4-1-17, ఋతో భారద్వాజస్య 7-2-63, లఙః శాకటాయనస్యైవ 3-4-111, గిరేశ్చ సేనకస్య 5-4-112, అవఙ్ స్ఫోటాయనస్య 6-1-123, అని పదునల్వురు వైయాకరణులను పేర్కొని యున్నాఁడు. వీరలలో ముగ్గురు సామాన్యులు. పదునొకండ్రు సామువిశిష్టులు. లోకములో సామాన్యముగా వగపడు—

ఇంద్రః చంద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః।
పాణి న్యమర జైనేంద్రాః భవ న్త్యష్ట ఆది శాబ్దికాః॥

అను కారికలోని వైయాకరణులలో ముగ్గురు మాత్రమే పాణినిచే స్మరింపఁబడిరి. మొత్తము పై శ్లోకమునఁగాని పాణినిచేఁగాని పేర్కొనఁబడిన వారలలో నెందఱు పృథగ్వ్యాకృతి కర్తలు, ఎందఱు సంప్రదాయప్రవర్తకులు అనువిషయమును మాత్రము దెల్పుట యంత సుకరముగాదు. ఏది యెట్లయినను బాణినికిఁ బూర్వము మాత్రము కొన్ని వ్యాకరణములున్నట్లు తప్పక యంగీకరింపఁ బడవలయును. కాని యయ్యవి ఔపనిషద దర్శనములో శంకర భగవత్పాదుని శారీరకమీమాంసా భాష్యాతిశయముచే వంతకుముందుఁగల భాష్యములు పరాహతములై యంతరించినట్లు పాణినీయముయొక్క యనన్యసామాన్యమగు వతిశయముచేఁ బూర్వవ్యాకృతులు పరాహతములై యంతరించినవని చెప్పకతప్పదు.

## పాణినీయము

పాణినీయ మనఁగా బాణినిచేఁ బ్రోక్తమగు గ్రంథ మని యర్థము. పాణిని మహర్షిచే మూఁడువేల తొమ్మిదివందల యేనుబది రెండు (3982) సూత్రములు అష్టాధ్యాయీనామాంకమున నొకటియం దనుగ్రహింపఁబడినవి. ప్రధానముగ నష్టాధ్యాయికి ననుబంధములుగనే పాణినివ్యాకరణమున పందొమ్మిది వందలయఱువది యొనిమిది (1968) ధాతువులతో నొప్పు నొకధాతుపాఠమును, నూటతొంబది రెండు (192) లింగానుశాసన సూత్రములను రెండువందల యిరువదియొక (221) గణపాఠములను శిక్షాక్రమమును గూడా నుపదేశించి యున్నాఁడు. ఇయ్యవిగాక పంచపాదీరూపమగు నుణాదిక సూత్రసంతతి గూడఁ బాణిని కర్తృకమే యను నొక వాదము గలదు. పాణినీయ సంజ్ఞా పరిభాషాధీనమగు నీ యుణాదిక సూత్ర, ప్రవృత్తిని గమనించినచో నీవాదము యథార్థమేయై యుండునను విశ్వాసము రూఢమే యగును.

ఇట్లు పాణిని మహర్షిచేఁ బ్రోక్తమగు యోగసమూహము తన కాలమున సంపూర్ణ ప్రచారమును గని వేయినూట ముప్పది యొక (1131) శాఖలతో విలసిల్లు వైదిక వాఙ్మయమును శిష్ట సంప్రదాయ సిద్ధమగు లౌకికవాఙ్మయమును గూడ సంపూర్ణముగ ననుశాసించినది.

"అథశబ్దానుశాసనమ్! కేషాం శబ్దానామ్? లౌకికానాం వైదికానాం చ," యను పతంజలి భగవత్పాదుని వచనమునుబట్టి యానాఁడు సర్వశిష్టజన సంపూర్ణ వ్యవహారయోగ్యమగు నీ లౌకిక సంస్కృతభాష ప్రత్యహము గూడ నవనవోన్మీలిత మగు రూపము నందుచుండ నద్దానినిఁ బ్రధానముగా శాసింపవలసిన యవసరము ఈ పాణినీయమున కుండుటవలన ఈ పాణినీయము తొలుత లౌకిక వాఙ్మయమునే యనుశాసింపఁదలఁచెను. అందుచేతనే పతంజలి భగవానుఁడు 'లౌకికానా' మను పదమును దొలుతఁ బేర్కొనెను. ఇఁక సిద్ధమైయున్న వైదిక వాఙ్మయమున ద్విజులకు వర్ణాగమ వర్ణలోప ఏస్వరాదిదోషములు వొరయకుండ నద్దానియందలి పవిత్రతాభావముతో దాని ననుశాసించుచున్నదని తెల్పుటకై "వైదికానా" మను రెండవ పదము చెప్పఁబడినది. కాఁగాఁబాణిని మహర్షి దన శబ్దానుశాసనముచే నుభయవిధ వాఙ్మయములను సంపూర్ణముగ సాధించుటచేతనే యియ్యది సంపూర్ణ వాఙ్మయానుశాసనమై వేదాంగముగా నొప్పుచు

"ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేన వా।
పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్రమితి గీయతే"

యను శాస్త్రలక్షణమును శబ్దవిషయమునవందఁగల్గెను.

## సూత్రవాఙ్మయము

భారతీయ వాఙ్మయమునకు నీ సూత్రవాఙ్మయము దేశాన్తర వాఙ్మయములకంటె నొక విశిష్టతను సంపాదింపఁగల్గినది. గ్రహించిన విషయమును సర్వదా మననము చేయుటకై అద్దానిని గంఠస్థము చేయుట భారతీయ సంప్రదాయము. విపులము లగు గ్రంథభాగములను గంఠపాఠము చేయుట యత్యంత దుస్సాధ్యమగుటచే విషయమును సంగ్రహముగా సూచన చేయునట్టి యీ సూత్ర వాఙ్మయమును వారలు గ్రహించిరి. ఎంతటి విషయమునైనను మాత్రము కొలఁది యక్షరములతోడనె సంగ్రహపఱచి బుద్ధి గోచరముసేయుచుండుట సర్వజనానుభవ గోచరము. కావుననే భారతీయ శాస్త్ర

ములలోఁ బ్రతిశాస్త్రమునందును ముఖ్యముగా వ్యాకరణశాస్త్రమునను సైతము సూత్రరూపములు వెలసినవి. సూత్ర మెట్లు రచింపఁబడ వలయుననువిషయమున సూత్రతత్త్వవిదు లిట్లు పేర్కొనిరి:

“అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్ ।
అస్తోభ మనవద్యం చ సూత్రమ్మని.

కావున వంశవనమునందు సూక్ష్మరూపమున వృక్షావయవము లిమిడియున్నట్లు సూత్రమున నా విషయ మంతయు నిర్విచికిత్సముగ నిమిడియుండవలయును.

## పాణిని సూత్రములు

పైని చెప్పఁబడిన సూత్రలక్షణము మిగిలిన శాస్త్రములయందలి సూత్రములకు గూడ సమన్వితమైనను పాణినీయమున సూత్రము లీ లక్షణము చాల జాగ్రత్తతో ననుసరింపఁబడినవి. కావుననే పతంజలి భగవానుఁడు—“వృద్ధిరాదైచ్”ను సూత్రార్థమును విమర్శించుచు—

“ప్రమాణభూత ఆచార్యో దర్భపవిత్రపాణిః శుచావవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతిస్మ, తత్రాశక్యం వర్ణేనా ప్యనర్థకేన భవితుం కింపున రియతా సూత్రేణ.”

అని సూత్రగతాక్షర మాత్రానర్థక్యమును గూడ సహింపక పోయెను.

ఇట్లు పాణినీయమున నక్షరానర్థక్యము నంగీకరింపక పోవుటయే గాక సంగ్రహమునందలి తమ—యత్యంతాభి నివేశమును—

“అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః” అని (పరిభాష 133) ప్రకటించుకొనియున్నారు. కావుననే సూత్రార్థ విమర్శ ప్రసంగమున సూత్ర స్వరూపమును బర్యాలోచించుచు భగవత్పతంజలి తన మహాభాష్యమున సూత్రగత వర్ణములలో నర్థమాత్రమైనను దగ్గించుట కవకాశము గలదాయని విమర్శించుచుండును. సూత్ర వాఙ్మయమున నీ పాణినీయమువంటి బహు విషయములతో నొప్పు సూత్రనికాయ మెందును గాన మనువది తిరుగులేని మాటయే.

ఇట్టి యుత్తమ శాస్త్రకారుల చరిత మనఁగా సమయ సందర్భములు నేఁటివఱకుఁ దెలియఁబడక పోవుట విచారహేతువే. ప్రాచీనులు ఆంతర విషయములయం దుంచిన దృష్టిని ఇట్టి బాహ్య విషయముల యందుంచక పోవుటయే యిందులకుఁ గారణము. కాని పాణినిఁ గూర్చిన కొన్ని ప్రకటిత ప్రమాణములఁబట్టియుఁ బతంజలి వచనములను బట్టియుఁ గథాసరిత్సాగరాది నాటి విశ్వసనీయము లగు కథాగ్రంథములను బట్టియుఁ బాణిని శాలాతుర గ్రామాభిజనుఁడనియు శలంకు తనయుఁడనియు దాక్షీ పుత్రుఁడనియుఁ బాణిని గోత్రుఁడనియు ‘అహికాభిధానుఁ డనియుఁ గొందఱ యాశయము.

## శాస్త్ర రచనము

పాణినిమహర్షి దనశాస్త్రమును లోకమున నవతరింపఁ జేయుటకై నూతనమార్గము నవలంబించెను. శబ్దముల సాధుతా సాధుతా జ్ఞానసిద్ధి ప్రాక్పూర్వకముగ వాఙ్మయ సంతతమునకు మొదలు నీపద శాస్త్రము నెటుల (ఏపద్ధతిలో) రచింపవలయుననువిషయమును నిశ్చయించుట యంత సుకరము కాదుగదా! ఏలయన నాఁటికిఁగల శబ్దశాస్త్రము లన్నియు నసంపూర్ణములు కావున వాని నాధారముగాఁ గైకొనుట కవకాశము లేదు. కావునఁ దాను విశిష్టమగు నొకమార్గమును దప్పక యవలంబింపవలయును. దానికై పరితపించు నాతనికి మహేశ్వరానుగ్రహమునఁ దొలుత శాస్త్రానుకూల వర్ణసమామ్నాయ మంతయుఁ బదునాల్గు సూత్రములలో స్ఫురింపఁగా నాతఁడద్దాని నాధారముగాఁ జేసికొని దనశాస్త్రమును రచియింపఁ దొడఁగెను. నిజముగాఁ బాణినీయము యొక్క గొప్పదన మంతయు నా పదునాల్గు సూత్రములయందుఁ బతింపఁబడిన వర్ణక్రమమునందే గలదనుటకు సందేహము లేదు. మిగిలిన యష్టాధ్యాయియంతయు నొక మహావృక్షరాజమై యుండగాఁ నీ పదునాల్గు సూత్రములును నద్దానికి బీజమై యొప్పుచున్నవి. అట్టి పదునాలుగు సూత్రముల నాధారముగాఁ జేసికొని ప్రత్యాహారము లనెడి యొక సంగ్రహోపాయముచేఁ బాణిని మహర్షి వాఙ్మయ మహోదధి నవలీలగా మథింపఁగల్గినాఁడు. తరువాత నాతఁడు తనకు ముందుఁగల వ్యాకర్తృకృతములగు సంజ్ఞలను బరిభాషలను గొన్నింటిని సిద్ధము చేసికొనియు వేఱొక కొన్నింటినిఁ దనశాస్త్రమున కనుకూలముగఁ గల్పించుకొనియు ఉత్సర్గాపవాద రూపమున శాస్త్రము నంతను రచియింపఁగల్గెను. అప్పటికిని గొన్ని శబ్ద రూపములు సామాన్య విశేష సూత్రములకు సాధ్యములు గాకయుండ నవ్వానిని నిపాతనరూపమునఁ జేర్కొనెను. కాని యిట్టివి యపారశబ్దసాగరమునఁ బృషద్రూపములే యగుచున్నవి. ఈ విషయముననే పతంజలి భగవానుఁడు—“శబ్దానుశాసన మిదం కర్తవ్యం। కిం శబ్దోపదేశః కర్తవ్యః, ఆహోస్వి దపశబ్దోపదేశః, ఆహోస్వి దుభయోపదేశ”యని యుపక్రమించి ప్రతిపదపాఠాద్యనేకవిధములగు నుపాయములను ఇతిహాసములతోఁగూడ హృద్యముగాఁ జర్చించి తుదకు—“కించిత్సామాన్య విశేషవ ల్లక్షణం ప్రవర్త్యమ్। యేనాల్పేన యత్నేన మహతో మహతః శబ్దౌఘాన్ ప్రతిపద్యేరన్। కిం పున స్తత్? ఉత్సర్గాపవాదౌ। కశ్చిదుత్సర్గః కర్తవ్యః, కశ్చి దపవాద” యని నిర్వచించినాఁడు. ఈ తీరునఁ బాణిని దన సమయమునఁగల భాషను సంపూర్ణముగ సంస్కరించెను.

## కాత్యాయనుఁడు

ఇట్లు కాలము గడచినకొలఁది గీర్వాణవాణీలత పల్లవితమును బుష్పితము నగుచుఁ బత్నములగు శాఖోపశాఖలతో వ్యాపించిపోవుచుండఁ బాణిని మహర్షి నిర్మించినయష్టాధ్యాయీ కాయమానము అపర్యాప్తము కాఁగా మఱికొన్ని స్తంభములను నాటి యద్దానిని బర్యాప్తము గావించుటకుఁ గాత్యాయన మహర్షి ప్రయత్నించినాఁడు. ఈతనిచే రచింపఁబడిన వాక్యములకే వార్తికము లని పేరు. వార్తిక మనఁగా—

“ఉక్తానుక్త దురుక్తానాం చింతా యత్ర ప్రవర్తతే।
తం గ్రంథం వార్తికం ప్రాహుః”

అని శాస్త్రజ్ఞులచే నిర్వచింపఁబడియెను. కాత్యాయనుని సమయము

నాఁటికిఁ బాణినినాఁటి భాషలోఁ గొన్ని పదములు ప్రచ్యుతి గొన్ని పదములకు దురుక్తతయుఁ గలుగఁగా ననుక్తములు గొన్ని శబ్దములు గూడ వ్యవహారగోచరములయినవి. అందులకై యీతఁడు ఇంచుమించు పాణినీయములగు పదునైదు వందల సూత్రములకు వార్తికములను సంతరించెను. ఈ వార్తిక సంఖ్య గూడ సుమారు నాల్గు వేలుండును. ఈతఁడు దన వార్తికముల యందుఁ బేర్కొనిన భావ్యారపాది, వ్యాడి మున్నగు వారలలో వ్యాడి యను నతఁడు పాణిని సూత్రములకు "సంగ్రహము"ను విపుల వ్యాఖ్యానము రచియించెననియు నయ్యది లక్ష శ్లోకపరిమిత మనియుఁ బతంజలి భగవానుని—"కింపు నర్నిత్యః శబ్దః ఆహోస్విత్ కార్యః? సంగ్రహే ఏతత్ప్రాధాన్యేన పరీక్షితమ్; నిత్యోవా స్యాత్ కార్యోవేతి!" "అథ సిద్ధశబ్దస్య కః పదార్థః?—సంగ్రహే తావత్ కార్యప్రతిద్వంద్విభావా న్మన్యామహే నిత్యపర్యాయవాచినో గ్రహణమితి" (పస్పశభా) యను వచనములఁబట్టియు, "గ్రంథవిశేషే" "వ్యాడికృతో లక్షశ్లోక సంఖ్యో గ్రంథ ఇతి ప్రసిద్ధిః" యను కైయట నాగోజీభట్ట వచనములఁబట్టియుఁ దెలియుచున్నది. కాని యీ వ్యాడి రచితసూత్ర వ్యాఖ్యానము భర్తృహరినాటికే లుప్తమైనట్లు—

"ప్రాయేణ సంక్షేప రుచీ నల్ప విద్యాపరిగ్రహాన్
సంప్రాప్య వైయాకరణాన్ సంగ్రహేఽస్త ముపాగతే।
కృతేఽథ పతంజలినా గురుణా తీర్థదర్శినా।
సర్వేషాం న్యాయబీజానాం మహాభాష్యే నిబంధనే"
(వాక్యపదీయ. 2 కాండే)

అను వచనములనుబట్టి తెలియుచున్నది. ఈ వ్యాడికిని బాణినికిని సన్నిహితసంబంధము గలదని "సర్వే సర్వపదాదేశా దాక్షీపుత్రస్య పాణినేః" (4-1-20 భాష్య) "శోభనాఖలు దాక్షాయణేన (వ్యాడినా) సంగ్రహస్యకృతిః" (2-3-66 భాష్య) (దాక్షీపుత్రుడు = పాణిని, దాక్షీపుత్రుఁడు అనఁగా దాక్షాయణుఁడు=వ్యాడి) అనువచనములనుబట్టి తెలియుచున్నది. కావునఁ బాణిని కాత్యాయనుల. మధ్యకాలముననే పాణినీయమునకు విపులములగు వ్యాఖ్యానములు బయల్వెడలినవని చెప్పవచ్చును.

ఇఁక నీకాత్యాయనుని స్వరూపమునుగూర్చిగూడఁ బెక్కులు విసంవాదములు గలవు. "వాక్యకారం వరరుచి" మ్మను శిష్టనమస్కారవచనమునందలి వరరుచియు "ఓంనమఃపాణిని కాత్యాయన పతంజలిభ్య—"యను సంప్రదాయసిద్ధ గ్రంథాది నమస్కారవిషయుఁడగు కాత్యాయనుఁడును అభిన్నులేయని శిష్ట సంప్రదాయ వచనము. కాని నేఁటి విమర్శకు లద్దాని నంగీకరింప దూరవర్తులై చరింతురు. వాజసనేయ శ్రౌతసూత్రస్మర్త యగు కాత్యాయనుఁడు దుర్గాతంత్రప్రవర్తకుఁడగు కాత్యాయనుఁడును అభిన్నులా భిన్నులా యను చర్చ కాక దంతపరీక్షాతుల్యమైనను దన్మాత్రాదిసత్తు లద్దానిఁ జేయుదురుగాక!

పైనిఁ బేర్కొనిన విధముగాఁ గాలభేదము వ్యాకరణవార్తికోత్పత్తికి నావశ్యకమగుచుండఁ బాణిని వరరుచులు—"తతోఽభవద్వరరుచేర్వ్యాడిః పాణినినాసహ"యను మున్నగు వచనములనుబట్టియు బాణిని వ్యాడి వరరుచీంద్రదత్తులు వర్షోపాధ్యాయుని కడ విద్యనభ్యసించినట్లు దెలియవచ్చెడి కథాసరిత్సాగరమునుబట్టియు నవి కాలిక లనుట యెంతవఱకుఁ బొసఁగునో యని సందేహము. కాత్యాయనుఁడు మాత్రము దాక్షిణాత్యుఁడని భగవత్పతంజలి "యథా లౌకికవైదికేషు అనెడి వార్తిక వివరణ సందర్భమున "ప్రియ తద్ధితా దాక్షిణాత్యాః యథాలోకే వేదే చేతి ప్రయోక్తవ్యే లౌకికవైదికేష్వితి ప్రయుంజతే" యని పేర్కొనినాఁడు. దాక్షిణాత్యులు ప్రియ తద్ధితులు గావున దాక్షిణాత్యుఁడగు వార్తికకారుఁడు తద్ధితాంతములను బ్రయోగించెనని దీని భావము.

## పతంజలి భగవానుఁడు

పైని నిరూపించిన తీరుననే వాక్యకారుని యనంతరము కొన్ని శతాబ్దులకు మఱల భాషాసంస్కార మావశ్యకమాయెను. అసలు ప్రవృద్ధిశీలమగు భాషనే నియమనము చేయుట లోకమున నశక్యమగుచుండ నందు ధాతునిదానమై యనంతరమణీయ వాగ్జాల సృష్టికి నవకాశ మొసఁగు గీర్వాణ భాషవంటి దాని సంపత్సమృద్ధి నాఁపుట కెరికి శక్యమగును? సంస్కృతమును శుద్ధమును గాని భాష సభ్యము శిష్ట పరిగ్రాహ్యము కాదనుమాట సర్వజన సమ్మతమేగదా! కావుననే పతంజలి భగవానుని యవతారమునకు ఆవశ్యకత కల్గినది.

## మహాభాష్యము

ఈతని గ్రంథమునకేమహాభాష్యమని పేరు. భాష్య సామాన్య లక్షణము.

"సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుకారిభిః
స్వపదానిచ వర్ణ్యన్తే భాష్య" మ్మని

చెప్పబడినది. అందునను పాతంజలము సకలలోక వ్యాయవిలసితమై సర్వశాస్త్ర బీజప్రతిపాదకమై యితరభాష్యములకు నాదర్శప్రాయ మగుటచేతను అనన్యసాధ్యములగు భాషా విమర్శములతో నొప్పుచుండుట చేతను, గ్రంథ పరిమితిచేఁ గూడ నపారమగుటచేతను మహాభాష్యమునా నొప్పుచున్నది. ఈ మహాభాష్యార్థపరామర్శమునఁగాని తద్గ్రంథ పాఠమునఁగాని తన్మయత్వము నొందని విద్వాంసుఁడు లేకపోవుటచేతనే "మహాభాష్యంవా పాఠయేత్, మహారాజ్యంవా పాలయేత్"ను సూక్తి విద్వల్లోకమున సుప్రసిద్ధమైనది. పతంజలి భగవానుఁ డింతటి శక్తిసంపన్నుఁ డగుటచేతనే కాఁబోలు శాస్త్రము "పాణినీయము"ని పాణిని పేరిట నొప్పుచున్నను దుదిప్రామాణ్యము పాతంజల వాక్యమునకే గల్గినది. (చూ. "యథోత్తరం మునీనాంప్రామాణ్యమ్") పతంజలి తనభాష్యమున సూత్రకారుని యనుక్తదురుక్త పరిశోధనకై బయల్వెడలిన వార్తికవచనములలోఁ బెక్కింటిని విమర్శించి యనుక్తములను సూత్రకారోక్తములనుగాను, దురుక్తములను సూక్తములనుగాను సాధించి వార్తికములను ఖండించినాడు. కుణ్యాది వైయాకరణులచే రచియింపఁబడిన సంగ్రహగ్రంథేతరములగు కొన్ని వృత్తులు గలవనియు నవ్వాని మతములనుగూడ భాష్యకారుఁ డనుసరించెననియుఁ గైయటాదుల వచనములవలనఁ దెలియవచ్చినను నేఁడుమాత్ర మట్టి వృత్తులు కన్పట్టలేదు.

## ఐతిహ్యము

పాణినీయమును ప్రతికల్పముగాఁ దలంచు వైయాకరణు లదివ అను పతంజలిని సహస్రశీర్షుఁడగు నాదిశేషుని యపరావతారమని విశ్వసింతురు. దీనికై వీర లీదిగువ నుదాహరింపఁబడిన యైతిహ్యమును ప్రవచింతురు.

ఒకనాఁడు మహర్షిపాణిని మాహేశ్వరానుగ్రహమున స్ఫురించిన యష్టాధ్యాయి నొక పర్యాయము ఆమ్నాతము గావించి యిట్టి గంభీరార్థ విలసితమగు గ్రంథము సమర్థమగు వివరణముతో నొప్పినఁగాని దురవగాహమై స్వోద్దిష్టమగు ఫలమును సమకూర్ప నేరదేయని విచారగ్రస్తుఁడై యుండి నంతలో భానుఁడస్తంగతుఁడగుచుండెను. మహర్షియుఁ దనయాశ్రమోపాంతమునందలి విమల సారస్వతజలము లందు స్నానమాడి యాచమించి సాయమర్ఘ్య ప్రదానమిచ్చు నంజలితోఁ బ్రవాహోదకములను గైకొని యందు మహాతేజస్సంపన్నమగు నాగకిశోరమును గని ఈర్ష్యాసంత్రాసములతో "కోర్భవాన్" అని ప్రశ్నించుచు జలములను గ్రిందవదలెను. వెనువెంటనే యాసర్పశిశువు "సర్పోఽహ"మ్మని సమాధానమును జెప్పఁగా శబ్దైకచక్షువగు మహర్షి "రేఫః క్వగతః" అని మఱలఁ బ్రశ్నింప "భవతైవాప హృతః" అని యానాగము సమాధానమును జెప్పినది. ("కోభవాన్" అని ప్రశ్నించుటకు బదులు మహర్షి తత్తఱపాటుతో "కోర్భవాన్" అని ప్రశ్నించెను) మహర్షియు దన యపశబ్దప్రయోగ దోషములను దెలిసికొని దన యుపాస్యదేవతయగు మహేశ్వరుఁడే దన చింతను బోఁగొట్టుటకై స్వసూత్రార్థ వివరణమునకుఁ దన యలంకారరూపుఁడగు నాదిశేషుని నీరూపమునఁ బంపెనని తలంచి సంప్రదాయ రహితముగా నవఁగా ననుపదిష్టుఁడై శాస్త్రము నెవ్వఁడేని ప్రవచనమును జేయఁగూడదను తలంపుతో యోగమహిమచే సర్పాకారమును డించి మానవరూపమును ధరించిన యాతనికిఁ దన శాస్త్రము నుపదేశించి లోకమున నవిలంబితముగ దీనిని బ్రచారము గావింపవలసినదిగా ననుశాసించెను. కావుననే యాతనికి (పతన్ + అంజలేః) బతంజలి యను నామము గలిగినది.

పతంజలియుఁ బరమశివుని తనువియోగము నోర్వఁజాలక యొక్కసారియే దన యవతరణ ప్రయోజనమగు భాష్యవ్యాప్తిని సాధింపనెంచి సమీపగతములగు నాశ్రమములకుఁ జని యటనుండి సహస్రసంఖ్యామితమగు ఛాత్రబృందమును సంపాదించి యౌగపద్యముగనే వారల కందఱకును దన గ్రంథము నధ్యాపనము గావింప నెంచి వారలతోడ యవనికాభ్యంతరవర్తియై దాను గ్రంథాధ్యాపనము గావింతుననియు నట్టితఱి నెవ్వారలుగాని యవనిక నపనయింపఁ దగదనియు నొక కట్టడిసేసి మహాభాష్యప్రవచనమును గావింప మొదలిడెను. అంతేవాసిగణ మంతయు గ్రంథ గాంభీర్యమును దమ గురుచరణుల బోధకతాశక్తిని దలంచి మిగుల నచ్చెరువందుచు బ్రవచనసమయమునఁ బారవశ్యము నందుచుండెను. ఇఁక గ్రంథమునఁ దుదిసూత్ర భాష్యముమాత్రము రేపటికి మిగిలియుండెను. మహాభాష్యశాన్తి రేపే చేసికొందమని యాచార్యులు సెలవిచ్చిరి.

నాఁటి సాయంకాలసమయమున సబ్రహ్మచారిసంఘాత మంతయు నొక నదీపులినమున సమావిష్టమై శాన్తిసమయమున ఆచార్యఋణమును నే పెట్లు దీర్పవలయునో యావ్యాకరణ గురువరుల పదాబ్జములకు నర్పణము గావింపవలయునో యని విచారింప నారంభించినది. అందుఁ దొలిశ్రేణి యందుఁ గల శిష్యసత్తములు ఆచార్యపుంగవులు దమయందే దృష్టినిలిపి సూత్రవివరణమును భాషించుటచేఁ దామె స్వయముగఁ దచ్చరణములకుఁ బూజ సల్పుదుమని నుడివిరి. అంతఁ దుదిశ్రేణియందలి ఛాత్రులు వీరలు మందబుద్ధులగుటచేఁ బ్రథమశ్రేణియం దుంచిరి గాని వాస్తవముచేఁ దమ యాచార్యులు దమయందే దృష్టినిడి వ్యాఖ్యానమును గావించుచుండిరనియు నట్లుకానిచో మారవర్తులైన దమకుఁ జెవిలోఁ జెప్పినట్లే పాఠమంతయు వినఁబడుట కవకాశము లేదనియుఁ గావునఁ దామే వారల—పాదార్చనమును గావింపవలయు ననియు నుడివిరి. ఇట్లొక్కొకశ్రేణి తమ్ముఁ దృష్టియందిడికొనిదే యాచార్యులు అధ్యాపనము గావించిరనియు, గానిచో నా పాఠ మట్లు తమ శ్రవణగోచరము కాఁజాలదనియు వాదింపఁజొచ్చిరి. తుదకు శిష్యసంఘాతము తమ తమ విచిత్రానుభవమును బరస్పరము దెల్పుకొని యాశ్చర్యచకితులై దీనియందేదియో రహస్యము గలదనియు, లేనిచో గురుశిష్యులమధ్య నాతిరస్కరిణీ వ్యవధానమున కవసరమేల గల్గెననియు వచించి యీ రహస్యమును దెలిసికొనుటకు రేపుమాత్రమే యవకాశముండుటచే నిద్దానిని దప్పక దెలిసికొనవలయునని నిశ్చయించిరి. మఱుసటి దినమునఁ బ్రవచనము చాల యుత్సాహముతో జరుగుచుండెను. పతంజలి భగవానుఁడు దుదిసూత్రముపైఁ దన భాష్యతేజమును బ్రకాశింపఁజేయుచుండెను. అట్టి సమయమునఁ గొందఱు తన్మయులై వినుచుండిరి. కొందఱు పూర్వదినసాయంతనకృత నిర్ణయమునకు సమయ మతిక్రమించుచుండెనే యని పరితపించుచుఁ దమ సబ్రహ్మచారియగు నొక బ్రహ్మచారివైపు సైగచేయుఁడు పిసునాత్ముఁడగు నావటువు వెంటనే యాజవనికను దొలఁగించెను. ఇఁక నేమి గలదు! సహస్రఫణావిరాజితుఁడగు నాఫణిరాజు తీవ్రవిషదృష్టులు ఆ యన్తేవాసి సంతతియందు నిగుడుఁడుఁ దత్క్షణమే వారలందఱు భస్మరాసులైరి. అంతఁ బతంజలి దనస్వరూపము నుజ్జగించి మఱల యోగరూపమునంది జరిగిన వృత్తాంతమును దలంచి విషణ్ణుఁడయ్యెను. ఇంతలోనే యొకవటువు పాషాణవివరనిక్షిప్తములగు దన గ్రంథపత్రములను గైకొని గురుసమీపమునకు వచ్చుచు నధ్యాపనధ్వని లేక కళావిహీనమగు నాప్రదేశమును గాంచి నివ్వెఱవోవుచు గురు సమీపమునకు వచ్చి సప్రశ్రయముగ వందన మాచరించి వెలవెలవోవుచుండ నాచార్యుఁడు—"ఛేద్రవతా, నీ వెచటికిఁ బోయితి"వని ప్రశ్నింప నాతఁడు గజగజవడఁకుచు, "ఆచార్యా, ఆశ్రమసీమకు బాహ్యప్రవృత్తికై వెడలి శుద్ధుఁడనై వచ్చుసరికి విలంబమాయె"నని యేమేమో చెప్పఁబోవుచుండ నుపాధ్యాయుఁ డాతని భయమునుండి శాంతపఱచి జరిగిన విషయమును దెల్పి మిగిలినగ్రంథభాగ మాతనికిఁ బూర్తిగావించి యెట్టి స్థితిలోనైనను నీవీ భాష్యమును బ్రచారము గావించి మాఋణమును దీర్చికొనవలసినదే యని యనుశాసించి దాను దన యవతారమునుండి తిరోహితుఁడాయెను. శిష్యుఁడును ధాతురాగముతో వ్రాసిన యాపత్రములాఱుటకై యాతపమునం దుంచుచు నవ్వానితో మిగిలిన గ్రంథమునుగూడ నచట నేయుంచి దాను దత్సా

ర్నష్టచరిత్రుఁడయి యుండి జరిగిన విషాద సంఘటనమును దలంచి మిత్రద్రోహమునకు వగచుచు సంజ్ఞావిహీనుఁడై యుండెను. అట్టి సమయమున నెటనుండియో యొక మేఁక వచ్చి యాపత్రములను దిన నారంభించెను. వేదవ్రతుఁడును అంతస్వస్థుఁడై చూచి మేఁకను వెడలించి మిగిలిన పత్రములను జాగ్రత్తపఱచికొనెను.

తుదకు పతంజలి సహస్రచ్ఛాత్రగణమునందు వేదవ్రతుఁడును అతినియజభక్తి తావశిష్టమగు మహాభాష్యగ్రంథమును మిగిలెను. జరిగిన సంఘటనములచే వేదవ్రతుఁడు మిగుల నిర్వేదము నంది క్రమముగా దన్నిమిత్తకమగు నుత్కటవైరాగ్యము నందియుండెను. ఒకనాఁడు వేదవేదాంగపారగుఁడగు నాతఁడు ఉపనిషదధ్యయనమున నిమగ్నుఁడై "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" అనెడి వాక్యార్థము దన బుద్ధివిషయము కాఁగా యథావిధి సన్యసించి శ్రీ శుకయోగి సన్నిధి కేఁగి యుపసదనమును గావించి ప్రణవమహావాక్యోపదేశమునంది గురుదత్తమగు "గౌడపాదానంద భారతి" యను నామమును బడసెను. ఔపనిషదవిచారము దక్క వేఱొండు శాస్త్రచర్చ చేయనర్హము గాని యీ తురీయాశ్రమమునందుఁ బాతంజలానుశాసనమునుబట్టి మహాభాష్యప్రవచనము చేయుటకుఁ దనకు నవకాశము లేకపోఁగా నా స్థితియంతయు శ్రీ గురువులకు విన్నవించి శ్రీ శుకానందభారతుల నుండి పాతంజలమహాభాష్యప్రవచనము సేయుటకు ననుజ్ఞను సంపాదించెను. నాఁటినుండి సన్యాసులుగూడఁ దమకవశ్యకర్తవ్యమగు నౌపనిషదవిచారముతోపాటు ఈ పాతంజలమహాభాష్యప్రవచనమునుగూడఁ దమ యవకాశమునుబట్టి చేయుచుండుట యొక సంప్రదాయ మాయెను."

కథాప్రసంగ మెట్లున్నను బ్రకృత పాతంజలభాష్యము మాహేశ్వరసూత్రతతివలెనే సిద్ధపురుషప్రోక్తమని చెప్పుటలో నెట్టి సందేహముగూడ లేదు. అటులనే యుపనిషత్ప్రసంగములనువినా వేదవేదాంగపాఠము సైతము నిషేధింపఁబడిన పరమహంస సంప్రదాయమునఁ బాతంజలమహాభాష్యప్రవచనము నిషిద్ధము గాదను నదిగూడ సంప్రదాయసిద్ధమగు సత్యమే. అటులనే మహాభాష్యము అష్టాధ్యాయీగతసూత్రములలోఁ గొన్నికొన్ని సూత్రములకుఁ గానవచ్చుటలేదు. కారణమేదైనను గావచ్చును.

పాతంజలమహాభాష్యముతో స్వతంత్రపాణినీయ వ్యాకరణ రచన మాఁగినది. గీర్వాణభాషకు వ్యాకరణమనఁగా "త్రిమునివ్యాకరణ" మ్మనియే పేరు స్థిరపడినది.

"పాణినీయం మహాశాస్త్రం పదసాధుత్వ లక్షణమ్ ।
సర్వోపకారకం గ్రాహ్యం కృత్స్నం, త్యాజ్యం న కించన"

యని సకలవాఙ్మయమునందును దీని యశశ్చంద్రికలు వెల్లివిరిసినవి.

ఇట్టి మహాప్రసిద్ధిఁగన్న మహాభాష్యకర్తయగు పతంజలి చరితముగూడ మనకు స్పష్టముగాఁ దెలియదు. సంప్రదాయసిద్ధమగు పతంజలి భగవానుని స్తుతిలో—

"యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన।
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి
రానతోఽస్మి"

అను గీత మొకటి గలదు. దీనియందు యోగసూత్రములను రచించి మానసికమలమును మహాభాష్యమును రచించి వాఙ్మలమును వైద్యగ్రంథమ నొకదానిని రచించి శారీరకమలమును ఇట్లు త్రికరణదోషములను బతంజలి భగవానుఁడు పోఁగొట్టెనని చెప్పుటచే నితఁడు యోగశాస్త్రము వైద్యశాస్త్రమునుగూడ రచించెనని తెలియుచున్నది. యోగశాస్త్రమునకు మూలభూతమగు సూత్రము లీతని పేరనే "పాతంజల యోగసూత్రము"లని ప్రసిద్ధిఁ గనుటచేఁ బతంజలి యోగసూత్రములను రచియించెననుటలో సందేహము లేకున్నను, పతంజలి విరచితమగు వైద్యశాస్త్ర మెయ్యది యను సందేహము విద్వల్లోకగోచర మగుచున్నది. కొందఱు చరకసంహితను రచియించెనని యందురుగాని యా గ్రంథము చరకుఁడను వేఱొక నామముతో నొప్పు ఋషిచే సంస్కృతమైన భారద్వాజ శాస్త్రముగా నందే చెప్పఁబడియుండుటచేఁ బైవాద మంత శ్రేష్ఠము గాదని చెప్పవచ్చును. కావున నీపాతంజలమగు వైద్యశాస్త్ర మెయ్యదియై యుండునో పరిశోధకులు ఇంకను బరిశోధింప వలసి యున్నది.

ఇఁక "గోనర్దీయస్త్వాహ, గోణికా పుత్రస్త్వాహ" మున్నగు పాతంజల వచనములచేఁ బతంజలియే కీర్తింపఁబడుటవలన నతఁడు గోనర్దదేశీయుఁడనియుఁ గోణిక యను నామె తనయుఁడనియుఁ దెలియుచున్నది. ఈగోనర్దము కాశ్మీరాన్తర్గతమని విమర్శకులు పేర్కొనుచున్నారు. కాని వాత్స్యాయన కామసూత్రాది గ్రంథములలో విభిన్న ఋషుల మతములను బ్రదర్శించునపుడు గోనర్దీయ—గోణికా పుత్రులను వేఱుగాఁ బేర్కొనుటచే గోనర్దీయ-గోణికా పుత్రులు భిన్నులా యను సందేహము గల్గుచున్నది.

మహాభాష్య గ్రంథ విమర్శమువలన ననేక నూతన విషయములు అనఁగా వాఙ్మయమునను ఆచారములయందును జరిత్రమునందును భౌగోళికము నందును దెలియును. వ్యాకరణవిషయమున నీ గ్రంథమెంత యుపకృతి కారియో మిగిలిన విషయములందుఁగూడ నియ్యది యంత యుపకరించుచున్నది. దీనియందు "చంద్రగుప్త సభా, పుష్యమిత్రసభా, పుష్యమిత్రో యజతే, యాజకా యాజయన్తి। ఇహ పుష్యమిత్రం యాజయామః। అరుణద్యవనః సాకేతమ్" అను మొదలగు నుదాహరణములలోఁ గొన్ని యపరోక్షలక్ష్యములుగా నీయఁబడినందువలన నతఁడు పుష్యమిత్రుని కాలమువాఁడని నిర్ణయింపఁబడుచున్నది. పుష్యమిత్రుఁడు చంద్రగుప్తుని మనుమఁడగు బృహద్రథునికి సేనాపతిగానుండి రాజు తన యధర్మప్రవృత్తివలనఁ బ్రజాకంటకుఁడు కాఁగా నాతనిఁ దొలగించి పుష్యమిత్రుఁడే రాజాయెననియు నతఁడు అశ్వమేధయాగమును జేసెననియుఁ జరిత్రప్రసిద్ధములగు విషయములే. కావునఁ బతంజలి గూడ నీతని సమకాలికుఁడే యగుచు క్రీ. పూ. 2 వ శతాబ్దివాఁడని చారిత్రకుల నిర్ణయము. పతంజలి దనపూర్వులగు సూత్రవార్తికకారులను బేర్కొనవలసివచ్చినపుడు అత్యంతాదరముతోడను భక్తితోడను "ఆచార్య"యను విశేషణ పురస్సరముగనే పేర్కొనుట యొకవిశేషముగా నే గ్రహింపవలయును.

గాక మూలగ్రంథములకు వ్యాఖ్యానములు, తద్వ్యాఖ్యానములకు వ్యాఖ్యానములు, వానికి మఱికొన్ని వ్యాఖ్యానములు, ఇట్లు వ్యాఖ్యాన పరంపరలు బయల్వెడలినవి. వీని ప్రయోజనము వ్యాకరణమునకు ఇతరశాస్త్రములకంటె విశిష్టతను సంపాదించుటయు శాస్త్రమునఁ గన్పట్టు నభిమత సిద్ధాన్తములతో వేఱొక సిద్ధాన్తమును ఖండింపఁ బూనుటయుఁ దక్క భాషా సంస్కారము మాత్రము కాదు. దీనివలన బుద్ధివికాసము సూక్ష్మ విషయ పరిశీలన శక్తి, దాని వలనఁ గల్గు నానందమును గల్గును.

ఇందు విచిత్రమగు విషయమేమనఁ బాణినీయోత్పత్తి లోక వేద ప్రయుక్తమగు పదసంఘాతము నాధారముగాఁ జేసికొని బయల్వెడలినదేగాని నూతన కృత్రిమ శబ్దజాలమును సృష్టించి లోకమున కందఁజేయుటకు బయల్వెడల లేదను సిద్ధాన్తము "లోకతః (వార్తిక) యల్లోకే అర్థమర్థ ముపాదాయ శబ్దాన్ ప్రయుంజతే, నైషాం నిర్వృత్తౌ యత్నం కుర్వన్తి, తద్యథా ఘటేన కార్యం కరిష్యన్ కుంభకార గృహం గత్వా ఆహ—కురుఘటం, కార్యమనేన కరిష్యామీతి, న తద్వచ్ఛబ్దాన్ ప్రయుయుక్షమాణో వైయాకరణ కులం గత్వాఽఽహ—"కురుశబ్దాన్ ప్రయోక్ష్యే ఇతి! తావత్యేవార్థ ముపాదాయ శబ్దాన్ ప్రయుంజతే" "ప్రయోగమూలం వ్యాకరణం" "ప్రయుక్తానామేవ మన్వాఖ్యాన" మ్మను మొదలగు పాతంజల వాక్యముల వలన సిద్ధమైయుండఁగా క్రమముగా నర్వాచీనులగు పాణినీయ వైయాకరణులు శబ్దజాల మంతయు శాస్త్రోత్పన్నమనియుఁ దదనుత్పన్నములగు శబ్దప్రయోగములు శిష్టప్రయుక్తములైనను నయ్యవి యనుపాదేయములే యనియుఁ దలఁచుచు నవ్వాని సాధనమునకై యత్నింపక భావమపై నధికారమును జలాయింప నెంచలిడిరి. వీరలు తమ యనుసరణమునకుఁ బ్రౌఢవాదముతోఁ బలుకఁబడిన "నలక్షణేన పదకారా అనువర్త్యాః; పదకారైర్నామ లక్షణ మనువర్త్యమ్, యథాలక్షణం పదం కర్తవ్యమ్మ"ను పాతంజల సూక్తుల నుదాహరింతురు. పైసిద్ధాన్తమే భగవత్పతంజల్యభిప్రేతమైనచో నాతఁడు "ప్రయోగమూలం వ్యాకరణం" ప్రయుక్తానామేవ మన్వాఖ్యానమ్మ"ని నుడువడుగదా !

ఇట్లు పాణినీయులు లౌకికభాషపైఁ జేయు ప్వారినిఁ జూచి యాంధ్రవ్యాకర్తలు గూడ నత్యంతా పరిపుష్టములగు వ్యాకృతులను సృష్టించి దమకుఁ బూర్వముగల శిష్టప్రయోగములను గూడ 'నసాధు'వులనియు నిరాకరింప యత్నించుట కడుంగడు సాహసమే యని వేఱె చెప్పనక్కఱలేదు.

## పాణినీయమున ఆర్థిక గ్రంథారంభము

పాణిని ప్రోక్తమగు శాస్త్రమంతయు శబ్దస్వరూప విచారముతో నారంభమయి తత్ప్రక్రియా విధానమున శబ్దముల సాధుతాసాధుతలను నిరయింపఁ బయల్వెడలినదియే. ఇట్టి ప్రక్రియయందు వీరలకుఁ బ్రధానముగా శబ్దస్వరూపమే యపేక్షితముగాని శబ్ద సంబద్ధమగు నర్థమంత యపేక్షితముగాదు. కొన్ని ప్రకరణములయందు మాత్రము తత్తచ్ఛబ్ద స్వరూప నిష్పత్తికొఱకుఁ గొంతవఱకు నర్థా పేక్షగలదు. అయినను ఈ రచనమంతయు శబ్ద ప్రధానము అర్థోపసర్జనము నగుటచే నియ్యది ప్రాకృతమేనాఁ బడుచున్నది. పాణినీయ వాఙ్మయమున నీ భాగమునకుఁ జెందిన గ్రంథజాలమే యత్యధికముగా వెలయుచున్నది.

ఇఁక రెండవ తరగతికిఁ జెందిన గ్రంథముల నార్థిక గ్రంథములందురు. ఇయ్యవి శబ్దోపసర్జనములును అర్థ ప్రధానములును నగుటచే నివ్వాని కీనామము గల్గినది. వీనియందు ధాతుప్రత్యయ నామ నిపాతాదుల యర్థ నిర్ణయము సమాసశక్తి నిర్ణయమును జేయఁబడును. వ్యాకరణమునకు ఇతర శాస్త్రములతోడి సంబంధము ఈ గ్రంథ భాగములయందే గల్గుచుండుటచే శాస్త్రాంతరములతో వాక్యార్థ చర్చ యిందే జరుగుచుండును. ఇట్టి శాస్త్రార్థమునకై యశేషపాణిని సూత్రార్థ విజ్ఞానముగాని తత్కృత ప్రక్రియా విశేష పరిచయముగాని యంత యవసరములేదు. ఇట్టి యార్థికాంశచర్చ సూత్రవార్తిక భాష్యాదులయందు నంతగా నుపలబ్ధము గాకపోయినను భర్తృహరి భాషితమగు వాక్యపదీయమున విపులముగా నారబ్ధమైనది. వ్యాకరణ శాస్త్రమునఁ గల యిట్టి యార్థిక గ్రంథములలోఁ బ్రధానము లగునవి వాక్యపదీయము కొండభట్ట విరచితమగు భూషణము, నాగోజి భట్ట విరచితమగు "మంజూష"యును. ఈ గ్రంథములు కాణాదాది శాస్త్రాంతర సిద్ధములగు నర్థ నిర్ణయములను ఖండించి వైయాకరణ సిద్ధాన్త ప్రతిపాదితములగు వాక్యబోధములే సర్వవిధములఁ బ్రమాణ యుక్తి సహాకృతములని నిర్ణయించినది.

## పాణినీయమునకు దర్శనత్వము

దర్శనమనఁగా నధ్యాత్మ తత్త్వమును జర్చించు ప్రస్థాన మని యర్థము. ఆత్మ తత్త్వ విచారమునుజేయు గ్రంథమునకు ఆర్య వాఙ్మయమున విశిష్టమగు నాదరాతిశయము గల్గుటచేఁబాక శాస్త్రము మొదలు పరబ్రహ్మశాస్త్రము వఱకును గల సకలశాస్త్రములును ఎట్లయినను దమ శాస్త్రతాత్పర్యములను ఆత్మయందే సమన్వయముచేసి దమకు నభీష్టమగు నాత్మస్వరూపమును మోక్షస్వరూపమును నిర్వచించినవి. పురుషార్థములలో ద్వితీయ తృతీయ పురుషార్థములను బోధించు శాస్త్రములకు బాహ్యముగఁ జూచినచో అధ్యాత్మ ప్రసక్తి కెందును దావులేకున్నను దైని నిరూపించిన యార్యశాస్త్రీయ సంప్రదాయముల ననుసరించియే గ్రంథాన్తమునఁ గౌటిల్యుని యర్థశాస్త్రమునఁగాని వాత్స్యాయనుని కామశాస్త్రమునఁగాని యీ యధ్యాత్మప్రసక్తి గానవచ్చుచున్నది. ఇటులనే శబ్దసాధుత్వాసాధుత్వములను బ్రధానముగఁ జర్చించి నిర్ణయింపఁ గడఁగిన పాణినీయమునకు స్థూలదృష్టితోఁ జూచినచో నధ్యాత్మ విచారమునఁ దావులేకున్నను బాణిన్యాది మునిత్రయము దమ గ్రంథమునం దీతత్త్వము సూక్ష్మముగ సూచించి తరువాతి వైయాకరణుల చర్చలకు మంచి యవకాశము నొసగిరి. వైయాకరణులు తమ యాత్మతత్త్వమును స్ఫోటబ్రహ్మరూపముగా నిరూపించిరి—

"అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్।
వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతో యతః"

(వాక్యపదీయే బ్రహ్మకాండే)

ఇందు సకల జగత్ప్రక్రియ దేనివలనఁ గల్గుచున్నదో యట్టి యర్థభావముతో వివర్తించు బ్రహ్మము అక్షరమును అదిని ధనరహి

తము నను శబ్దతత్త్వమే యని చెప్పఁబడియెను. ఇట్టి శబ్దమే "స్ఫుట్యతే౽వ్యజ్యతే వర్ణైః ఇతిస్ఫోట"యను వ్యుత్పత్తిచే 'స్ఫోట' నామము నందినది. ఉచ్చారణ సమనంతరకాలముననే నశించు స్వభావముగల వర్ణములచే నభివ్యక్తమై యర్థస్ఫురణమును గలుగఁ జేయు నిత్యశబ్దరూపమే యీ స్ఫోటమనియు నియ్యది యనేక వర్ణ వ్యక్తులచే నభివ్యక్తమగు నిత్యజాతి రూపమనియుఁ జెప్పఁబడియెను. ఎట్లన—'ధేనువు' అనెడి వర్ణసమూహమునందలి తొలి ధకారము తదనంతరమగు ఏకారోచ్చారణ కాలమున నశించుచున్నది. అట్లే ఏకారము నకారోచ్చారణ సమయముననను నకారము కారోచ్చారణ కాలముననను నశించుచుండ నంత్య వర్ణోచ్చారణా నంతరమునఁగలు గోరూపమగు నర్థజ్ఞానము దేనివలనఁ గలుగఁజేయఁ బడుచున్నదని యాశంకించుకొని యనన్తర వర్ణోచ్చారణ సమయముననే నశించు వర్ణములకు యుగపత్ స్థితి లేకపోవుటచేత వర్ణము లెంతమాత్రము గోరూపార్థమును బోధింపఁజాలవని నిర్ణయించి నశ్వరములగు వర్ణములచే నభివ్యక్తమై వర్ణాతీతమై యర్థాభివ్యక్తిని గలుగఁ జేయు నిత్యమగు శబ్దము ఒండుగలదనియు నయ్యది జాతి రూపమే యనుచు 'స్ఫోటమ'ని వ్యవహరింప బడుచున్నదని చెప్పఁబడినది. ఈ స్ఫోటము దాను నశ్వరములగు వర్ణవ్యక్తులచే స్ఫుటముచేయబడుచు నిత్యమై, మఱలఁ దాను ఇతరమగు నర్థమును స్ఫుటము చేయుచుండుటచే నిద్దానికి నుభయవిధముల 'స్ఫోట' శబ్దము తగియున్నది. ఇదియే నిత్యశబ్దము. దీనినిబట్టియే వైయాకరణులకు శబ్ద నిత్యత్వ వాదులని వ్యవహారము గల్గినది. ఇట్టి నిత్యమగు శబ్దబ్రహ్మమే గుణరూప ప్రకృతిచేఁ బదార్థరూపమున వివర్తమగుచున్నదని వైయాకరణుల సిద్ధాన్తము. దీనినే పాణిని మహర్షి తన యష్టాధ్యాయి యందు ఆరంభముననను అంతముననను సూచించియున్నాఁడు. ఎట్లన— "వృద్ధిరాదైచ్" అని బ్రహ్మపర్యాయ వాచియగు (బృహి—వృద్ధౌ) వృద్ధి శబ్దప్రయోగముచే బ్రహ్మమును స్మరించి యనన్తరము ప్రకృతి రూపగును గుణమును "అదేఙ్గుణ" యనియు నట్టి బ్రహ్మప్రకృతులే యర్థభావ వివర్తమునకుఁగారణ మని "ఇకోగుణవృద్ధీ"యనియు శాస్త్రాదియందుఁ ప్రథమ ద్వితీయ తృతీయసూత్రములను స్మరించి సూచించి యున్నాఁడు. అట్లే యష్టాధ్యాయీ చరమసూత్రమగు "అ అ" యను దానిచే అర్థస్వరూప మంతయుఁ బ్రకాశ స్వరూపుడగు పరమేశ్వరునియందే పరిసమాప్తమగునని సూచింపఁ బడియె. "అక్షరాణామకారో౽స్మి" యను భగవత్స్మృతి వలనను, "అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమేశ్వరః" అను శిష్టస్మృతివలనను అకారము బ్రహ్మస్వరూపము. అద్దానియందుఁ దన శాస్త్రము నంతమ పాణినిసమాప్తము గావించె నని దీనివలన స్పష్టమగుచున్నది. ఇట్లే శబ్ద ప్రపంచమునకు మూల భూతములగు ధాతుగణమును బఠింపనెంచి బ్రహ్మపర పర్యాయమగు సత్తారూపార్థముతో నొప్పు "భూ-సత్తాయాం" అను వచనముతోఁ బాణిన్యాచార్యుఁడు ధాతుపాఠము నారంభించెను.

ఇటులనే వార్తికకారుఁడు గూడ-"వర్ణజ్ఞానం వాగ్విషయో యత్రచ బ్రహ్మ వర్తతే" "సిద్ధే శబ్దార్థసంబంధే" అనువార్తిక పాఠములందు వాగ్విషయమున బ్రహ్మగలదనియు శబ్దము సిద్ధరూపమున నిత్యరూపమనియు సూచించియున్నాఁడు.

తతః పతంజలి భగవానుఁడున్న నో—"అథగౌరిత్యత్ర కః శబ్దః" అని యాశంకించి యనేక వికల్పములను జేసి నిరాకరించి తుదకు "కస్తర్హి శబ్దః" అని ప్రశ్నించి—"యేనోచ్చారితేన సాస్నా లాంగూల ఖురవిషాణినాం సంప్రత్యయో భవతి సశబ్దః" యని సమాధానము చెప్పెను. దీనికిఁ గైయటుఁడు "వైయాకరణాః వర్ణవ్యతిరిక్తస్య పదస్య వాక్యస్యవా వాచకత్వ మిచ్ఛన్తి వర్ణానాం ప్రత్యేకం వాచకత్వే ద్వితీయాది వర్ణోచ్చారణా నర్థక్య ప్రసంగాత్తే"ని పాతంజల శబ్దమునకు స్ఫోటరూపమగు నిత్యశబ్దమని వ్యాఖ్య గావించియున్నాఁడు.

"సో౽యమక్షర సమామ్నాయో వాక్సమామ్నాయః పుష్పితః ఫలితశ్చంద్రతారకవత్ ప్రతిమండితో బ్రహ్మరాశిః" అని యక్షర సమామ్నాయ మంతయు బ్రహ్మరాశి యని వర్ణించి యున్నాఁడు. మఱియు "కింపునర్నిత్యః శబ్దః ఆహోస్విత్ కార్యః" అని యుపక్రమించి శబ్దనిత్యత్వమును బ్రతిష్ఠించెను. స్ఫోటరూపమగు శబ్దముగాక వర్ణరూపమగు శబ్దము నిత్యముకాదుగదా!

ఇట్లు మునిత్రయ సూచిత శబ్ద నిత్యత్వముననే అనఁగా శబ్ద బ్రహ్మపరపర్యాయ స్ఫోట బ్రహ్మవాదమునే వాక్యపదీయకారాదులు సవిస్తరముగ నిరూపించిరి. భర్తృహరి తనవాక్యపదీయమున జాతిసముద్దేశమునందు పరమార్థ సంవిల్లక్షణ సత్తారూపమగు జాతియే స్ఫోటరూపమని నిర్వచించియున్నాఁడు. శ్రీ శంకరభగవత్పాదుఁడు తన శారీరక మీమాంసాభాష్యమున దేవతాధికరణము నందు— "శబ్ద ఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం." అను (వ్యా. సూ. 1-3.28) సూత్ర వ్యాఖ్యా ప్రసంగమున "వర్ణా ఏవతు శబ్దః ఇతి భగవానుపవర్షః" అని పాణిన్యాదులకుఁ గూడ ఆచార్యుఁడుగాఁ గీర్తింపఁబడు నుపవర్షుని మతమును జెప్పియున్నాఁడు. దీనిని బట్టి యీ వైయాకరణస్ఫోటవాదము పాణినీయోత్పత్తి సహసంభూత మేయని చెప్పక తప్పదు. ఈవాదము లన్నింటను గ్రోడీకరింప నష్టవిధములగు స్ఫోటవాదములు-వర్ణ,పద,వాక్య, అఖండపద, అఖండ వాక్య, వర్ణ, పద, వాక్యజాతి స్ఫోటములను నామములతో వెలయు చున్నట్లును, ఈయెనిమిదియు సిద్ధాన్తములే యైనను అందు అఖండ వాక్యస్ఫోటము వాక్యజాతిస్ఫోటము అనునవియే పరమసిద్ధాన్తభూతములైనట్లును పాణినీయుల తుది సిద్ధాన్తము. ఈవిషయమునే యర్వాచీన వైయాకరణులు—

"అనేక వ్యక్త్యభివ్యంగ్యా జాతిః స్ఫోట ఇతి స్మృతా
కైశ్చిద్వ్యక్తయ ఏవాస్యా ధ్వనిత్వేన ప్రకల్పితాః,
సత్యాసత్యౌతు యౌ భాగౌ ప్రతిభావం వ్యవస్థితౌ
సత్యం యత్ తత్రసాజాతిః అసత్యా వ్యక్తయోమతాః.
ఇత్థం నిష్కృష్యమాణం య చ్ఛబ్దతత్త్వం నిరంజనమ్,
బ్రహ్మైవేత్యక్షరం ప్రాహుః తస్మై పూర్ణాత్మనే నమః."
(వై. భూ. సార 70,71,72)

అని నిరూపించిరి. ఇట్లు స్ఫోటబ్రహ్మమువలననే పరమ పురుషార్థలాభము గలుగుచుండ ఈ యష్టాధ్యాయీ నిర్వర్త్యమగు నీ యసత్య శబ్దప్రక్రియారూపమగు నాయాసము వ్యర్థమే గదా యని

యూ లోపించుకొని యీ శబ్దబ్రహ్మతత్త్వనిధి గనుమునకు నీ ప్రక్రియా విశేషము ఉత్తమ సాధనమని చెప్పఁబడినది.

పంచకోశాది వర్తస్యాత్ కల్పనైషా సమాశ్రితా
ఉపేయప్రతిపత్త్యర్థా ఉపాయాః పరికల్పితాః" ఇతి

అన్నబ్రహ్మభావనమునకు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానందమయ రూప పంచకోశములు బ్రహ్మముగాఁ జెప్పఁ బడి యుపాసనము చే వరుణపుత్త్రుఁడగు భృగువు "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" యనెడి వాక్యముచేఁ బ్రతిపాదింపఁబడిన సత్యబ్రహ్మమును దెలిసి కొనినట్లే యీ యుపాధ్యాయీ ప్రతిపాది తాసత్యశబ్దప్రక్రియా ప్రతిపత్తిద్వారా నిరంజనంబగు శబ్దబ్రహ్మతత్త్వమును బొందఁగలరనియు నందుచే నీ ప్రక్రియావిశేషము శబ్దబ్రహ్మప్రతిపత్తికి అసాధారణోపాయముగా గ్రహింపవలయుననియు నిర్వచింపఁబడెను. ఈయర్థము నే భర్తృహరి—

"తద్వార మపవర్గస్య, వాఙ్మలానాం చికిత్సితమ్।
పవిత్రం సర్వవిద్యానా మధివిద్యం ప్రకాశతే।
ఇదమాద్యం పదస్థానం సిద్ధిసోపాన వర్త్మనామ్।
ఇయం సాఽమోక్షమాణానా మజిహ్మా రాజపద్ధతిః।

"...... ప్రాప్తిత ద్వస్యాస్యం పేస ...... సర్వతిః"
అని చెప్పియున్నాఁడు.

ఇట్టి యీ పాణినీయుల సిద్ధాన్తము కోణాదాదులవలె నొక నిషద సిద్ధాన్తమునకు అత్యన్తము దూరవర్తి గాక దాని యడుగు జాడలలోనే మెలఁగుటచే వైయాకరణులు వైదికప్రామాణ్యమును శిరసావహించు నన్యశాస్త్రకారులకుఁగూడ మాననీయులైరి. కావుననే— "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి" అనియు "తత్ర ప్రథమే విద్వాంసో వైయాకరణాః" "బుధైః వైయాకరణైః ప్రధానీభూత స్ఫోటరూపవ్యంగ్య వ్యంజకస్య శబ్దస్య ధ్వనిరితి వ్యవహారః కృతః" అనియు అలంకారిక శిరోమణులగు మమ్మటాదుల సన్మానలకుఁ బాత్రులైరి.

ఇట్లు పాణినీయము ఆరంభముననే మానవుని పాఠించునదిత ములును మహేశ్వరానుగ్రహాలబ్ధములును నగు చతుర్దశసూత్రతతిలో నారబ్ధమయి యపారములగు వైదిక లౌకిక సారస్వత పారావారముల మథించి సమానశాస్త్రములలో నుత్తమాదరమునంది తుదిని బ్రహ్మప్రాపకమై మహీయమానమగుచు భారతీయోత్తమ శాస్త్రములలో నొక యున్నత పదము సంపాదింపఁగల్గెను.

# సాలెగూడు

శ్రీ సంగరాజు లింగమూర్తి

చంద్రం నడుస్తున్నాడు.

అతను నడుస్తుంటే భూమి కదులుతున్నట్లనిపించింది. ఇరు ప్రక్కలా వున్న భవనాలు నడుస్తున్నట్టు, ఆకాశం నిటారుగా నిలబడినట్టూ తోచింది. అవిశ్రాంతంగా పరుగెత్తే కాలచక్రంలా వుండను కున్నాడు సిమెంటురోడ్డు. వచ్చేపోయే కార్లకు, రిక్షాలకు, సైకిళ్ళకు దారులిచ్చే ట్రాఫిక్ పోలీసు అనంతకోటి సంతానాన్ని లోకం మీదికి వదులుతున్న సృష్టికర్తలా వున్నాడనుకున్నాడు.

ఏవో కేకలు వినిపించి ప్రక్కకుతిరిగి చూశాడు చంద్రం.

పేవుమెంటుమీద బస్సుకోసం వేచివున్న గుమాస్తా భాయీని కాబూలీవాలా వడ్డీ డబ్బుకోసం హంగామాచేస్తూ, అతని పరపతిని నడిరోడ్డుమీద దోపిడీ చేస్తున్నాడు.

జీతంవచ్చిన నాల్గోనాడే జేబు ఖాళీఅయి అప్పిచ్చే దాత కోసం వెతుకుతున్న మరో గుమాస్తాముందు 'దర్మం సేయండి బాబూ' అని మొరపెట్టుకుంటున్నాడు కుంటటం అలవాటు చేసుకున్న బిచ్చగాడు.

సుష్టుగా హోటల్లో మెక్కిందంతా అరక్క బొజ్జనిమురుకుంటున్న ఆసామీముందు ఒక బిచ్చగత్తె చేయిజాపితే, తమలంసేవిస్తున్న ఆ బొజ్జమనిషి మీసంగా విల్సుసిగరెట్ పొగవదులుతూ ఆ యౌవనపు బిగువును కళ్ళతో కొల్లగొడుతున్నాడు—ప్రక్కనే జేబు కొస్తున్న కత్తెర దొంగను గమనించకుండా.

కాస్త ఎడంగా బస్సుకోసం నిలుచున్న కాలేజీ పడుచు మీద బాణాల్లా దూసుకువచ్చి పడుతున్నాయి దారిన పోయే బానయ్యల చూపులు.

తన పరువును నడిరోడ్డుమీద దోపిడీ చేస్తున్నందుకు అభిమానంతో కుంచించుకు పోతున్న గుమాస్తా భాయీ, అప్పిచ్చే దాతకోసం అన్వేషిస్తూ నిలబడిన మరో గుమాస్తా, బస్సుకోసం ఎదురుచూస్తున్న కాలేజీ పడుచూ ఒకకోవకు చెందినవారుగా అనిపించింది చంద్రానికి.

వడ్డీడబ్బుకోసం నోరు పారేసుకుంటున్న కాబూలీవాడు, కుంటటం అలవాటు చేసుకున్న సోమరి బిచ్చగాడు, నీతికి ఇనుపతెరలు దించిన ఘరానా బొజ్జమనిషీ, యౌవనపు బిగువును కావాలని ప్రదర్శిస్తూ యాచిస్తున్న బిచ్చకత్తె, బొజ్జవాణ్ణి పొంచివున్న కత్తెరదొంగ, దారినపోయే బానయ్యలు ఒకకోవకు చెందినవారుగా చంద్రానికి పొడగట్టారు.

'ఏమిటీ సమాజం ?' అని ప్రశ్నించుకున్నాడు.

ఉన్నవాడు మధ్యతరగతి వాడిని పీడిస్తున్నాడు. లేనివాడు ఉన్నవాడి ననుకుంటున్న మధ్యతరగతివాణ్ణి బాధిస్తున్నాడు. స్వస్త్రీలను విజ్ఞానమణులను చేయలేని బానయ్యలు పరాయివాన్ని నడిబజారులో చూపులతో దాహం తీర్చుకుంటున్నారు.

ధర్మం మూడుకాళ్ళ ముసలమ్మలా వుందనుకున్నాడు చంద్రం.

చంద్రం నడుస్తున్నాడు.

రిక్షాలు, కార్లు, సైకిళ్లు అతణ్ణి దూసుకుపోతున్నాయి. అతని బుర్రలో ఆలోచనలు పరుగులుతీస్తున్నాయి.

ఉత్తరం డబ్బాలో వేసిరమ్మంటే "తలనొప్పిగా వుంది-టీ ఇప్పించండి సార్" అంటాడు బంట్రోతు. ఆరునెలల ఇంక్రిమెంట్లు రావాలి చూడమంటే, స్వజాతీయుడైన అకౌంట్సు సెక్షన్ గుమాస్తా నేరుగా లంచం అడగలేక, "రేపు తాజ్‌లో డిన్నరిస్తావా?" అంటాడు. ప్రమోషన్‌కోసం అధికారిని వేడుకుంటే "సరే-చూద్దాం...రేపటినుంచి తీరుబడి చేసుకొని ఓ గంటసేపు మావాడికి ప్రైవేటు చెబుతావుకదూ?" అని ఆదేశిస్తాడు.

టీ ఇప్పించమని ప్రాధేయపడిన బంట్రోతు, డిన్నర్‌కోసం సాధ్వరించిన అకౌంట్సు గుమాస్తా, ప్రైవేటు చెప్పమని ఆదేశించిన అధికారి త్రిశంకు స్వర్గంలాంటి మధ్యతరగతికి చెందినవారేగా అనుకున్నాడు చంద్రం.

"ధనవంతులు మనల్ని వంచిస్తున్నా"రంటారు మధ్యతరగతి జనం.

"ధనవంతులు మా నెత్తురు తాగేస్తున్నా" రంటారు బీదవాళ్లు.

"నిజంగా ఎవరు ఎవరిని వంచిస్తున్నారు? ఎవరు ఎవరి రక్తాన్ని తాగేస్తున్నారు?" అని ప్రశ్నించుకున్నాడు చంద్రం.

చంద్రం నడుస్తున్నాడు.

రిక్షాలు, కార్లు, సైకిళ్లు అతణ్ణి దూసుకుపోతున్నాయి. అతని బుర్రలో ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి.

"హల్లో...ఎక్కడికి? ఆలోచనలతో పరాగ్గా నడుస్తున్న చంద్రాన్ని ఎవరో పలుకరించారు. చంద్రం ఆగిపోయాడు.

"ఆఫీసు నుంచి ఇంటికేనా?" ఆ వ్యక్తే మళ్ళీ ప్రశ్నించాడు. అవునన్నట్టు తలూపాడు చంద్రం.

"ఒకసారి మాఇంటికి రా బ్రదర్ ... మా తమ్ముడికి పరీక్షలొచ్చిపడ్డాయి. కాస్త నోట్సుచెప్పి పోదువుగాని" అన్నాడా వ్యక్తి.

"దానికేముంది—వస్తాలే" అన్నాడు చంద్రం.

అతను రిక్షాను కేకవేశాడు. ఇద్దరు రిక్షావాళ్ళు పరుగెత్తి వచ్చారు. అతను తను పోవాల్సిన గమ్యం చెప్పాడు.

"పదణాబుసార్ !"

"రూపాయక్కర్లా...ఇంతాక అయిదణాలకే వచ్చాను."

"మూడు మైళ్ళుంది, ఎవరొస్తారు సార్ — ఎనిమిదణాలివ్వండి"

"ఆరణాలివ్వండిసార్" రెండో రిక్షా వాడందుకొన్నాడు.

రిక్షావాళ్ళిద్దరూ తిట్టుకున్నారు. ఆ వ్యక్తి రెండో రిక్షాలో ఎక్కేశాడు.

ఆ వ్యక్తి రిక్షావాడి నెత్తురు తాగేస్తున్నట్టుగా బాధపడ్డాడు చంద్రం !

అతను వెళ్ళాల్సిన ప్రదేశానికి పదణాలు తక్కువే. మూడు మైళ్ళు. సగందూరం రిక్షాదిగి లాక్కుపోవాలి. మొదటి రిక్షావాడు న్యాయంగానే అడిగాడు. ఆ వ్యక్తి వాణ్ణి బుకాయించాడు. అంత వరకూ బేరం దొరకని రెండో రిక్షావాడు అరణాలకే సిద్ధమయ్యాడు.

"రిక్షావాడు రిక్షావాణ్ణి మోసగించాడు. వాళ్ళిద్దరినీ తన మిత్రుడు వంచించాడు" అనుకున్నాడు చంద్రం.

రిక్షావాళ్ళల్లో పోటీ మనస్తత్వం కలిగించి తను లాభపడ్డాడు త్రిశంకుస్వర్గపు మనిషి.

"తన మిత్రుడు ఎంత స్వార్థపరుడు !" అనుకున్నాడు చంద్రం.

చంద్రం నడుస్తున్నాడు.

విసుగూ విరామం లేకుండా పరుగెత్తుతున్నాయి మోటారు కార్లు, రిక్షాలు, సైకిళ్ళు అతణ్ణి దూసుకుపోతున్నాయి. అతని బుర్రలో ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి.

"తమ్ముడికి నోట్సు చెప్పడానికి రమ్మన్న పెద్దమనిషి అంత దూరం ఎలా వస్తాననుకున్నాడు ? తను రాలేనని కచ్చితంగా ఎందుకు చెప్పలేక పోయాడు ?" అని ప్రశ్నించుకున్నాడు చంద్రం.

"తను అతనింటికి పోయిరావాలంటే జేబులో రూపాయి వుండాలి. జేబులో ఆ మాత్రం ఆదరువే వుంటే కవిసమ్మేళానికి దర్జాగా రిక్షాలోనే వెళ్ళేవాణ్ణిగా......లేపు రావడానికని అతణ్ణి రూపాయి ఎందుకు అడగలేక పోయాడుతను ?"

ముఖమాటం అడ్డు వచ్చింది.

రూపాయి అడిగితే చులకనైపోతాననుకున్నాడు.

"నీ వృత్తి బూర్జువావి" ఒకప్పుడో మిత్రుడన్న మాట జ్ఞాపకం వచ్చింది చంద్రానికి.

"తను లేనివాడినని చెప్పుకోలేడు. ఉన్నవాడినని నటిస్తాడు. దీన్నే బూర్జువా తత్వమంటారు కాబోలు".

'మింగ మెతుకు లేదుకాని, మీసాలకు సంపంగి నూనె' అన్న నానుడికి రంగుపూసి బూర్జువాతత్వ మంటున్నా'రను కున్నాడు చంద్రం.

నడుస్తున్న చంద్రం హఠాత్తుగా ఆగిపోయాడు — నోరు తెరుచుకొని, వెనక్కి తిరిగి కళ్ళప్పగించి చూస్తూ.

"రాఘవులూ" అని పిలిచాడు. అతని పిలుపు వినిపించిందో లేదో గాని చంద్రంవంక ఎవరూ తిరిగైనా చూడలేదు. చూసీ చూడనట్టూ, వినీవిననట్టూ వెళ్ళిపోయాడు రాఘవులు. రాఘవుల నిర్లక్ష్యానికి చంద్రానికి కోపంరాలేదు. "మానవజాతి రానురాను ఎంత అవిశ్వాసంగా తయారవుతున్నది" అని గొణుక్కున్నాడు.

కష్టసమయంలో రెండుమూడుసార్లు రాఘవుల్ని ఆదుకున్నాడు చంద్రం. తన పలుకుబడితో ఉద్యోగం ఇప్పించాడు. బ్రతకడం నేర్చుకున్న రాఘవులు ఉద్యోగంలో అంచలంచలుగా పైకి వెళ్ళిపోయి నాలుగురాళ్ళు కూడబెట్టాడు.

"రాఘవులకు తనతో ఇప్పుడు పనేముంది. తన దగ్గర పసోయ మడుగుతానని తప్పించుకుపోయాడు" అనుకున్నాడు చంద్రం.

ఏదో విచిత్రమైన గొంతు వినిపించేప్పటికి చంద్రం పక్కకు తిరిగి చూశాడు.

ఎవరో పిచ్చివాడు పేవుమెంటుమీద నిలబడ్డాడు. దట్టంగా పెరిగిన గడ్డం, వాలికలైన బట్టలు వికారంగా వున్నాడు. వాడిచుట్టూ కొందరు చేరి విడ్డూరంగా చూస్తున్నారు. పిచ్చివాడు ఒక్కసారి పగలబడినవ్వాడు.

కోతిలా ముఖంపెట్టి, 'కిచకిచ' మన్నాడు. నక్కలా కూత పెట్టాడు. కోకిలలా గానంచేశాడు. అంతలోనే రామచిలుకలా అరిచాడు.

జనం ఆశ్చర్యంగా చూస్తున్నారు. చంద్రం పెడగా నిలబడ్డాడు. పిచ్చివాడు రెండునిమిషాలు గాలిపీల్చుకొని, కుక్కలా అరిచాడు. గుర్రంలా సకలించాడు. గాడిదలా ఓండ్రపెట్టాడు. సింహంలా గర్జించాడు.

"రేడియోవాళ్లు ఈ పిచ్చివాణ్ణి స్టాఫ్ ఆర్టిస్టుగా తీసుకుంటే ఎంత బాగుంటుం"దనుకున్నాడు చంద్రం.

రేడియోకి ఇటువంటి పిచ్చివాళ్ళు పనికిరారు. కళాకారుని ముద్ర పిచ్చివాడికి ఎలాపడుతుంది ? ఆ ముద్రపడందే రేడియోవాళ్లు ఎలాగు రిస్తారు ? తనే సమాధానం చెప్పుకున్నాడు.

పిచ్చివాడు జంతువుల అరపులుమానేసి ఉపన్యాసం మొదలు పెట్టాడు. ఖర్మంచాలక పిచ్చివాడయ్యాడుగాని ఒకపార్టీకి నాయకుడు కావాల్సింది. ఆ పిచ్చివాడి ఉపన్యాసంచుట్టూ చేరినవారందరినీ ఆకర్షించింది. అక్కడ చేరిన వారందరూ మధ్యతరగతివాళ్ళే ! పిచ్చివాడిమాటల్ని యథాతథంగా వ్రాస్తే దేశద్రోహి నంటారు వన్ను. అయితే పిచ్చివాణ్ణి పోలీసు లెందుకు అరెస్టు చెయ్యలేదంటారు. అదంతా పిచ్చివాగుడు క్రింద జమకట్టి వుంటారు. లేదా పిచ్చివాడు జంతువుల అరపులమధ్య ఉపన్యాసం కొనసాగించి వాళ్ళను మోసగిస్తున్నాడేమో ! అసలు పిచ్చివాడవునో కాదో! కాని చూసినవారు పిచ్చివాడని ఘంటాపథంగా చెప్పేట్టుగా వుంటాడు.

భద్రాచలం వరదప్రమాదాలు, గోదావరి వరదలు, తెలంగాణలో కరువు, రైలు ప్రమాదాలు, కాశ్మీరుసమస్య, ఆర్థికమంత్రి విదేశాలకు అప్పుకోరడం – ఇవన్నీ పిచ్చివాడి ఉపన్యాసంలోని భాగాలు. ప్రణాళికలను విమర్శించాడు. ప్రభుత్వ విధానాన్ని ఖండించాడు. విప్లవాన్ని ఆహ్వానించాడు. ప్రభుత్వం మారాలన్నాడు. ఉపన్యాసమంతా సగం తెలుగులో సగం ఇంగ్లీషులో సాగింది. ఉన్నట్టుండి పిచ్చివాడు త్యాగరాజకీర్తన అందుకున్నాడు. అది పూర్తికాకుండానే "రోజులు మారాయి" పాట ప్రారంభించాడు.

"ఇతను పిచ్చివాడంటే ఎలానమ్మను? జీవిత పోరాటంలో ఓడిపోయి మనస్సు చెడగొట్టుకొని వుంటాడు." అనుకున్నాడు చంద్రం.

ఆకలివేస్తున్నదని పిచ్చివాడు యాచన ప్రారంభించాడు. ఈ సంగతిని అంతకుముందే పసికట్టి కొందరు వెళ్ళిపోయారు.

"పిచ్చివాడికైనా ఆకలిదప్పులు తప్పవుగా. ఇంత వినోదం కలిగించాడు అందరూ తలో కాణి యిస్తే ఇంతలోనే దరిద్రంవచ్చి పడుతుందనుకున్నారేమో" అనుకుంటూ ఒక అణా పిచ్చివాడి చేతిలో వేసి చంద్రం బయలుదేరాడు.

చంద్రం నడుస్తున్నాడు.

ఇప్పుడతను నడుస్తున్న ప్రదేశం అంత జనసమ్మర్దవంతమైంది కాదు. పెనకటిలా కార్లు ఎక్కువగా పరుగెత్తడం లేదు. రిక్షాలు, కార్లు దూసుకు పోవడంలేదు.

"ఎవరు ఎవరిని వంచిస్తున్నారు.? ఎవరు ఎవరి రక్తం తాగుతున్నారు?" అన్న ప్రశ్న తిరిగి జ్ఞాపకం వచ్చింది చంద్రానికి.

"నైతికంగా దిగజారిపోతున్న దెవరు?" మరో ప్రశ్న ఎదురైంది చంద్రానికి.

అతని బుర్రలో మళ్ళీ ఆలోచనలు చెలరేగాయి.

ప్రతివాడిలోనూ స్వార్థం పడగలెత్తింది. తనను తానే మోసగించుకుంటున్నాడు. తోటివాడిని వంచిస్తున్నాడు. శత్రువెక్కడో లేడు. తన శత్రువు తనలోనే వున్నాడు. మధ్యతరగతి ప్రజ ఇంతగా దిగజారడానికి కారణం? ఔన్నత్యాన్ని ఎందుకు పొందలేకపోతున్నారు?

చంద్రం బుర్ర వేడెక్కి తలనొప్పి వచ్చింది.

ఎదురుగ్గా అయ్యంగారి హోటల్ ఆహ్వానించింది.

జేబులు తడుముకున్నాడు.

రెండు చిల్లికాన్లు బైటికివచ్చాయి.

చంద్రం నవ్వుకున్నాడు.

ఆరెండు చిల్లికాన్లతో పాన్‌కొని వేసుకొని బయలుదేరాడు.

"తనెందుకు పాన్ వేసుకున్నట్టు?" అని ప్రశ్నించుకున్నాడు.

"నలుగురూ తను హోటలుకు వెళ్లివచ్చినట్టు భ్రమించాలని పాను వేసుకోడం దేనికి? ... తను దరిద్రుడిగా ఎవరూ భావించ కూడదని తెలిసితానే వంచించుకుంటున్న తత్వం ఎప్పుడు పోతుంది? అన్న ప్రశ్నకు వెంటనే సమాధానం చిక్కలేదు చంద్రానికి.

ప్రళయం రావాలి.

శివుడు నృత్యం చేయాలి.

భూమ్యాకాశాలు దద్దరిల్లాలి.

సముద్రాలు పొంగాలి.

గంగా గోదావరుల కట్టలుతెగాలి.

కృష్ణ నల్లువలై పారాలి.

ఆప్రళయంలోంచి క్రొత్తమనిషి పుట్టుకరావాలి.

చంద్రానికి తల తిరుగుతున్నట్లయింది. పడిపోతానేమో ననుకొని, బొటనవ్రేళ్లతో భూమిని అదిమిపట్టి నిలుచున్నాడు.

"ఏమిటి తనింత భయంకరంగా ఆలోచిస్తున్నాడు" అని ప్రశ్నించుకున్నాడు.

"నూతన సమాజ నిర్మాణానికి బాటలు వేసుకుంటున్నాము. దేశం సశ్యశ్యామలంగా వుంటానికి ప్రణాళికలు వేసుకుంటున్నాము. నీకు జాతిమీద విశ్వాసం లేకపోతే ఎట్లా?" అన్న భజనపరుడి మాటలు స్ఫురణకు వచ్చాయి చంద్రానికి.

"ఎన్ని కోట్లరూపాయలు కేటాయించి, ఎన్ని ప్రణాళికలు వేస్తే జాతిలో నీతి నిజాయితీలు పెరుగుతాయి? ప్రభుత్వం ఎన్ని సినిమాలు తీయిస్తే మానవత్వం మనిషిలో మేలుకుంటుంది? ఎంతమంది మేధావులు ఎన్ని పథకాలువేస్తే జాతిలో ఇన్ని తెగలు లేకుండా ఒక్క త్రాటిమీద నడవగలుగుతారు?"

"హల్లో...రండి...రండి..." అన్న మాటలతో చంద్రం ఆలోచనలు చెదిరిపోయాయి.

"ఈపాటికి సభ ప్రారంభమై వుంటుందనుకున్నాను" అన్నాడు చంద్రం.

"ఇంకో అరగంటలో అధ్యక్షులు వచ్చేస్తారండీ...వారు రాగానే ప్రారంభించడమే...రండి...లోపల కూర్చుందురుగాని" అన్నాడు కార్యకర్త.

చంద్రం లోపలికి వెళ్ళాడు. అప్పటికే అక్కడ కొందరు కవులు అధివసించి వున్నారు. 'ఒహో' అంటే 'ఓహో' అని ఒకరి నొకరు చిరునవ్వులతో పలుకరించుకున్నారు. ఆ పలుకరింపుల్లో ఆప్యాయత లేదు. ఆ చిరునవ్వులు సహజసిద్ధమైనవి కావనుకున్నాడు చంద్రం. చంద్రాన్ని చూసేప్పటికి ఒక కవికిశోరం లేచి వచ్చి ఆలింగనం చేసుకున్నాడు. "లోపల ఎంత కుళ్ళుపెట్టుకుని, పైకి ప్రేమ ఒలకపోస్తున్నా" డనుకున్నాడు.

చంద్రం ఓ ప్రక్కగా కూర్చున్నాడు.

రికార్డుల సంగీతం, చెవుల్ని హోరుచేస్తున్నది.

తానొక మహాకావ్యం వ్రాయబోతున్నట్టు—దానికి ఇండియా ఉపాధ్యక్షుడు పీఠిక వ్రాయడానికి ఒప్పుకున్నట్టూ చెబుతున్నాడు ఒక మహాకవి.

"శ్రామికవ్యథ తప్పిస్తున్నదంతా, ఆకలి కవిత్వం, ప్రేమకవిత్వం తప్ప ఆధ్యాత్మికత ఎక్కడా కనిపించడం లేదు కదా!" బెంగపడిన ఓక కవి శార్దూలం తన భక్తుడితో అంటున్నాడు.

"కవిత్వానికున్న పవిత్రత్వాన్ని చెడగొడుతున్నారు ఆధునికులు" ఒక విమర్శకుడు వాపోతున్నాడు.

"ఈ కవిసమ్మేళనానికి ఉంగరాల జుట్టాయన రాకపోతే జయం మనదే" అంటున్నాడు ఒక కవిసింహ బిరుదాంకితుడు.

అఁ...ఆ ఉంగరాలజుట్టు కవిలో కవిత్వమేముందండీ—వాబొంద. సంగీతంతో జనాన్ని మోసగిస్తున్నాడు. మీ ముందు ఏకవి నిలవగలడు! ఈనాటివిజయం మీదేలెండి" అంటున్నాడు ప్రక్కవాడు.

వాళ్ళ అమాయకత్వానికీ, ఈర్ష్యాలుతకూ నవ్వుకున్నాడు చంద్రం.

వీళ్ళంతా మేధావులు. జాతిని మేల్కొల్పే వైతాళికులు.

"ఏదిసత్యం?...ఏదసత్యం—ఓ మహాత్మా!" రికార్డు సంగీతం కర్ణపుటాల్లో గింగురుమంటున్నది.

ఎవరి క్కావాలాపాట?

ఎవరికొక్కావాలా మీమాంస?

అక్కడ కూర్చున్నవారిలో సంచలనం కలిగింది. ఏమిటోనని తిరిగిచూశాడు చంద్రం. అధ్యక్షులు వస్తున్నారు. ఒక కార్యకర్త దారి చూపిస్తున్నాడు. ఇద్దరు కార్యకర్తలు భక్తిప్రపత్తులతో ప్రక్కను నడిచే అంగరక్షకుల్లా వస్తున్నారు.

అధ్యక్షుడు సామాన్యుడు కాడు.

దేశాన్ని ముందుకుతీసుకుపోతున్న మంత్రి పుంగవుడు.

మంత్రిగారి రాకతో సభాస్థలి జనంతో నిండిపోయింది. ఎన్నడూ కవి సమ్మేళనాలకురాని పత్రికా విలేఖరులు ఫోటోగ్రాఫర్లు అక్కడ హాజరయ్యారు.

తెలుగు నుడికారం తెలియనివాడు కవి సమ్మేళనానికి అధ్యక్షుడు. రైతు జీవితాల్ని కొల్లగొట్టి ప్రభుత్వందగ్గర నష్ట పరిహారం తీసుకుంటున్న ఒక మాజీ సంస్థానాధిపతి సభా ప్రారంభకుడు.

సభంతా కలియచూశాడు చంద్రం.

సభలో కూర్చున్నవారంతా మధ్యతరగతి జనం. కవిత్వం చదవడానికి వచ్చినవారంతా ఆ తెగకు చెందినవారే!

ఎక్కడికైనా తయారయ్యేది ఈ త్రిశంకు స్వర్గవాసులే!

రికార్డులకు విశ్రాంతి కలిగింది. సభ ప్రారంభమైంది.

మంత్రిగారు సభను వస్తుంటేనే ఒక ఛాయాగ్రాహకుడు క్లిక్ మనిపించాడు. ఆయన వేదికమీదికి ఎక్కుతూంటే మరో ఫోటోగ్రాఫర్ కళ్లు జిగేలుమనేట్టు బొమ్మ లాగేశాడు.

కార్యదర్శి నివేదిక చదవడం ప్రారంభించాడు.

కొంతమంది కవులు తాము చదవబోయేవాటికి తుది మెరుగులు పెడుతున్నారు.

చంద్రం జేబులోంచి కొన్ని కాగితాలు తీశాడు.

"ఎందుకు వ్రాశాడు తానీకవిత్వం?"

"తనను మోసం చేసుకోలేడు."

"జనాన్ని వంచించలేడు."

చంద్రం ఆ కాగితాలను ఛ్రటను చించి ముక్కలుముక్కలు చేసి బల్లక్రిందికి విసిరాడు. ఒక తెలిసిన కార్యకర్త కనిపిస్తే పిలిచి తాను కవిత్వం చదవబోవడం లేదనీ, తన పేరును జాబితాలోంచి తీసేయించవలసిందనీ చెప్పాడు.

"మీరు చదవలేకపోతే ఎట్లా? మీ పేరుమీద కొంతమంది వచ్చారు. క్రొత్తది వ్రాయకపోతే పాతదే ఏదో ఒకటిచదివెయ్యండి" అన్నాడు కార్యకర్త.

"ఇంతమందిలో నిజంగా తన కవిత్వాన్ని అభిమానించేవాళ్లు ఎంతమంది? వాళ్లకు తను ఆశాభంగం కలిగిస్తున్నాడా?" అని ప్రశ్నించుకున్నాడు చంద్రం.

ప్రాత కవిత్వం చదవడం ఇష్టంలేక క్రొత్తది వ్రాసు కొచ్చాడు. ఇప్పుడో క్రొత్త అనుభవం కలిగేప్పటికి ఆ కాగితాలు చించివేశాడు.

కార్యదర్శి నివేదిక చదవడం అయిపోయింది. మరో కార్యదర్శి సందేశాలు చదవడం ప్రారంభించాడు.

ఎవరి క్కావాలీ నివేదికలు?

ఎవరి క్కావాలీ సందేశాలు?

జనానికి కవిత్వం కావాలి.

కార్యకర్తలకు సందేశాలు కావాలి.

కార్యదర్శి నివేదిక లేండే, వారు జరుపుతున్న కార్యక్రమాలు జనానికి ముఖ్యంగా మంత్రిగారికి, మాజీ సంస్థానాధిపతికి ఎలా తెలియాలి. అవి వారికి తెలపండే వివరాలు పొందటం ఎట్లా?

ఇది ప్రచార యుగం.

సభలకు మంత్రులొస్తే ఎంతో ప్రచారం వస్తుంది.

సందేశాలవల్ల తమ గొప్పదనాన్ని చాటుకోవచ్చు.

ఆ సందేశాల్లో భారతాధ్యక్షుడి దగ్గిరినుంచి మ్యునిసిపల్ ఛైర్మన్ సందేశంవరకూ ఉన్నాయి.

అచ్చాఫీసువాళ్ళు ఒక పెళ్ళిపత్రికను కంపోజు చేయించి అవసరమైనప్పుడు తిథి వార నక్షత్రాలు పేర్లుమార్చి వెయ్యి పెళ్ళిళ్ళకు ఆ మేటరునే ఉపయోగించినట్టు, కవులు ఏ వధూవరులకైనా పనికి వచ్చే ఆశీర్వచన పద్యాలు వ్రాసివుంచినట్లు సందేశాలు పంపే పెద్దలంతా ఒకే డ్రాఫ్టును ఎన్ని వేల సందేశాలకు ఉపయోగిస్తున్నారో అనుకున్నాడు చంద్రం.

సందేశాలు చదవడం అయిపోయింది.

కవు లందరినీ వేదికమీదికి ఆహ్వానించారు.

రాజఠీవిని ప్రదర్శిస్తూ ఒక్కొక్క కవే వేదికమీదికెళ్ళి, సహజంగా లోపలవున్న హీనతత్వంవల్ల మంత్రిగారికి వినయంగా నమస్కరించి తమతమ స్థానాల్లో కూర్చుంటున్నారు.

చంద్రం కదల్లేదు.

"చంద్రంగారు కూడా దయచేసి వేదికమీదకి రావాలి" అని కార్యకర్త మైకులో అరిచాడు.

"ఎంత సిగ్గుచేటు! తను దొంగతనం చేస్తున్నట్టు అంతా అనుకుంటారేమో!" అనుకుంటూ చంద్రం వేదికమీదకి వెళ్ళాడు.

కవులు అంతా అదో రకంగా చూశారు చంద్రాన్ని.

మాజీ సంస్థానాధిపతి ప్రారంభోపన్యాసం ప్రారంభించాడు.

కవిత్వమంటే తనకెంతో ఇష్టం. తన సంస్థానంలో ఎందరో ప్రతిభగల కవుల్ని సన్మానిస్తుండేవాడినని, ఇప్పుడు రాజులతోపాటు, మాలాంటి సంస్థానాధిపతులూ, జాగీర్దార్లు తుడిచిపెట్టుకుపోయారు కాబట్టిన్నీ ప్రజలే ఇప్పుడు ప్రభువులు కాబట్టిన్నీ కవుల్ని వారే సన్మానించాలన్నాడు.

"ఎంతటి సత్యాన్ని వక్కాణించాడూ" అనుకున్నాడు చంద్రం.

"నేను కవినికాను. రచయితనీకాను. ఈకవి సమ్మేళనానికి అధ్యక్షస్థానం వహించగల అర్హత నాకులేదు" అని ప్రారంభించారు మంత్రిగారు.

"అయితే తమరు వేదిక దిగవచ్చు" అంది ఓ గొంతుక. జనం గొల్లుమంది. 'ఎవరిదాగొంతు' అనుకుంటూ చంద్రం జనంలోకి చూశాడు. పేవుమెంటుమీద కనిపించిన పిచ్చివాడు అక్కడ ప్రత్యక్షమవడం చంద్రానికి ఆశ్చర్యం కలిగించింది. కార్యకర్తలు పిచ్చివాణ్ణి బైటకిపొమ్మని నెడుతున్నారు.

"నేను పోను" అని మొరాయించి కుర్చీలో పీకంవేసి కూర్చున్నాడు పిచ్చివాడు.

మంత్రిగారు ఇదేమీ తనకు పట్టనట్టే ఉపన్యాసం చేస్తున్నారు.

"కార్యకర్తల కోరికను చిన్నబుచ్చడం భావ్యంకాదని అధ్యక్షత వహించడానికి ఒప్పుకున్నాను. మీకందరికీ కవిత్వం వినాలని వుందని నాకుతెలుసు. మమ్మల్ని విసిగించకుండా రెండుమాటలు చెప్పి ముగిస్తాను. కవులు నిరంకుశులు. ఫలానిది వ్రాయమని ఎవరూ వారిని ఆదేశించలేరు. ఆదేశించినా వారు వ్రాయరు. వారికుండే ఈతిబాధలు నాకు తెలుసు. బాధల్లోంచే ఉదాత్తమైన కవిత్వం పుట్టుకు వస్తుందని కొందరు పెద్దలన్నారు. దేశాన్ని ముందుకు తీసుకుపోయేది కవులు. మీరు బైతాళికులు. మీరంతా మనప్రణాళిక దిగ్విజయానికి తోడ్పడాలి. అంటే మీరు ప్రణాళికోద్దేశాలు ప్రజల హృదయాలపై ముద్రవేసేట్టు కవిత్వాన్ని సాధనగా ఉపయోగించాలని మనవి చేస్తున్నాను." అంటూ కూర్చున్నారు మంత్రిగారు.

కవి సమ్మేళనం ప్రారంభమైంది.

ఒక కవి ఆంధ్రుల పూర్వౌన్నత్యాన్ని కవిత్వంలో ప్రస్తుతించాడు.

ఒక కవి ప్రేయసి కాటుకకళ్ళను ముద్దిడుతున్నాడు.

ఒక కవిశేఖరుడు మైకు ముందరకు వచ్చాడు.

"ఇప్పటిదాకా ఆఫీసు పనితో అలసిపోయివచ్చాను. నిలబడటానిక్కూడా ఓపికలేదు. అయినా రెండుమూడు పద్యాలుచదివి విరమిస్తాను." అని చెబుతున్నాడు కవిశేఖరుడు.

"ఏంటసే ఉపోద్ఘాతమంతా" అని వేదికమీద కూర్చున్న ఇద్దరు కవులు గుసగుసలాడుకున్నారు.

"క్రొత్తది వ్రాయటానికి తీరుబడి లేకపోయింది. నా వ్రాసిన ఖండకావ్యంలోంచి కొన్ని పద్యాలు వినిపిస్తాను" అంటూ కవిశేఖరుడు ఒక పద్యం అందుకున్నాడు. మూడోపాదం పూర్తి కాకపోయేప్పటికి తల గోక్కుంటూ మొదటి రెండుపాదాలు పునశ్చరణ చేశాడు. అయినా లాభంలేకపోయింది. జేబులుమీద పెట్టుకున్న సంచీలోంచి ఆ ఖండకావ్యం తీసి రెండు నిమిషాలు పేజీలు తిరగవేసి పద్యం పూర్తిచేశాడు.

"ఆ పుస్తకం మొదటే చదవకూడదూ?" అంది వెనుకగొంతు.

మరోకవి కావ్యగానం ప్రారంభించాడు.

"......................

అతడు ఆమెనుచూచె

ఆమె యాతనిచూచె

ఇద్దరి చూపులలోన

ఏదో తియ్యనిబాధ

అతడు చెయిజాచె

ఆమె కేలందించె"

చిటికలు వేస్తూ తాళయుక్తంగా పాడుతున్నాడు.

ఒక పండితుడి వంతు వచ్చింది.

"అబ్బె—పూలహార మెందుకండీ"అంటూనే మెడవంచాడు.

"అధ్యక్షులకు సభాసదులకూ నమస్కారములు. ఈ కావ్యం రచించి దాదాపు పది సంవత్సరాలైంది. ఈమధ్యనే కొన్ని కాగితాలను చెదలు తినేసేప్పటికి ఆ పద్యాలను మళ్ళీ పూరించేప్పటికి తల ప్రాణం తోకకువచ్చినంతపనైంది. సహృదయులు వీటిని చిత్తగించాలి" అంటూ వక్యం దటించి కావ్యగానం ప్రారంభించాడు. ఎక్కడ ఆపమంటారోనన్న భయంతో చకచకా పది పద్యాలు చదివేశాడు. సభికులు చప్పట్లు కొడుతున్నారు. "ఇక చాలించండి మహాప్రభో" అని ఒకసభికుడు పొలికేక పెట్టాడు. పండితుడు బిత్తరపోయి అధ్యక్షులవంక చూశాడు. కూర్చోమన్నట్లు సంజ్ఞ చేశాడు. "వక్లండి—ఈ ఒక్కపద్యం చదివి ముగిస్తాను. ఇదంటే నాకెంతో అభిమానం" అంటూనే పద్యం చదివేసి, తొందు పుస్తకం చంకన పెట్టుకొని "ఈసారెప్పుడైనా అవకాశమిస్తే మంచి రమణీయఘట్టం చదివి వినిపిస్తాలెండి" అంటూ వెనక్కి తిరిగాడు.

"పాపం—అమాయకుడు" అనుకున్నాడు చంద్రం.

ఒక మహాకవి లేచాడు. అతని అభిమానులు చప్పట్లుకొట్టారు. చిరునవ్వుతో ఆ మహాకవి ఠీవిగా మైకుముందు నిలబడి ప్రక్కకు చూశాడు. పూలహారానికి ఆలస్యమైందేమో అని. ఆ కొస్తమొక్కుబడీ అయ్యాక మహాకవి గళమెత్తాడు.

అది కావ్యగానంకాదు.

"హరికథా కాలక్షేపంలా వుం"దనుకున్నాడు చంద్రం.

ఆ మహాకవి భక్తబృందం తలలూపింది. చప్పట్లు కొట్టింది. మహాకవి పొంగిపోయాడు.

చివరకు చంద్రం వంతు వచ్చింది.

వేదికమీద కూర్చున్న కవులందరి కళ్ళూ అతనిమీద పడ్డాయి. సభలో నిశ్శబ్దత తాండవించింది.

చంద్రం ఏ కవి సమ్మేళనంలోనూ కాగితాలు చూడకుండా చదవలేదు. మైకు ముందుకు వెళ్లాక ఏ జేబులోంచైనా కాగితాలు బైటికి తీస్తాడనుకున్నారు కవులు. వాళ్లకు ఆశాభంగం కలిగించాడు చంద్రం.

చంద్రం ఒక్కసారి సభంతా కలియచూశాడు.
అతని చర్య క్రొత్తగా అనిపించింది కవులకు.
"ఎన్నాళ్ళీ గాఢ పరిరంభణం
ఎందుకీ ప్రళయకేళీ విజృంభణం!
నన్ను విడిచిపుచ్చు మత్తకాసినీ
నను నీ అనురాగపు హాలాహలం త్రాగించకు విలాసినీ!"

మహాకవి చెవులు రిక్కబొడుచుకున్నాయి. ఏమిటీ ధోరణి అనుకుంటూ కొందరు కవులు తెల్లమొహం వేశారు. అధ్యక్షస్థానంలో కూర్చున్న మంత్రికి అయోమయం అనిపించిందేమో నోరు తెరచి చూస్తున్నాడు. తనకెక్కడ అర్థం కాలేదనుకుంటారోననేమో మాజీ సంస్థానాధిపతి "ఓహోహో!" అన్నాడు.

"ఎన్నాళ్ళీ గాఢ పరిరంభణం
ఎందుకీ ప్రళయకేళీ విజృంభణం!
నన్ను విడిచి పుచ్చు మత్తకాసినీ
నను నీ అనురాగపు హాలాహలం త్రాగించకు విలాసినీ!
ఓ మందారపు సౌందర్యం చిలికే
అరుణాధర చుంబనం
మధురానుభూతి చేకూర్చిందనుకోకు
ఇది లిప్‌స్టిక్ పైపూతల మెరుగు
ఇది ప్లాస్టిక్ అనురాగపు బిగువు
దుష్టవిధి దోసిళ్లతో బూడిదపెత్తిన పత్తి
కాలుష్యపు నల్లరంగు గట్టిగా పులుముకున్న కొప్పులో
హృదయ కుసుమాన్ని తురిమి
నీ సౌందర్యం నిత్య సత్యమేనని
నీ గుండెలలోని విషభాండం
నిర్మలమైన ప్రేమామృత సంభరితమేనని
లోకంముందు నా పతి నగ్న స్వరూపం
బయటపెట్టలేని బలహీనతలో
ఎన్నాళ్ళీ ఆత్మవంచన
ఎందుకీ ప్రళయకేళీ విజృంభణ!"

సభలో చప్పట్లు చెలరేగాయి. మహాకవి అద్భుతంగా వుందని కరస్పర్శ చేశాడు. అంతటి మహాకవి అద్భుతంగా వుందన్నప్పుడు ఎవరికీ సంశయం కలుగలేదు. అధ్యక్షుడు చాలా బాగుందని మెచ్చుకున్నాడు. "ఈనాటి విజయం తమదే" అన్నాడు ఒక అభ్యుదయకవి. ఇంతలో సభలో కోలాహలం బయలుదేరింది. వేదిక మీద వారు ఏమిటా అని చూశారు. పిచ్చివాడు జనాన్ని నెట్టుకొని వేదికదగ్గరకు వస్తున్నాడు. కార్యకర్తలు అతణ్ణి అడ్డుతున్నారు.

"రాజుకంటే బలవంతుడు మొండివాడు" అన్న నానుడిని రుజువు చేశాడు పిచ్చివాడు. అందరినీ విదలించుకొని వేదిక మీదకు దూకి "అధ్యక్షా, మహాజనులారా! నేనుకవిత్వం చదవడానికిరాలేదు. ఎవరిమీదా కసి తీర్చ రాలేదు. నేనుచంద్రం అనే కవిని సన్మానించదలచుకున్నాను. నాకు అతని కవిత్వం నచ్చింది. అర్థంచేసుకుంటే అందరికీ నచ్చుతుంది. మీరు అయన్ని పూలహారం వేసి సన్మానించారు. నాకా శక్తిలేదు. చంద్రునికో నూలిపోగులా నా దగ్గరవున్న ఈ నాలుగు నయాపైసలతో చంద్రంగారికి సన్మానం జరుపుతున్నాను" అంటూ పిచ్చివాడు చంద్రాన్ని లేవదీసుకువచ్చి ఆ నాలుగు కాసులు చేతిలో పెట్టి చేతులుజోడించి, చరచరా వేదికదిగి జనంలో కలిసిపోయాడు.

ఈ సంఘటన అందరినీ ఆశ్చర్యపరిచింది.
అందరూ తలోవిధంగా వ్యాఖ్యానించుకున్నారు.
కార్యదర్శి వందనసమర్పణంతో సభ ముగిసింది.
చంద్రం కళ్ళు పిచ్చివాడికోసం వెతికాయి.
ఎటుపోయాడో పిచ్చివాడు కనిపించలేదు.
చంద్రం నడుస్తున్నాడు.
చంద్రానికి అప్పుడు జ్ఞాపకంవచ్చింది ఇంటిసంగతి.

"రాత్రికి బొగ్గులులేవు. తొందరగా ఇంటికిరండి. ఏకంగా వచ్చేప్పుడు పసిదానికి పాలడబ్బా కొనుక్కురండి" అని ప్రొద్దున ఆఫీసుకు వెళ్లేప్పుడు భార్యామణి శాసించింది.

"ఏమిటి చెయ్యడం? డబ్బెక్కడా పుట్టలేదు" అనుకున్నాడు.

"అయినా తను ఎంతమందిని డబ్బడిగాడు? ఒక్కణ్ణి. అతను లేదన్నాడు. మరెవరినీ తాను అడగలేకపోయాడు. రేపైనా ఎక్కడైనా చూడాలి" అనుకున్నాడు.

చంద్రం నడుస్తున్నాడు.

సిమెంటురోడ్డు ప్రశాంతంగా వుంది. ఆకాశం నిర్మలంగా వున్నట్లనిపించింది. ఇరుప్రక్కలా వున్న భవనాలు చలనంలేని కొండల్లా వున్నాయనుకున్నాడు. ఎప్పుడోగాని కార్లు రావడం లేదు. ఎక్కడోగాని రిక్షా కనిపించడం లేదు.

గుమాస్తాలు నిర్భయంగా పడుకొని వుంటారు.

కాబూలీవాలా ఇనప్పెట్టె తెరచి నోట్లు లెక్కపెడుతుంటాడు.

వంటటం అలవాటు చేసుకున్న బిచ్చగాడు మత్తుగా తాగి ఎక్కడో పడివుంటాడు.

బొజ్జమనిషి ఏ సినిమాహాల్లోనో స్నేహితులతో సోఫాలో కూర్చుని వినోదిస్తుంటాడు.

బిచ్చకత్తె ఏ రిక్షావాడి హస్తాల్లోనో నలిగిపోతూ వుంటుంది.

కత్తెర దొంగ ఎక్కడో జల్సాచేస్తుంటాడు.

కాలేజీ పడుచు ప్రశాంతంగా పాఠాలు వల్లిస్తూ వుంటుంది.

దారినపోయిన దానయ్యలు తాను చూచిన ఏ సుందరినో తలుచుకొని భార్యను రంజింప చేస్తుంటాడు.

చంద్రం నడుస్తున్నాడు.
అతనిలో ఇప్పుడే ఆలోచనలూ లేవు.
అతనిలో ఒక్కటే తృప్తి.
అంతర్ముఖుడై తన జీవితపు నగ్నసౌందర్యాన్ని దర్శించాడు.
రసిక హృదయం ఫలకంమీద రూపించాడు.

# విదేశములలో భారతీయ సంస్కృతి

శ్రీ జటావల్లభుల పురుషోత్తం

విదేశములపై భారతీయ సంస్కృతివైచిన ప్రస్ఫుటముద్రల కొన్నింటిని కనబరచుటయే యేతద్వ్యాసోద్దేశము. వివిధవిజ్ఞాన రంగములలో భారతీయులు సాధించిన విజయములను నిరూపించుటకు కాని భారతీయసంస్కృతి ప్రపంచముపై ప్రసరింపచేసిన బహువిధ ప్రభావమును సమీక్షించుటకు కాని యిట యత్నింపబడుటలేదు. భారతీయసంస్కృతి యొకప్పుడు విశ్వవ్యాప్తముగా నుండెనని యూహించుటకు తగినసాక్ష్యములను కొన్నింటి నిట నీయదలచితిని.

ప్రపంచ మంతటను భారతీయ ధర్మసంస్కృతులు అతి ప్రాచీనకాలముననే వ్యాపించినవని న్యాయస్థులయిన యూరపియన్ పరిశోధకులు నిరూపించియున్నను, మరికొందరు భారతదేశమును మిక్కిలి సామాన్యముగా చిత్రించుటచే రాజకీయదాస్యములో నుండిన భారతీయులకు ఈ రెండవ రకమురచనలే రుచించుచుండెను. మొదటివర్గమునకు చెందిన గ్రంథములు విద్యాలయములలో మాత్రమే కాక గ్రంథాలయములలో కూడ పాఠకులు లేక మూల్గుచుండుట సంభవించెను. రాజకీయస్వాతంత్ర్యముతోబాటు స్వతంత్రాలోచన భారతీయులకు కలుగుచున్నకొలదియు ఈవిషయమై జిజ్ఞాస పెరుగుచున్నది. ప్రపంచములో నెక్కడకేగినను ప్రాచీన భారతీయ సంస్కృతి గోచరించుటచే భారతీయులకు స్వీయసంస్కృతి విషయమై ఆత్మగౌరవము పెరుగుటయు, తన్మూలకముగా భారతీయ సంస్కృతిని రక్షించుకొనుటయే దేశసేవలో ముఖ్యభాగమను భావము పెరుగుటయు సంభవించుచున్నది.

## ఆసియా

భారతీయసంస్కృతి ఆసియాదేశములలో ఎంత ప్రస్ఫుటముగా కన్పట్టుచున్నదో ఇటీవల శ్రీ జవహరలాల్ నెహ్రూ పలికిన యీ క్రిందిమాటలవలన స్పష్టమగుచున్నది. భారత గణతంత్ర ఉపాధ్యక్షులు శ్రీ రాధాకృష్ణన్ కాంబోడియా చీనా దేశముల లోను, తాను జపాను దేశములోను సంచారముచేసివచ్చిన క్రొత్తలో శ్రీ నెహ్రూ యీ మాటలు పలికినారు.

"ప్రాచీన భారతదేశముయొక్క ప్రతిరూపమునే మేమా దేశములలో చూచితిమి. భారతీయ భావములు, భారతీయ సంస్కృతి, భారతీయభాష ఆ దేశములలో ప్రతిబింబించుటను మేము చూచితిమి. అది భారతదేశముయొక్క యథార్థశక్తి సూచకము."

వివిధ దేశములలో భారతీయ సంస్కృతి యే రీతిగా కన్పట్టుచున్నదో యనుటకు చిహ్నముగా మన రామాయణకథ ఎన్ని దేశములలో ఏ రీతిగా వ్యాప్తిలోనున్నదో తెలిసికొనవచ్చును. వేయితర దేశముల యితిహాసములును భారతదేశములో వ్యాప్తిలోలేవు; ఈ దేశపు రామాయణము అన్ని దేశములలోను కన్పట్టుచున్నది. భారత సంస్కృతి విస్తృతి దీనివలననే వ్యక్తమగుచున్నది. సయాము దేశములో 'రామకియాన' అను పేరుతో రామాయణ మున్నది. ఈ కథలో కాళిదాసు రఘువంశముయొక్క ప్రభావము కొంతయున్నది. రాముడును, రావణుడును అన్నదమ్ముల పిల్లలని సయాము రామాయణములో నున్నది. సింహళ రామాయణములో రాముడు సీత నయోధ్యలోనుంచి యే అడవికేగెను. చీనా రామాయణములో పేర్లు మార్చబడినవి. కాంబోడియా రామాయణమునకు శ్యామకేరయాని పేరు. కాని పాత్రలలో మార్పు విశేషముగా లేదు. ఇందు రాముడు జీవించియుండియే తాను మరణించినట్లు హనుమంతునిచే సీతకు వార్త పంపును. సీత మిక్కిలి దుఃఖముతో ప్రయాణించి అయోధ్య కేగి రాముని చూచి పిమ్మట భూమిలో లీనమైపోవును. బర్మా రామాయణములో శూర్పణఖయే లేడియై రాముని తనవెంట పడ వర్తించెను. టిబెట్ రామాయణములో దశరథునకు జ్యేష్ఠ, కనిష్ఠ అను, భార్యలిద్దరు మాత్రమేయున్నట్లు చెప్పబడెను. టర్కీలోని రామాయణమునకు 'రవోతవ' అని పేరు. ఇది చాలభాగము వాల్మీకి రామాయణమునే పోలియున్నది. ఇంకను అనేక దేశములలో రామాయణము బహురీతుల వ్యాపించియున్నది.

ఇరాన్ అనబడు పారశీకదేశమును తీసికొందము. భారతదేశములో వేదమతముపై తిరుగుబాటుచేసి యిచటి వారితో కలహించిన కొందరు భారతీయులు ప్రాచీనకాలముననే యీ దేశమును విడచి పారశీకము చేరిరని పరిశోధకులెల్లరు చెప్పుచున్నారు. పారశీక మత గ్రంథమైన జెండవెస్తాలోని మంత్రములను, వేదమంత్రముల ప్రక్కనిడి పరిశీలించుచో ఆశ్చర్యము కల్గును. వేదములోని శర్వుడు అట శర్వగాను, నాసత్యుడు నాహాత్యగాను, మిత్రుడు మిత్రగాను, భగుడు బగగాను, నరసింహుడు నైరోసంహగాను కన్పట్టుచున్నారు. భేద మేమియు లేని దేవతానామము లనేకములున్నవి. వైదికమతములో హోమసహితముగా జరుగు ఇష్టియను దేవతారాధన విధానము జొరాస్ట్రియనుల మతములో కూడ ఇష్టియను పేరుతోనే యున్నది; ఆహుతి 'ఆజుతి' యనబడును; హోత 'జోత' యనబడును. ఇట్టి సాదృశ్యములు సహస్రములు కలవు.

ఇటు ఇండోనీషియాను తీసికొందము. మన వారెవ్వరును ఊహించియుండనంత హెచ్చుగా ఆదేశములో భారతీయ సంస్కృతికలదు. ఇతరమతములు ఆ దేశములలో తర్వాత ప్రవేశించి

వను అనేక సంప్రదాయములు భారతీయములుగానే నేటికిని కన్పట్టు చున్నవి. ఆ దేశములో అచ్చుపడు పుస్తకములలో ప్రారంభమున "అవిఘ్నమస్తు" అని యుండునని మన మూహించి యుండము; కాని అది యట్లేయున్నది.

1954 వ సంవత్సరములో ఏప్రిల్ నెల 25 వ తేదీని నాగ పూరులో సంస్కృత విశ్వపరిషత్తు రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు గారి అధ్యక్షతను సమావేశమైన సందర్భమున డాక్టర్ రఘువీర ప్రదర్శనము నేర్పాటుచేసెను. అందు తూర్పుద్వీపములలో భారత సంస్కృతియెట్లున్నదో తెలుపుగ్రంథములు, ఇతరవస్తువులు ప్రదర్శింపబడెను. ఇండొనీషియన్ పుస్తకము లనేకములలో ఒకేవిధమైన అక్షరము లుండుటను చూచి నేను "ఇదియేమి? అన్ని పుస్తకములలో ఒకే అక్షరములవలె నున్నవి?" అని యడిగితిని. అంత శ్రీ రఘువీర యిట్లు చెప్పెను: "ఇవి 'అవిఘ్నమస్తు' అను సంస్కృతపదములు. ఇవి ఇండొనీషియన్ లిపిలో వ్రాయబడియున్నవి. ఇట్లు గ్రంథములలో 'అవిఘ్నమస్తు' అని వేసికొనుట వారికి సంప్రదాయము." అని చెప్పెను. ఆ అక్షరముల ప్రతిని తీసి నాకీయవలసిందని నేను కోరితిని. ఆయన ఆ ప్రకారము అక్షరములను వ్రాసి క్రింద తన సంతకము చేసి నాకిచ్చెను.

ఇందలి లిపి కూడ దేవనాగరినుండియే వచ్చినదనుట స్పష్టము.

భారతీయుల ఇతిహాస పురాణములు ఇండొనీషియాలో ఎంతగా ప్రచారములో నున్నవో యీ క్రింది సంఘటన తెలియ జేయుగలదు.

డాక్టర్ రఘువీర ఇండొనీషియన్ అధ్యక్షుని కలిసి కొన్నప్పుడు "నా పేరునకు అర్థమేమి?" అని సోకర్నో అడిగెను. "ఇది అదిలో సుకర్ణశబ్దమై యుండును. బుద్ధుని విగ్రహమునకు చెవులు పెద్దవిగా చేయుచుందురు. కావున ఇది బుద్ధునిపేరై యుండును" అని రఘువీర అనెను. సోకర్నో నవ్వి, "అట్లుకాదు. నేను పుట్టినప్పటికి మా తండ్రి ప్రతిదినము మహాభారతము చదువు చుండెను. భారతవీరుని పేరేదియైన నాకు పెట్టవలయునని ఆయ నకు తోచెను. భారతవీరు లందరిలోను కర్ణుడు ఆయనకు హెచ్చుగా నచ్చెను. కాని భారతములోని కర్ణుడు దుష్ట చతుష్టయములోని వాడు. తన కుమారుడు దుష్టకర్ణుడు కాక సుకర్ణుడుగా నుండవలయు



జకార్తాపురావస్తు ప్రదర్శనశాలలోని దుర్గవిగ్రహము
ఛాయాచిత్రకారులు : శ్రీ దేశిరాజు వేంకటకృష్ణశర్మ.

నని తలచినా తండ్రి నాకు సుకర్ణుడని పేరిడినాడు." అని సోకర్నో చెప్పెను! విదేశములలో భారతీయ సంస్కృతిని తెలుపుట కట్టి ఆశ్చర్యకరములైన సాక్ష్యము లసంఖ్యాకములుగలవు.

థాయిలండ్‌లో నేటికిని బ్రాహ్మణ పురోహితులు రాజునకు పట్టాభిషేకము జరిగింతురు. 1950 మే 5 వ తేదీని భూమిభాన్ రాజు పట్టాభిషేకము జరిగెను. అంతకుపూర్వపురాత్రి బ్రాహ్మణ పురోహితులును, బౌద్ధ పురోహితులును వేర్వేరు స్థలములలో ప్రార్థనలు గావించిరి. మిమ్మట ఉదయమున బ్రాహ్మణులు రాజునకు అఘమర్షణ స్నానము గావించిరి. పట్టాభిషేక సమయమున భారతీయ సంప్రదాయానుసారము శుభసూచకముగా శంఖారావము చేయ బడెను. ఆ దేశము (సయాము)లో అన్ని దిక్కులనుండి తేబడిన పవిత్రోదకముతో రాజునకు మంగళస్నానము చేయించిరి. ప్రాచీన కాలమునుండియు థాయిలండ్‌లో జరుగుచుండిన పట్టాభిషేక మహోత్సవముల పద్ధతిలోనే యిదియు జరిగెను.

హిందూ దేవాలయములు ఎన్నియో దేశములలో పూర్వ ముండినట్లు నిదర్శనము లున్నవి. ఇటీవలనే అజర్ బైజాన్‌లో బాకు వద్ద నొక దేవాలయము బయటపడినది. దీని విషయమై భారత ప్రభుత్వము విచారణమునకుకూడ గడంగినది. బలిద్వీపములో నేటికిని దేవాలయములలో పూజాకర్మకలాపము హిందూ మతాచారముల ప్రకారమే జరుగుచున్నది. దేవతకు అర్ఘ్యధూపదీపనైవేద్య నీరాజన మంత్రపుష్పాదు లవిధముగానే జరుగుచున్నవి. ఇతర కర్మలు భారతీయపద్ధతిలోనే జరుగుచున్నవి. మృత దేహములకు దహనసంస్కారమే జరుపబడుచున్నది. అది తరచు నదీతీరముల యందే జరుగును. నాట్యములు, నాటకములు హిందూ పురాణ గాథలకు సంబంధించియేయున్నవి.

సుమత్రాద్వీపములో క్రీ. శ. 4 వ శతాబ్ది నాటికి శ్రీ విజయ అను పేరుతో భారతీయ సామ్రాజ్య ముండెననుట ప్రసిద్ధ విషయము. అచట శాలివాహన శకము వాడబడుచుండెను. నాటి శాసనములు కొన్ని సంస్కృత భాషలోనే యున్నవి. భారత రామాయణముల ప్రచారము మెండుగా నుండెను. నేటికిని కథాకాలక్షేపములలోను, బొమ్మలాటలలోను, నాటకములలోను హిందూ పురాణములలోని విషయములే కన్పట్టును. సుమత్రాలోనే కాక తూర్పుద్వీపములన్నింటియందును భారతీయ పురాణముల ప్రచారము నేటికిని కన్పట్టుచున్నది.

తరువాతి కాలమున బౌద్ధమతమును స్వీకరించిన ఆసియా దేశములన్నింటియందును ఒకప్పుడు వేదపురాణ సంస్కృతియుండెను. కావుననే అన్ని దేశములయందును బౌద్ధాచారములతో బాటు వైదిక సంప్రదాయములును కన్పట్టుచున్నవి. మంత్రోచ్చారణము, అంగన్యాసకరన్యాసములు, ఇతరానుష్ఠానపద్ధతులు అవి స్వచ్ఛరూపములో కాకపోయినను విపరిణామయుతములై బౌద్ధ దేశములన్నింటియందును కన్పట్టుచున్నవి.

ఈ నడుమ విదేశములకేగి వచ్చిన డాకర్ ఆత్రేయ (కాశీ హిందూవిశ్వవిద్యాలయ వేదాంతశాఖా ప్రధానాచార్యులు) చెప్పిన యీ మాటలు గమనింపదగియున్నవి: "ప్రపంచములో ఇంచుమించు ప్రతిదేశపు సంస్కృతిమీదను భారతీయ ప్రభావము కన్పట్టును. జపానులోని కొన్ని దేవాలయములలో హిందూ దేవతలు ఆరాధింపబడుటను నేను స్వయముగా చూచితిని." జపానులోని బౌద్ధ దేవాలయములలో బుద్ధవిగ్రహమునకు సమీపమున శివుని విగ్రహము నుంచుదురు. నాగములు, కపాలములు, వ్యాఘ్రచర్మము శివునకుండును. వీణ వాయించుచు సరస్వతికూడ నట కన్పట్టును. లక్ష్మీదేవికిని అట స్థానముకలదు. విఘ్నేశ్వరుడు కూడ గజాననముతో నట కన్పట్టును.

చైనాకు సమీపమునగల ఖోటాన్ ప్రాంతములోని ప్రజలు తమ యింటి గోడలమీద బోధిసత్వునితో బాటు విఘ్నేశ్వరుని బొమ్మలనుకూడ వేసికొందరు. ఖోటాన్‌లో క్రీ. శ. 8 వ శతాబ్దిలో సంస్కృతము రాజభాషగా నుండెనని స్టెయిన్ తన 'Ancient India' అను గ్రంథములో వ్రాసెను.

ఆసియాలో బయలుదేరిన తత్త్వశాస్త్రములకు కూడ భారతీయ సంస్కృతి మూలకత్వము కన్పట్టుచున్నది. చైనాలో విలసిల్లిన కన్‌ఫ్యూషియన్ మతములోని నీతినియమముల ప్రాముఖ్యము కూడ భారతీయ సంప్రదాయములనుండియే గ్రహింపబడినదని డాక్టర్ జేమ్సు హెచ్. కజిన్స 'The Cultural Unity of Asia' అను గ్రంథములో (పుట 81) వ్రాసియున్నాడు.

క్రీస్తు పుట్టునప్పటికి పాలస్తీనా ప్రాంతములో వైష్ణవ సంప్రదాయములు పాటింపబడుచుండెను. ఇంచుమించు ఆ కాలమునాటి బొమ్మలు లభించినవి. అందు స్త్రీలకును పురుషులకునుగూడ వైష్ణవ నామము లున్నవని మిసెస్ జేమ్సుకా తన 'Legends of Modana' అను గ్రంథములో వ్రాసెను.

నేడు కేవల భారతీయ సంప్రదాయములుగా నున్న ఇవన్నియూ యొకప్పుడు విశ్వసంప్రదాయములుగా నుండెను. స్త్రీ భర్తృసేవ ద్వారా తరింపవలయుననుట భారతీయ సంప్రదాయము. ఒకప్పుడిది ప్రపంచ మంతటను ఉండెను. భగవంతుడు నరుని సృజించి "నీవు నన్ను సేవించుము" అని యాదేశించెననియు, నారిని సృజించి "నీ భర్తద్వారా నన్ను సేవించుము" అని యాదేశించెననియు ప్రాత నిబంధనయను బైబిలు పూర్వభాగములో కలదు. మిల్టన్ మహాకవి తన "పేరడైజ్ లాస్ట్" అను గ్రంథములో, నాల్గవ భాగములో, దీనిని రమ్యముగా వివరించియున్నాడు.



ప్రాంబనంలోని చతుర్ముఖబ్రహ్మ దేవాలయం
ఛాయాచిత్రకారులు : శ్రీ దేశిరాజు వేంకటకృష్ణశర్మ.

నేటికి 3400 సంవత్సరముల క్రిందట మెసపొటేమియా ప్రాంతములో భారతీయ సంస్కృతి యెంత గాఢముగా నాటుకొని యుండెనో యీ క్రింది యంశము తెలుపగలదు. ఆ కాలములో నచట హిట్టైట్ జాతివారికిని, మిటానీ రాజ్యమువారికిని కలహము వచ్చెను. తుదకు వారికి సంధి జరిగెను. ఆ సంధి నియమము లొక ఫలకముపై వ్రాయబడినవి. ఆ ఫలకము నేటికిని కలదు. ఆ సంధికి సాక్షులుగా వరుణాది వైదిక దేవతలు పేర్కొనబడినారు. అచటివారు ఆనాడు వైదిక సంస్కృతిచే కల్గియుండిరనుట కిది ప్రబల సాక్ష్యము.

చాలకాలము జపాన్‌దేశములో నివసించి, ఇతర ప్రాచ్యదేశములలో కూడ సంచారముచేసి భారతదేశము నభిమానభూమిగా స్వీకరించిన డాక్టర్ కజిన్స భారత ప్రభావము ఆసియా దేశములలో నెట్లు

పడినవి యని పైని పేర్కొన్న గ్రంథములో వివరించి యున్నాడు. బహు పరిశోధనానంతరము ఆయన యీ క్రింది నిర్ణయమునకు వచ్చెను: “సంస్కృతి విషయములో ఆసియాలోని అన్ని మార్గములు ఇండియాకే వచ్చిచేరును; కాదు, కాదు, ఇండియానుండియే అన్ని మార్గములును బయలుదేరినవి. రష్యా, చైనా, టిబెట్, సామర్కండ్ మున్నగు దేశముల సంస్కృతితంతువులు ఇండియాతో అనుబంధింపబడి యున్నవి.” (పుట 122)

## ఆఫ్రికా

ఈజిప్టుదేశము భారతీయ సంప్రదాయవాసితమని యెల్లరు నంగీకరించి యున్నారు. 2400 సంవత్సరముల క్రిందటనే భారతీయాచారములు ఈజిప్టులో కలవని హెరడోటస్ అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. ఈతడు క్రీ. పూ. ౫ వ శతాబ్దములో నివసించి యానాటి బహుదేశములను గూర్చిన యంశములను గ్రంథస్థము చేసియుండెను.

మానవ మృతకళేబరములను సంవత్సరముల కొలది భద్రపఱచు విద్య యీజిప్టువారికుండెను. ఆ మమ్మీలపై కప్పబడెడి వస్త్రములను [మస్లిన్] భారతదేశమునుండియే వారు తెప్పించుకొనుచుండిరి. బాబిలోనియన్ భాషలో మస్లిన్‌కు సింధు అను పదముకలదు. ఆ సంగతిని ఆధునిక చారిత్రకులు మనకు చెప్పుచున్నారు.

ప్రాచీనకాలమున ఈజిప్టువాసుల దేవునిపేరుకూడ భారతదేశమునుండి గ్రహింపబడినది. ఇసిస్ అనునది వారి దేవుని పేరు. ఇది ఈశశబ్దభవము. సూర్యునకు హోరస్ అను పేరుండెను. సకారముభాషలలో హకారముగా మారుట ప్రసిద్ధము. ప్రాచీన ఈజిప్టు రాజులు రామ్సెస్ I, రామ్సెస్ II ఇత్యాది నామములతో ప్రసిద్ధులైయున్నారు. రామశబ్దమే రామ్సెస్ ఆయెననునది నూతన కల్పనకాదు. బహు పండితాంగీకృతమైనది.

ఈజిప్టు రాజుల సింహాసనమునకు ఒకవైపున హనుమంతుని విగ్రహమును, ఒక ప్రక్కను గరుత్మంతుని విగ్రహమును ఉండెను. నైలునది సమీపమున నొక గుహలో శ్రీదేవి, భూదేవి, నీళాదేవి సమీపమునగల విష్ణువు విగ్రహముకలదు. కొన్ని గుహలలో రామాయణ భారత కథలు వీనాడో చిత్రింపబడినవి కన్పట్టుచున్నవి. ఒక గుహలో అగ్నియందు హోమము చేయుట చిత్రింపబడియున్నది.

కళేబర శిథిలశేషములనుబట్టి జాతిసామ్యమును నిర్ణయించు పరిశోధకులు (Ethnologists) గూడ భారతీయుల జాతికే యీజిప్టువారు చెందుచున్నారని నుడివియున్నారు. (ప్రొఫెసర్ హీరెన్ రచించిన ‘Asiatic Nations, 2 వ సం. 308 వ పుట)

భారతీయుల కళలు, శిల్పములు, ఆచారములు, వేదాంతాది శాస్త్రములు వేలకొలది సంవత్సరముల క్రిందటనే వివిధదేశములలో వ్యాపించిన మార్గములు ముఖ్యములైనవి రెండు కలవు. (1) భారతదేశమునుండి ఈజిప్టునకును, అటనుండి గ్రీసునకును, అటనుండి రోమునకును, అటనుండి మిగిలిన యూరపియన్ దేశములకును ఇది వ్యాపించెనని మాడమ్ బ్లావట్స్కీ తన ‘Secret Doctrine’ అను గ్రంథములో వ్రాసినది. ఆమె దివ్యజ్ఞాన సమాజమునకు మూలవ్యక్తిగా జగత్ప్రసిద్ధి గాంచినది. ఈజిప్టు మార్గములోను, దానిచేను ప్రక్కగా నున్న దేశములలోను—పర్షియా, అరేబియా, అస్సీరియా, బాబిలోనియా మున్నగు ప్రాంతములలోను—భారతీయ సంస్కృతి ఆదినుండియు విశేషముగా ప్రసరించుచుండెను. (2) జావా (యవ) ద్వీపాది ప్రాచ్యదేశముల మీదుగా అమెరికాకు భారతీయ సంప్రదాయములు సంక్రమించినది.

ఈజిప్టు భారతదేశ ప్రభావమును కల్గియుండెననుటను పోకాకే అనుదినములుగా నిరూపణము చేసియున్నాడు. (1) భారతదేశములోని నదుల నామములే యీజిప్టులోని నదుల కీయబడినవి; లేదా సంస్కృత నామములే యీజిప్టు నదులకు కన్పట్టుచున్నవి. ఉ. నైల్ నది. ఇది పూర్వము నీలానది యనియే యీజిప్టులో వ్యవహరింపబడుచుండెను, (2) ఆదేశపు పట్టణములు పశ్చిమోత్తర భారతదేశములోని పట్టణముల పేర్లనే కల్గియున్నవి. (3) రామనామాంచితులైన రాజులు ఈజిప్టును పాలించిరి. (4) ఈజిప్టువారి శిల్పవాస్తు విజ్ఞానము భారతదేశాగత మనుట స్పష్టము (5) గృహనిర్మాణ కళయు అట్టిదే. (6) ఈజిప్టు భాషలోని అనేకపదములు స్వల్పములయిన మార్పులను చేయుచో సంస్కృతపదములే యైపోవును.

భారతదేశములో నొకానొక తెగవారు రాజహత్య గావించిన మహాపాపమునకై దేశమునుండి బహిష్కరింపబడి ఆఫ్రికాలోని కొన్నిభాగముల నాక్రమించుకొని రనుటకు పోకాక్ ప్రాచీన సాక్ష్యములను చూపియున్నాడు. (India in Greece 200 పుట,) ఈరీతిగా మహాపాపములు చేసినవారు భారతదేశ బహిష్కృతులై విదేశములకు పోవుటయు, అచట స్థిరపడిపోవుటయు భారతదేశ చరిత్రలో చిరకాలమునుండి సాగుచున్నది.

## అమెరికా

భారత సంస్కృతి చిహ్నములు అమెరికాలో నేటికిని కన్పట్టుచున్నవి. కొలంబసు అమెరికాను కనిపెట్టకముందు అమెరికనులకు బాహ్యప్రపంచముతో సంబంధము లేకుండెనను నమ్మకము చారిత్రకుల కుండెను. ఇటీవల వెల్లడియైన కొన్ని యంశములనుబట్టి అతిప్రాచీనకాలములో కూడ అమెరికా భారతదేశ సంపర్కమును గల్గియుండెననియు, అప్పుడు అమెరికాలో హిందూమతమే ప్రచురముగా నుండెననియు స్పష్టమైనది. కొన్నికొన్ని ప్రాంతములలో—ముఖ్యముగా మెక్సికోలో—విశేష సాక్ష్యములు లభించినవి. సర్ విలియం జోన్సు మొదలు శ్రీ చమన్‌లాల్ వరకు ఎందరెందరో పరిశోధకులు వెల్లడించిన అద్భుత విషయములను సంగ్రహముగా సమీక్షించి చూచిన భారత సంప్రదాయముల ప్రపంచవిస్తృతి ఎట్టిదో తెలియగలదు.

మెక్సికోలో విఘ్నేశ్వరుని విగ్రహములు లభించినవి. అవి యేనుగుబొమ్మలనుటకు కొందరు ప్రయత్నించిరి. కాని అమెరికాలో నాటికిని నేటికినిగూడ ఏనుగులు లేవు. వాని బొమ్మలెట్లు వచ్చును? ఇంతయును ఈ విగ్రహములకు తలమాత్రమే యేనుగుది, మిగిలిన భాగ మంతయు మనుష్యరూపమే. విఘ్నేశ్వరుని యితరలక్షణ

ణములుకూడ కలవు. మూషక వాహనముకూడ కలదు. కావున విఘ్నేశ్వరప్రతిమగా సంగీకరింపవలసి వచ్చినది. ఇతర దేవతావిగ్రహములును ఎన్నియో లభించినవి.

సర్పపూజకూడ అమెరికాలో నుండెను. పునర్జన్మ విశ్వాసముకూడ అమెరికనుల కొకప్పుడుండెను. మృతులకు దహన సంస్కారములు జరుగుచుండెను. నదులను దేవతాభావముతోను, మాతృభావముతోను పూజించుట అమెరికనులలో నుండెను. ఒకరాజు భార్య లాశ్వనితో సహగమనము చేసినట్లున్న ప్రాచీనచిత్రము మెక్సికోలోని నేషనల్ మ్యూజియంలో కలదు. సహగమనము భారతీయాచారము. కొన్ని బొమ్మలలో సింహాసనములు, పద్మాసనములు కలవు. ఇవి భారతదేశమునకు తప్ప మరియే దేశమునకును సంప్రదించిన సంప్రదాయములు కావు.

చమన్‌లాల్ అమెరికా వెళ్ళి తీసికొనివచ్చిన ఛాయాచిత్రములలో నెన్నియో విశేషము లున్నవి. నేటికిగూడ భారతీయ పద్ధతిలో దుస్తులను వేసికొనువారి చిత్రపటములనుకూడ ఆయన తీసికొని వచ్చిరి. బొలీవియాలోని కైలాసనాథ దేవాలయము కూడ చమన్‌లాల్ గారి 'Hindu America' అను గ్రంథములో కలదు. పెరూలో లభించిన విఘ్నేశ్వర మూర్తియు, ఆంజనేయమూర్తియు కూడ అందున్నవి. సూర్య భగవానుని ప్రతిమలును కలవు. కూర్మావతార గాథ అచట సుప్రసిద్ధముగ నుండెను.

# యూరపు ఖండము

యూరపు నాగరకత ప్రధానముగా గ్రీసునుండి వివిధదేశములకు ప్రసరించినది. ఆ గ్రీసు ఇండియానుండి వేదాంతమును, పురాణగాథలను, ఇతర సంప్రదాయములను గ్రహించెననుటకు కావలసినన్ని యాధారము లున్నవి.

పైథాగరస్ అను గ్రీకు దార్శనికుడు భారతదేశమునకు వచ్చి పండితుల వద్ద శుశ్రూషచేసి యనేక విద్యలు నేర్చుకొనెను. అతడు ఆదిలో భారతీయుడేయనియు, బుసగుడు సాముధేయుడనియు, కొందరు పాశ్చాత్యులే యభిప్రాయపడిరి. ఈతడు గ్రీసుదేశములో చిరకాలము నివసించెను. అచట యాతనికి గొప్ప శిష్యగణముండెను. పునర్జన్మలు కలవని యాతడు గ్రీకులకు బోధించెను. కర్మచేతనే జన్మకలుగుచున్నదని తెలిపెను. ఈ రెండును కేవలము భారతీయ సిద్ధాంతములు. అతడు కర్మసిద్ధాంతములు భారతీయుల వద్దనే నేర్చుకొనెననుటకు సందేహములేదు. భారతీయ దర్శనములలో సుఖదుఃఖములు, మానావమానములు, శీతోష్ణములు—అను ద్వంద్వముల ప్రసక్తిని పైథాగరస్ తెచ్చి అవియే సంసారములో బంధహేతువులుగా నుండునని చెప్పినాడు. ఇట్టి భావముల నెన్నింటినో పైథాగరస్ స్వదేశీయులకు బోధించెను. మరియు నాతడు శాకాహారము ప్రశస్తమైనదని బోధించెను. యాదృచ్ఛికముగా అతని బోధలు భారతీయ బోధలకు సరిపోయినవని చెప్పుట చెల్లదు. ఏలయనః పైథాగరస్ సిద్ధాంతము అని రేఖాగణితశాస్త్రములో ప్రసిద్ధమైయున్నది. బోధాయన శుల్బసూత్రములలో గన్పట్టుచున్నది. దీనినిబట్టి పైథాగరస్ సంస్కృత గ్రంథమునుండి విషయమును గ్రహించి దానిని గ్రీసు భాషలో చెప్పెననుట స్పష్టము. క్రీ. పూ. 500 సంవత్సర ప్రాంతమువాడైన పైథాగరస్ అంతకంటె పూర్వుడైన బోధాయనునుండి గ్రహించుట సంభవము కాని తర్వాతవాడైన పైథాగరస్‌నుండి బోధాయనుడు గ్రహించుట సంభవము కాదు.

"దీర్ఘచతురస్రస్య అక్ష్ణయారజ్జుః
పార్శ్వమానీ తిర్యఙ్మానీ తదుభయం కరోతి హి"

అనునది యజ్ఞవేదికా నిర్మాణ సందర్భమున కొలతలకు సంబంధించి మహర్షిచే చెప్పబడినది. ఇట్టివాని ననేకములను పైథాగరస్ భారతీయులనుండి తెలిసికొనెను. ఇట్టి సాక్ష్యము లుండుటచేతనే మాక్సుముల్లర్, ఎన్‌ఫీల్డ్, ష్లెగిల్, మోనియర్ విలియమ్స్ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు పైథాగరస్ భారతీయుల వేదాంతమును నేర్చినమీదటనే గ్రీసులో ఆచార్యుడుగా వినుతి కెక్కెనని యంగీకరించియున్నారు.

సోక్రటీస్ భారతీయ పండితులతో వేదాంతగోష్ఠి నెరపినట్లు గ్రీసులో ప్రథకలదు. భారతీయ వేదాంతమును సోక్రటీస్ నేర్చినాడని యాయన బోధలు స్పష్టముగా చాటుచున్నవి. సోక్రటీస్ శిష్యుడైన ప్లేటో భారతీయుల వేదాంతముతో పరిచయము గలవాడనుట స్పష్టము. కఠోపనిషత్తులో దేహానిరథిగాను, ఇంద్రియములను గుఱ్ఱములనుగాను నిరూపించు కల్పన ప్లేటో రచనలో కన్పట్టుచున్నది. "సుప్రసిద్ధులైన థేల్స్, ఎంపెడిక్లీస్, ఎనెక్జాగొరస్, డెమాక్రిటస్—(అను గ్రీకు వేదాంతులు) ప్రాక్ ఖండమున కేగి తత్త్వ శాస్త్రాధ్యయనము చేసిరి" అని ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో సంస్కృతాచార్యుడుగా నుండిన ఎ. ఎ. మాక్డొనెల్ తన "సంస్కృత సాహిత్యము" అను గ్రంథములో వ్రాసియున్నాడు. భారత ప్రభావము గ్రీసుపై అనేక శతాబ్దములు సాగెను.

క్రైస్తవమతము వ్యాపించువరకును లిథూనియాలో ఇంద్రవరుణాది వైదిక దేవతలారాధింపబడుచుండిరి. ఆ దేశములోని నదులకు నర్మద, సరస్వతి మున్నగు నామములుండెను. నాగరకప్రపంచముతో నేమియు సంబంధములేని ఎస్కిమోలు కూడ ఒకప్పుడు భారతీయ ప్రభావమునకు లోబడినవారే. వారి భాషలోని చాల పదములు గ్రీకు మున్నగు భాషలద్వారా కాక నేరుగా సంస్కృతమునుండియే దిగివచ్చినట్లు కన్పట్టును. అగ్నికి ఇన్గ్నియా అనియు, వక్షమునకు వక్ అనియు ఆ భాషలో కన్పట్టుచున్నవి. యూరపు ఖండమునందంతటను కూడ భారతీయ ప్రభావమును సూచించు చిహ్నాలు కలవు. యూరపు అను పేరే సురూపశబ్దమునుండి వచ్చినదని కర్నల్ టాడ్ చెప్పుచున్నాడు. నేటికి 2000 సంవత్సరముల క్రిందట ఆర్మీనియాలో కృష్ణుని యారాధనము బహుళప్రచారములో నుండెను.

క్రీస్తు పూర్వము మొదటి శతాబ్దిలో జూలియస్ సీజర్ బ్రిటన్ దేశమును జయించునప్పటికి కచ్చట డ్రూయిడ్స్ అను మతగురువు లుండిరి. వారి లక్షణములు చరిత్రలో విపులముగనే వర్ణింపబడి

యున్నవి. ఈ లక్షణములను బట్టి వారు భారతదేశమునుండి వెళ్ళిన బ్రాహ్మణులని కొందరు అభిప్రాయపడిరి. ఈ డ్రూయిడ్ గురువులు ఆత్మ నిత్యమని బోధించుచుండిరి; పునర్జన్మ కలదని చెప్పుచుండిరి. వారు అపవిత్ర ప్రజల సమీపమున నుండుట ఇష్టపడక ప్రశాంతముగా అడవులలో నివసించుచుండిరి. వీరి కనేక విద్యలలో ప్రావీణ్యముండెను. వారు ప్రజలలోని తగవులను పరిష్కరించుచుండిరి. యుద్ధవిద్యయును వారికి తెలియును, కాని వారు సైన్యములో చేరనక్కర లేదని రాజశాసనముండెను. వారు పన్నులు చెల్లింప నక్కరలేదు. వారిలో ఉపదేశము పొందిన బాలురు 20 సంవత్సరములు గురువువద్ద నుండి విద్యాభ్యాసము చేయుచుండిరి. వారు తమ విద్యలను రహస్యముగా కాపాడుకొనుచుండిరి. ఈ లక్షణము లన్నియు యూరపియన్ చరిత్రకారులు చెప్పుచున్నవే. ఇందభిప్రాయభేదము లేదు.

ఈ డ్రూయిడ్సు భారతదేశమునుండి వెళ్ళినవారే యనుట స్పష్టము. అందులకు నిదర్శనములు: (1) వీరు ఇంగ్లండులోనే కాక ప్రతి యూరపుదేశములోను ఉండిరి. వారు ఏ దేశములోను సహజమైన వారుగా భావింపబడలేదు. వారు ఎక్కడనుండియో వచ్చినారను ప్రతీతి అన్ని దేశములలోను ఉండెను. కావున వారు యూరపు వాసులు కారు. (2) వారు బ్రిటనుకు మోనా యను దేశమునుండి వచ్చినారని ప్రతీతి కలదు. మోనా యనగా మునిదేశమే. ఇది కేవలము శబ్దసాదృశ్యముచే చెప్పునది కాదు. 'Isle of Saints' (మునుల ద్వీపము) అనునది మోనాకు పర్యాయపదముగా వాడబడుచుండెను. ఆ కాలములో మునులదేశము భారతదేశమే కాని మరొకటి కాదు. (3) పైని తెలుపబడిన లక్షణములు భారతీయులకు వర్తించునే కాని మరి యెవరికిని వర్తింపవు. ఆసియాలో కాని యూరపులో కాని యీ లక్షణములు గల జాతి మరొకటి లేదు. కనుక యూరపులో కొన్ని వర్గములవారికి భారతీయులు మతవిషయములో గురుత్వము వహించి యుండిరనుట స్పష్టము.

మారుమూలదేశమైన స్కాండినేవియాలో కూడ ప్రాచీన భారతీయాచారములు గోచరించుచున్నవి. స్కాండినేవియనుల ప్రాచీన మతగ్రంథము ఎడ్డా అనునది స్వర్గసంబంధమైనదని "వేదాల" సూత్రములుగా చెప్పబడినవి యని కౌంట్ జార్న్‌స్టెర్న్ తన Theogony of the Hindus అను గ్రంథములో (పుట 108) చెప్పియున్నాడు. భారతీయ క్షత్రియులు ప్రాచీన కాలములో స్కాండినేవియాకు వలస స్థిరపడిరని కర్నల్ టాడ్ తన రాజస్థాన చరిత్రలో వ్రాసియున్నాడు.

# ఉపసంహారము

ప్రతిదేశములోను శతసంఖ్యాకములుగానున్న యిట్టి ప్రాచీన భారతీయ సంస్కృతి చిహ్నముల పట్టిక నిచ్చినమాత్రముననే యొక బృహద్గ్రంథమగును. భారత సంస్కృతి విస్తృతి ప్రపంచములో నెంతగా నున్నదో యూహించుటకు తగినంత సమాచారము మాత్రమే యిట నీయబడినది.

పైయంశములను జ్ఞప్తియందుంచుకొని ప్రొఫెసర్ హీరేన్ తన 'Historical Researches' లో వ్రాసిన యీక్రింది వాక్యము కేవలము అతిశయోక్తి కాదని తెలిసికొందము. "ఆసియాఖండమే కాక పాశ్చాత్య ప్రపంచమంతయు జ్ఞానమును ధర్మమును భారతదేశమునుండియే గ్రహించెను." (సంపుటము II, పుట 45.)

భారతీయ విజ్ఞానమునకు యూరపు నాగరికతతో గల సంబంధమును గూర్చి చిరకాలము పరిశోధనచేసి "ఇండియా ఇన్ గ్రీస్" అను గ్రంథమును రచించిన పోకాక్ అను ఆంగ్లేయుడు నుడివిన మాట లీసందర్భమున గమనింప దగియున్నవి: 'మత విషయములలో పాటి భారతీయులలో ఏకీభవించని కొందరు భారతీయులు వారితో కలహించి భారతదేశమును విడిచి దక్షిణమున సింహళమునకును, ఉత్తరమున హిమాలయములను దాటి వివిధ దేశములకును పోవుచుండిరి. అట్లు పోయినవారు తమతో కూడ తీసుకొనిపోయిన భారతీయ విద్యలే యూరపు ప్రజల కళాభివృద్ధికిని, విజ్ఞానాభివృద్ధికిని బీజము లయినవి; యూరపుయొక్క ధార్మికాభివృద్ధికూడ నిట్టి భారతీయులవలననే జరిగినది." (పుట. 28.)



# మట్టి మనిషి

శ్రీ మంథా వెంకటరమణరావు

పాత్రలు : గణేష్, చంద్రయ్య, గంగులు, పీటర్, ఎర్రటోపీ వ్యక్తి, జోహానో

* *

* * తెర లేచేసరికి నాలుగడుగుల ఎత్తు, చెట్టు కొమ్మల రొడ్డ పైకప్పుతో గుడిసెలు వెనుకకి కానవస్తూ ఉంటాయి.

కాస్త ముందుకి ఒక చెట్టు. దానిముందు రెండు, మూడు పెద్ద రాళ్ళు.

చంద్రయ్య, పాతికేళ్ళవాడు, ఒక రాయిమీద కూచున్నాడు.

గణేష్, 50 ఏళ్ళ వ్యక్తి కర్రమీద ఆని [illegible]ని దూరంగా చూస్తూ ఉంటాడు. 'బుల్ డోజర్' శబ్దం వినిపిస్తూ దగ్గరయి, మళ్ళా దూరమవుతుంది.

గణేష్ : గీ...గీ...గీ మని-సెవులు దిమ్మెకెక్కిపోనాయి.

చంద్రయ్య : (ఊరుకుంటాడు.)

గణేష్ : యేటయ్యోయి అలోసన్లో పడిందేపారం-యినబడ్డంలా లే? సెవులు దిమ్మెకెక్కేసాయా, నీకూ?

చంద్రయ్య : ఏ స్తే యేసేయిగా పోసు—

గణేష్ : యీ యేసం నా కొడెందుకు నే—జోహాని మీద కెళ్ళింది మనసు—యిక్కడుందా?

చంద్రయ్య : (చిరునవ్వు నవ్వుతాడు)

గణేష్ : యీ స్తివా—నా కొతేదీ బాగదు లేదయ్యా.

[గంగులు వస్తాడు—60 ఏళ్ల మనిషి.]

గంగులు : ఆ పెద్ద మిసని సప్పుడుసేస్తూ యెళ్ళినప్పుడల్లా నా గుండె గజగజలాడతాది......

గణేష్ : మీవోడి గుండె పోడోయి.

గంగులు : యేటయింది మావోడి గుండెకి...

గణేష్ : ఆ కిరస్తానపోడి బొట్టమీద మనసుపోనాది...

గంగులు : పీటర్ గాడి కూతురా ?

గణేష్ : అఁ...అఁ...

చంద్రయ్య : యేటి సేదయ్యా-పల్లకో—

గంగులు : జోనానియా ?

గణేష్ : అఁ...అఁ...

చంద్రయ్య : గణేసు మావా...నాకోపం తెప్పించక.

గంగులు : నిజమేనా సంద్రులూ?

చంద్రయ్య : నిజమయితే సేటి అబద్ధమయితే సేటి ?

గంగులు : నిజవాఁ? అబద్ధవాఁ?

చంద్రయ్య : కిరస్తానవాఁ? మటిమాసే మడిసికి కిరస్తానమేటి...... మాలేటి...మాదిగేటి...అల్లా మొస్తున్నారా మట్టి?

గంగులు : జవాబు సెప్పు...నిజవా...అబద్ధవా?

చంద్రయ్య : నిజమయితే...?

గంగులు : ఎలాగౌతాది...నా ఒప్పందం సేకుండా.

చంద్రయ్య : గొడ్డు మాంసం, పందిమాంసం తిన్నేడు. అల్సు తిన్నదీ గొట్టెలే...

గంగులు : ఎల్లు...యిక్కడ్నించెల్లు...థూట్...నాకు మొకం సూపించమాక.

[చంద్రయ్య లేచి విసురుగా వెడతాడు.]

గణేష్ : కుర్రాడిమీద అంత అగ్గయి పోతా వేమన్నా...

గంగులు : ఆ కిరస్తాని ముండతో యీడికి యాపక మేటి.

గణేష్ : అఁ...కొంప మునిగిపోనాది...ఊఁ...సూసి ఒదిలేసాడు

గంగులు : యీడలాటి రకం కాదయ్యా. దాని కొంగట్టుకుంటే మరొదల్డు...యెందర్ని మరిగిందో ఆ ముండ...

గణేష్ : ఏదనుకొని...పిలక నలాగనక రయ్యోయి...అదలాటిది గాదు. మనకి తెలందుందా? ఓ పారోర్నిరు బాబు సెయ్యట్టి గుంజే తీసేసింది.

గంగులు : ఏఁవన్నా కిరస్తానం కిరస్తానమేఁ...దానిబుద్ధి సూపించు కుంటాదిలే, ఓరోజు.

[బుల్ డోజర్ శబ్దం ఎక్కువయింది.]

గణేష్ : సూడు...ఎంతెంత మట్టి తోలేత్తున్నారో.

గంగులు : అది పక్కనుంచెడితే గుండె ఒణుకు పుడతాది...దాని కింద పడితే యింక...

[పీటర్ వస్తాడు. ఒక కాలు లేదు. ఒకకర్రని రెండుచేతుల తోనూ పట్టుకుని, దానిమీద ఆధారపడి గంతులేస్తూ వస్తాడు. సెడసిన జుత్తు- 60 ఏళ్లుంటుంది వయస్సు.]

గణేష్ : మట్టి కరిగించి యినుము తీస్తారట...యినుము...

పీటర్ : (దూరంగా చూస్తూ) ఆఁ...తీస్తారినువు. యినుప మనుసు లంతా ఒచ్చి యినుప్ తీస్తారు...యిదంతా బొగ్గుసేత్తారు. మంటలు జేత్తారు...మట్టిని కాల్చి యినుప్ తీస్తారు...

గణేష్ : (గంగులుకు కన్నుగీటి) నీ బూమెక్కడుందో సూపవ్నా...

పీటర్ : నాబూఁవాఁ! ఆఁ...ఆఁ...అది సూసేవా...చిమ్మెం చేసి యినుపేసి కట్టేరు...కోటలోలాలేసింది ... అది నాబూఁవి...ఎకరాబూఁవి—రెండెకరాలు...చిన్నగుడిసె...కర్రనాగలి...నా జోహానా...పచ్చటి సెట్లు...పచ్చటి సేలు...రంగురంగుల పిట్టలు...నా జోహానా నవ్వేది.

గణేష్ : నవ్వేదీ! అప్పుడేటయింది?

పీటర్ : యేసుపెబువు నన్ను పరీచ్చసేదామనుకున్నాడు—కలరా ఒచ్చింది...నా కొడుకుని పిల్చుకున్నాడు—నా బూఁవి మీద అరుగో అది పేసింది...అయినా నా జోహానా ఉంది...జోహానా నవ్వుతాది.

గణేష్ : పెబువులాగేఉంది యెవ్వారం—ఆ దొరలొచ్చేరు—యెన కొక్క కతాపుతిన్ని గంటేసేరు...

గంగులు : పీటర్ తాతా! నీ కూతురు నా బొట్టెడిమీద కన్నేసింది—మాయలుజేసి వొళ్లో యేసుకుందామని చూస్తాందాది—

పీటర్ : నా జోహానోకి మాయలూ మర్మాలూ తెలీవు గంగులూ...

(చంద్రయ్య వస్తాడు)

గంగులు : ఆఁ...యెవడికి తెల్దులే, అడ్డమయినవోడితోటీ...

చంద్రయ్య: అయ్యా...

గంగులు : పోతాది...రంగెలీ...

పీటర్ : (కళ్ళు మూసుకొని, చేతులెత్తి ఆకాశానికి దండం పెడతాడు.)

చంద్రయ్య: (తండ్రిభుజం పట్టుకుని ఊపి) యేది మళ్లా అను...మళ్ళా కుయ్యి...నీ రకతం సూత్తాను...

గంగులు : (కొడుకుని వెనక్కితోసి రెండు లెంపలమీదా కొట్టి) పో! కుక్కయెదవా! నీ మొకం సూపించమాక...యీడి తల్లి చస్తే యీడ్ని యీ సేతులమీద పెంచినాను—పేణం...పోసి పెంచినాను...నా రకతం సూత్తావా? మద్ది నొచ్చిన ఆ బజారుముండే యీడికెక్కువయిపోనాదా తే నాకన్న? థూ! పోయెదవా...యీ జలమలో నీ ముకంనూ ఒట్టు...

గణేష్ : కొరాక్కునా మదుసులు!...

[చంద్రయ్య రాతిమీద కూచుంటాడు]

పీటర్ : దేవుడా! నీ బిడ్డలంసేసే పాపాలు చమించు.

గణేష్ : యెప్పుడూ ఆ దేవుడనే యేడుత్తావ్...

పీటర్ : పెబువు మనకోసం సిలువయెక్కి రకతం కారబోసేడు...

గణేష్ : నువ్వు కారపొయ్యి సేదూ!...సేను కారపొయ్యి సేదూ! రకతం...యినుముకోసం...

పీటర్ : పెబువు సెలవిచ్చిందదే...పరీచ్చకి నిలవాల...

గణేష్ : యేడిచినట్టుంది వోడకం...

పీటర్ : గణేసూ...మారిపోతావయ్యా సుడిసిని...యీపాటి కట్టాలకే యిలాగయిపోతే...

గణేష్ : నీకేం...పిచ్చినాకొండెవి...సెప్తావ్ తే కబుర్లు...

[జోహానో వస్తుంది—యవ్వనంలో ఉన్న యువతి]

పీటర్ : ఏ కట్టాలొచ్చినా నా జోహానో నాతోడుంటే...నవ్వుముకం అగుపడితే సాలు.

[ఆమెను దగ్గరగా తీసుకుంటాడు]

జోహానో : పీటయ్యా పకోళీ తినవా!

పీటర్ : తొందరేందమ్మా...నువ్వు తిన్నావా...

జోహానో : నాకు మనసెయ్య లేదియాల...

గణేష్ : యెవరిమీద!

జోహానో : నీమీద—ముసలోడివయినా పొగరడగలేదు గణేసు మావా...

గణేష్ : నువ్వే అడసాల పిల్లా...

జోహానో : అడుస్తాగాని...పని కెళ్ళవేటియాల...

గణేష్ : ఆఁ...యెడతాను...ఇంకా తూరపు తెల్లార్లేదు—బాదుగా యెదవపని...మట్టి తవ్వడం మొయ్యడం...పెందలనుండి సీకటయేవరకు...

జోహానో : (చంద్రయ్య దగ్గరకు వెళ్లి) ఏం...అలా అలోసిత్తూ కూకున్నావ్? పనికిరావా?

చంద్రయ్య : నా కియాళ యెళ్ళమనసొటలేదు...

పీటర్ : యిసారపడితే నాబం యేటుంది తండ్రీ...గుండె గేలిక జేసుకోవాల...

జోహానో: ఏటయిందయ్యా?

గణేష్ : రెండు పిట్ట లెగురుతున్నాయ్...యేటగాడొచ్చి ఒక పిట్టని వొలేసి పట్టుకున్నాడు...గూట్లో పెట్టేడు...

చంద్రయ్య : మడిసివికావు నువ్వు గణేసు మావా—యిచ్చకాల రాయిడి వయిపోతున్నావ్...

గణేష్ : యిచ్చకాలు నాకెలాగుంటదా? పిల్లామూ...పిల్లలా...ఆళ్ళని ఆ మరిడమ్మ మింగింది...నా బూమి ముక్కని అవకట్ట మింగింది...ఆ మహా వరద్దున తాపుతంతే యిక్కడొచ్చిపడ్డాను...యిదంతా యినుమట గదా...నేనొక యినప మడిసినయిపోనాను...

జోహానో : (నవ్వుతూ) అందుకే కడ్డీనాగున్నావ్...

గణేష్ : సెనినపమడిస్ని నా కుర్రోడా!...యిచ్చకాలోడ్నికాను...నాకేటి, యేదుపా నవ్వా?...అన్నీ అయిగాయి...అందరూ యేడవండి...సూత్తాను...

పీటర్ : కట్టాలు అనుబగించి నోసేమడిసి...దేవుడు మన్ని పరీచ్చ సెయ్యడానికే కట్టాలు పెడతాడు...దయిర్యం మున్నోడే పెబువుని సేరుకుంటాడు...

గణేష్ : యింకాప వయ్యా...

జోహానో : అడితోమేటి...ఎళ్ళయ్యా యెల్లిపకోలతిను...

పీటర్ : (వెనుతిరా) నువ్వు రారాదా! (వెడతాడు)

జోహానో : మావాఁ...నువ్వూ యెళ్ళి తిని రారాదా!

గణేష్ : ఆఁ...తింటే తింటాను...లేకపోతే లేదు.

చంద్రయ్య : (లేచి) మేం మాటాడుకోవాల...

గణేష్ : మాటాడుకోండి...

చంద్రయ్య : నువ్వేల యిక్కడకి?

గణేష్ : ఏమేటి? యిక్కడ వుండకూడదా...నవ్వమంటావా?

చంద్రయ్య : పోవా?

గణేష్ : యెక్కడికి?

జోహాన్ : అడితో యేటి...పద మరో సోటికి...

గణేష్ : పిలక్కి కోపమొచ్చిందా? బతగ్గలమూ? సరే యెడతా...

[వెడతాడు]

జోహాన్ ...ఏటి మాటాడాల...అంత రఅస్యం...

చంద్రయ్య : (ఆమె చేతులు పటుకుని) నామీదే మనసని మాటెయ్యి.

జోహాన్ : యిదా రఅస్యం...నీ కనుమాన మేల.

చంద్రయ్య : అవ్వాదా?

జోహాన్ : నీమీదే మనసు...అయిందా?

చంద్రయ్య : ఎప్పుడూ నామీదే మనసుంటాదా?

జోహాన్ : యెప్పుడూ నీమీదే మనసుంటాది...

గణేష్ : (నవ్వుతూవచ్చి) యెప్పుడు నీ మీదే మనసుంటాది... (కడుపు పట్టుకుని) అహ...హ—హో...

చంద్రయ్య : ఛీ! ముష్టినా కొండె...పక్కన్నక్కి యింటున్నావా? సిగ్గు నేదు?

గణేషు : సిగ్గ...సిగ్గ...(నవ్వి) మాటాడుకుందుకి మీకు సిగ్గ నేదు... యినడానికి నాకు సిగ్గా...యెప్పుడూ నామీదే మనసుంటాదా? యెప్పుడూ నీమీదే మనసుంటాది...

చంద్రయ్య : (మీదకివస్తూ) నిన్ను రకతం కక్కిత్తాను... దొంగ నాయేల...

గణేషు : అందరి రకతంకక్కిస్తు గాని...నీతల్లిరకతం కక్కించేవ్... మీఅయ్యరకతం కక్కిత్తావ్ ... నారకతం...జోహానా రకతం కక్కిత్తావ్ ... ఆకరికి యినువు నీరకతం కక్కిస్తాది .... (పోతూ) మనసుంటాది ... పిల్లా ... నీమీద నామనసు...నామీద నీమనసు...

జోహాన్ : అడితో నీకేటి ? పల్లకో ... ఆడి బొబ్బెడు పోయిన కొద్దీ మరి మరిలో నేదాడికి...

చంద్రయ్య : మరిదమ్మ తింది...

జోహాన్ : అలాగంటాడు...మహానది కొడకట్టి నారుకదా యేదో... రాల్లు సేలుత్తూ పోనాదు ... ఏమలాగున్నావియాళ?...

చంద్రయ్య : నన్నొదిలి యెళ్ళవుగదా ... మీఅయ్య సెప్పినా ... మాఅయ్య సెప్పినా? మాటెయ్య...

జోహాన్ : సరే మాటే...

చంద్రయ్య : యెళ్ళను...

జోహాన్ : యెళ్ను...సరా?

[కమలాపళ్ళతో ఒక సర్దార్జీ వొస్తాడు]

సర్దారు : సాంత్రా...మిఠాసాంత్రా...నాగ్ పూర్ సాంత్రా...

చంద్రయ్య : ఏఁయు, యెలాగ?

సర్దారు : తీన్...అనాజోడా...

చంద్రయ్య : దో అనా కియ్యి...

సర్దారు : యేరౌర్కెలా హైబాయీ ... యే రౌర్కెలా! (పోబోతూ) సాంత్రా...నాగ్ పూర్ సాంత్రా...

చంద్రయ్య : యిది రౌర్కెలా అయితే ఏటయింది? మేం మడుసులం గామా?

జోహాన్ : ఒకటెయ్య...

[డబ్బు తీస్తుంది]

చంద్రయ్య : నాకొడున్నాయి...నువ్వియ్యమాక...

జోహాన్ : నే నిత్తే నేటి...నువిత్తే నేటి...

సర్దారు : హంబీ జీనా పడేంగేనా సాబ్?

[పోతాడు]

చంద్రయ్య : నువ్వెందుకిచ్చేవ్...యిందు...ఉంచు...

జోహాన్ : నాకోపమొస్తాదిసుమా...

[పండు ఒల్చి సగం ఇచ్చి]

పుల్లా...

చంద్రయ్య : అంతా దగా యెధవలు...యిందు...డబ్బులుంచు...

జోహాన్ : యిదేటీ పిచ్చి...

చంద్రయ్య : ఆలోచిస్తూ ఏది నిలవుంచేను ... ఆర్నెల్లకీ ... ఆర్నెల్లకీ పదయితే...సంవత్సరాని కిరవై ...

జోహాన్ : యేటిజేస్తావ్ ...అంత డబ్బు...

చంద్రయ్య : మనకి పనికిరాదా?

జోహాన్ : నాదగ్గరేం నేదు...అయ్యని మరి నే సేసూడాలి కదా...

చంద్రయ్య : మీఅయ్యప్పుడు మనకొడుంటాడు...యిన్నావా?

జోహాన్ : ఒక చనం నే నగబడకపోతే తోసదు అయ్యకి...

చంద్రయ్య : మనకొడుంటా డంటున్నానుగదా...యినుము తయారీ మొదలేడితే మనకిల్లిస్తార్లే...

జోహాన్ : అప్పుడీ మట్టి పనుండదుగదా... యేం పని చేస్తాం?

చంద్రయ్య : సేత్తామంటే పనే ఉండదా...లచ్చ పనులు...ఈ గుడిసె ఒగ్గేయొచ్చు...మీద యేదామంటే గడ్డి కూడా నేదు...ఈ సెట్టుకొమ్మలతో గుడిసెలు...పలి...ఒర్షం... యిల్లిస్తే రాజుగా ఉండొచ్చు...

జోహాన్ : పని కేళయింది...సూర్యుడా సెట్టుమీద కొచ్చినాడు... ఆలస్యమయితే మేస్త్రీ అగ్గవుతాడు...

చంద్రయ్య : అయితే అతనీ ... ఆ డెప్పుడూ ... అగ్గవుతూనే ఉంటాడు...

జోహాన్ : నువెళ్ళు... నేన్నొ యెనకొస్తాను...

చంద్రయ్య : కొలువ ఆరడుగుల నోతయింది...మరొకడుగు తవ్వేస్తే గొట్టాలేత్తారట—రేపటికి పడతాయి గొట్టాలు...

జోహాన్ : అంత నోతు సొరంగం నోపట బయం బయం గుంటుంది నాకు...అంత నోతు తవ్వితే నేగాదా గొట్టా లెయ్యడానికి...

చంద్రయ్య : యెలాగయితే మనకేటి—మనపని ఆళ్ళకొక్కవాల... ఆళ్ళ డబ్బు మనకొక్కవాల...

మ్యారా టోపీలు పెట్టుక తిరుగుతారు...మా జోబీలు నింపుకుంటారు. 'బడాసాబ్'ల్తో కల్సిపోయి...అందుకూ మా అవుసరం మీకు...

గంగులు : యేటి గనేషూ...బాబునలాగంటావ్...అరు నేక పోతే యీ కూల్డబ్బులన్నా ముట్టకపోను...

గణేష్ : దరిద్రం యెదవ డబ్బులు...నేకపోతే పీడొదలిపోయి... ఒంట్లోని మడిసిపచ్చేక యెదవడబ్బులెందుకు...పని సెయ్యి...డబ్బు గడించు...తిను...పనిసెయ్యి...తిండానికి డబ్బు గడించు...డబ్బు గడించడానికి పని సెయ్యి... పిల్లామొద్దు...బౌ లై లొద్దు...నవ్వక్కర్నేదు...యేడవక్కర్నేదు...పండుగొద్దు పున్నవొద్దు...పని సెయ్యి... నా బూముంటెనా? యిటముంటే చేనోడ్ని లేకపోతే తొంగొనేవోడ్ని.

వ్యక్తి : ఓహో! తేరగా కూడుంటావనా? చెమటోడ్చాలి నాయినా...ఎద్దులా పని చెయ్యాలి...అప్పుడే నీకు తిండానికి హక్కు...

గణేష్ : ఛూ! యెళ్ళిక్కడ్నించి...నువ్వేటి సెవట కొరుత్తున్నావ్...బాబూసాబ్ లు ఏటిసెవటగారుత్తున్నారు... సెప్తారు కబుర్లు. పేన్ లకింద కూకొని...(వ్యక్తి కమీజు పట్టుకుని) యెందుకయ్యా నేను మన్ను తవ్వాల?

వ్యక్తి : (గాబరాగా) గనేష్! ఒదులు...గంగులూ...వీడ్ని పట్టుకో...

గణేష్ : నా కొడుకు పచ్చేడు...రాళ్ళు పేలుత్తూ సచ్చేడు... తుక్కు తుక్కయి యెగిరిపోనాడు...మూడొందలు సేతిలో యెట్టినారు...ఓ! సంతోసమయింది...సత్తే పచ్చేడు...మూడొందలు...

వ్యక్తి : (విడిపించుకుని) మూడువంద లిచ్చేరట! బాగానే ఉంది...

గణేష్ : నా కొడకా! నువ్వు మడిసివే? నీ మూడొందల కోసమట్టా కొడుకుని కన్నాను...కని, సంపుకున్నాను...

(వ్యక్తిని పట్టుకుని గట్టిగా ఊపుతాడు)

వ్యక్తి : (తప్పించుకుని వేగంపోతూ) గంగులూ, మళ్ళొస్తాను...

పీటర్ : యేటి గనేసూ...మతిపోయిందా? యేటయ్యా నీకమెక్కుపోతున్నావ్...

గణేష్ : యిది కొర్కనా నాయనా- యిక్కడి మడుసులు మడుసులు కారు...దెయ్యపు బతుకు బతుకుతున్నారు...

గంగులు : ఈయేళ వేసిన యేళ బాగోనేదు...దరిద్రపుకోటు రోజు...

పీటర్ : రోజులన్నీ ఒకటే...మనకలా కనుపిస్తాది...దేవుడ్ని నమ్మినోడికి సెడ్డ, మంచీ అన్నీ ఒకటే...

గంగులు : తీపి కబుర్లుసెప్పి మంచి సేదావను కుంటున్నావ్ గామోసు...అలా కుదరదయ్యోయి...నీ కూతురు మనసు మార్పు...నా కసలు తగువంటే యిష్టంనేదు...

[పెద్ద బుల్ డోజర్ శబ్దం]

యిదేటీ శబదం- అదుగో ఆ దెయ్యం కొలేను- పెద్దకొండని కూడా యెత్తేసాది...యేటన్నాయినా యిదన్నీ...గుండెల్నించి ఒణుకుపుడతాది...

[వెడతాడు]

పీటర్ : ఏ సుపెబూ! నీ బిడ్డలని కాపాడు...పాపాలు...

గణేష్ : పొలాపవయ్యా...యిది మా 'సరిచి' గాదు...

[దూరంగా కోలాహలం వినిపిస్తుంది]

పీటర్ : యేటా గోల...

[కళ్ళకి ఎండ తగలకుండా చెయ్యిఅడ్డుపెట్టుక చూస్తాడు]

గణేష్ : ఈ యూనియిన్ మడిసి ఏదో తగవు పెట్టుంటాడు... ట్రయిక్ జేయిస్తానని ఏదో చేసుంటాడు...

పీటర్ : అద్నలా గన్నావు కాని, కల్సి, సంగంగా ఉండడం మంచిది కాదా గనేసూ మనకి...

గణేష్ : నా కక్కర్లే—డబ్బుతో కూళం యేత్తారు మడుసుల్ని...

గంగులు : (వచ్చి) ఏటేదో, గోలనాగుంది...

పీటర్ : మనోళ్ళదో తగూ సేత్తున్నా రంటున్నాడు గనేసు...

గంగులు : ఏదో అంతా మూగినారు...మా సంద్రులక్కడే ఉన్నాడు.

పీటర్ : యూనియన్ మడిసేదో పురెక్కించుకుంటాడు—సీటికీ మాటికీ యీ తగవు లిష్టంలేదు నాకు...జోహాన్ అక్కడే ఉంది...

[ఇద్దరు కూలీలు పరుగెత్తుకొస్తారు.]

1 కొలవ కూలిపోనాది!

2 : 'కొరినా' పక్కనించెళ్ళింది. నూత్తూ ఉండగానే కుడిసెంప దభీమని కూలిపోనాది...

గంగులు : అయితే యేటయింది! యిప్పుడేటయింది! అందులో యెవరుండిపోనారు...సెప్పవయ్యోయి దేవుడా...

[ఒక యువతి ఏడుస్తూ వస్తుంది]

యువతి : గంగులూ...పీటర్ తాతా...మా బోట్ల ఇద్దరూ ఉండిపోనారు లోపల...కొలవనిండా మట్టినిండి పోనాది...

పీటర్ : (కర్ర విసిరేసి కూలబడి) యేటీ! యేటి...

గంగులు : (యువతి బుజం పట్టుకుని) ఆ!...ఆ?

యువతి : జోహాన్...మన జోహాన్ నేదు...అయిపోనాది... నాని పనీ, సెంద్రులు పనీ అయిపోనాది...

1 : అయిదుగురు మడుసులుండిపోనారు మట్టికింద...

గంగులు : (నేలమీద దొర్లుతూ) ఓరి తండ్రీ సంద్రులూ...విన్నిందుకే పెంచినానా అయ్యా...

(ఒంటినిండా ధూళి పులుముకుని పరుగెత్తి పోతాడు అరుస్తూ)

పీటర్ : నీ నవ్వుముకం నేదా జోహాన్ తల్లి...నాకు నువ్వు మరి అగబడవా సిట్టి తల్లి...

[కర్ర తీసుకుని కుంటుకుంటూ పోతాడు.]

ఎర్రటోపీ వ్యక్తి : (వచ్చి) పింఛీనూం...పాపం...

గణేష్ : యింతకొచ్చిశావ్ వాళ్ళేలా, మళ్ళా!

వ్యక్తి : మనుషులు కావాలి. మన్నంతా తీస్తేగాని వాళ్ళ కేకాలు బైటపడవ్...ఎవ్వడూ రాడు...

శి : తవ్వుతూంటే మళ్ళోయేపు మన్ను జారిపోతే...

గణేష్ : కొంతకే రెండేళ్ళలా బల్లలెందు కట్టలేదు కాపు!? యింత్ర టోపీ పెట్టుకుని తిరుగుతారు...అల్లి డబ్బు ఖర్చయి పోతాది...బల్ల ఒకోటి పదిరూపాయలౌతాది...అన్ని కావి ఎయ్యడానికి డబ్బవుతాది...మేమయితే రూపాయి కొకళం దొరుకుతాం...సచ్చినా మరో రూపాయి! మరోడు......మీ కోబీలు నిండిపోయినాయి...మీరు పల్లకున్నారు పల్లగా...

వ్యక్తి : యివాళ నువ్వు మనిషివి మనిషిలా లేవు...

పీటర్ : (కుడినుండి వచ్చి ఎడమ వేపు పోతూ) జోహానో...నా జోహానో...యేదీ నువ్వు తల్లీ...(పోతాడు)

గణేష్ : యిళ్ళు......యేగ మెరుపు......యింకా యిక్కడే ఉన్నావా? నీకో మూడొంకలు ...అదికో మూడొందలు ...యిస్తాల్లె, ఓ! సంతోషమే...ఓ! బ్రహత్ కుషీ!

ఒక తలంపటి వ్యక్తివచ్చి : యింకా దొరకలే మనుష్యులు ...మన్నంతా తీస్తేగాని గొట్టాలెయ్యడాని కవదు......ఔవలది పూరానిండిపోయింది...ఎల్లుండికిపనవకపోతే బోల్డు నష్టం...

గణేష్ : (పిచ్చివాడ్లా)...డొను పనైపోవాల...పని—డబ్బు... డబ్బు...పని...పీటర్ తాతా......గంగులూ! మూడేసి వొందలు...ఎల్లుండికి పనైపోవాల పద... నేనొస్తాపద... తవ్వుతానుపద..తవ్వా...మెయ్యి...తవ్వా..మెయ్యి...

తలం॥ వ్యక్తి : (వేదాంతి లా ముఖం పెట్టి తాపీగా హిందీలో) కభీ కభీ ఐసా హోజాతా హై—కొర్కడా బనానే కా కామ్ హైనా? కంపెన్సేషన్తో మిలేగా!

[బుల్డోజర్ శబ్దం ఎక్కువయి వినిపించి దూరమవుతూ ఉంటుంది] —తెర.

# ఆంధ్రరాష్ట్రములో చేతిపరిశ్రమలు

శ్రీ ఆర్. వి. రావు

చేతిపని పరిశ్రమల ప్రాధాన్యత కొద్ది మంది పనివారికి ఉపాధిని కల్పించడంలోనే గాక కళానైపుణ్యంతో ఒకతరం వారి సంస్కృతి, నాగరికత, ఆశల్ని ప్రతిబింబింపజేయడంలో వాటికి గల సామర్థ్యం ప్రస్ఫుటమవుతుంది. బంకమన్ను, చింకిగుడ్డలు, దారం, పచ్చగడ్డి, ఆకులు, కొయ్య, వృక్షసంబంధమైన రంగులు ఏదో సృష్టించాలనే మనస్సుకూ, అభావాలకు ఆకృతిని కల్గించాలనే చేతులకు ముడిపదార్థాలుగా ఉంటున్నవి. ఈ పరిశ్రమలు తరతరాలుగా వస్తున్న మన సంస్కృతి సంపదల్ని సంరక్షిస్తున్నవి. ఆంధ్రప్రదేశ్ శిల్పుల తాత ముత్తాతలే అమరావతీ, ఎల్లోరా; అజంతా గుహల శుభయుతమైన రాతి చెక్కడాలకు, శిల్ప కళకూ బాధ్యులు. అవి నమూనా పనిగావుంటూ నేటికీ అనేక మంది శిల్పులకు ప్రోత్సాహాన్నిస్తున్నవి.

మన చేతిపని పరిశ్రమలో మూర్తీభవించిన నమూనా, వర్ణము, ఆకృతి పరిణామము శతాబ్దాలుగా జరుగుచున్న పరిశోధనల పరిణామ కథ, కాలగమనంతో సంపూర్ణత్వం సాధించబడింది. ఎన్నటికీ కాంతివిహీనం కాని నిర్మల్ గోలు ఉత్పత్తి విధానం, బిద్రీవేర్, ఆటవస్తువులకు పంకి కర్రను ఎంచుకోవడం, శెవర ఆకులతో లక్కపూతగల వస్తువులకు మెరుగుపెటడం, గొర్రె బొచ్చునుండి కంబళ్లను తయారుచేయడం అనేక సంవత్సరాల పరిశోధనల ఫలితంగా రూపొందించబడినవి.

## పిల్లల ఆటవస్తువులు

మనకు చిరకాలంగా ఆటవస్తువులున్నవి. పిల్లలకు ఆటబొమ్మలు కలిగించె వేడుక అపారమయినది. ఆంధ్రప్రదేశ్‌లో కొండపల్లి, నిర్మల్, నక్కపల్లి, ఏటికొప్పాక, తిరుపతి మున్నగు చోట్ల ఆటవస్తువులు తయారుచేయబడతాయి. ఈ ఆటవస్తువులు యాంత్రికమయినవి కావందున పిల్లలే వాటిని కదల్చవలసివస్తుంది. ఆ విధంగా వారికి మానసిక ఆనందం కలుగుతుంది. పక్షులు, జంతువులు, కూరగాయలు, ఫలములు, దేవతలు, దేవుళ్ల ప్రతిమలు, గ్రామజీవనానికి సంబంధించిన ఇతర వస్తువులకు ప్రాతినిధ్యం వహించే బొమ్మలు చేయబడుతాయి.

### కొండపల్లి బొమ్మలు :

కొండపల్లి ఆటవస్తువులు ముఖ్యంగా గ్రామీణ జీవనాన్ని ప్రతిబింబించే ఆ చిన్న వస్తువుల పూర్తి సెట్—చాల ఆకర్షకంగా ఉంటాయి. ఒక సెట్‌లో సామాన్యంగా పైన గడ్డికల కొంకు గుడిసెలు, అందున్నవారు పనిచేయడం, స్త్రీ అవుపాలు పిండడం లేక బావినుండి నీరు తోడడం, లేక ధాన్యం దంచడం [illegible] మగవాడు ఆవు లేక మేకపాలు పిండడం, అంబారీతో ఏనుగు, కల్లు గీతవాడు మున్నగు బొమ్మలుంటాయి.

### నిర్మల్ ఆటవస్తువులు :

ఈ ఆటవస్తువులు వాస్తవికమయినవి. అవి ప్రకృతిని యథాతథంగా ప్రతిబింబింప జేస్తాయి. అనేక సహజమైన వస్తువులలో ఒక ఆటవస్తువు కలిస్తే దానిని గుర్తించడం చాల కష్టం. నిర్మల్ ఆటవస్తువులలో పసువులు, పండ్లు, కాయగూరలు, నెమలి, చిలుక, కోడిపెట్ట, చిలుతపక్షి, మైనాలాంటి పక్షులు మున్నగునవి ఉంటాయి. ఈ ఆటవస్తువులు స్థానికంగా లభించే గానుగ చెక్కలో తయారుచేయబడుతాయి. వారు వేసేరంగులు వాస్తవమైన వాటిని పోలినట్లుంటాయి.

### నక్కపల్లి ఆటవస్తువులు :

నక్కపల్లి, ఏటికొప్పాక ఆటవస్తువులపై లక్కపూత ఉంటుంది. వంటపాత్రలు, బళ్లు, రైళ్లు ఇంజన్లు నమూనాలు, గ్రామఫోనులు, పండ్లు, పిల్లలకు వేడుకను కల్గించే ఇతరవస్తువులు ఇందు ఉంటాయి.

గుడివాడ సమీపగ్రామాలలో బంకమన్నుతో చేసే బొమ్మలు, కాగితపు బల్బులను ప్రత్యేకంగా పేర్కొనవలసి వుంది.

### తిరుపతి ఆటవస్తువులు :

తిరుపతి ఎఱ్ఱకఱ్ఱ ఆటవస్తువులు ప్రత్యేక తరగతికి చెందినవి. అవి మనుష్యుల దేవుళ్ళ బొమ్మలుగా వుంటాయి. ఒక అంగుళం నుండి అడుగున్నరవరకూ ఎత్తు మారుతుంటుంది. ముడి పదార్థాల తొలిరంగు పసుపు పచ్చగాగాని, ఎర్రగాగాని, యథాతథంగా వదల బడటంగాని, దానిపై రంగు వేయడంగాని జరుగుతుంది. దొడ్డల చెరువు, మాధవమాల, శెట్టిగుంట, తిరుచానూరు గ్రామాలలో కూడ ఇవి ఎక్కువగా తయారు చేయబడతాయి. తిరువేంద్రం, మద్రాసు, బొంబాయి, ఢిల్లీలాంటి ప్రదేశాలకుకూడ ఇవి ఎగుమతి చేయబడుతాయి.

## వరంగల్, ఏలూరు తివాసీలు

తివాసీలు గదికి శోభను చేకూర్చుతాయి. గది వాతావరణ వైచిత్ర్యం శోభను కూర్చు వస్తువులంటే నేలపై పరిచే తివాసీకే ఎక్కువ ప్రాముఖ్యత గురిచేయగలవు.

వరంగల్ తివాసీలు నేతానికి ఆంధ్రప్రదేశ్ కు సర్వ కారణం. 1857 సంవత్సరంలోనే లండన్‌లో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య ప్రదర్శనంలోనికి వచ్చిన కంబళ్ళలో వరంగల్ వి—ముఖ్యంగా దక్కన్ రగ్గు అనబడేవి—ఉత్తమ మయినవి. అవి సిల్కు, ప్రత్తి లేక ఉన్నితో నేయబడతాయి. ఈ ఉన్నికంబళ్ళు, ఉన్ని తివాసీలలో ప్రతి అడుగుదారంలో రంగుపూలు పట్టుబడుతుంది. ఈ తివాసీల డిజైనులు పర్షియా డిజైనులను పోలినా స్థానిక సమాజాలలో మేళవించ బడతాయి. ఈ డిజైనుల రంగులు స్థానికంగా లభించే పూలతోనే సమ్మేళితం చేయబడతాయి.

పశ్చిమ గోదావరిజిల్లా కేంద్రమయిన ఏలూరు ఉన్నితివాసీల నేతపరిశ్రమకు ప్రఖ్యాతిగాంచినది. అక్కడి పరిశ్రమ 18 శతాబ్ద మధ్యభాగమునుండి పెద్దఎత్తున సాగుతున్నది. జిల్లా ఎగువ తాలూకాలలో పెంచబడే గొర్రెలనుండి స్థానికంగా లభించే ఉన్ని ఈ పరిశ్రమకు ప్రధాన ముడిపదార్థం. స్థానికంగా సుమారు 83,000 పౌనులు ఉన్ని కురుమలు లేక గొల్లవారినుండి లభిస్తుంది. అది తెలంగాణా ప్రాంతంలోని సమీపజిల్లాలనుండి కూడ సేకరించ బడుతుంది. ఏలూరు వైల్ కార్పెట్ వీవర్సు సహకార సొసైటీ 150మంది సభ్యులతో 1937లో ఏర్పడింది. ఈ సొసయిటీకి వెలుపల కూడా తివాసీలు ఉత్పత్తి చేసేవారు చాలమంది ఉన్నారు. ఏటా 25,000 చదరపు గజాల తివాసీల ఉత్పత్తి అవుతున్నట్లు అంచనా వేయబడింది. అందు చదరపు గజం రు 12-8-0 నుండి రూ. 80-0-0 వరకు ఉంటుంది. ఢిల్లీలోని ఇండియా స్టాండర్డ్సు ఇన్స్టిట్యూట్ చే సరియైన స్థాయిని రూపొందించడానికి ప్రభుత్వం తగు చర్యల్ని గైకొన్నది. అది మున్ముందే రూపొందించబడినది.

## అద్దకపు పరిశ్రమ

భారతదేశంలోని అద్దక వస్త్రాల చరిత్రలో ఆంధ్రప్రదేశ్ లోని అద్దకపు కళ అద్వితీయమైన అధ్యాయం. ఆంధ్ర అద్దకపు కళా నైపుణ్యం, సాంప్రదాయాలను అవగాహన చేసుకోడానికి అ వివరాలను గమనించడం అవసరం. దీని రంగులు స్థానిక అడవులలోని వేరడు, పువ్వులూ, ఆకులనుండి సంపాదించబడేవని, రసాయనిక పదార్థాలు, బంకమన్ను, పేడ, నదీతీరంలోని ఇసుకనుండి సాధించ బడినట్టివి; డిజైనులు కూడా దేశీయసంస్కృతిని ప్రతిబింబించే శక్యమైన, నిరాడంబరమైనవిగా ఉండటంతో ఈ అద్దకం పూర్తిగా దేశీయమైనది. అద్దకపు విధానాలలో ముఖ్య మైనవి మూడు: (1) రెసిస్టుస్టయిల్ లేక నీలిమందు విధానం, (2) అలిజరైన్ లేక డైడ్ స్టయిల్, (3) టై అండ్ డై విధానం.

### 1. రెసిస్టుపద్ధతి లేక నీలిమందు విధానం

### కలంకారి అద్దకాలు

బందరు (మచిలీపట్నం)లోని కలంకారీ అద్దకం రెసిస్టు పద్ధతి లోనిది. స్థానిక వృక్ష సంబంధమైన రంగులతో వస్త్రాలకు అద్దకాలు వేయబడును. తెల్లగా ఉండవలసినచోట్ల కలం లేక బ్రష్‌తో మైనపు చుక్కలు పెట్టబడును. వాటికి రంగు అంటుకోదు. కలంకారీ అద్దకం కళావైభవాన్ని ప్రస్ఫుటింపజేసే విధానం రామాయణ, మహాభారత కాలంనాటి పురాతన కథల్ని జ్ఞాపకం చేసేటట్లు బొమ్మలు ముద్రించబడతాయి. పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లులోని దేవాలయం ఇంకా దక్షిణ దేశంలోని అనేక దేవాలయాలలో పురాతన కలంకారీ అద్దకాల మచ్చుముక్కలు కనిపిస్తాయి. ఇటీవలగా అందమైన చీరలు, దుప్పట్లు తయారీకి ఈ అద్దకం వినియోగించబడు తున్నది. అనేక నమూనాలతో, బంగారుఛాయ అంచుగల కలంకారీ వస్త్రం కింఖాబ్ (Kim Khab) వలె మెరుమిట్లు గొల్పుతుంది. కలంకారీ అద్దకాలకు ఎగుమతి మార్కెటుకూడా బాగావున్నది.

### 2. అలిజరైన్ (మెదక్) పద్ధతి

అలిజరైన్, మోర్డెంట్, వెంట్ డైయింగ్, పలంగ్-పోష్, కర్టెన్ తెరలు, మెత్తకవర్లు, మున్నగువాటి అద్దకానికి వినియోగించ బడును. దుప్పట్లు, లంబాడీస్త్రీల దుస్తుల అద్దకానికి కూడా ఈ విధానం ఉపయోగించబడుతుంది. హైదరాబాద్ లోని లంబాడీ స్త్రీల ఈ అనాగరిక అలంకరణ, శృంగారము చూసి విదేశీయుల కళ్లు చెదరినవి.

### 3. టై అండ్ డై స్టయిల్స్

టై రెండు పద్ధతులద్వారా దేశీయమైన అద్దకం జరుగుతుంది. నూలుకు రంగువేసే విస్తృత విధానంతో పోచంపల్లి, చీరాలలో అట్టి ఫలితాలే సాధించబడుతున్నవి. అందు అడ్డముగా, నిలువుగా వుండే ప్రతి నూలుదారమునకు ముందుగా నిర్ణయించబడిన నమూనాలో రంగువేయబడుతుంది. పోచంపల్లి అద్దకాలు ప్రత్యేకత అద్ద కానికంటె ఉత్తమంగా ఉన్నట్లు తేలుతుంది. ఈ విధంగా రంగువేయబడిన నూలు, నేత అనంతరం మెత్తగా అందంగా వుంటుంది. ఈవిధానంలో పోచంపల్లి రుమాళ్ళు, చీరాల 'తేలియా' రుమాళ్ళు, మిర్యాలగూడ చేనేత చీరలు తయారుచేయబడుతున్నవి.

ఇటీవలగా పోచంపల్లి చీరలు స్త్రీలను బాగా ఆకర్షిస్తున్నవి. దేశమంతటా అమ్మబడుతున్నవి.

## చీరాల-పేరాల ఆసియా రుమాళ్ళు

ఇక్కడ చేనేతవారు అవలంబించే విధానం పోచంపల్లి చేనేత కార్మికులు అనుసరించే విధానంవలెనే ఉంటుంది. ఈవిధంగా చీరలు, ఇతర వస్తువులను కూడా తయారు చేయడం వాంఛనీయం.

## మహబూబ్‌నగరం చాపలు

చాపలు ఈ రోజులలో గ్రామ కుటీరాలలో నేగాక ఆధునాతన గృహాలను అలంకరించడంలోకూడా అవసరంగా వున్నవి. బంగారు ఛాయగల వీటి ఆకర్షణ, కూర్చోడానికి సౌఖ్యంగా వుండటం, తేలిగ్గా, ఎక్కడికయినా తీసికొని పోవడానికి గల సౌలభ్యంవలన అవి మరింతగా ప్రజల్ని ఆకర్షిస్తున్నవి. మహబూబనగరం జిల్లా రుసుకుండ గ్రామంలోని ముసలేక ప్రత్యేకవర్గంవారు చాపల నేతలో ఆరితేరినవారు. ఆ సమీప చెరువులు, కుంటలలో పెరిగే తుంగగడ్డితో వారీ నేతను సాగిస్తున్నారు. రాష్ట్రంలోని వివిధప్రదేశాలలో అందమైన చాపలు తాటి ఆకులతో తయారుచేయబడుతున్నవి.



బిద్రీ పూజవని కూజా

## బిద్రీ వేర్

అరేబియా, పర్షియాలలో ఉక్కు లేక రాగిపై బంగారు, వెండి పొదుగుటకు సంబంధించినదే ఈ హైదరాబాద్ కళ అత్యంత పురాతనమైనది. అయితే బిద్రీ వేర్‌లో ఉపయోగించబడే లోహం, తుత్తునాగం (జింక్) తో కూడిన మిశ్రమ లోహం. అది సీసంవలె కాంతిహీనంగా ఉంటుంది. అయితే ఆ వస్తువు చివరకు నల్లగా తయారై వెండికి చక్కని శోభను కూర్చుతుంది. సాంప్రదాయకమైనా, డిజైనులలో ఆధునాతన అవసరాలు, అభిరుచులకు తగిన ఏర్పాట్లు కావించబడును.

ప్రారంభంలో పళ్లెములు, కూజాలు, హుక్కాలు, మసాలా వస్తువు లుంచే పెట్టెలు, పూలగుత్తు లుంచు పాత్రలు మున్నగునవి తయారయ్యేవి. ఈ లోహం రోగనివారణ గుణాలను కలిగివుంటుందనే నమ్మకం వ్యాపించినందున వీటి పాత్రలకు కూడ చాల గిరాకీ ఉండేది. ఇప్పుడు సిగరెట్ పెట్టెలు, ఏష్ ట్రేలు పూలగుత్తు లుంచే పాత్రలు, కప్పు మున్నగునవి తయారుచేయబడుతున్నవి.

## మెటల్ వేర్

ఆంధ్రప్రదేశ్ లోని రాగిపాత్రలు, ఇత్తడి పాత్రలకు చక్కని సాంప్రదాయకమైన డిజైను లున్నవి. ఫ్రెట్ వర్కు, చెక్కడు ద్వారా నమూనా రూపొందించబడుతుంది. పెంబర్తి, సికింద్రాబాద్, పెల్లూరు, కాళహస్తిలలో ఈ పరిశ్రమకు ముఖ్యమైన కేంద్రా లున్నవి.

## నర్సాపురం లేసు

నర్సాపురం, పాలకొల్లులలోను, నర్సాపురం తాలూకాలోని సుమారు 60 గ్రామాలలోను లేసు (అల్లిక) పరిశ్రమ విస్తృతంగా సాగుతున్నది. ఈ పరిశ్రమకు కావలసిన ముడి పదార్థం పత్తిదారం మాత్రమే. పరికరం ఉట్టిసూది. విలువైన లేసు పనికి డైమండ్ దారం ఉపయోగించబడుతుంది. ఈ లేసు ఉత్పత్తిలో సుమారు 5,000 మంది ఇప్పుడు పనిచేయుచున్నారు. ఉత్పత్తి చేయబడుతున్న లేసు రకాలు (1) టేబిల్ గుడ్డలు, (2) టీక్లాత్ అంచులు, (3) బట్టలకు అందాకృతిగల కేంద్రాలు, (4) లేసు అంచులు.

ప్రపంచ మంతటా శతాబ్దాలుగా గృహిణులు దుస్తులకు లేసు వేయడం కొనసాగుతున్నది. భారతీయ లేసు మృదువుగా మంచి పనితనాన్ని కనబర్చుతుంది. గోడలకు వ్రేలాడవేసేందుకు కూడా చక్కని నమూనాలలో లేసు ఉపయోగించబడుతుంది.

## వెండినగిషీపని

కరీం నగరంజిల్లాలో నిపుణు లయిన కంసాలీ మృదువైన పనితనం ఈ పనిలో ప్రత్యేక మవుతుంది. నేడు ఇది చాల అరుదైన చేతిపని పరిశ్రమగా నున్నది. కొద్దిమంది నిపుణులైన శిల్పులు, కంసాలులు మాత్రమే దానిని చేయగల్గుతున్నారు. వారు అతి సన్నని వెండి తీగతో పనిచేసి వల రంధ్రములు గల తీగలతో చాలసున్నితమైన, అద్వితీయమైన డిజైనులను రూపొందిస్తున్నారు. ఈపరిశ్రమలో సుమారు 130 మంది పని చేస్తున్నారు. ఈ పరిశ్రమలో ఉపయోగించబడే పరికరాలు అతి స్వల్పమైనవి. ఉత్పత్తిచేసేవస్తువులలో ఏష్ ట్రేలు, గాజులు, పోకచెక్కల పెట్టెలు, బొత్తాములు, బరణీలు, సిగరెట్ కేసులు, పూలగుత్తు లుంచే పాత్రలు, మెడల్సు, కాగితాలు కోసే కత్తులు, ఫొటో ఫ్రేములు మున్నగునవి కలవు.

ఇటీవల ఆభరణాలు దుస్తుల తయారీకి లోలకులు, గొలుసులు, కర్ణాభరణాలు, కడియాలు మున్నగువాటి ఉత్పత్తికి వెండి నగిషీపని ఉపయోగించబడింది. అవి ధరించిన వారికే గాక చూసేవారికి కూడ చాల ఆనందాన్నిస్తాయి.

## నిర్మల్ పరిశ్రమ

నిర్మల్ అంటే స్వచ్ఛమయిన పని అని అర్థం. స్వచ్ఛమైన, శోభాయమానమైన ఈ నిర్మల్ వస్తువులు పేరును సార్థకం చేస్తున్నవి. డిజైనులు కాంతివంతమైన రంగులతో పొందిక ఉండేటట్లు మెరుస్తూవుండే వల్లని లేక బంగారు ఛాయగల భాగం వెనుక ఉంటుంది. చక్కని కొమ్మలు, పువ్వులు, ఆకులతో చాల జాగ్రత్త, సమర్థతతో ఈ డిజైనులు ఎంచుకోబడుతాయి. ఎన్నటికీ కాంతి విహీనం కాని వెండి, బంగారు రంగులతో ఆ డిజైనులు మరింతగా ప్రకాశవంతం కావించబడుతాయి. గౌతమబుద్ధుడు, నటరాజు, కాళిదాసకవి, జోలకొట్టువాండ్లు, చిత్రాలుగల నిర్మల్ ప్లేట్లు, పురాతన మొగల్ చిత్రకళను జ్ఞాపకానికి తెస్తాయి. ఎత్తుపీటలు, బల్లలు, కుర్చీలు, టేబిల్ ల్యాంపులు, మంచాలు, సోఫాలు మున్నగు ఫర్నిచర్ సామగ్రి తయారవుతుంది. నిర్మల్ సిగార్ కేసులు, సిగరెట్

కేసులు కూడ ఖ్యాతిగాంచినవి. ఈ వస్తువులు చాల ప్రఖ్యాతి గాంచడంవల్ల విదేశాలకు కూడా ఎగుమతి అవుతున్నవి.

తుంది. ఆ తరువాత ఈ కంబళ్ళపై ఎంబ్రాయిడరీ పని చేయబడు తుంది.



ఆంధ్రదేశమునకు గర్వకారణమైన బిద్రీపూజపని సామానులు.

## దంతము, కొమ్ము పరిశ్రమ

దంతము, తాబేలు పెంకు, కొమ్ము పరిశ్రమ ఆంధ్రప్రదేశ్ చేతిపని పరిశ్రమలలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించియున్నది. ఈ పరిశ్రమ విశాఖపట్నం, సికింద్రాబాద్ లలో ఉన్నది. దంతమును తాబేలుపెంకుపైన మంచిగంధపు చెక్కపైన చెక్కు డ్రైట్ వర్కులో కత్తి, ఉలిలాంటి స్వల్పమైన పరికరాలే పనిపోతాయి.

## చర్మకారపరిశ్రమ

ఆంధ్రప్రదేశ్ లోని తోలుపరిశ్రమలలో స్త్రీల హ్యాండు బ్యాగులు, పర్సులు, బుక్ కవర్లు, ఫ్యాన్సీ స్యాండిల్సు, తయారు చేయడం ముఖ్యమైనవి. ఈ చేతిపరిశ్రమ శాంతినికేతన్ స్టయిల్ లో అభివృద్ధి చేయబడుతున్నది.

## కంబళీపరిశ్రమ

మహబూబునగరంజిల్లాలో తయారుచేయబడే చక్కని కంబళ్లు మెరుస్తుండే నల్లటిరంగును కలిగివుండును. ఉపయోగించే నూలు చాల సన్నంగా వుంటుంది. దేశీయ మగ్గంపై నేతపని జరుగు

## కుండలు

ఇటీవల కుండల అద్దకంలో ఒక క్రొత్తపద్ధతి హైదరాబాద్ లో రూపొందించబడింది. పూలగుత్తులుంచే పాత్రలు ఏష్ ట్రేలు, గిన్నెలు మున్నగునవి బంకమన్నుతో తయారు చేయబడుతాయి. ఆతరువాత బంగారు వన్నెగల చుక్కలు చల్లబడుతాయి. ఆతరు వాత నూనె పెయింటులు వేయబడుతాయి.

## గాజులు, పూసల పరిశ్రమ

గాజులు, పూసల పరిశ్రమ ఆంధ్రదేశంలో చాల అభివృద్ధి చెందుతున్నవి. చిత్తూరుజిల్లా పాపానాయుడుపేట మున్నగుచోట్ల ఉత్తమ శ్రేణికి చెందిన గాజుపూసలు తయారవుతున్నవి. పాపా నాయుడుపేట కేంద్రాన్ని కొంతకాలం క్రితం సందర్శించిన ఒక విదేశీ నిపుణుడు వెలిబుచ్చిన అభిప్రాయం గమనార్హమైనది. ఆయన స్వీడన్ కు చెందిన గాజు నిపుణుడు. ఆంధ్రప్రదేశ్ లో పర్యటించి నపుడు పాపానాయుడు పేట వెళ్ళి ఆధునిక యంత్రాల సహాయం లేకుండా అంత ఉత్తమశ్రేణికి చెందిన గాజు పూసల్ని అక్కడి పని వారు చేయడం ఎలా సాధ్యమాకి అనే తన సందేహాన్ని తీర్చు

గ్రామము, చిత్తూరు జిల్లాలో నారాయణవనంపేట, అనంతపురం జిల్లా గుత్తూరు, విశాఖపట్నంజిల్లా సింహాచలం, మహబూబు నగరంజిల్లా గాజులపేట ఈ పరిశ్రమకు ప్రధానకేంద్రాలు.

## సంగీత వాయిద్యాలు

సరస్వతీదేవి పేరుతో వినవచ్చే వీణ, శ్రీకృష్ణుని పేరుతో మనకు స్ఫురించే ఫ్లూట్ తూర్పుగోదావరిజిల్లాలోని పిఠాపురంలో తయారు చేయబడుతాయి.

## జనగామ పూసల ఎంబ్రాయిడరీ

జనగామలోని పూసల ఎంబ్రాయిడరీ పని ఇటీవల రోజులలో చాలమందిని ఆకర్షించింది. చిన్నవైన తెల్లనివి, రంగులవి, పూసలు వివిధ ఆకృతులలో, డిజైనులలో రవికల గుడ్డపై అమర్చబడుతాయి. అవి చాల ఆకర్షణీయంగా కనిపిస్తాయి. గాజుముక్కలు నిర్దిష్టమైన కొలతామునందులలో అతికించే లంబాడీ ఎంబ్రాయిడరీ కూడ సాంప్రదాయకమైన నమూనాలతో చాల ఆకర్షవంతంగా ఉంటుంది.

## పేము, వెదురు వస్తువులు

నాగరికత ప్రబలిన నాటినుండి వెదురు అనేకపనులకు వినియోగించబడుతున్నది. బుట్టలు, టేబిల్ ల్యాంపులు, కుర్చీలు, బల్లలు మున్నగునవి వెదురు, పేములలో చేయబడుతున్నవి.

## ఆంధ్రప్రదేశ్‌లో వస్త్రాలు

ఆంధ్ర ప్రదేశ్ లోని వస్త్రాలు చక్కని నేత, అద్వితీయమైన డిజైనుకు ఖ్యాతిగాంచినవి. రంగుల పొందికను బాగుగా అవగాహన చేసుకున్నవారు వాటికి రంగులను నిర్ణయిస్తారు. వాటిని అలంకరించడానికి స్వచ్ఛమైన బంగారు, వెండి దారాలు ఉపయోగించబడుతాయి. అనేక రకాలయిన వస్త్రాలు చేతితో వడికిన నూలులో లభిస్తాయి. గనుక తనకు యిష్టమైన ఫ్యాషన్‌గల గుడ్డలన్ని తేలిగ్గా పొందవచ్చును.

### పోచంపల్లి చీరలు :

పోచంపల్లి గ్రామంలో తయారయ్యే చీరెల పమిట అంచులలో ప్రతిబారముకూ విడిగా రంగు అంటేటట్లు ఒక నమూనాలో చక్కగా రంగు అద్దకం జరుగుతుంది, మెత్తగా ఉంటుంది. ఈ చీరలను అన్ని సందర్భాల లోనూ వాడవచ్చును. వాటికి పొందిక కుదిరే రవికెలగుడ్డలు, రుమాళ్లు, కర్టెన్లు, టేబిల్ కవర్లు కూడ ఈ పద్ధతి అద్దకంలో లభిస్తాయి. వివిధరంగులతో కూడా నమూనాలు ప్రవేశపెట్టబడినవి.

### ఉప్పాడ, గద్వాల చీరెలు:—

ఈ చీరెలు బంగారు శోభలో ఉంటాయి. అయినా ప్రత్తిచే, పమిట భాగం, అంచులు సిల్కు అలంకరణ, బంగారు దారములతో కూర్చబడి ఉండును. వీటి జలతారులాంటి అంచులు ఉత్సవ సందర్భాలలోను, శుభాకార్యాలలోను వాడడానికిఉపయోగపడుతాయి. వాటిని వేసవిలోను, తేమగా నున్నప్పుడూ కూడా మామూలు నూలు చీరెలుగా వాడవచ్చును. వాటికి తగిన రవికెల గుడ్డలు లభిస్తాయి.

### వెంకటగిరి, సిద్దిపేట చీరెలు :—

వెంకటగిరి, సిద్దిపేట చీరెలు ప్రాసిద్ధంగా తయారయ్యే మన్నికైన నమూనాలతో తయారవుతాయి. అవి అంచులపనితనంతో ఉన్నా, చాల బాగుండును. కూడుకూడి ఇట్టి చీరల్ని ఎందుకు కొనకూడదు?

### సిద్దిపేట, వంగారెడ్డి, మంగళగిరి, ఆహ్వానం, నారాయణపేట సిల్కు చీరెలు :—

మన చేతిపనివారి నైపుణ్యం, సమర్థత మామూలుగా అప్పుడప్పుడూ చూసేవారి దృష్టిని కూడ ఆకర్షించును. అంచి ఉంచబడిన వాటి వెలుగు, చక్కని రంగులపొందిక, అలంకారాలు ఉత్సవ సందర్భంలో వాడడానికి తగివుంటును. అవి ధరించేవారికి గౌరవం, గౌరవం, సౌందాతనం కల్గించడమేకాక, చూసేవారిని రంజింప చేయును. అవి చాల మన్నికగలది.

### అద్దకపు వస్త్రాలు :—

చేతితో నేసిన వస్త్రాలకు చేతిఅద్దకం శోభను చేకూర్చుతుంది. ఆకారవర్ణంలో మృదువైన వస్త్రాలు లభిస్తాయి. అద్దకం చొక్కాగుడ్డలు, బ్లౌజుముక్కలు, బుష్‌షర్టు గుడ్డలు మున్నగునవి మన నవాకార ఎంపోరియం లన్నిట్లో దొరుకుతాయి.

### హిమ్రూ వస్త్రాలు :—

చక్కని బొమ్మల డిజైనులలో రంగు రంగులలో ఈవస్త్రాలు లభిస్తాయి. హిమ్రూవస్త్రాలలో ఆకర్షణీయమైన స్త్రీలకు కుట్టు బ్లౌజులు, శాలువలు, ఇతర స్త్రీల దుస్తుల్ని తయారుచేయవచ్చును. కర్టెన్లు, టేబిల్ క్లాత్ లు, సోఫా కవరింగులకు కూడా హిమ్రూగుడ్డ తగివుంటుంది.

## చేతిపని పరిశ్రమల మార్కెటింగ్

కుటీర పరిశ్రమల వస్తువుల్ని—ముఖ్యంగా—చేతిపని పరిశ్రమ ఉత్పత్తుల్ని—విక్రయించడానికై—1930 లో హైదరాబాద్ లో ప్రభుత్వ కుటీర పరిశ్రమ సేల్సుడిపో నెలకొల్పబడింది, ఏటా రు 5 లక్షలవరకూ వస్తువులు ఈ డిపో ద్వారా విక్రయించబడుతున్నవి. సేల్సుడిపోను విస్తరింపజేసే పథకం ఇప్పుడు పరిశీలనలో ఉంది. ఇదిగాక విజయవాడలో, సెంట్రల్ సేల్సు ఎంపోరియం ఒకటుంది. రాజమండ్రిలో కూడ ఒకమార్కెటింగ్ కేంద్రం పనిచేస్తున్నది. తిరుపతిలో మరో సేల్సు ఎంపోరియంను స్థాపించడానికి అఖిలభారత చేతిపని పరిశ్రమలబోర్డు ఆర్థికసహాయాన్నిచ్చినది కూడ.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేతిపని పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమము

ఆంధ్రప్రదేశ్ లోని పారిశ్రామిక కార్యక్రమ అభివృద్ధిలో చేతిపని పరిశ్రమలు ముఖ్యమైన భాగాన్ని ఆక్రమించుకొని వున్నవి. ఈ ప్రణాళికలో దీనికై రు 30.05 లక్షల మొత్తం ఏర్పాటు చేయబడినది. ఇప్పటికే ఈ విషయమై చాలచర్యలు గైకొనబడినవి. 15 ముఖ్యమైన పథకాలు అమలుజరుపబడుతున్నవి. ఈ పథకాల

క్రింద పనివారల సహకార సంఘాలు ఏర్పాటు చేయడం లేక ఏర్పాటు చేయడానికి సంకల్పించడం జరిగింది. వాటికి వర్కింగ్, పెట్టుబడి అప్పుల నిర్వహణకు బ్యాంకుల సహాయం ఉంటుంది. సొసయిటీలు ఉత్పత్తికృషి ప్రారంభించినవి. పనివారలకు ఉపాధి లభిస్తున్నది.

రూ ౧,౫౦,౮౦౦ ఖర్చుతో హైదరాబాదులోని ప్రభుత్వ కుటీర పరిశ్రమల సేల్సు డిపో విస్తరణ పథకంలో మార్కెటింగ్ సమస్య కూడ పరిష్కరించబడుతుంది. ఈ మొత్తం మంజూరయింది కూడా. విజయవాడ, రాజమండ్రిలలో మార్కెటింగ్ డిపోలు నిర్వహించ బడుతున్నవి కూడా. కొన్నాళ్ళకు ఇంకా ఎక్కువ సేల్సు ఎంపోరియంలు స్థాపించ బడుతాయి. మార్కెటింగ్ ఫలితాలను, ఆర్థిక వ్యవస్థను పరిశీలించి మన డిపోలలో వస్తువుల ప్రదర్శన (డిస్ప్లే)ను అభివృద్ధి చేయడానికి త్వరలో ఒక మార్కెటింగ్ ఎనలిస్టు ఒక డిస్ప్లే ఆర్టిస్టు నియమించ బడుతారు. వివిధ పరిశ్రమలకు కెటలాగ్‌లు కూడ తయారుచేయబడుతాయి. ఈ వస్తువులకు ఎగుమతి మార్కెటింగ్ అవకాశాలు కూడ పరిశీలించ బడుతాయి.

ఇదిగాక రూ ౮,౪౫,౫౬౦ ఖర్చుతో ౧౬ పథకాల్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది. ఈ పథకాలలో డిజైనులకు కేంద్ర సంస్థ స్థాపన, పనివారికి గృహావసతి ఏర్పాటుకు ఉద్దేశించబడిన పథకాలు కూడ ఉన్నవి.

ఆంధ్రప్రదేశ్ కు పునర్నిర్మిత చేతిపని పరిశ్రమల సలహా సంఘాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఈ సలహా సంఘము ఆశయపద్ధతులు, పరికరాల్ని ప్రవేశపెట్టడంలో ప్రభుత్వానికి సలహా ఇవ్వడం, ముడిపదార్థాల సేకరణ, మార్కెటింగ్, డిజైన్ సౌకర్యాలు, శిక్షణ, సర్వే, పరిశోధన విషయమై స్థాయిని నిర్దేశించడం, చేతిపని పరిశ్రమల సమస్యల్ని పరిశీలించి ఉత్పత్తిని అభివృద్ధి పరచి దేశంలోనూ, విదేశములలోనూ కూడ అమ్మకాలను పెంపొందించడంలో ఈ సలహా సంఘం చాల ఉపయోగకరంగా ఉంటుంది.



# సర్కస్ డేరా

శ్రీ మధురాంతకం రాజారాం

ఏ పుట్టలో పాము ఉంటాయో, ఏ పుట్టలో ఈసి ఉంటాయో యిర్లవాడికి తెలిసినట్లు మరొకరికి తెలియదు. భుజాన మూపెడు ఈతపుల్లలతోనూ, చేతనిల్లు దుత్తతోనూ యిర్లవాడొకడు మీకు పల్లెపట్టుల్లో ఎదురైతే, అతగాడక్కడెక్కడో పుట్టమూసి ఈసిళ్లు పట్టబోతున్నాడన్నమాట! కీటక సంహారకాండలో జాందీ వాచకంగా అతడు పుట్టలో ముఖ్య రంధ్రాన్ని మాత్రం మినహాయించి, మిగిలినవాటిని మూసేస్తాడు. ఆ తరువాత చిక్కగా నీళ్లు చిలకరిస్తాడు. రంధ్రానికి చేరువగా ఒక దిగుడు అమర్చి అందులో దివ్వె వెలిగిస్తాడు. ఎండుమట్టిపైన చల్లటినీళ్ళుపడ్డంతో నీటిఆవిరి పైకెగిరి, పుట్టలోపలి కీటకాలకు వాన కురుస్తున్నట్టో, లేక కురిసి వెలిసినట్టో భ్రమ కలుగుతుంది. బారులుబారులుగా అవి పైకొస్తాయి. వచ్చీరాగానే మృత్యుదేవత క్రూర దంష్ట్రలాంటి దీపశిఖ వాటిని ఆహ్వానిస్తుంది. అవి మొదట రెక్కలు రాల్చుకుంటాయి. తరువాత యిర్లవాడికి మరునాటి ఎరగా మారిపోతూ కుప్పగా కూలిపోతాయి.

పూర్తిగా గాకపోయినా, కొంతవరకూ ఈ 'పుట్ట మూత'తో పోలికలున్న సంఘటన ఒకటి పట్టణంలో జరిగింది.

ఏడుగంటల కల్లా భోజనాలు ముగించి, జంబుచాపలు పరచుకోడం తరువాయిగా దీపాలు ఆర్పేసి, వెచ్చగా వక్కాకు నములుతూ అరుగులపైన కూర్చున్న పల్లెటూళ్ళవాళ్ళకు ఆకాశంలో ఓ కాంతిపుంజం కనిపించింది. అది అచ్చంగా కాంతిపుంజం కూడా కాదు. భువినుండి దివికి ఏటవాలుగా ప్రసరిస్తున్న వెలుగుబాట. 'ఎన్నడూ లేంది, ఏనాడూ వినంది, ఏమి టీవిడ్డూరం' అని ఒకవైపున జానపదులు వెరగుపడిపోతున్నారు, మరొకవైపున ఆ వెలుగు వినువీధిలో నాలుగైదుసార్లు వలయాలుతిరిగి, అంతటితో తన పని తీరిపోయినట్టు అంతర్ధానమైపోయింది.

మెరుపూ, ఉరుమూ ఒకేసారి ఉద్భవించినప్పటికీ శబ్దవేగం కన్నా కాంతివేగం ఎక్కువ గనుక మెరుపు ముందుగా కనిపిస్తుందని చెబుతుంది, విజ్ఞానశాస్త్రం. ఇక్కడగూడా సరిగ్గా అలాగే జరిగింది. రాత్రి ఎనిమిదిగంటలు, ఆ ప్రాంతంలో వెలుగు కనిపించింది. పట్టణంనుంచీ దశదిశలకూ విస్తరిల్లుతున్న రహదారుల వెంబడీ బయల్దేరిన బస్సులతోబాటు ఆ వార్త మరునాటి వుదయానికల్లా పల్లెసీమల్లోకి ప్రాకివచ్చేసింది.

ఏమా వార్త? ఎందుకా వెలుగు?

'సర్కసొచ్చిందట బాబూ! సర్కసొచ్చింది' ఏనోట విన్నా యిదే మాట వినిపించింది.

ఆ వచ్చిన సర్కసు ఎలా వచ్చింది?

'భట సంఘంబులతో, రథావళులతో, భద్రేభయూథంబుతో పటువేగాన్విత ఘోటకవ్రజముతో'— ఒక్కమాటలో చెప్పాలంటే కటుసంరంభముతో పెళ్ళికి తరలిన శిశుపాలుడిలా వచ్చింది. కానైతే ఒక చిన్న తేడా! శిశుపాలుడు విదర్భతనయను చేకొనడానికి వచ్చాడు. సర్కసు జేబులు దోచుకోడానికి వచ్చింది.

ఆ మాయదారి సర్కసువాడి 'బస' ఎలాంటిదోగానీ వాడు వెలిగించిన దీపం తాలూకు కాంతి గగనమండలానికే ప్రసరించింది. అక్కడ ఊరుకుందా? ఊహూ, వలయాలు తిరిగింది. పట్టణానికి మూడామడలదూరంలో వున్నవాడు 'అబ్బ, ఏమిటీ చోద్యం' అని ఓ వైపున విస్తుపోతూనే వున్నాడు. ఇంతలో పదామడల దూరంలో వున్న పెద్ద మనిషి ఒకతను అతడితో కలిసి 'ఓరి నీ ఆశ్చర్యం చట్టుబండలుగానూ! ఆ వెలుతురు మావూరికే కనిపించిందయ్యా' అన్నాడు. ఇంకేముంది! ఆః ఆః అంటూ మూడామడల్లో నివసిస్తున్న మానవ సామాన్యుడు ఆశ్చర్యాతిరేకంతో నోరు తెరిచేశాడు.

అంటే ఏమన్నమాట? ఆ దీపకాంతి ప్రసరించినంత మేరకూ సర్కసువాడు తనవలను విసరగలిగాడన్నమాట, తన కబంధహస్తాలను చాచగలిగాడన్నమాట!

అంతటితో ఏమయింది? పెద్ద పెద్ద బొమ్మలంటించుకున్న మేదరతడికలతోనూ, మెగాఫోనుతోనూ, సినిమాపాటల గ్రామఫోను సంగీతంతోనూ ఓ మోటారువాను శరవేగంతో పరతెంచి వచ్చి పల్లె పల్లెకూ గుప్పెడు కరపత్రాలు పంచింది. ఒక్కొక్కటీ మూరెడు పొడుగు కరపత్రం! పదహారు ఏనుగులు, యిరవైయేడు గుర్రాలు, ఏడు ఒంటెలు, నాలుగు పులులు, రెండు సింహాలు, ఒక భల్లూకం అని జాబితాను పేర్కొని, అంతటితో జంతువర్గము ముగించడానికి సంకోచిస్తూ, భగవత్సృష్టిలోని వైవిధ్యాన్ని నొక్కి చెప్పడానికి కాబోలు 'నాలుగువందలమంది మనుష్యులు' అని ఉదహరించడం జరిగింది. తరువాత ప్రదర్శనంలోని వివిధాంశాలను ఏకరువుపెట్టి చిట్టచివర 'అలసించిన ఆశాభంగం, నేడే చూడండి' అన్న హెచ్చరికతో కరపత్రం పూర్తయింది.

ఆ సర్కసు వాడెవడోగానీ, వాడు శబ్దతత్వాన్నిగూడా క్షుణ్ణంగా ఆకళించుకున్న ధీమంతుడిలా వున్నాడు! 'నేడే చూడండి' అంటూ అతడు దేశంపైకి విసిరిన పదాలజంట, అదొక పంచాక్షరీ మంత్రంలా యింటింటా నినదించింది. కుటుంబ సమేతంగా ఆఫీసరుగారూ నేడే చూడాలి. ఇంటిల్లిపాదీ వెంటరాగా హెడ్‌గుమాస్తాగారూ నేడే చూడాలి. బంధు మిత్రులు యావన్మందితో ముప్ఫైమైళ్ళలోవున్న పెంటపాడు మునసబుగారూ నేడే చూడాలి. ఒకరేమిటి, తలారిరాముడు, దేవళంపూజారి ఆచారి, బడి

పంతులు పాపారావు, జాన్ ఓబిలేసు, దోసెలంగడి తులసమ్మ— అందరూ నేడే చూడాలి. మంత్రశక్తికిలోనై మతి పోగొట్టుకున్న సర్పకులం జనమేజయుడి యాగశాలకు యిలా పరతెంచివుండాలి. 'నేడే చూడాలి' అన్న మానవుడి తృష్ణితాన్ని తొలగదోసుకుని అప్పటికే చింతపండు బస్తాల్లా తయారైవున్న బస్సులు వడివడిగా పారిపోయాయి. బాటప్రక్కన చేతులు చాచి రెక్కమాన్లకు మల్లే నిలబడివున్న గ్రామీణ ప్రజలకు 'రైట్, రైట్' అన్న కండక్టరు కేకలుమాత్రం వినిపించాయి. కానీ యింతమాత్రానికే నిరుత్సాహపడిపోయేదిగాదు ప్రజానీకం! వాళ్లు మూలనున్న బండను పైకి దీశారు. ఇరుసులకు కందెన పేసి, ఎడ్లను పూన్చారు. ఆడవాళ్ళు పులుసన్నంతో, పెరుగన్నంతో తబిళ్లునింపారు. పెళ్ళికి వెళ్తున్నట్టు, తిరణాలకు పోతున్నట్లు బండ్లు నగరంవైపు కదిలాయి.

చేసినపాపం చెబితే పోతుందంటారు, ఇలా సర్కసుకు వెళ్ళి పట్టణంలో దిగబడిపోయిన అసంఖ్యాక ప్రజాసమూహంలో నేనూ ఒక్కణ్ణి!

రాత్రి తొమ్మిదిగంటలవేళ. ఇదివరకే ఓసారి సర్కసుకు వెళ్ళి, ఆ జనాలరద్దీలో నలిగి నానా అవస్థలుపడిన ఒకానొక పెద్దమనిషి (సుప్రసిద్ధ చారిత్రిక ప్రదేశాల్లోని 'గైడ్' హోదాతోనే అనుకోండి) టిక్కెట్లుతీయడం చాలా కష్టమని చెప్పినందువల్ల కాస్త త్వరగా బయలేరవలసి వచ్చింది. తిరణాళ్ళు, పరసలూ, పెళ్ళిసంబరాలు మొదలైనవాటికి పిలవకపోయినా వచ్చి పరామర్శించి పోయే అతిథి వానదేవుడు. ఆయన ఏడు ఏమున్నరకల్లా వచ్చి రెండు చుక్కల వర్షం కుమ్మరించిపోయాడు. పగటిపూట దుమ్ములేచిన రోడ్డు వానతాకిడికి బురదైపోయింది. బురదరోడ్డుపైన కనుచూపానినంతవరకూ మనుషులు విసవిస నడచిపోతున్నారు. సాయంత్రంవరకూ కాసిన ఎండ, ఆ తిరువాత కురిసినవాన, ఇప్పుడిలా తండోపతండాలుగా సాగిపోతున్న మానవులు — ఈ మూడు దృశ్యాలనూ సమన్వయించుకున్నట్లయితే ఎవరికైనా ఒక సృష్టి రహస్యం తేటతెల్లం గాకపోదు. తమను తామే పాలించుకోడానికనీ, పరిసరాల్ని పరిశుభ్రంగా వుంచుకోడానికనీ దానికనీ దీనికనీ మానవుడు ఏవో వ్యవస్థలు నిర్మించుకుంటున్నాడు గానీ, అడవిపక్షులకు ఆహారమివ్వగలిగిన భగవంతుడు ఈ పనులు కాస్తా చేసిపెటలేకపోడు. ఎండకాసింది. రోడ్లపైన దుమ్ములేచింది. వానకురిసింది. బురదయింది. సర్కసు ప్రేక్షకులు నడుస్తున్నారు. ఇక రోడ్డురోలరుతో అగత్యమెక్కడిది?

సెలయేళ్ళు వాగుల్లోపడి, వాలుగువంకల్లో కలసి, వంకలు నదుల్లోకి ప్రవహించి, ఆ నదులు సముద్రంతో సంగమిస్తున్నాయి. గమ్యస్థానం సమీపమౌతున్నకొద్దీ నా మనసులో సముద్రం మెదిలింది. అక్కడ నీరు. ఇక్కడ మనుషులు. అక్కడ అర్థమూ, పర్థమూ లేని అలలహోరు. ఇక్కడ శ్రావ్యమూ, సహ్యముకాని మాటల మ్రోత.

ఆ డేరా చాలా పెద్దది. డేరాచుట్టూ సాధు జంతువుల పాకలకు, క్రూరజంతువుల బోన్లకు, మానవుల గుడారాలకు ఓపినంత జాగా ఆక్రమించుకోబడింది. చుట్టూరా పది పన్నెండడుగుల ఎత్తున్న డబ్బారేకుల ప్రాకారం. ప్రాకారానికేవల ఒకటే ఒక టిన్నర శర్లాంక పోతుగనా యిరుపక్కలా క్రిందరాలని జనమస్తోంతా అన్నింటికీ నెపక సోడాకిళ్ళీలకొట్లు, టీ, కాఫీ బంకులు. గారెలు బూరెలు అమ్మే అంగళ్ళు. రోడ్డునుంచి చిల జలంలో కలిసి తడితడిగా వున్న పచ్చికపైన బురదమెత్తుకున్న పాదాలతో మెల్లగా త్రోవజేసుకుని ముందుకు నడవసాగాను. చల్లచల్లగా వీస్తున్న చలిగాలి స్పర్శకు ముఖం జల్లుమంటోంది. కర్త, కర్మ, క్రియలతో వివరించి చెప్పడానికి వీలిచ్చే అలజడి కాదది! మూగసినిమాల కాలంలో క్లయిమాక్సు ఘట్టం వచ్చినప్పుడు కథకుడు "అదిగో వచ్చాడు. కత్తి తీసుకున్నాడు. కదిలాడు ముందుకు విరోధి. దూకాడు పైకి" అంటూ హడిహడిగా మాటలు ఉచ్చరించేవాడు. ఇక్కడా అంతకంటే గత్యంతరం లేదు. సిగరెట్టు పొగ బీడీ కంపు. షోకెళా మనిషి సెంటు గమగమ. పల్లెటూరి ముత్తయిదువ కొప్పులో ముడుచుకున్న మొగిలిరేకుల సుగంధలహరి. కళ్ళకు మిరుమిట్లుగొలిపే దీపాలు. చలికి ముడుచుకుపోతున్న ముఖాలు. నవ్వులు. కేరింతలు. ఛీత్కారాలు. వికటాట్టహాసాలు. అది కళ్ళకు కనిపించిన దృశ్యమే! కానీ ఒకసారి పడుకుని నిద్రపోయి లేచినతర్వాత అది 'కలా, నిజమా' అన్న విభ్రాంతికి ఆస్కారమిచ్చే దృశ్యం!

ఇంతలో ఒక ముఖ్యవిషయం జ్ఞప్తికివచ్చింది. మొదటి ఆట గూడా విడిచిపెట్టినట్టున్నారు. నా కిప్పుడు టికెట్టుకావాలి. ఏది లేకపోతే డేరాలోపలికి ప్రవేశం సాధ్యంకాదో, ఆ టికెట్టు కావాలి. ఎక్కడ దొరుకుతుందా టికెట్టు? ఎవరినో అడిగాను. 'ఆ చివర' అంటూ ఆయన చేయిచూపాడు. తీరా అక్కడికి వెళ్లిన తర్వాత 'అబ్బే ఇక్కడ కాదండీ! ఆ చివర' అన్నారు. వెళ్ళినంత దూరం తిరిగి వచ్చి, ఇంకా ముందుకు వెళ్ళాను. నిజమే! అక్కడ టికెట్లు యిస్తున్నారు. టికెట్లిస్తున్న కిటికీలకూ, నాకూ మధ్యదూరం యిరవై గజాలకు తక్కువుండదు. ఈ యిరవైగజాల మేరలో సింహాబలులూ, వృకోదరులూ, గామాలు, కోడి రామ్మూర్తులూ అంగుళం సందులేకుండా నిలబడిపోయి 'బలంవుంటేనే బ్రతుకు' అన్న పరమసత్యాన్ని చూపరులకు తెలివిడిచేస్తున్నారు... నే నిప్పుడేం చేయాలి?

చేతులు కట్టుకుని ఒడ్డున నిలబడితే తరంగ హస్తాలతో ముత్యాలు పోసితెచ్చి, కడలి మనకు పాదపూజచేయదు. ముత్యాలు పొందగోరితే సముద్రంలో దూకవలసిందే! తప్పదు. కానీ తిమింగలాలు ఎదురైతే? గుక్క తిరక్కపోతే? ముత్తెపుచిప్ప చేతికి దొరికిన తర్వాత పైకిరావడానికి ఓపరికం లేకపోతే? అవును. అపాయమే మరి! చనిపోవడానికి ముందుగా ఒక సాహసకార్యం చేయగలిగితే చాలునన్న మహదాశయంకాదు నాది! మంచికో చెడ్డకో ఈ లోకంలో పుట్టడమంటూ జరిగినతర్వాత, బ్రతుకుపైన తీపికలిగివుండడం నేరం కాబోదు. ఐతే నాకు టికెటు దొరకదు. కానీ నాకు టికెట్టుకావాలి! ఏం చేయాలి? నే నిప్పుడేంచేయాలి?

సరిగ్గా ఈ సందిగ్ధావస్థలో నాకు ఆపద్బాంధవుడిలా కనిపించాడు నాగులు!

అప్పుడు నాగులు డబ్బారేకుపైన ఒంటికాలితో నిలబడి, ప్రాకారానికి ఊతగానాటివున్న కొయ్యను ఎడమచేతితో పట్టుకుని

అలా బాగా క్రిందికి వంగి పడిపోతూ టిక్కెట్లిమ్మని టిక్కెట్లు తీసుకుంటూనే ఉద్యుక్తు డౌతున్నాడు!

"ఇదిగో నాయుడూ! నాకూ ఒక టిక్కెట్టు" అని అరిచాను.

నాయుడుకు నామాటలు వినిపించివుండవు. అతడు వినిపించుకొనగల పరిస్థితిలో కూడా లేడు. పట్టుదప్పితే అతడు తలక్రిందులై జారిపోతాడు. అడ్డంగా మనుషులున్నారు గనుక ప్రమాదానికి అవకాశం లేనిమాట నిజమే! కానీ అంతఎత్తునుంచీ పైనబడితే ఈ మానవులతణ్ణి రెక్కలు రెక్కలుగా, తూకలు తూకలుగా జేయరని ఏం నమ్మకం?

విధా యింకొకసారి ప్రయత్నించిచూచాను. ఈసారి నాయుడు తల పైకెత్తి "ఉండవయ్యా నువ్వు మరీనూ!" అని విసుక్కున్నాడు.

టిక్కెట్టు కొనుక్కోలేని అశక్తుణ్ణి, నేను ప్రాధేయపడినా పడవచ్చు. శూన్యంలో శీర్షాసనంలాంటి ఆ దురవస్థలో నాయుడు విసుక్కోనూవచ్చు. కానీ విశేషమేమిటంటే ఈ సంఘటనలో అసందర్భమేం గోచరించిందోగానీ నా ప్రక్కన నిల్చున్న పెద్దమనిషి ముఖం ఓరగా తిప్పుకుని చల్లగా నవ్వేశాడు.

దెబ్బతిన్నట్టు నేనతడి వైపు తిరిగాను.

"అహాఁ మరేమీ అనుకోకండి సార్! మీరతణ్ణి అడగడం ఎలా వుందంటే..." అంటూ రాగంతీసి "నే రంగమెళ్ళి పోతానే నారాయణమ్మా అన్నాడు నాయుడుబావ. అందుకు నారాయణమ్మ ఏమందీ? నువు పోతే పోయేవు గాని నాయుడుబావా, నాకు పోగుల జత తెచ్చిపెట్టు అంది" అని అతడు తన ఉపాఖ్యానాన్ని ముగించాడు.

నాకు తల కొట్టేసినట్టయింది. ఎదుటివాడి స్థితిగతులను గమనించకుండా ఎవడికివాడు వాడి దృక్పథాన్ని అనుసరించే ఆలోచించి, అందుకు తగట్టుగా ప్రవర్తించడంవల్ల నలుగురిలో అవహేళనకు లోనుగావలసివస్తుంది. ఈరోజు వుదయం ఎవరిముఖం చూచి లేచానో గానీ నే నిలాంటి హేళనకు గురికావడానికి ఇది మొదటిసారిగాదు. రెండోసారి. ఇందులో మరొక చిత్రం వుంది. రెండుసార్లూ నేనే నాయుడువల్లనే అవహేళనపాలయ్యాను.

అవసరాన్ని బట్టి ఉదయం ఏడుగంటలనుంచీ రోడ్డులో చింతచెట్టుక్రింద పడిగాపులు పడినతర్వాత మధ్యాహ్నం మూడుగంటలకు ఓ బస్సులో తావు దొరికింది. ఆ బస్సు బండెడ్లకలిలా పిసుమూరి కనుమ్రాకి, కర్రుడి రథంలా కలువకుంట విటిలో కూరుకపోయి, "ఓహో, యింక లేదు. ఆగిపోయిందన్నమాటే" అని మైలుకు ఒకటి రెండుసార్లు మొండికేసి, ఆఖరుకు ఎలాగోలాగ ఒల్లీ ఒల్లని కొప్పురానికి వచ్చిన కొత్తకోడలిలా అయిదు, అయిదున్నరకు బస్ స్టాండు చేరుకుంది. పల్లెటూరినుంచీ పట్నానికి వచ్చి బంధువుల యింట్లో ఒకటిరెండు రోజులు మకాం వేయదలచుకున్న మానవుడు రిక్తహస్తాలతో బస్సెక్కడం అవివేకమన్న విషయంపట్ల నాకు గాఢమైన నమ్మకం వుంది. కపిత్థజంబూఫలాల్ని సమర్పించుకుంటే ఉమాసుతుడు శోక వినాశకారకుడైనట్టే, చెరకుముక్కలు, వేయించిన కాయలు, తాటిముంజల్లాంటి చిరుతిండ్లతో పట్టణంలో బంధువుల యింట కాలుమోపితే ఆ అతిథికి తీయటి మర్యాదలూ, హాయిగొలిపే మన్ననలూ నిస్సంశయంగా లభ్యమౌతాయి. బస్సుస్టాండు చేరుకున్న వెంటనే నేను కూలివాడికోసం నలువైపులా గాలించసాగాను. ఇంతలో ఎక్కడున్నాడో ఏమిటో నాయుడు బస్సు యింకా పరుగెడుతూ వుండగానే ఫుట్‌బోర్డుపైన మా సామాను లగేజ్ సాది దించేశాడు.

బస్ టాపుమీద రెండు మూటలున్నాయని చెప్పాను. నాయుడు నిచ్చెన సహాయంతో పైకెక్కసాగాడు.

బస్ స్టాండులో దిగినప్పటినుండీ నాకు మొట్టమొదట గమనించవలసిన వ్యక్తి నాయుడు. ప్రతిరోజూ నాలాంటివాళ్ళను ఎక్కడ చూసినా చూస్తుంటాడు గనుక అతడికి నేనెవరినో తెలిసివుండదు. కానీ నాకు నాయుడ్ని గురించి బాగా తెలుసు. ఈ శరీరం పరోపకారార్థమన్న ఆర్యోక్తిని అక్షరాలా నమ్మినవాడిలా అతడు మారుమాటాడకుండా లగేజిని తలపై పెట్టుకుంటాడు. అతడిలో గొడవ ప్రారంభమయ్యేదల్లా మోత యింటికి చేరినతర్వాతే!

సమయానికి బంధువు ఇంట్లో లేడు. గృహిణి ఎదురుగావచ్చి ప్రఫుల్లవదనంతో స్వాగతమిచ్చింది. నేను జేబులో చేయివేశాను. చిల్లరడబ్బులు లేవు. ఓ పదిరూపాయల కాగితం పైకి వచ్చింది.

"నోటుందిగానీ చిల్లర లేదే!" అన్నాను.

"పెన్ను చేతిలోవుంటే రెయ్యికేం కొదవసార్! కాసేపట్లో తీసుకరానూ!" అంటూ నాయుడు నేనింకా అంగీకార అనంగీకారాల మధ్య వూగిసలాడుతుండగా నే నా చేతిలోనుంచీ నోటు తీసుకుని రివ్వున బయటికి వెళ్ళిపోయాడు.

"కూచోండన్నయ్యా! కాఫీ తెస్తాను" అంటూ గృహిణి లోపలికి వెళ్ళింది.

అయిదునిమిషాలకల్లా కాఫీ రానేవచ్చింది. ఒక్కొక్కటీ ఒక్కొక్క జాములా మళ్ళీ అయిదు నిమిషాలు గడిచిపోయాయి. నాయుడుమాత్రం పత్తా లేడు!

ఒకటిగాదు, రెండుగాదు, పదిరూపాయలనోటు!

ఖాళీగ్లాసు తీసుకపోవడానికి వచ్చిన యింటి యిల్లాలు "అదేమిటన్నయ్యా! అలా దిగులుపడి కూర్చున్నారు" అని ప్రశ్నించింది.

"అది కాదమ్మా! పదిరూపాయలనోటు..." అంటూ వివరించాను.

"అయ్యో రామ! ఇదేం వెర్రిబాగుల తనమమ్మా! గాలిలో దీపంపెట్టి దేవుడా నీ మహిమ అని కూర్చుంటారా? వెళ్ళండి, వెళ్ళండి. క్షణం తామసిస్తే డబ్బు మనదిగాదు" అంటూ ఆమె నన్ను వీధిలోకి తరిమింది.

అక్కడికి బజారు కూతవేటు దూరంలోవుంది. "ఫలానా వ్యక్తిని చూచారా" అంటూ ప్రతి అంగడిలోనూ వాకబుచేశాను. నా ప్రశ్నకు జవాబు చెప్పడంకన్నా నే రెండు కళ్ళతో అన్వేషిస్తున్నా నన్న విషయం వాళ్ళకు కావలసి వచ్చింది. చివరకు నడి బజారులో వలుసురూ ప్రొగ్రా అసలు కథేమిటని నన్ను నిలబెట్టి అడిగేశారు. జరిగినసంగతి తూచా తప్పకుండా వివరించుకున్నాను.

నాయుడుపైన నగరవాసులకుకూడా ఏమంత నమ్మకం లేదన్న విషయం నాకప్పుడు వ్యక్తమైంది.

"ఓహో వాడా? వాడు నాగులు! ఎంతకైనా తగును!"

"బస్ స్టాండు దగ్గర వాడిచేతికి డబ్బివ్వడమే! అంతకన్నా ఏట్లో పారేయటం నయం కాదూ!"

"ఐనా యివి మనిషిని మనిషి నమ్మగలిగే రోజులటండీ?"

వాళ్ళ అభిప్రాయాలు నాకూ, నా పదిరూపాయలనోటుకూ మధ్య ఓ అగాధాన్ని సృష్టించివేశాయి.

కానీ అంతలో ఒక అద్భుతం జరిగింది. ఏ అంగడిలోనుంచీ బయటపడ్డాడో గాని. ఉన్నట్టుండి నాగులు నా ఎదుట ప్రత్యక్షమై గుప్పెడు చిల్లర నా దోసిట్లో పోసేశాడు.

అంతవరకూ నేను నాగుల్ని నమ్మడం చాలా పొరబాటన్న అభిప్రాయాన్ని ఏకగ్రీవంగా వెలిబుచ్చిన వాళ్లందరూ క్షణంలో ఊసరవెల్లికిమల్లే రంగులు మార్చేసుకున్నారు.

"ఈమాత్రానికి ఇంత రాద్ధాంతమా!"

"పదిరూపాయలనోటును చూస్తారుగాని మనిషిని చూడరే!"

వీళ్ళకు నాగులు ఋజువర్తనపైన్నేగాదు, నా పెద్దమనిషి తనం మీద కూడా నమ్మకం లేదనిపించింది. మాటల తూపులకు తట్టుకోలేక దూరంగా వచ్చేశాను.

నాలుగైదు గంటల క్రితం జరిగిన ఆ గాథను పునశ్చరణ చేసుకుంటూ నేను విగ్రహంలా నిల్చున్నాను. చుట్టూరా సాగుతున్న అలజడిలో హఠాత్తుగా స్థాయి హెచ్చింది.

"పడిపోయింది. పడిపోయింది" అని ఒక్కుమ్మడిగా పది పదిహేనుమంది అరిచేశారు.

పడిపోనున్నది నాగులు పట్టుకొన్న కొయ్య. అది పూర్తిగా వుండడంపోయి, దాన్ని నాగులే కదలకుండా ఈవలికీడ్చి తటుకోవలసివచ్చింది. కొయ్య వాలిపోతే నాగులు భూపతనం గాక తప్పదు. అతడిపైన డబ్బారేకులు. రేకులపైన మనుషులు. అమాంతంగా కళ్లు మూసి తెరిచేలోగా నుగ్గునూచం అయిపోవడానికి రంగం సిద్ధం చేసుకుంటున్నాడా ఈ నాగులు!

వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది. చట్నీ అయిపోవలసిన నాగులు మరు నిమిషంలో గుంపులో జొరబడి కేకలుపెట్టసాగాడు. "పర్చీ టికెట్టు! రెండు రూపాయలుసార్, రెండు రూపాయలు!"

ఒక రూపాయటికెట్టు రెండు రూపాయలే! ఓరీ వీడి అసాధ్యంకూలా! కన్ను అలా వుండగానే కనుపాపను దోచేయడమంటే యిదేనేమో!"

నే నింకా ఆశ్చర్యంనుంచీ కోలుకోనేలేదు. బహుశా ఒకటి రెండు నిమిషాలు గడచివుంటాయి. ఆ పాటికే నాగులు పాటలో శ్రుతి మారిపోయింది.

"ఐదుటికెట్లు అమ్ముడుపోయాయి సార్! ఇంక అయిదు మాత్రమే వున్నాయి. ఒకటిముప్పావలాసార్! ఒకటిముప్పావలా!"

ఐతే ఈ నాగులు మానవుడిలోని తొందరపాటునూ ఓర్పునూ పోటీపెడుతున్నాడన్నమాట! నామట్టుకు నేను మరికొంత సేపు నాలోని ఓర్పునే సమర్థింపదలచుకున్నాను.

"ఎవరికి కావాలండీ? మీరండీ? మీకు? ఒకటిముప్పావలా సార్..." ఎవడినంటే వాడిని తాకి 'అప్రోచ్' చేయనుంకిస్తున్న చెడుగుడు ఆటగాడిలా నాగులు గుంపులో చెలరేగిపోయాడు. ఈ రేటుగూడా ఏమంత ఆశాజనకంగా కనిపించలేదేమో, వెంటనే ప్లేటుమార్చేశాడు. "ఆఖరు బేరం సార్! ఇంకమూడు టికెట్లు మాత్రమే వున్నాయి. ఒకటిన్నర రూపాయసార్, ఒకటిన్నర రూపాయ్"!

వెర్రి వెయ్యి రకాలు. అందులో వేలం వెర్రిది అగ్రతాంబూలం. మానవుల్లోని ఆత్రగొట్టుతనాన్ని, పోటీపడే మనస్తత్వాన్నీ ఆధారంగా వుంచుకుని ఆసామికి డబ్బుదోచి పెట్టే వ్యాపార తంత్రాల్లో మొదట వేలంపాట పేరు చెప్పి ఆ తరువాత మరొక దానిపేరు చెప్పాలి. వేలం పాటలో మొదట వేసి పలికిన వస్తువు మనం చూస్తూ చూస్తూ వుండగానే తన విలువను కూడదాకా పెంచుకుంటుంది. మశకంలాంటి మూల్యం వామనుడి విశ్వరూపంలా నిమిష నిమిషానికీ విజృంభించి ఏనుగంతగా పరిణమించడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. గణితశాస్త్రపరిభాషలో ఇది అనులోమ నిష్పత్తి - మరి నాగులు వ్యాపారతతంగమంతా యిందుకు విరుద్ధంగా వుంది. అతనికున్న అవకాశం అయిదు నిమిషాలు. లేదంటే పది నిమిషాలు. ఈ వ్యవధిలో నిమిష నిమిషానికీ అతడి చేతిలోని వస్తువు ధర క్షీణించి పోతోంది. కాలగతికీ మూల్యానికీ యిక్కడున్నది విలోమ నిష్పత్తి! అవునుమరి. ఒక్క వ్యాపారంలోనే ఏమిటి, ఈ వ్యాపారాలూ విద్యలూ, భోగాలు భాగ్యాలూ నాటకాలూ బూటకాలు దేనికైతే అవసరమౌతున్నాయో ఆ బ్రతుకే రెండు విధాలుగా ప్రసరిల్లిపోతున్నది. ఒకటి, ప్రవాహ గతిననుసరించి అశ్రమంగా అదొక వినోదంలాగా పడవ నడపడం. రెండు, చేతులబలంతో, అంతకంతకూ తరిగిపోతున్న శరీర దారుఢ్యంతో ఏటికెదురీదడం!

"ఒకటింపావలా!" అన్నాడు నాగులు.

నాగులకు అదనంగా నాలుగణాలు ముట్టజెప్పుకోడం నాకు నష్టమనిపించలేదు. కత్తివాదరలాంటి ఆ డబ్బారేకు పైన అరగంట సేపు నిల్చున్నందుకే అతడికి అర రూపాయి యిచ్చుకోవచ్చు.

ఒకటింపావలా యిచ్చి టికెట్టు కొనుక్కుని నేను నేరుగా డేరాలోపలికి వెళ్ళిపోయాను.

డేరాకప్పులో క్రిందినుంచీ పైదాకా వ్యాపించివున్న సందుల్లోనుంచీ ఆకాశం కనిపిస్తున్నది. డేరాలో విద్యుద్దీపాలకు మల్లే అక్కడ తారకలు మెరుస్తున్నాయి. ఆ మెరుస్తున్న తారకలతో వినీలాకాశం ఆశాంతాలవరకూ వ్యాపించివున్న పెద్దడేరాలా తోచింది. ఈ డేరాఎదుట మానవుడు పిపీలకంతో సరిపోల్చదగినవాడేకావచ్చు. కానీ ఆ డేరాఎదుట ఈ డేరా? అది సముద్రమైతే యిది జలకణంగూడా కాదు. ఐతే గియితే ఆ జలకణంలో సహస్రాంశం.

ప్రదర్శన ప్రారంభాన్ని సూచిస్తూ గంట మ్రోగింది. నాగరిక తాలైనతర్వాత గానకళాధిదేవత కైసేసి కొన్న విదేశీ ఆభరణాల లాంటి వివిధ జంత్రసామగ్రి బాండువాయిద్యం పేరిట గోల్లున

ప్రోగింది. సంగీతాన్ని కర్ణపేయంగావుందనీ, అపాతమధురంగా వుందనీ ప్రస్తుతించడం సాంప్రదాయం. ఆ సాంప్రదాయ బావసత్వ పప్పులిక్కడ వుడకవు. ఒకేరకమైన కాశ్మీరుబొజర్ను చొక్కాలు, తలపైన నీలిరంగు టోపీలు ధరించి వేదికపైన శిల్పకారులకు మల్లే కొలువైన వాయిద్యగాళ్ళు తళతళ మెరుస్తున్న చిత్రవిచిత్ర సాధనాలపైన సారించిన సంగీతం కళకళలాడుతూ కన్నులపండువగా ఒప్పారింది.

చుట్టపు చూపుగా వచ్చిన సాటిరాజుఎదుట మర్యాదకోసం జరిగే చతురంగ బలప్రదర్శనంలా ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు మెల్ల మెల్లగా కీవివెలయించుకుంటూ వచ్చి రంగస్థానానికి ప్రదక్షిణం తిరిగి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాయి. అంతలో చిట్టచివరి ఏనుగు గున్నకు మానవరూపం సిద్ధించిందని భ్రమించడానికి వీలుగా ఓ మహాకాయుడు రంగంపైన ప్రత్యక్షమయ్యాడు. అతడు అంగ సౌభాగ్యంలో సమస్తలోకాన్నీ సవాలుచేస్తున్నట్టు భుజాస్ఫాలనం చేశాడు. ఐదుగురు మనుషులు ఒక్కసారిగా చేతులుకలిపినా పైకి లేవని యినుపగదను సునాయాసంగా గాలిలో గిరగిర త్రిప్పాడు. అతడి రొమ్ముకు పలక ఆనించి, పలకపైన ఏనుగు నెక్కించిన దృశ్యం, ఆ ఏనుగలా నిల్చున్నంతసేపూ ప్రేక్షకుల గుండెలపైన పనిచేసింది.

ప్రేక్షకుల మనోవీధిలో ఆ మహాకాయుడి ముద్ర యింకా చెరిగిపోనేలేదు. అంతలో ఓ యిరువదేళ్ళ యువతి పరుగే నడకగా వచ్చి నృత్యానికి సిద్ధమౌతున్న రాజనర్తకిలా సభాసదులకు నమస్కరించింది. రచనల్లో శారీరక సౌందర్యాన్ని పెద్దగాచేసి చెప్పడం ఈనాటి ఔచిత్యంగాదు. కానీ అందుకని కూర్చుని కథో, కావ్యమో వ్రాయదలచుకున్నప్పుడు పనిగట్టుకుని ఔచిత్యాన్ని పోషించడం జరుగుతుంది. ఆలోచనకు తెరపియివ్వకుండా అనుభూతే మానసాకాశమంతా క్రమ్ముకున్నప్పుడు నియమాలు నిలవవు. ఆ స్థితిలో ఎవరికైనా మైమరపు కలుగుతుంది. ఆ మైమరపునుంచీ బయటపడడం వారి వారి చిత్తసంస్కారాన్ని అనుసరించి ఒకచోట త్వరగానూ, మరొకచోట ఆలస్యంగానూ జరుగుతుంది. నేను తేరా అంతటా కలయజూచేసరికి కొందరప్పుడప్పుడే కోలుకుని అల్లాడుతున్న కనురెప్పలతో ఆ అందాలరాశికి నివాళియిస్తున్నారు. మిగిలినవారింకా అనిమేష నయనాలతో ఆమెను తిలకిస్తూనేవున్నారు. ఈ సర్కసులోవున్న అనేక ఆకర్షణల్లో, ఈమె సౌందర్యం గూడా ఒకటన్న విషయం నాకప్పుడు విశదమైంది. ఆమె పేరేమిటో నాకు తెలియదు. బహుశా అది పొంగుతున్న పాలలా విహ్వాలించిపోయే అపూర్వ సౌందర్యానికి పర్యాయపదమై వుంటుంది.

ఆమె ఓ జాజిపలకను ఆనుకుని ప్రేక్షకులకు అభిముఖంగా నిల్చుంది. కళ్ళకు గంతలు గట్టుకొన్న యువకుడొకడు పళ్ళెం నిండుకూ కత్తులుంచుకుని ఆమె ఎదుట నిల్చున్నాడు. వట్టి సౌందర్యాన్ని చూడ్డంతో తనివితీరని ప్రేక్షకులకు మరింత తృప్తి కలిగించడంకోసం అతడామె పైకి కత్తులు విసరసాగాడు. విఫలమైన కాముకుడి కోరికలా ఆమె సౌందర్యాన్ని చుంబించకుండా కత్తి ప్రతిసారీ ఆమెకు బెత్తెడుదూరంలో గ్రుచ్చుకుంటున్నమాట నిజమే. కానీ మృత్యువుకూ మనుగడకూ వున్న దూరం యింత తక్కువైతే అది యిద్దె తెంప్రిందిక ప్రాణానికి ఎంతసేపు పట్టుంది? అనాల్సిం విధాత ఆమె కింత సౌందర్యాన్ని ఎందుకు ప్రసాదించాడు? మిడిగ్రుడ్లలో, బొక్కిదవడలలో, రాక్షసిబొగ్గులాంటి శరీరచ్ఛాయతో చూస్తే డోకుతప్పనంతటి జుగుప్సాకరంగా ఈమెనెందుకు సృష్టించలేదు? అందం విప్రాణిక రక్షణ యివ్వగలిగిందిగనక? అందంగా వుండడంవల్లనే చిలుకలకోసం, పావురాళ్ళకోసం వలలు విసురుతున్నారు. దుప్పుల్ని ఎందుకు వేటాడుతున్నారు, వాటి రొమ్ములు అందంగా వుండటంవల్ల! పులుల్ని ఎందుకు కాల్చి చంపుతున్నారు, అందంగావున్న వాటి చర్మాలకోసం!

క్షణంలో దృశ్యం మారింది. నాలుగైదు నిమిషాలకొకసారిగా ఓఅరగంటసేపటివరకూ దృశ్యాలలా మారుతూనే వుండిపోయాయి. నూనెగుడ్డలు మంటలు చిమ్ముతున్న వర్తులాకారపు యినుపకమ్మిల్లో నుంచి ఓజవ్వని లేడిపిల్లలా చెంగుచెంగున దూకింది. రొమ్ముపైన బండరాయి సమ్మెటదెబ్బలతో పగిలిపోయిన తర్వాత ఓ యువకుడు దుమ్ము దులుపుకుని పైకి లేచాడు. ఒక ఎలుగుబంటి మోటర్ సైకిలు త్రొక్కింది. పూర్వకాలపు రాజాస్థానాల్లోని విదూషకుడికి తోడల్లుడులాంటి బఫూను నేలపైన పడకుండా నాలుగైదు కత్తులను రెండుమూడు నిమిషాలపాటు గాలిలో ఎగురవేశాడు. అగస్త్యుడు సముద్రాన్ని ఆపోశనం పట్టేశాడన్న పురాణగాథ మన మనుకుంటున్నంత అభూత కల్పన కాదని నిరూపించడానికన్నట్టుగా ఒక బక్కపల్చటి మనిషి పదిహేను చేపలతో రెండు బకెట్ల నీళ్ళను ఏకధాటిగా త్రాగి అత్రాగిననీటిని అయిదు నిమిషాలతర్వాత చేపలతో సహా పైకి చిమ్మాడు!

ఇన్ని సాహసకృత్యాలు జరిగిన తర్వాత ఒంటిచక్రాల సైకిళ్లు కొన్ని జంటలు జంటలుగా రంగంపైకి వచ్చేశాయి. వెన్న పెట్టిన వాళ్ళను వడిసెలతో కొట్టడం లౌకిక మర్యాదల్లో ఒకటని చాటి చెప్పడానికి కాబోలు, ఒంటిచక్రపు తేరును అనుకరించినా అనుకరించి, కుంటిసారధి వున్నా పూడినా ఒకటే నన్నట్టుగా బ్రేకుల తంటా వదిలించుకోనూ వదిలించుకుని, అందుకు సూర్యభగవానుడి కింత కృతజ్ఞత కనపరచకపోవడం అటుంచగా, ఆ సైకిళ్ళెక్కిన సుందరీమణులు తమ ముఖలావణ్యాన్ని చంద్రబింబం నుంచీ పుణికి పుచ్చుకున్నారు. ఎంతగా నిగ్రహించుకోబోయినా అలవాటు ననుసరించి వుండి వుండి క్రమ్ముకుంటున్న నిదుర తెరల్లో స్తబ్దులైవున్న సామాజికుల్లో కలకలం బయలుదేరింది. ఒకటికి పది చంద్రబింబాలు ఒక్కసారిగా ద్యోతకమైతే, మనుషుల ముఖాలు కలువ పువ్వులపాటి చేయవటండీ మరి!

ఆ సైకిళ్ళను ఒక సరళ రేఖలో సూటిగా త్రొక్కడమే కష్టసాధ్యంగా వుండగా, వాళ్లు నాలుగుబారల వలయంలో అల్లీబిల్లీ తిరిగారు. ఆతరువాత చిత్రకవిత్వానికి మల్లే తేనిపోని అడ్డు తిరుగుళ్ళన్నీపోయారు. చిత్రకవిత్వం చదువుకోడానికైతే అదొక హాయలతో ఆహ్లాదకరంగానే వుంటుంది. కానీ భావంమాత్రం ఒకంతట బోధపడదు. ఆరాత్రివేళ, విద్యుద్దీపాల కాంతిలో వాళ్లు తమ తమ సైకిళ్ళతో విరచించిన నాగబంధాలకూ, గోమూత్రికాబంధాలకూ అర్థమేమైనావుంటే అది యిది: "సోదరు

లాగా! మీరు మా అందచందాల్ని మాత్రమే చూస్తారు. ఈ అంద చందాల వెనక సున్నితమైన కత్తులవంటి నిలబెట్టే ఒంటిచక్రాల సైకిళ్ళెక్కించి, మంటలమధ్య పరుగులెత్తించే కఠినపు కసరత్తుని మీరు చూడరు. కుందేలు కనపడగానే నాలుక చాచి, చొంగలు కార్చుకుంటూ వెంటాడే జాగిలంలా, మాటిమాటికీ మాపై విరుచుకు పడిపోవడానికి వుంకించే కాముకత్వంబారినుంచి తప్పుకుంటూ నా అన్నవాళ్ళకు దూరంగా, పదిహేజుల కొక మకాముగా మేమెందుకిలా దుర్భర ప్రవాసక్లేశం అనుభవిస్తున్నామన్న సంగతి, తొమ్మిది గంటలప్పుడు యిళ్ళల్లో భోజనంచేసి హాయిగా తాంబూలం నములుతూ భార్యాబిడ్డలతో సహా వచ్చి సర్కసు డేరాలో కూచున్న మీకు అర్థంగాకపోవడంలో ఆశ్చర్యమూ లేదు. మీకు మాలాటి తోబుట్టువులుండకపోరు. మీకు మాలాటి కూతుళ్ళుండకపోరు. వాళ్ళు గడప దాటకుండా కాపురాలు దిద్దుకోడమే మీకిష్టం. కానీ మేమిన్ని కాదు మరిన్ని సాహసకార్యాలు చేసి, ఇంతకాదు మరింతనగ్నంగా మా అంగచందాల్ని ప్రదర్శించడం మీకానందం! అవును మరి. శరీరాలు మీవి కానప్పుడు, మేము కాశీదాకా ప్రాకినా మీకు నష్టమయ్యేదేమీ లేదు. ఎవరికో నష్టం కలుగుతోందని చింతించడం మానవస్వభావం కాదు. ఇది సర్కసుడేరాకు మాత్రమే పరిమితమయిన న్యాయమూ గాదు. లోకపుతీరే యింత!"

ప్రదర్శనం చకచకా సాగిపోతోంది. గాలరీలో రణగొణధ్వని తప్పితే మిగిలిన డేరా అంతా నిశ్శబ్దంగా వుంది. దగ్గరలో ఏదో కుర్చీ కదిలిక వినిపించి అటువైపు తిరిగాను. అప్పుడే లోపలికి వచ్చాడేమో, కుర్చీలో కూర్చుంటూ నాగులు నాకేసి చూసి చిరునవ్వు ఒలకబోశాడు.

"అదేమిటోయ్, యిప్పుడొస్తున్నావు! ఇందాకా ఏం చేస్తున్నట్టు?" అన్నాను.

"టిక్కెట్లన్నీ అమ్ముడుబోయాక టీ త్రాగటానికని బంకులోకెళ్ళి కూచున్నాను. ఇంటికి వెళ్ళిపోదా మనుకుంటుండగా ఎవరో ఒకతను తలనొప్పిగా వుందని బయటికి వచ్చేశాడు. అతడిదగ్గర నాలుగణాలకు అవుట్‌పాసు కొనుక్కున్నాను" అన్నాడు నాగులు.

సరిగ్గా ఆ సమయానికి తెల్లటి గౌనులో మల్లెపువ్వుల ప్రోగులాంటి ఓ మందయాన భూమికి అయిదారు గజాల ఎత్తున్న యినుప తీగపైన వడివడిగా నడచిపోతోంది.

ఇంతసేపటికి లభ్యమైన పలుకుదోడును సద్వినియోగం చేసుకోదలచి "చూచావా నాగులూ! ఆమె ఏం చక్కా నడుస్తోందో" అన్నాను.

నాగులు మౌనంగా నా భుజంపైన చేయివేశాడు. "ఏమిటీ?" అన్నాను. "నా పాదం చూచారా" అన్నాడు.

గాయానికి కట్టిన గుడ్డగూడా ఎరుపెక్కిపోయి, అతడిపాదం పాదమంతా నెత్తురుగడ్డలా గోచరిస్తోంది.

"అదేమిటి నాగులూ! బాగా కోసుకపోయిందేమిటి?" అని కంగారుగా ప్రశ్నించాను.

"టిక్కెట్లమ్మే తొందరలో చూసుకోలేదుగానండీ, ఆ తర్వాత చూశానుగదా, గుదికాలంతా అరంగుళం మేరకు తెగిపోయింది. జనంలో నే నెక్కడెక్కడికెళితే అక్కడల్లా నెత్తురు చుక్కలు చుక్కలుగా కారిపోయింది."

డబ్బారేకు అంచుపైన అరగంటసేపు అసిధారావ్రతం సలుప గలిగిన నాగులు ఎదుట, తీగపైని నడకను గురించి ప్రస్తావించ బోయినందుకు నాలో నేనే కించపడ్డాను.

మళ్ళీ పది పదిహేను నిమిషాలు పరధ్యానంలో గడిచిపోయాయి. రంగస్థలంపైన కండపుష్టి, ఎముక బలానికీ నమూనాల్లాంటి అశ్వాలు పరుగెడుతున్నాయి. వేగంగా పరుగెత్తడంలో గుర్రాలు వాటికవేసాటి అన్న విషయం అందరికీ తెలిసిందే! చిత్రమేమిటంటే అవి అంత వేగంతో పరుగెత్తుతుండగా ఓ యువకుడు ఒకదానిపై నుంచీ మరొక దానిపైకి లంఘిస్తున్నాడు.

"చూడు చూడు! అబ్బ, ఏం చలాకీతనం నాగులూ! కొంచెం అదమరిస్తే పళ్ళు రాలిపోవూ, ముఖం చదరమైపోదూ!" అన్నాను.

"ఇహిహీ" అంటూ నాగులు నా ముఖంమీదికి ఓ వెకిలి నవ్వు పారేశాడు.

"ఏమిటి నాగులూ, యిది కూడా నీకు ఆశ్చర్యంగా లేదా?" అన్నాను.

"పందెం వేద్దామటండీ? ఇరవై అయిదుమైళ్ళ స్పీడుతో వెళ్ళే బస్సును చూపించండి. ఎగిరి ఫుట్‌బోర్డుపైన దూకకపోతే నా పేరు నాగులుకాదు. ఐతే ఒకటి. ఈ గాయం మానిపోవాలి" అన్నాడు నాగులు.

ఓరి వీడిల్లు బంగారంగానూ, వీడు నా మాటమిగల నిచ్చే ఘటంలా లేడు!

ఇంతలో ప్రేక్షకులు ఎంతో సేపటినుంచీ ఎదురుచూస్తున్న ఘటం, సర్కసు వారు పంచిపెట్టిన కరపత్రాల భాషలో ఆకాశడోలలో సాహసక్రీడ ప్రారంభమైంది.

త్రాటి నిచ్చెన మూలంగా యువతీయువకులు కొందరు డేరా కడ్డంగా కట్టిన వలపైకెక్కి, అక్కడి నుంచీ పైకప్పుకు వ్రేలాడుతున్న ఊయలల పైకి చేరుకున్నారు. కాసేపు విలాసంగా సాగిన తర్వాత ఆ క్రీడ చూస్తూ చూస్తూ వుండగానే సాహస ఖేలగా మారిపోయింది. ఉట్టిలో కుండల్లా ఒకరి పాదాలు మరొకరు పట్టుకుని యిద్దరు ముగ్గురు ఒకటిగా ఊగారు. క్రిందనున్న వ్యక్తి వున్నట్టుండి మరొక వుయ్యాలను పట్టుకోగా మీదనున్న మనిషి హఠాత్తుగా క్రిందికి వెళ్ళిపోయాడు. క్షణం విరామం లేకుండా అక్కడున్న ఆరేడు ఊయలలూ చివ్వుచివ్వున ఊగిపోయాయి. ఈక్షణాన ఈ వుయ్యాల్లోవున్న వ్యక్తి మరుక్షణాన ఏ వుయ్యాలలో వుండగలడన్న విషయం ఊహకందటంలేదు. గాజు తొట్టిలో క్రిందికీ మీదికీ తిరుగుతున్న చేపలకుమల్లే వాళ్లు గాలిలో ఈత కొడుతున్నట్లే భావింపవలసి వచ్చింది.

ఈ సాహసకృత్యానికి న్యూనత నాపాదించడం తనతరం కాదనుకున్నాడేమో, నాగులు ఊయలల వైపు నిర్లిప్తంగా చూస్తున్నాడు.

"ఏం నాగులూ! ఎలా వుంది?" అని ప్రశ్నించాను.

"అక్కడ ఆ వల ఒకటి వున్నంతవరకూ అంతా బాగానే వుంటుంది" అన్నాడు నాగులు.

రసహీనుడితో కవితాగోష్ఠి చేయబోయి భంగపడినవాడిలా నేను ముఖం ముడుచుకున్నాను.

"కోప్పడకండి సార్!" నా దగ్గరికి కుర్చీ జరుపుకుంటూ అన్నాడు నాగులు. "ఆక్కొన్నిని తీసిపారేయాలని కాదు. నాకు పదేళ్ళు వచ్చీ రాకముందే మా నాన్న చనిపోయాడు. ఎలా చనిపోయాడో చెప్పమంటారా? పదుమట్ల బావిలో పై మెట్ల మీద నిలబడి మట్టిపోస్తున్నాడు. క్రిందినుంచీ తట్టతీసుకుని ముందుకు తిరిగా జేమో, కాలుజారింది. కళ్లుమూసి తెరిచేలోగా బావిలో నీళ్ళు ఎరుపు తిరిగిపోయాయి. మనిషి మనిషిగా చేతికి దొరకలేదు. గోనె సంచిలో మూటగట్టి పైకి చేదుకోవలసి వచ్చింది." ఒకటి రెండు క్షణాలు మౌనంగావుండి అతడు తనకు తానే స్వగతంలా చెప్పుకుపోసాగాడు. "అలాగని అదాయనకు కొత్త పనిగాదు. ఆయన బ్రతుకంతా బావుల్లో మట్టిమోయడంతోనే గడిచిపోయింది. కానీ భగవంతుడు ఆయనకు చావుకూడా అక్కడే రాసిపెట్టాడని ఎవరనుకున్నారు?"

ఉన్నట్టుండి ఏదో రహస్యం జ్ఞాపకంవచ్చిన వాడిలా తల పైకెత్తి అన్నాడు నాగులు: "బావిలో కాలుజారితే మనిషి చావక మరేమౌతాడండీ? అక్కడ యిలాంటి వలలేదు గదా!"

ఇక నాగులు ఎదుట నాకు మౌనవ్రతమే శరణ్యమనిపించింది!

నా మాట మిగిలించాడు కాదన్న ఉక్రోషాన్ని అవతలికి నెట్టి నిజమాలోచిస్తే నాగులు వాదంలో వాస్తవం లేకపోలేదు. పొట్టకోసం కోటివిద్య లయితే, ఆ కోటి విద్యల్లో కత్తిమీద సాములాంటి వెన్ని? మిత్తికోరల్ని సానపెట్టడం లాంటి వెన్ని? నాలుగు దూలాల్ని ఒకటిగా చేర్చికట్టి దానికి పడవ అని పేరుపెట్టి సముద్రంలో ఓపినంత దూరం తిరిగి చేపలుపట్టి తెచ్చుకొంటే పొట్టగడవని జాలరివాడి బ్రతుకు కత్తిమీద సాముగాక మరేమిటి? పాతాళలోకం లాంటి భూగర్భంలో, కదలడానికీ మెదలడానికీ అవకాశంలేని చీకటిగొందుల్లో పార చేతబట్టి పనిచేసేవాడి బ్రతుకు మిత్తికోరలకు సానపెట్టటం గాక మరేమౌతుంది? నిర్మాణంలో వున్న అయిదంతస్థుల మేడపైకి కర్రనిచ్చెన ద్వారా యిటుకరాళ్లు మోసుకెళ్తున్న ఆడమనిషి సురక్షితంగా క్రిందికి దిగిరాగలదని ఎవరు చెప్పగలరు? చెంబును పైకితీయడానికి పదిగజాల లోతున్న బావిలో మునుగుతున్న గజ ఈతగాడు మళ్ళీ సజీవముగా పైకి తేలగలడన్న పూచీ యేముంది?

'తీసుకో, తీసుకో' అని స్వరవాణ్ణి పూరించి, వాడు దగ్గరికి వచ్చే లోపుగానే మనం దాచిపెట్టుకునే తినుబండంలా అంతలో మృత్యువుచేత చిక్కి భక్కరించబోయి, యింతలో దూరంగావెళ్లి నిక్కిరించబడేమేనా మానవజీవితం?

ఆలోచన కంతరాయంగా లౌడ్‌స్పీకర్లలో వ్యాఖ్యాత కంఠం గంభీరంగా వినిపించింది. "మృగరాజూ మానవుడికీ పోటీ! మేకతో బెబ్బులి సాహసం! మీకు గగుర్పాటు గలిగించే సన్నివేశం! అదిగో, అతడే మృగరాజు! ఇదిగో, ఇతడే ఆ మృగరాజును సాధువుగా తీర్చిదిద్దిన సాహసికుడు. చూడండి. చూచి ఆనందించండి..."

ఏటవాలుగా వున్న రాతి బండమీద ఓ గండుపిల్లి దొర్లుతున్నట్లుగా సింహం దిన్నెలు మార్గోన్ముఖంగా సాగింది. ఆ గద్దెని తాకిడికి తల్లి ఒడిలో నిద్రపోతున్న పసిపాప ఉలికిపడి లేచి ఏడ్చినట్లు ఏడుపు వినిపించింది. పరాధీన స్థితిలో వున్నప్పటికీ రాజసం వెలితి పోని గాంభీర్యంతో, వేసిన ప్రతి అడుగులోనూ దర్పం ద్యోతకమౌతుండగా, చూసిన ప్రతి చూపులోనూ ఔద్ధత్యం తొణికిసలాడుతుండగా ఆ సింహం కాసేపు వేదికపైన తిరిగింది. అంతటితో తన పని తీరిపోయినట్లు, బోను లోపలికి వెళ్లిపోయింది.

ఆ తరువాత లోకంలోని దుష్టశక్తులన్నింటికీ ప్రతిబింబము లాంటి మువ్వన్నె మెకం, మూర్తీభవించిన తామసగుణంలా ఒకవైపు నుంచీ వేదికపైన ప్రవేశించింది. మరోవైపునుంచి మేకపిల్ల ఒకటి నిర్భీతిగా పులిని సమీపించింది.

ఊపిరి బిగబట్టుకున్న ప్రేక్షకులు మోరలు పైకెత్తి ఆ విచిత్ర దృశ్యాన్ని చూడసాగారు.

నేలపైన కూర్చుని తోకాడిస్తూ పులి ఆవులిస్తున్నట్టుగా నోరు తెరిచింది.

ఆ తెరిచిన నోటిలో మేకపిల్ల తన తలను మెడదాకా దూర్చింది.

దవడల్ని ఒక అరంగుళం మేరకు కుంచిస్తే చాలు—పులి కోరలకు వెచ్చటి మేక నెత్తురుతో అభిషేకం జరుగుతుంది.

కానీ—పులి అలాటిపని చేయలేదు.

"తరిబీదు సంగతి అలావుండనీ నాగులూ! పులీ, మేకా అంత అన్యోన్యంగా వుండడం ఆశ్చర్యకరం" అన్నాను.

నాగులు మౌనంగా ఆ దృశ్యంకేసి చూస్తున్నాడు.

నే నంతటితో నయినా వూరుకోవలసింది!

"ఇంతకంటే లోకంలో విచిత్రమేముంది నాగులూ! అయినా ఆ మేకపిల్ల పులిని అంత గాఢంగా ఎలా నమ్మగలిగిందబ్బా!" అంటూ ఆశ్చర్యం ప్రకటించాను.

"ఎలాగయినా అవి జంతువులు గదండీ!" అన్నాడు నాగులు.

'ఏమిటీ, ఏమిటీ?' అనబోయి, మునిపంటితో పెదవి కొరుక్కుని అంతటితో నోరు మూసుకున్నాను. ఆ క్షణాన నాముఖాన ఎలాటి మార్పు సంభవించిందో చెప్పలేను. బహుశా, కొరడా పెట్టి చెంపమీద వాత తీసినట్టు, అది పొంగిపోయి వుంటుంది!

# ప్రాచీన హిందూయుగ చరిత్ర

## కొన్ని సంస్కరణలు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

భారతీయ సంప్రదాయాలను, ఆధారాలను గ్రహించి వివరించే భారతదేశ చరిత్ర నేటిదాకా రాకపోవటం శోచనీయము. పాశ్చాత్యులు ఎన్నో వ్రాశారు. వారిచ్చిన మన దేశచరిత్రను మన ఐతిహాసికులు చాలావరకు అనుకరించినారు. ఈ మాతృకలలో అంత విశిష్టము, గుప్తంగా ఉన్న భావాలను వీరు గ్రహించినట్లు లేదు. తమ క్రైస్తవమత సంప్రదాయాలను విస్మరించని ఈ పాశ్చాత్యులు చాలా కాలంవరకు ప్రపంచము క్రీ. పూ. 4004 లో జన్మించినదని భావించటంతో ప్రతి దేశచరిత్రను ఈ తేదీ తర్వాతనుంచే ప్రారంభించారు. గ్రీకు, లాటిన్, రష్యన్ భాషలతో అతి సన్నిహిత సంబంధము సంస్కృతానికి ఉన్నదని అంగీకరించవలసి వచ్చిన తర్వాత వైదిక వాఙ్మయానికి గ్రీక్ వాఙ్మయానికి ఎక్కువ కాల వ్యవధి లేదని చెప్పదలచి, వైదిక వాఙ్మయాన్ని క్రీ. పూ. 1200 నాటికి దించినారు. ఇండో యూరోపియన్ భాషా కుటుంబమునకు చెందిన ఆర్యులందరు ఒకానొకప్పుడు ఒకే ఒక చోట నివసించినారని, అక్కడనుంచి వివిధ మార్గాలద్వారా ఆయా దేశాలకు వలస పోయినారని వీరు భావించినారు. ఇది పాశ్చాత్య చరిత్రకారుల మూసిన సిద్ధాంతము. పురాణాలు చరిత్రకు ప్రామాణికాలు కావని, బౌద్ధ జైన గ్రంథాలు మాత్రమే సరియైన ఆధార గ్రంథాలని మరొక సిద్ధాంతము. ఇలా ఎన్నో భావాల నుంచుకొని వాటికి అనుగుణంగా భారతదేశ చరిత్రను వ్రాయ మొదలిడితే అది నిష్పాక్షికమైన వాస్తవ చరిత్ర కాజాలదు. ఇలాంటి వ్రాతలను మనవారంగీకరిస్తే, వీరి చరిత్ర లేమాత్రము ప్రామాణికాలు కాగలవు?

2. ఆర్యులు నిజంగా భారతదేశానికి వలస వచ్చినారా? అనే ప్రశ్నను విచారించకుండా అంగీకరించటానికి వీలులేదు. మన సంప్రదాయంలోగాని, గ్రంథాలలోగాని ఈ వలస రావటం ప్రస్తావించబడలేదు. పైగా ఇక్కడనుంచి విదేశాలకు వీరు వెళ్ళినట్లు చెప్పటానికి అనేక ఆధారాలున్నవి. మన దేశంనుంచి తూర్పుగా గాని, పశ్చిమంగా గాని పోతున్న కొద్ది సంస్కృత శబ్దాలకు అపభ్రంశరూపాలు ఎక్కువగా కన్పించుచున్నవి. ఈ అపభ్రంశాలు పూర్వరూపాలని, సంస్కృత శబ్దాలు వీటి తర్వాత వచ్చినవని ఎవరును చెప్ప సాహసించలేరు గదా! ఆర్య భాషా కుటుంబాలలో ప్రప్రథమంగా సాహిత్యం మనదేశంలో బయలుదేరినది. ఆ తర్వాత పర్షియాలో వచ్చినది. ఇలా పడమరకు పోతున్నకొద్దీ ఆయాభాషలలో సాహిత్యము చాలా అర్వాచీనంగా కన్పిస్తున్నది. ఎక్కడనో దూరానికి వలసవచ్చినవారు సాహిత్యంలేక దీనిని కొన్ని శతాబ్దాలదాకా ఆకుటుంబంలోని ఇతరులు ఎందుకు ఊరుకొన్నారో చెప్పవలసిన బాధ్యత ప్రవాస వాదుల మీద వున్నది. పాత రాతియుగంనాటినుంచి అవిచ్ఛిన్నంగా భారతదేశంలో కన్పించే ఆచార వ్యవహారాలుకూడా భారతదేశమే ఆర్యుల జన్మభూమి అని చెప్పుతున్నది. ఈ సిద్ధాంతమును అంగీకరిస్తే నేడుమనం చదువుకునే భారతదేశ చరిత్రను పూర్తిగా మార్చి వ్రాయవలసి ఉంటుంది.

ఏయే శతాబ్దాలలో ఆర్యులేయే దిశలకు వెళ్ళినది తెలిసికొనటానికి ఆయా ప్రదేశాలలోని నాగరికతలను, ఆచారాలను పరిశీలించాలి. ఏకారణాలవలన భారతదేశాన్ని వదలిపోవలసి వచ్చినది, స్వదేశంలోని ఏ నదీ పురాది నామములను వెంటతీసుకొని పోయినది విచారించాలి. అప్పుడు భారతదేశ చరిత్ర ప్రారంభము అతి ప్రాచీన కాలానికి పోవటమేగాక, ఈదేశస్థులేయే దేశాలతో సంబంధాలు పెట్టుకొన్నారోగూడ తేలగలదు. ప్రాచీన హిందూయుగ చరిత్రకిది ప్రథమఘట్టము.

3. వైదిక వాఙ్మయముకాలము నిర్ణయించుట కష్టము. కాని కలియుగము క్రీ. పూ. 3102 నుంచి ఆరంభమైనదనటానికి మనకు చాలా ఆధారాలున్నవి. ఇంతకు ముప్పది ఐదేండ్ల పూర్వం మహాభారతయుద్ధము జరిగినదని సంప్రదాయము, ఈయుద్ధం అసలు జరుగనేలేదనే మహావిద్వాంసులున్నారు. వీరికన్నా తెలివైనవారు క్రీ. పూ. 1151 లో ఈయుద్ధము జరిగినదన్నారు. ఊహలపై దేశచరిత్రను నిర్మించడమంటే ఇలాగే ఉంటుంది. సంప్రదాయ వాక్యాలను, గ్రంథాలను త్రోసివేసి అవి అసత్యములనటానికి మనకు హక్కు ఏమైన కలదా?

మహాభారత యుద్ధానంతరము పాలించిన రాజవంశాల జాబితాలు మన పురాణాలలో స్పష్టముగా చెప్పబడినవి. వీటిని జాగ్రత్తగా పరిశీలించితే భారతయుద్ధము క్రీ. పూ. 3137 లో జరిగిందని తేల్చవచ్చును. కాని కల్హణుని

'శతేషు షట్సు సార్థేషు త్ర్యధికేషుచ భూతలే
కలేర్గతేషు వర్షాణా మభూవన్ కురు పాండవాః'

అనే శ్లోకాన్ని బట్టుకొని క్రీ. పూ 2448 లో మహాభారత కథ ప్రారంభమైనదని ప్రాచీనులే అన్నారనే వారున్నారు. కల్హణుడు

కల్యాదిలోని 653 సంవత్సరాల చరిత్రను చెప్పటకు నిరాధారుడై ఆ తర్వాతనుంచి రాజవంశాలను పేర్కొన్నాడు.

'శేకస్‌నుంచి అలెగ్జాండరు వరకున్న కాలంలో 154 భారతీయ రాజులు 6451 సంవత్సరాలు పాలించారు' అని 'మెగస్తనీస్' అన్నాడు. 'డయానీసియస్‌నుంచి సంద్రకొత్తొస్ వరకు 153 భారతీయ రాజులు 6042 ఏండ్లు పాలించిరి; ఈ సమయంలో మూడు గణతంత్ర రాజ్యములున్నవి, రెండవది మూడువందల ఏండ్లవరకు మూడవది నూట ఇరవై ఏండ్లవరకు ఉన్నది' అని 'అరియన్'లో కలదు. కల్హణునికి లభించని 653 ఏండ్ల చరిత్రలో ఇక్కడ 420 సంవత్సరా లున్నవి. మిగిలిన 233 ఏండ్లకాలము మొదటి గణతంత్ర రాజ్యకాలమై ఉండాలి. అరియన్‌లో ఈకాలం చెప్పిన భాగము త్రుటితమైపోయినది. గణతంత్ర రాజ్యమంటే వీనిప్రకారము భారతీయ రాజులు పాలించనికాలమని అర్థము.

పౌరాణిక రాజవంశాలు మగధను ప్రాతవారినే సరిగా లెక్కించినవి. ఇచట కలియుగంలో 22 బార్హద్రథులు, పదిమంది నాగులు, నవనందులు, ద్వాదశమౌర్యులు, దశశుంగులు, నలుగురు కణ్వులు, 32 ఆంధ్రులు వస్తారు. వీరు 99 మంది రాజులు. మనువు దగ్గరనుంచి లెక్కిస్తే మహాభారతకాలంలో మరణించిన జరాసంధ పుత్రుడు సహదేవుడు 117 వ వాడు. చివరి ఆంధ్రరాజు 216 వ వాడు కాగలడు. వీరు పాలించినకాలము కలియుగములో 2669 సంవత్సరాలు.

అవంతిని పాలించిన ప్రద్యోతుల 138 సంవత్సరాలు వీరిలో కలపటం ప్రామాదికము. కాని పురాణాలలో గణతంత్ర రాజ్యకాలం సూచింపబడలేదు. అందుచేత ఈ 138 ఏండ్లు ఒక గణతంత్ర రాజ్యం ఉండి తీరాలనవచ్చును. మౌర్యులు 137 ఏండ్లు పాలించినారు. కొన్ని ప్రతులలో వీరికి 316 ఏండ్లు ఇవ్వటంచేత వీరిదగ్గరలో 179 సంవత్సరాలుగా ఒక గణతంత్రరాజ్య ముండాలి. ఇలాగే శుంగులు, కణ్వులు 157 ఏండ్లు పాలించినా కొన్నిప్రతులు వీరికి 385 ఏండ్లు చెప్పటంచేత ఇచ్చటకూడా 228 సంవత్సరాల గణతంత్ర రాజ్యస్థితి ఉండాలి. ఇలా వ్యాఖ్య చేయటానికి ఉపపత్తులు చాలా ఉన్నవి. ఈ ఉపపత్తులను గ్రహించక పురాణాలలో తప్పుడు లెక్కలున్నవనటం చాలా సాహసము.

పురాణాలలో ప్రధానమైన రాజులపేర్లు మాత్రమున్నవి. చివరకు ప్రతివంశంలోను గల మొత్తం రాజులసంఖ్య, వారు పాలించినకాలము చెప్పబడినవి. వీటిలో ఒక్కొక్కపేరు నలభై సంవత్సరాలను సూచించేది అని డి. ఆర్. మన్కడ్ సోపపత్తికంగా నిశ్చయించినాడు. గ్రీకు చరిత్రకారులు 154 రాజులకు 6451 సంవత్సరాల మూడు మాసాలిచ్చినప్పుడు ఒక్కొక్క రాజుకు దాదాపు 42 సంవత్సరాలు రాగలవు. 153 రాజులు 6042 ఏండ్లు పాలించితే సగటున 39 సంవత్సరాల ఆరుమాసాలు వస్తున్నవి.

ఈ లెక్కను అనుసరించి మనువు తర్వాత చెప్పబడిన పేర్లను గమనిస్తే 120 వ వాడు పరీక్షిత్తు కాగలడు. భారతయుద్ధంలో జన్మించిన పరీక్షిత్తు క్రీ. పూ. 3101 లో రాజ్యానికి వచ్చినాడు. ఒక్కొక్క రాజుకు సగటున 40 సంవత్సరాలు చెప్పితే ఇతనికన్న 4800 ఏండ్లకు పూర్వము, అనగా క్రీ. పూ. 7900 లో మనువు కాలమని నిశ్చయింపవలెను. గ్రీకులు చెప్పిన శేకస్, డయనీసియసులనుంచి సంద్రకొత్తొస్ వరకు గల రాజులు 153 ఉండాలి.

4. సంద్రకొత్తొస్ అనగా చంద్రగుప్త మౌర్యుడని పాశ్చాత్య చరిత్రకారు లన్నారు. దీనికి పల్లవి, అనుపల్లవి పాడేవారు మన పండితాగ్రేసరులు. సంద్రకొత్తొస్ శబ్దంలోనుంచి మౌర్యుడనే నామం కూడా వీరికెలా లభించిందో! అది రహస్యము. స్వతంత్ర భారతావనిలో మనమీ ప్రశ్నను ఇప్పుడైనా వేయకతప్పదు.

ఒక కొండపైన హోమంచేసి, తర్వాత అక్కడ కోటనుకట్టి, దానిలోని సేనకు శశికొత్తొస్‌ను అధిపతిగా అలెగ్జాండరు చేసెనని అరియన్ వ్రాసినాడు. ఇతడు శశిగుప్తుడు కావలెను. నందులలో గాని, మౌర్యులలో గాని ఈ పేరు కన్పించదు. క్రీ. శ. 40 నాటి వాడగు రుఫస్ కొన్ని విశేషాలిచ్చినాడు. 'ప్రాశి, గంగరిడేల రాజగు అగ్రమ్మెస్ అలెగ్జాండరు సమకాలికుడని, ఇతని తండ్రి మంగలి వాడని, రాణి ఇతనిని ప్రేమించుటచేత ఇతడు క్రమముగా అధికారంలోకివచ్చి రాజును, రాజకుమారులను చంపి, ఈ రాజును కనెనని, అందుచేత ఈ రాజుపై ప్రజలకు భక్తి, శ్రద్ధలు లేవని పోరస్ అలెగ్జాండరుకు చెప్పినని రుఫస్ వ్రాసినాడు. క్రీ. పూ. మొదటి శతాబ్దమువాడైన దియొదొరొస్ కూడా ఈ విషయాలనే చెప్పతూ, 'ప్రాశి, గంగరిడేల రాజగు క్సంద్రమ్మెస్ తుచ్ఛుడు, దుష్ప్రవర్తన కలవాడు; ఇతని తండ్రి అందగాడు కావటంచేత ఆనాటిరాణి అతనిని మోహించి, అతని సహాయంతో భర్తనుచంపి, అతనిని రాజు చేసినది' అని వ్రాసినాడు.

"అలెగ్జాండరును చూచిన అంద్రొకొత్తొస్ తర్వాతి రోజులలో ఇలా అనేవాడు—'దుష్టుడు, నీచుడు ఐన రాజును ప్రజలందరు ద్వేషించటంచేత, తలచుకొంటే అలెగ్జాండరు దేశాన్ని అంతా తేలికగా జయించి ఉండేవాడు'" అని క్రీ. శ. 50 నాటి వాడగు ప్లుటార్క్ అన్నాడు. "స్వాతంత్ర్యమును సంపాదించి పెట్టిన సంద్రొకొత్తొస్ తర్వాత రోజులలో నిరంకుశపాలన మొదలు పెట్టుటచేత ప్రజ లతనిని ద్వేషించే వారు. ఇతడు అధమ వర్గాలలో జన్మించినవాడు." కాని ఒక శకునం కన్పించగానే రాజ్యపదవిని ఆశించి సాధించినాడు. తన సాహసంతో నంద్రుస్‌ను ధిక్కరించగానే, అతనికి మరణశిక్ష విధింపబడినది. అప్పుడే శకునము కన్పడినది" అని జస్టిన్ వ్రాసినాడు. దీని ఫలితంగా దొంగల ముఠాను పోగుచేసి, తిరుగుబాటు చేసినాడట. దొంగలముఠా అంటే రాజులేని రాజ్యంలో ఉన్నవారని మెక్‌క్రిండిల్ వివరించినాడు. వీరు గణతంత్ర రాజ్యంలోనివాళ్ళని స్పష్టము.

ఈ వాక్యాలద్వారా ఒక రాజవంశంలో చివరరాజుకు ఇద్దరు పుత్రులున్నారని, ఆయనభార్య దుష్ప్రవర్తన గలది యని, ఆమె మంగలిని ప్రేమించినదని, తర్వాత భర్తను, పిల్లలను చంపించినదని స్పష్టము కాగలదు. ఇతని కుమారుడగు అగ్రమ్మెస్ లేక క్సంద్రమ్మెస్ అను నాతడు అలెగ్జాండరు నాటికి మగధనుపాలించిన రాజు. ఈ అలెగ్జాండరు వెళ్ళిపోయినతర్వాత అంద్రొకొత్తొస్ లేక సంద్రొ

కొత్తోస్ అనేరాజు దేశాన్ని పాలించినాడు. ఇతడు సంద్రుస్‌ను ధిక్కరించినవాడు. ఈ కథలో చాణక్యుని ప్రస్తావన లేనేలేదు.

పూర్వపురాజు మరణించకముందే క్సండ్రమెస్ జన్మించెనని డియోదొరోస్ అన్నాడు. మరణానంతరము ఇతడు పుట్టినాడని కోర్టియస్ వ్రాసినాడు. ఆ రాణికి, మంగలికి కలిగిన కుమారు డితడని స్పష్టము. సంద్రోకొత్తోస్ ఇతనితోను, సంద్రుస్‌తోను యుద్ధము చేయవలసి వచ్చింది. క్సండ్రమెస్ అనువాడే సంద్రోస్ కూడా కావచ్చును.

ఈ పేర్లకు, ఈ కథకు సరిపోయే వృత్తాంతమును పరిశీలించటానికి కలియుగ రాజవృత్తాంతము నే గ్రంథ మొకటి ఉన్నది. క్రీస్తుశకారంభంలో గ్రీకులు చెప్పిన కథకు సరిపోయే వృత్తాంతమున్న ఈ గ్రంథాన్ని అప్రామాణికమని త్రోసివేయటం మన చరిత్రకారులకు పరిపాటి ఐనది.

"ఆంధ్రరాజుల అనంతరము శ్రీ పర్వతీయులగు ఆంధ్ర భృత్యులని పిలువబడే గుప్తవంశీయులు రాజులు కాగలరు. శ్రీ పర్వతేంద్రాధిపతియగు శ్రీ గుప్తుని మనుమడు, శ్రీ పార్వతీయ కులోద్భవుడగు ఘటోత్కచ గుప్తుని తనయుడు, అమిత విక్రముడు నైన శ్రీ చంద్రగుప్తుడు నేపాలరాజ పుత్రిక ఐన కుమారదేవిని పెండ్లి ఆడినాడు. దీనితో రాజ్య కార్యనిర్వహణ లోనికి ప్రవేశించి లిచ్ఛవుల సహాయంతో సేనాధిపతి ఐనాడు. రాజగు చంద్రశ్రీ యొక్క భార్యకు చెల్లెలైన లిచ్ఛవీ రాకుమార్తెను పెండ్లిచేసి కొన్నాడు. ఆపైన రాజపత్నిచే ప్రేరేపింపబడి ఏదోఒక ఉపాయముపన్ని చంద్రశ్రీని చంపి, అతని పిల్లలకు రాణి ఆజ్ఞతో గార్డియన్‌గా వ్యవహరించినాడు. ఏడేండ్లు ఇలాఉండి ఆ పిల్లలగు పులోములనుచంపి, ఆంధ్రులనుంచి రాజ్యము నపహరించి, మగధ నేలినాడు" అని కలియుగ రాజవృత్తాంతములో ఉన్నది. చంద్రశ్రీ పుత్రుడగు పులోమ, అతని తమ్ముడు ఏడేళ్లు పాలించినట్లు వాయు, మత్స్యాది పురాణాలుకూడా చెప్పినవి.

ఈ విషయాలు గ్రీకు చరిత్రకారులు వ్రాసినవాటికి సరిపోవు చున్నవి. ఘటోత్కచగుప్తుని పుత్రుడైన చంద్రగుప్తుడే వారి వ్రాతలలో కన్పించే అగ్రమెస్ అని, క్సండ్రమెస్ అనికూడ పిలువబడిన మంగలి.

ఈ చంద్రగుప్తునకు లిఛలీ భార్యవలన జన్మించిన కచుడు తనతండ్రితో కలసి ఏడేండ్లు పాలించెనని కలియుగరాజవృత్తాంతము. చంద్రగుప్తుని నాణెములలో కన్పించే విచిత్రనాణెముల కిచ్చట సమాధానమున్నది. ఈ కచునితో కలసి పాలించటంవలన నేపాల రాజకుమార్తెకు జన్మించిన పుత్రునితో వైర మితనికి సంప్రాప్త మైనది. అప్పుడు "ఆ నేపాలాధీశుని దౌహిత్రుడు మ్లేచ్ఛసైన్యాలను సేకరించి, వంచకుడైన తనతండ్రిని బంధుపుత్రసమేతంగా వధించిన అశోకాదిత్యుడు. ఇతడే సముద్రగుప్తుడు" అని కలియుగ రాజవృత్తాంతము. గ్రీకులు చెప్పిన దొంగ ముఠాను ఇక్కడ మ్లేచ్ఛులన్నారు. దీనినిబట్టి అలెగ్జాండరు కాలమునాటి సంద్రోకొత్తస్ అను వాతడు సముద్రగుప్తుడని స్పష్టము. ఇతడోడించిన క్సండ్రమెస్ చంద్రగుప్తుడు కాకతప్పదు. సంద్రుస్ అను పేరు కచుని నామాంతరము కావచ్చును. చంద్రశబ్దము గ్రీకులో క్సండ్ర ఐనది; సముద్రశబ్దము సంద్ర ఐనది. చంద్రగుప్తుడు విజయాదిత్య బిరుదును, సముద్రగుప్తుడు అశోకాదిత్య నామమును, రెండవ చంద్ర గుప్తుడు విక్రమాదిత్య బిరుదును ధరించినారు. ఈ రెండవ చంద్ర గుప్తునకే అమిత్రఘాతియనే బిరుదుకూడా ఉండవచ్చును. అలహాబాదు స్తంభము పైగల శాసనంలో సముద్రగుప్తుడు కోటవంశీయుడని, అతడు పాటలీపుత్రమును జయించవలసి వచ్చినదని తెలుస్తున్నది. ఈ సిద్ధాంతమును అంగీకరిస్తే క్రీ. పూ. 326 నాటికే సముద్రగుప్తుని పాలన ఉన్నదనాలి. అప్పుడు ప్రాచీన హిందూ యుగచరిత్ర ఎంత మారుతుందో వేరె చెప్పవలెనా?

క్రీ. శ. 671 లో వ్రాసిన ఇట్సింగ్ తన కాలానికి ఐదు వందల ఏళ్ళకు పూర్వమే శ్రీ గుప్తుడున్నాడనే సంప్రదాయ మున్నదని చెప్పినాడు. రెండవ చంద్రగుప్తవిక్రమాదిత్యుని కూతురు వాకటక రాజపత్ని ఐన ప్రభావతి ఒక శాసనంలో ఘటోత్కచుని మొదటి గుప్తరాజని పేర్కొన్నది.

5. నేటి చరిత్రకారులు సముద్రగుప్తుడు క్రీ. శ. 320 ప్రాంతంలో రాజ్యానికి వచ్చినాడని అంటారు. అసలు విచారింప దగినది విషయము. క్రీ. శ. నాల్గవ శతాబ్దంలో ఉత్తర భారత దేశపరిస్థితిని గూర్చి అనేక ప్రాచీన గ్రీకు, రోమక చరిత్రకారులు చాలా విషయాలను వ్రాసినారు. మన ఐతిహాసికాగ్రేసరులీ గ్రంథాలను ఎందుకు వదలినారో తెలియదు. వారి సిద్ధాంతాలతో తులతూగని పురాణాలనే కాక, ఇతర ప్రాచీన ఐరోపీయ గ్రంథాలను కూడా త్రోసివేయటం సత్యాన్వేషకులమని పిలిపించు కొనే వీరికి తగదని మనవి చేసికొనాలి మనమంతా.

సింధు, కనోజ మొదలగు ప్రదేశాలను పాలించే ఏసుగురు రాజులు క్రీ. శ. 420 నుంచి 440 దాకా పాలించ పర్షియా రాజగు బ్రహాంగూర్‌నకు సామంతులని ఫిరదౌసి వ్రాసినాడు. నేటి భారతదేశ చరిత్రకారుల ప్రకారం ఈ కాలానికి గుప్తరాజు లుండాలి. వీరు పర్షియాకు సామంతులా?

క్రీ. శ. 264 నుంచి 340 వరకు ఉన్న యూసోబియస్ పంఫిలి "కాన్‌స్టాన్‌రాజు తమకు సార్వభౌముడని నచ్చచెప్పటానికి అనేక కానుకలతో భారతదేశమునుంచి రాయబారులు వచ్చి తమ దేశంలో ఆయన చిత్రాలను, శిలావిగ్రహాలను నెలకొల్పినామని చెప్పినారు" అని వ్రాసినాడు. ఈ కాన్‌స్టాన్‌టిన్ క్రీ. శ. 337 లో మరణించినాడు. మన చరిత్రకారులుచెప్పే సముద్రగుప్తు డిలాంటి పనిచేసినాడా?

"ఇతర దేశాలవారితో పోటీచేస్తూ భారతదేశపు రాజులు తమ నాయకులను, బహూకరణములను క్రీ. శ. 361 లో జూలియన్ చక్రవర్తికి పంపినారు" అని క్రీ. శ. 390 నాటివాడైన మర్సెల్లినుస్ వ్రాసినాడు. చంద్రగుప్త విక్రమాదిత్యుడీ పనిచేసినాడా? నాల్గవశతాబ్దంలో ఉత్తర భారతదేశం స్వతంత్ర దేశం కాదని స్పష్ట మౌతున్నది. జూలియన్ యొక్క న్యాయదక్షతను, పరిపాలనను కొనియాడుతూ భారతదేశపు రాయబారులు వచ్చినారని సెక్స్టస్ విక్టర్ (క్రీ. శ. 352-380) వ్రాసినాడు. ఇదే

భారతదేశంలో ఆరవ శతాబ్దంలో కూడా ఉన్నదని జూవన్నిన్ మలద క్రీ. శ. 580 లో పల్కినాడు.

వీటినిబట్టి గుప్తరాజులను క్రీ. శ. 320—540 ల మధ్య కాలంలో చూపటానికి వీలుపడదు. వీరు క్రీ. పూ. 326 ప్రాంతము వారు. ఈ గుప్తరాజుల కాలంలో మెగస్తనీస్ ఉన్నాడు. అందువలననే మౌర్యుల నాటి చాణక్యుని గ్రంథానికి, మెగస్తనీస్ గ్రంథానికి చాలా విభేదాలు కన్పిస్తున్నవి.

ఈ విషయాలను శ్రద్ధగా పరిశీలించితే ప్రాచీన హిందూ యుగ చరిత్రను పూర్తిగా తిరగ వ్రాయవలెనని స్పష్టమౌతుంది. తేదీల నిర్ణయంలోనే చాలా తప్పటడుగులు వేసినారు. ఉదాహరణకు బుద్ధుని జన్మకాలం గమనించుదాము. పై లెక్కనుబట్టి మౌర్యులు కనీసం క్రీ. పూ. పదకొండవ శతాబ్దము వారౌతారు. అంతకుముందే బుద్ధుడుండాలి. మనకుడిచ్చిన లెక్కనుబట్టి బుద్ధ నిర్వాణము క్రీ. పూ. 2066 లో జరిగిందని తెలుస్తుంది. వీటిని అన్నింటిని చక్కగా పరిశోధించి భారతదేశ చరిత్రను వ్రాస్తే క్రీ. పూ. 26 వ మనదేశంనుంచి రోమక చక్రవర్తికి పంపిన రాయబారవర్గమే మహాచక్రవర్తి పంపింది తేలగలదు. అశోకుని శిలాస్తంభాలని చెప్పబడే వాటిలో అశోకుని విన్ని, సముద్రగుప్తుని విన్ని? అనే ప్రశ్నకూడా సమాధానాన్ని కోరుతుంది. పదునాలుగు ప్రధాన రాతిశాసనాలు, రెండు కళింగశాసనాలు, ఏడు స్తంభాల పైని శాసనాలు, రాణిగారి శాసనము సముద్రగుప్తుని వనటానికి ఆధారమున్నది. వీటికి బౌద్ధమతంతో సంబంధములేదు. మిగిలినవి అశోకునివి, సముద్రగుప్తుడు అశోకుడని మంజుశ్రీ మూలకల్పము, అవైదికుడని పురాణాలు పల్కినవి. అనేక రాజసమూహాలతో కళింగదేశమున సముద్రగుప్తుడు యుద్ధము చేయవలసి వచ్చినదని, అచట లక్షమంది మరణించినారని జయస్వాల్ నిర్ధారణ చేసినాడు.

ఇకనైనా మన చరిత్రకారులు పాశ్చాత్యులిచ్చిన భారతదేశ చరిత్రను పరిత్యజించి, సరియైన దేశచరిత్రనిస్తే చాలా బాగుంటుంది. విద్యాభవనంవారి చరిత్ర సంపుటాలుకూడా తప్పుడు మార్గాన్నే అవలంబించటం శోచనీయము.



# భర్తృక

శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

ఈ పసికందు పెరిగి పెద్దదై "నాన్నా" అని తనను పిలిస్తే 'ఏం సమాధానం చెప్పాలి' అని ప్రశ్నించుకున్నాడు గోపాలం. అతనికి సమాధానాలు అనేకం. అవన్నీ చెప్పి పాపమనస్సు పాడు చెయ్యలేడు తను. అసలవన్నీ సమాధానాలుగూడా కాదు. తన మనసులో మంటల్లా చెలరేగుతున్న అనేకమైన భావాల రూపాలు అవి. అవి నిజమూ కావు. అబద్ధమూ కావు, మళ్లీ పాపకళ్లల్లోకి చూస్తాడు. పార్వతి కనిపిస్తుంది. 'నాకు తీరని అన్యాయం చేశావు నువ్వు' అని చెబుదా మనుకుంటాడు. పాప నవ్వుతుంది. పసిడిబుగ్గల్లో వెన్నెల కాస్తుంది. ఆ కళ్లల్లో అనంతమైన ఆకాశం, అవధుల్లేని సముద్రాలు కలిసిపోయినట్లుంటుంది. అందులో ప్రకృతి ఉదయిస్తుంది. క్షీరసాగరమథనంలో హాలాహలం కదిలినట్లు ఏదో భయం... ఏదో ఛాయ తనను భయపెట బోతుంది. గోపాలం పాపను దగ్గరగా తీసుకుని 'నీకు అన్యాయం చేస్తాననుకున్నావా...భగవంతుడు ఇంకా బ్రతికే వున్నాడు... నీకేం భయం లేదమ్మా...' అంటూ గొణుక్కుంటాడు. పాప మళ్లీ నవ్వుతుంది.

పార్వతి తనకు అన్యాయం చేసిందేమో అనుకుంటాడు గోపాలం. అన్యాయం చెయ్యలేదనే వెళ్లిపోయాననుకుంటుంది పార్వతి. ఎక్కడికి వెళ్లిందో, ఏమో ఎవరితో చెప్పిపోలేదు. ఈ విశాల ప్రపంచంలో ప్రతి జీవితానికి ఏదో ఒకరకమైన ఆధారం వుండనే వుంటుంది. పార్వతి బ్రతకలేకపోదు. అందుకోసం కాదు గోపాలం విచారం. పార్వతి చచ్చిపోయినా అంతగా దుఃఖించే వాడు కాదేమో! పార్వతి తనకూ ప్రపంచానికి అన్యాయం చేసిందని గోపాలం వాదన. అంతా కలిసి తనకు అన్యాయం చేశారనుకుని వారందరినీ విడిచి వెళ్లిపోయింది పార్వతి. ఇందులో నిజానిజాలు నిర్ణయించటానికి నిజమంటూ ఒక వస్తువు ఏముంటుంది గనక. అది వారివారి సంస్కారాన్ని బట్టి ఉంటుంది. ఇంతకీ జరిగిన సంగతిఇది.

గోపాలం, పార్వతి ఎవరు అని అడుగుతారు. ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. వాళ్లచరిత్రలు ఏమంత పెద్దవిగావు. సాధారణ కుటుంబాల్లో జన్మించి ఒక ఇంట్లో ఉంటూవచ్చారు. ఒకరికొకరు ఎంతకాలంగానో తెలుసు. అదీ వారి పరిచయం. పార్వతికి పెళ్లి యిందని, ఆ భర్త కొంతకాలమైనా ఉండేవాడనీ గోపాలానికి తెలుసు. విగత భర్తృక పార్వతి. పార్వతితో మాట్లాడితే సమాధానం చెబుతుంది. ఆమె ఎప్పుడూ నవ్వగాగాని, ఏడ్వగాగాని ఎవ్వరూ చూచి ఎరుగరు. గోపాలం ఎప్పుడన్నా ఆమెకళ్లల్లోకి చూడగలిగితే నవ్వూ, ఏడుపూ కలిసి ఎన్నో భావాలు తనహృదయానికి వచ్చి తాకుతాయి. తాను ఏదో చెబుదామనుకుంటాడు. పార్వతి తనను గురించి ఏమనుకుంటున్నదో తెలియదు. తనభావాల ప్రతిబింబాలు అక్కడకూడా వుంటాయి అనుకుంటాడు అతను.

గోపాలాన్నడిగితే పెళ్లిఅయినవాళ్ళందరికీ పెళ్లికానివాళ్ళందరిమీద ఒకరకమైన ఈర్ష్య అంటాడు. దానికి కొన్ని కారణాలు గూడా వున్నాయి అతని దగ్గర. అంతా తనను పెళ్ళిచేసుకోమని బలవంతం చేస్తారు. తను సుఖపడుతుంటే చూస్తూ వూరుకోలేకనే గదా అని అతని అభిప్రాయం. పెళ్ళివిషయం వస్తే అతనిలో ఏమేమిటో ఆవేశాలు వస్తాయి. వైవాహికజీవితంలోని సుఖాలను గురించి కాదు. తన ఆశయాలు ఫలించే రోజులు వస్తున్నాయనే గుర్తొస్తుంది. భగవంతుడు ప్రసాదించిన ఈజీవితానికి ఏదో ఉపయోగం వుండాలి. తను మరణించే లోగా ఏదన్నా మంచి పని ఒక్కటన్నా చెయ్యాలి అనుకుంటాడు. "పార్వతిని పెళ్ళిచేసుకుంటాడు తను..." ఆమాట తలచుకున్నపుడల్లా ఆవేశం వచ్చి ముఖం కందిపోయేది. తను ఒక నిర్ణయానికి వస్తాడు. పార్వతి తనకు భార్య అవుతుంది. జీవితానికి ఇంకేం అక్కర్లేదు అనుకుంటాడు.

కాలేజీ చదువుకోసం పొరుగూరులో వున్నప్పుడు గోపాలం మనస్సు స్థిమితంగా వుండేదేగాదు. ఎప్పుడూ పార్వతి గురించే ఆలోచన. అప్పటికే వచ్చి ఆరునెలలు దాటుతోంది. పార్వతిని చూడాలన్న కుతూహలం అతన్ని కదల్చివేస్తోంది. ప్రతిసారి ఏవో అడ్డంకులు సెలవుపెట్టి పోవటానికి. ఇక వుండబట్టకపోయాడు. కాలేజీకి సెలవుపెట్టి పరుగులెత్తుకుంటూ వచ్చాడు ఇంటికి.

సొంతవూళ్ళో ఎరగని వాళ్ళెవరు. సామానంతా బండిలో ఎక్కించి బండివాడి పక్కముందుగా కూర్చున్నాడు. బండివాడికి గోపాలాన్ని చూడటంతోటే పార్వతి గుర్తుకు వచ్చింది. అతను పొరుగూరునుంచి వచ్చినాసరే తన బండీమీదనే గోపాలం ఇంటికి తీసుకుపోతాడు. అతనికి వరస అది. ఇంట్లో సంగతులు కొంచెం కొంచెం పసికడతాడు.

'పార్వతమ్మగారు ఆసుపత్రిలో వున్నారు తెలుసా... అండి...' అంటూ ప్రశ్నించాడు బండివాడు. ఆ బండిలోనే పార్వతిని ఆసుపత్రిలో చేర్పించింది. ఆ మాటవింటూనే గోపాలం గుండె బెదిరిపోయింది. కారణాలు అతను చెప్పలేదు. సామాను ఇంటికి తీసుకుపొమ్మని బండివాడికి చెప్పి గోపాలం పరుగు లెత్తుకుంటూ ఆసుపత్రికి పోయాడు.

పార్వతిని ఇంట్లో లేకుండా ఆసుపత్రిలో చూడవలసి వస్తుందని గోపాలం అనుకోలేదు. ఆసుపత్రి గదినుంచి నర్సు బయటకు

వస్తూ 'మీరు లోపలకు పోవచ్చు' అని చెప్పి వెళ్ళిపోయినప్పుడు ఒకక్షణం గుండె దడదడలాడింది అతనికి.

ఆమె మంచందగ్గర ఎవ్వరూ లేరు. అతనికి కొంచెం భయం వేసింది. చొరవ చేసుకుని మంచందగ్గరకుపోయి నిలబడ్డాడు. పార్వతి అతన్ని చూడటంతోటే అదిరిపడ్డది. ఆమె ముఖంలో వల్లని నీడలు కదులాడినాయి. లేచి కూర్చోవాలని ఆమె ప్రయత్నిస్తున్నట్లు గమనించిన గోపాలం 'వద్దు... అలాగే పడుకో' అని గది నాలుగు మూలలా కలయచూశాడు.

ఆమె నేత్రాలు ఏమేమిటో ప్రశ్నిస్తున్నాయి. చాలా నీరసంగా వుంది. మాట్లాడటానికి ప్రయత్నించి తొట్రుపాటు పడటంతో గోపాలం అందుకుని 'ఇప్పుడేవచ్చాను...రైలుదిగి బండీమీద వస్తుంటే బండీవాడు చెప్పాడు...' అన్నాడు.

'ఏంచెప్పాడు...' అన్నట్టు ఆదుర్దాగా చూసింది పార్వతి.

'ఎలా అయిపోయావు పార్వతీ ... నిన్ను ఇంకోరకంగా వూహించుకుంటూ వచ్చాను...అసలేం జరిగింది...ఏమటిసుస్థి...' ఆదుర్దా కనపరిచాడు. పార్వతి ముఖం రెండో పక్కకు తిప్పుకుని వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది. గోపాలం చూడలేకపోయాడు.

'ఆధైర్యపడకుపార్వతీ...నేను వచ్చానుగా! అంటూ ఆమె ముఖం స్పృశించబోయాడు. ఆమెలో అంతశక్తి ఎలా వచ్చిందో ఏమో...'నన్ను ముట్టుకోకండి' అంటూ పెద్దపెట్టున అరిచింది. గోపాలం నిర్ఘాంతపోయాడు. పార్వతి అతనివైపు ముఖం తిప్పనే లేదు. 'ఏమిటి...ఏమిటి...' అంటూ ఆదుర్దాగా ప్రశ్నించాడు.

'నన్నడక్కండి...నన్నడక్కండి...' అంటూ గొణిగింది పార్వతి. గోపాలం బరువుగాలేచి నిలబడి అటూ ఇటూ చూశాడు.. ఏదో భయంకరవాతావరణంగా వున్నట్లు తోచింది.

'మళ్ళీ వస్తాను...' అంటూ విసురుగా బయటపడి ఇంటికి వచ్చేశాడు.

ఇంటికిపోయేటప్పటికి వర్ధనమ్మ వాకిట్లో ఎదురుచూస్తూ నిలబడింది. తను సందుచివర కనబడటంతో మెట్లుదిగి ఎదురువచ్చి 'ఏం బాబూ ఇంతచిక్కిపోయావు' అంటూకుశలప్రశ్న వేసింది. గోపాలం నవ్వుతూ 'హోటళ్ళలో నీలాగా అన్నం తినిపిస్తారా పిన్నీ...ఆరు నెలలు దాటింది తృప్తిగా అన్నంతిని...అన్నాడు.

'సరే కబుర్లకేంలే ... ముందర కాళ్ళు కడుక్కునిరా ... నీకిష్టం అని పూర్ణబూర్లుకూడా చేశాను...' అంటూ లోపలకు తీసుకుపోయింది వర్ధనమ్మ.

ఇంట్లోకి అడుగు పెడుతుండగా తండ్రి ఎదురుపడి 'పదిహేను రోజుల్లో పరీక్షలు పెట్టుకుని ... ఇప్పుడేం మునిగిపోయిందని వచ్చావు" అని అడిగి సమాధానం కోసమయినా ఆగకుండా వీధిలోకి వెళ్ళిపోయాడు. గోపాలం నవ్వుకుని 'నాన్నకు నామీద కోపం తగ్గలేదల్లేవుందే...' అన్నాడు,

'నయం...మీనాన్న మంచివారు కాబట్టి సరిపోయింది. ఇంకొకళ్ళయితే ఏమన్నావుందా...పార్వతి సంగతి తెలుసా ఏమయిందో' అన్నది.

'నేనే అడుగుదామనుకుంటున్నాను...ఏమయిందేమిటి' అని అడిగాడు ఆదుర్దాపడుతూ. వర్ధనమ్మ పింగాణీపళ్ళెంలో పూర్ణబూరెలు పెడుతూ 'పెద్దవాళ్ళం చెబితే చాదస్తం అన్నారుగాని. పార్వతికి సుస్థేమిటో తెలుసా నాయనా...చెడిపోయినవాళ్ళందరికీ వచ్చేదే' అంది మెల్లిగా.

గోపాలానికి ఆమాట పెద్ద అఘాయిత్యంలా తగిలింది.

'జరిగిందేమిటో చెప్పకుండా...చెడిపోయింది..చెడిపోయింది అనటం ఎందుకుపిన్ని' అన్నాడు.

'ఉన్నమాటఅంటే తప్పొచ్చిందేమిటిరా...' అని అడిగింది వర్ధనమ్మ.

'తప్పొప్పులు పట్టటంలేదు...అనవసరంగా నిందించవద్దని అంటున్నాను...నేను పార్వతిని పెళ్లిచేసుకుంటే...' అంటూ ఇంకేదో చెప్పబోతుండగానే వర్ధనమ్మ ఉబ్బిరాలైంది. ముఖం అంతా ఎర్రగా కందిపోయింది.

'అయితే నువ్వు పార్వతిని పెళ్ళిచేసుకుంటావు...మతివుండే మాట్లాడుతున్నావా...' అని అడిగింది వర్ధనమ్మ కుప్పగా కూలిపోతూ.

'అవును...' అంటూ గోపాలం ముందరవున్న పళ్ళెం వదిలేసి దొడ్లో చెయ్యి కడుక్కుని ఇంట్లోకి వచ్చాడు. వర్ధనమ్మ వెనకాలగానే వచ్చింది.

'నే నొక్కమాట అడగనా పిన్నీ....'

'ఏమిటి...?'

'పార్వతికి ఇరవైఏళ్లుగాదూ...ఆమె మిగిలిన జీవితమంతా నిస్సారంగా...నికృష్టంగా గడిచిపోకుండా నేను చేయగలిగితే మంచిదేకాదు పిన్నీ...'

వర్ధనమ్మ నిట్టూర్చింది. ఆమె కళ్లల్లో ఎన్నో దృశ్యాలు మెదిలినాయి. ఆమెకు తన జీవితము గుర్తుకు వచ్చింది. ఆమె కళ్లలో నీళ్లు కదిలినాయి. ఒకక్షణం ఏమీ మాట్లాడలేకపోయింది.

'ఏమో నాయనా...ఈ ఆవేశాలూ...అనర్థాలూ నాకేం తెలియవు...మీ నాన్న ఇంకేదో సంబంధం చూస్తున్నారు...పిల్ల బాగా వుంటుందట...'

'పార్వతిమటుకు బాగాలేదా పిన్నీ...ఆమె జీవితం ఏం కావాలి...అంటే మీరెవరూ మాట్లాడరేం' అంటూ గంయిమన్నాడు. వర్ధనమ్మ సంబాళించుకోలేకపోయింది. ఆమెకు వెంటనే సమాధానం దొరకలేదు. పార్వతి రెండు సంవత్సరాల కాపురం ఆమెకు గుర్తు వచ్చింది. పాతివ్రత్య ధర్మం బ్రద్దలైపోతున్నది. ఆమెకు భయంవేసింది. పార్వతి జీవితం ఏం కావాలి? గోపాలం అడిగిన ప్రశ్న సబబుగా తోచింది. కవకయ్య సంబంధం తీసి కట్టేంగాదు. చిన్ననాటినుంచి ఎరుగున్నవాళ్లు. ఆ అమ్మాయి గోపాలంమీద ఎన్నో. ఆశలు పెట్టుకొని జీవిస్తోంది. ఆ అమ్మాయి జీవితం ఏం కావాలి? గోపాలానికి ఆ మాట తట్టకూడదూ? అనుకున్నది. రెండేళ్ళు కాపురంచేసిన పార్వతిని చెడిపోయిందంటే అదిరిపడ్డ గోపాలానికి శీలం అంటే ఏమి తెలుసు? తనెలా చెబు

తుంది? వర్ధనమ్మ ముభావంగా వూరుకుంది. ఆమె దగ్గర సమాధానం లేదు అనుకున్నాడు గోపాలం.

ఆ రోజు సాయంత్రం కనకయ్య తాలూకు సంబంధం మాట్లాడి పోవటానికి వచ్చాడు. గోపాలం ఎవరితోటీ మాట్లాడకుండా ముభావంగా వుండిపోయాడు. వర్ధనమ్మ కూడా ఏ విషయం చెప్పలేదు. కనకయ్య చిన్నబుచ్చుకున్నాడు. 'నేను మాట్లాడి ఏ విషయం చెబుతానులే...' అన్నాడు గోపాలం తండ్రి రమణయ్య. కనకయ్య వచ్చినదారినే నిరాశలో వెళ్ళిపోతూ 'మొట్టమొదటినుంచి అనుకుంటున్న మాట...మన కుటుంబాలు నాలుగు కాలాలపాటు కలిసి వుండేట్లు చూడటం మన బాధ్యత... అందుకే నా యీ తాపత్రయం...'అని చెప్పేసి ఉత్తరీయం బుజంమీద వర్దు కుని చేతికర్ర ఆడించుకుంటూ వెళ్ళిపోయాడు.

కనకయ్య గడప దాటాడో లేదో రమణయ్య విరుచుకు పడ్డాడు గోపాలంమీద.

'ఎవరిని చేసుకుంటావురా జానకిని గాకుండా...ఈ సంబంధం అనుమానంలో పడ్డప్పటినుంచి జానకి దిగులుపడి మంచం ఎక్కింది తెలుసా...మీ పిన్ని అంతా చెప్పిందిలే...నీ పిచ్చి, ముర్రి వ్యవహారాలు సాగవు తెలిసిందా...?' గోపాలం ఏమీ మాట్లాడక పోయేటప్పటికి

'ఏంరా... ఎవరికీ చెప్పేది...గోడలకు అనుకున్నావా... మాట్లాడితే ముత్యాలేమన్నా రాలిపోతా యనుకుంటున్నావా...' అంటూ గర్జించాడు రమణయ్య.

గోపాలం గొంతు పెగల్చుకుని 'నన్నేమన్నా మాట్లాడ నిస్తేనా...'అంటూ గొణిగాడు.

'మాట్లాడమనేగదరా చెప్పేది...నీ శోభ ఏమిటో చెప్ప రాదూ...' గొంతులో స్వరం ఏమాత్రం తగ్గలేదు.

'నాకీ పెళ్లి ఇష్టంలేదు...'

'అది తెలుస్తూనేవుంది...ఎందుకో అఘోరించరాదూ...'

'నేను పార్వతిని పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను...'

రమణయ్యకు వళ్లు మండిపోయింది.

'విధవ ముండను పెళ్ళి చేసుకుంటావుటరా...సిగ్గులేదూ ఆ మాట అనటానికి...థూ' అని తుపుక్కున ఉమ్మేశాడు. 'నాన్నా...'అంటూ గట్టిగా అరిచాడు గోపాలం 'నేను పార్వతిని తప్ప ఎవరినీ పెళ్ళి చేసుకోదలచుకోలేదు...ఆమెను మీ యిష్టం వచ్చినట్లు మాట్లాడకండి...' అన్నాడు.

రమణయ్య నిర్ఘాంతపోయాడు.

'ఏమిటి కూసింది...' అంటూ మీదకు లేచాడు.

'ఏమీ లేదు...లే'

'అదేదో తేలాలి...'

'అంత నిక్కచ్చిగా తేలాలనివుంటే నా మాట పూర్తిగా వినండి...పార్వతికి జరిగిన అన్యాయం చాలు...మీరు నన్నేం చేసినాసరే...పార్వతినే చేసుకుంటాను...ఆ మాట చెప్పిపోదా మనే వచ్చాను...'అంటూ ఆవేశపడుతూ చెప్పాడు. రమణయ్య ముఖం కందిపోయింది. గోపాలం ముఖం జేవురించింది.

'పోండి...అంతా గంగలోకి దిగండి...పార్వతిని ఎట్లా చేసుకుంటావో చూస్తానుగా...' గళం అంతా ఎత్తి అరిచాడు రమణయ్య.

'పార్వతినే పెళ్ళిచేసుకుంటావుటరా...' మళ్ళీ నొక్కి అన్నాడు రమణయ్య.

గోపాలం కళ్ళు ఎర్రగా మండిపోతున్నాయి.

'ఆ...ఆమెనే చేసుకుంటాను...'

'ఆమె ఆసుపత్రిలో ఎందుకువుందో తెలుసా...'

'............'

'తెలీదు...నీకు...చెపుతావిను...చెడుగా తిరిగి భయపడి ...మందుపుచ్చుకుని...చావలేక ఆసుపత్రిలో చేరింది...కులట... మహాపతివ్రత అని బాగుచేద్దా మనుకుంటున్నావురా...సిగ్గులేదురా నీకు...' అని చేతిలోవున్న తుండుగుడ్డ దులిపి బుజంమీద వేసుకుని దొడ్లోకి చరచరా పాములాగా బుసలుకొడుతూ వెళ్లిపోయాడు. గోపాలం హతాశుడై అలాగే కొయ్యలాగా నిలబడిపోయాడు.

ఆపూట అన్నం హితవుదోచలేదు గోపాలానికి. పార్వతి చెడిపోయిందా? అతని మనసు కలవరంపొందింది. చల్లపోసుకో కుండా లేచేటప్పటికి వర్ధనమ్మ చెబితేగాని తెలియలేదు. అయోమయంగా వకక్షణం నిలబడి వెళ్లిపోయాడు. వర్ధనమ్మ వంటపనంతా చేసుకుని గోపాలందగ్గర చేరింది. 'నాన్న మాటలన్నాడని అభిమానం వచ్చిందిగదూ' అంది. గోపాలం మాట్లాడలేదు.

అందుకనే కామాలు పార్వతి తనకు ముఖంచూపించలేక పోయింది. తను బయటకు వచ్చేస్తుంటే మాటఅన్నా చెప్పలేదు. తనస్పర్శను విదిలించి పారేసి బిగ్గరగా అరిచిందెందుకు? తనను మోసంచేసిందా? ఎన్నో వూహించుకున్నాడు. తనుచేయబోయే త్యాగానికి ఇంత విలువకట్టిందా...ఛీ...'అనుకున్నాడు.

మరునాడు ఉదయమే ఆసుపత్రికి పరుగులెత్తుకుంటూ వెళ్లాడు. పార్వతి ఎవరో నర్సుతో కబుర్లుచెబుతోంది. తనురాగానే నర్సు లేచినిలబడి పక్కకు వెళ్లిపోయింది. పార్వతిముఖంలో నవ్వు మాయమయింది. వానమబ్బుల్లాగా విషాదఛాయలు ఆమెముఖం మీదకు పరుగులెత్తుకుంటూ వచ్చినాయి. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయినాయి. తనవంక వకక్షణం చూసినదల్లా ముఖంపక్కకు తిప్పుకుని దిండులో తలదూర్చి వెక్కి వెక్కి ఏడవసాగింది.

గోపాలం అలాగే నిలబడి 'అంతా తెలిసింది...' అన్నాడు.

పార్వతి ముఖంతిప్పకుండానే! 'నేనూ అదే కోరుకున్నాను. నా బాగుకోరితే నాతో మాట్లాడకండి...ఆ రుణం తీరిపోయింది..' అంటూనే వలవలా ఏడవసాగింది. గోపాలం హృదయం కొద్దిగా ద్రవించింది. ఆగ్రహంతో వచ్చిన తనకు ఆమెమాటలు సానుభూతితో వినాలనే ఇచ్ఛకలిగింది.

'ఇంత అన్యాయం చేస్తావనుకోలేదు......' అన్నాడు గోపాలం అలాగే నిలబడి.

'అ... నేను అన్యాయం చేశానా... నేనా... నేను...' ఆమె తీవ్రంగా మాట్లాడసాగింది. గోపాలం నివ్వెరపోయాడు. ఎవరో నర్సువచ్చి 'ఏమన్నా కావాలా...' అని అడిగి వెళ్ళిపోయింది.

'నువ్వుకాదూ అన్యాయంచేసింది...అలా అనుకున్నావెందుకు ...సంఘాన్నీ, కన్నతండ్రిని ఎదిరించి, నీకోసమని...' అంటూ ఆవేశపడుతూ ఇంకేదో చెప్పలేక ఆగిపోయాడు.

పార్వతి వకక్షణం మెల్లిగా 'నామాట వింటారా...' అని అడిగింది.

'అందుకేగా వచ్చింది...'

పార్వతి పక్కనే స్టూలుమీద వున్న గాజుగ్లాసులో పళ్ళ రసం తాగుతూ 'కూర్చోండి...' అంది. గోపాలం బల్లరున పర్సీ క్లీటు లాక్కుని కూర్చున్నాడు. పార్వతి గ్లాసు మంచంకింద పెట్టి మెల్లిగా చెప్పటం మొదలు పెట్టింది.

'నిజంగా నా కిప్పుడే జ్ఞానోదయం అవుతున్నట్లుంది... ఏమిటో అర్థంకాని ఆనందం కలుగుతోంది...అది ఆనందమో విషాదమో తెలియటంలేదు...హాలాహలానికీ, అమృతానికి తేడా ఏమిటి అనిపిస్తోంది ఇప్పుడు...రెండూ పాలసముద్రంలో నుంచి వచ్చినవే గదూ...వకదానికొకటి మారురూపం అనుకుంటాను...'

'ఆ వాదంతా ఎందుకు...కావాలసింది చెప్పకుండా...'

'చెపుతాను ... నేను హాలాహలంమింగాను, అమృతం తాగాను...అందుచే మనసులో వున్నది చెప్పగలుగుతున్నాను... మీరు సంఘాన్ని ఎదిరించామన్నారే...తండ్రిని ఎదిరించామన్నారే...ఎందుకు...మీ పేరుకోసం ...ప్రఖ్యాతులకోసం ... విధవా వివాహం చేసుకుని సంఘాన్ని ఉద్ధరించానని ఊళ్ళో దండలు వేయించుకుందామని గాదూ...' గోపాలం తెల్లబోయి చూస్తున్నాడు.

'నన్నిట్లాగే అర్థంచేసుకున్నా వన్నమాట' వళ్లు పటపట లాడించాడు...పార్వతి అతి నిర్లక్ష్యంగా చూసి...'అదివరకు అలా అర్థంచేసుకోలేదు...ఇప్పుడు తెలుసుకోగలిగాను...పల్లు కొరుకుతా రెందుకు...వకొక్కరికి వక అభిప్రాయాన్ని సృష్టించుకుని దానికి దాసిన లవుతారు...కొందరికి డబ్బు...కొందరికి అందం... కొందరికి పేరుకావాలి...వీళ్లలో వున్న వకొక్క బలహీనతను ఆదర్శంగా కూర్చుకుని, రంగులువేసి మాట్లాడుతారు...మీరు మటుకు...పేరుకోసం కాకపోతే...' పార్వతి గద్గదస్వరయై, కన్నీరు కార్చటం మొదలుపెట్టింది. గోపాలనికి భయంవేసింది. ఆశ్చర్యం వేసింది. ఆమె మనసులోకి ఇటువంటి ఆలోచనలు ఎలా చేరాయో అతనికి అంతుపట్టలేదు. వర్ధనమ్మ మనసులో మెదిలింది. కనకయ్య గుర్తుకు వచ్చాడు. తండ్రి గుర్తుకువచ్చాడు. అంతా తన కళ్లముందర నడిచిపోతున్నారు. వాళ్ళొక్కరికీ పార్వతి సంగతి పూర్తిగా తెలియదు. ఆమె ఆసుపత్రిలో చేరటంవరకే తెలుసు. ఈ అనర్థానికి మూలం ఎక్కడుందో తనొక్కడికే తెలుసు. పార్వతికి తెలుసు...సంఘం అంటే ఏమిటి? తనూ, పార్వతీ కాదు. ఇంకో వాళ్ళు, పిన్ని కనకయ్యలాంటివాళ్ళు అనేకులున్నారు. తప్పుచేసిన వ్యక్తి నిర్భయంగా తప్పు అంగీకరించి క్షమాపణ కోరుకోగల మానసిక స్థైర్యం ఆ వ్యక్తికి కలగనీయరు. ఆ తప్పుని దాచేతున్ని, తెలియక తన్నుకులాడిపోతూ నికృష్టమైన జీవితం గడుపుతుంటే 'ఛీ' అని ఉమ్మేశే వాళ్లూ, 'పాపం' అని జాలిపడేవాళ్ళు. తనొక్కడూ ఏం చెయ్యగలడు? ఏమీ చెయ్యలేడా?

తనే చెయ్యలేకపోతే వకొక్క వ్యక్తిగా సంఘంలోని ఇతరులు మటుకు ఏం చేయగలుగుతారు...' నేనేం చెయ్యాలి...' అంటూ గోపాలం తలపట్టుకున్నాడు. అతని శిరస్సు వేడెక్కిపోయింది.

'నీ కన్యాయం చెయ్యను...నీ కన్యాయం చెయ్యలేను...' అంటూ గొణిగాడు. 'నిన్ను ప్రేమించాను...నన్ను నమ్ము...' అంటూ ప్రాధేయపడుతూ అడిగాడు.

'మిమ్మల్ని మళ్ళా నమ్మనా...చేసిన తప్పునే మళ్ళా చెయ్యమంటున్నారా...' పార్వతి మాటలు ములుకుల్లాగా వచ్చినాయి.

గోపాలం ఆమెవంక తీక్షణంగా చూచాడు. పార్వతి దీనంగా చూచింది. గోపాలం కంట తడిపెట్టాడు. పార్వతి గద్గదస్వరంతో 'నా సంగతి అంతా తెలిసిందా...' అంటూ గొణిగింది.

గోపాలం మనస్సు పరిపరివిధాల పోయింది. పార్వతికి పాప కలుగుతుంది. అతని హృదయం ఝల్లుమంది. ఎన్నో జ్ఞాపకాలు, మధురమనుకున్న క్షణాలు, మనసులో గిరగిర తిరిగినాయి. తను నిర్లక్ష్యం చేయబోతున్నాడని నమ్మిందా పార్వతి. 'నిజంగా వివాహం చేసుకోవటానికే నిశ్చయించుకున్నాననీ, అందుకే ఇప్పుడు వచ్చాననీ' ఎలా చెప్పటం అన్నది అతనికి తెమలనే లేదు. పార్వతిని నమ్మవచ్చా? అన్న సంశయం అతన్ని మరీ బాధిస్తూవచ్చింది. ఆమెలో పెరుగుతున్న ఛాయ ఎవరిది? నీడనుబట్టి మనుష్యుల నెలా పోల్చుకోవటం—

గోపాలం ఆలోచనలు వకదారి నడవటంలేదు. విధవరాలైన పార్వతిని వివాహం చేసుకోదలచిన తను, ఏపాపం ఎరుగని ఆ పసికందును క్షమించలేడా? పార్వతినే స్వీకరించగలిగిన తను ఆ పాపను స్వీకరించలేడా? ఏమిటిది? ఏంచెయ్యాలి...ఆవేశంలో కలిగిన పరిణామాలకు యావజ్జీవం కృంగి కృశించాలా? తన జీవితంకోసం, పార్వతి జీవితాన్ని తను నాశనంచెయ్యలేడు. కాదు. పార్వతి పలుకు. కుళ్ళు చావలసిందే! అవును...కాదు...గోపాలం వున్నట్టుండి హఠాత్తుగా గదివిడిచి బయటకు వచ్చేశాడు. ఎందరెందరో వారి వారి పనులమీద తిరుగుతున్నారు. తన బాధ వక్కరికీ అర్థంకాదు. పార్వతీ, పాప చనిపోతే, ఆ పుసురెవరికి తగులుతుంది. 'భగవాన్ నాకు జ్ఞానం ప్రసాదించు...' అనుకున్నాడు.

ఎక్కడున్నా గోపాలానికి కంటి రెప్పలలో పార్వతి మెదులుతోంది. అన్నం సహించటంలేదు. కునుకు పట్టటంలేదు. తల నొప్పి విపరీతంగా బాధపెడుతోంది. రోజులు దొరదొరా దొర్లుకుపోతున్నాయి. కనకయ్య చాలా తరుచుగా వస్తున్నాడు. వంట్లో బాగా లేదని పరీక్షలకు వెళ్ళటం మానుకున్నాడు గోపాలం.

రమణయ్య తీరిక వున్నప్పుడల్లా లోకాన్ని గురించి అందులో వున్న వాళ్ళ బాధ్యతలను గురించి కనకయ్య కూతురు సంబంధంతో కలిపి మాట్లాడుతున్నారు. గోపాలం అన్నీ విని వూరుకుంటాడు. తను ప్రత్యేకించి మళ్ళా చెప్పదలచింది ఏమీ లేదు. తను ఇంటికి వచ్చిన తర్వాత రెండు కొలెంపడు రోగితోలు చింపేవాడు.

ఒకరోజు రాత్రి తొమ్మిదిగంటలకు ఏమీ తోచక ఆవేదనలో గోపాలం షికారుకు బయలుదేరాడు. పార్వతి సంగతి తెలుస్తూనే వుంది. బయట వెన్నెలు విరగకాస్తున్నది. ఎక్కడో కుక్క తీరికగా కూర్చుని ఏడుస్తోంది. అనుకోకుండానే కనకయ్య ఇంటిసందువైపుకు వెళ్ళాడు. అక్కడ జానకి కనపడింది. వాకిట్లో నుయ్యిదగ్గర నిలబడి చందమామవంక చూస్తూ ఏదో పాట పాడుకుంటున్నది. తనను చూసింది. పరిచయమైనట్లుగా నవ్వింది. పాట ఆపలేదు. ఆమెకంటిలో మెరమెర వెన్నెలలో కనపడుతోంది. తెల్లటి వాయలుచీర గాలికి రెపరెపలాడుతోంది. బుజంమీదుగా జారినకొంగు గాలిలో కొట్టుకు పోతూ నురగలుకక్కే నదీప్రవాహంలా వుంది. గోపాలం వకక్షణం నిలబడి ఆమె దగ్గరగా వెళ్ళాడు. పాట ఆపేసి అతని కళ్ళల్లోకి ఎంతో తృప్తిగా చూసింది. అతను నిగ్రహించుకోలేకపోయాడు.

"నామీద మీకంతకోపం ఎందుకు...." అంది జానకి. గోపాలం "లేదు...నీమీద కోపంలేదు..." అని అక్కడినుంచి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఇంటికి వచ్చేశాడు.

రమణయ్య, కనకయ్యలు మళ్ళా పెళ్ళిసంగతి కదిలించారు. ఈసారి గోపాలం ఏమాటకీ ఎదురు చెప్పేస్థితిలో లేడు. "మౌనం అర్ధాంగీకారం..." అన్నారు. ఆమాటకి సమాధానం చెప్పలేదు గోపాలం. చివాలున లేచి వీధిలోకి వెళ్ళిపోయాడు.

వర్ధనమ్మ వకవిషయం గమనించింది. గోపాలానికి ఇష్టంకాని పెళ్ళిచేస్తే జీవితపర్యంతం బాధపడతాడని. ఈమాటే రమణయ్యతో చెప్పింది. నవ్వి వూరుకున్నాడు. మళ్ళీ మళ్ళీ చెప్పిచూచింది. రమణయ్య ఆమాటను చెవికి పట్టించుకోవటానికి ఇష్టపడటంలేదు.

ఇద్దరమ్మాయిలూ, వక అబ్బాయి...తరతరాలుగా వస్తున్న కథావస్తువులు. ఇద్దరిలో ఎవరో వకరిని ఎన్నుకుంటాడు కథానాయకుడు. ఆమె అతన్ని ప్రేమించదు. రెండవ ఆమె అతన్ని ద్వేషిస్తుంది. అదీకథ. లేకపోతే ఇంకోరకంగా జరుగుతుంది. గోపాలని కవన్నీ తెలుసు. వాస్తవిక జీవితంలో తను ఏవిధంగా నడుచుకోవాలి అంటే అతనికేమాత్రం అవగాహన కావటంలేదు.

మళ్ళా వకసారి పార్వతిని చూడాలని కలిగింది. కాని ఆమెలోవున్న పసికందు ఆమెకళ్ళల్లోనుంచి చూస్తూవుంటుంది, ఆ కరకు చూపులు తనుచూడలేడు. చూసి నిలదొక్కుకోలేడు. అందుకనే అతనికి భయం. ధైర్యం కూడబెట్టుకుని ఆ రోజు ఆసుపత్రిదాకా వెళ్ళాడు. లోపల క్యావు క్యావుమని పసిపిల్లఏడవటం వినిపించింది. ఎవరూ ఆ పాప...ఆ ఆసుపత్రిలో ఇంకెందరో వున్నారు. ఎవరని? పార్వతికి పాపకలిగితే...గోపాలం ఉద్వేగం పొందాడు. కన్నీరుకారనంటుంది. కళ్ళు మండిపోతున్నాయి. హతాశుడై తిరిగి వచ్చేశాడు.

వర్ధనమ్మ ఇంట్లోకి వస్తున్న గోపాలాన్ని చూసి కళ్ళు వత్తుకుంది. అతన్ని చూస్తే ఆమెకెందుకో జాలివేస్తోంది. ప్రేమఅంటే ఏమిటో ఎవరునిర్ధారించి చెప్పగలరు. దానికి ఎవరు నిర్వచనం ఇవ్వగలరు. వచ్చేటంతవరకూ దానిని అర్థంచేసుకోలేకుండా వుండిపోయే వాళ్ళెంతమంది? ఇదంతా వర్ధనమ్మ ఏం చెబుతుంది. అతనికేం కావాలో తనెలా అర్థం చేసుకుంటుంది?

'ఏం బాబూ...అలా అయిపోతున్నావేం...' అంది ఎంతో అనునయంగా...గోపాలం మెల్లిగా దగ్గరకు చేరాడు.

'ఏంబాబూ...నీ బాధేమిటో నాకు చెప్పరాదురా...నాదగ్గర రహస్యాలేమి నాయనా' అంది. ఆమెనుచూస్తే గుండెలు తరుక్కుపోతుంటాయి గోపాలానికి...ఏమని చెబుతాడు. ఏమని అర్థం చేసుకోగలదు?

'ఫిస్సీ...' అంటూ ఆమె వడిలోకి వరిగిపోయాడు. అతని నుదురు వెచ్చగా తగిలింది.

'సరిగా జ్వరంవచ్చినట్లుంది...ఎప్పటినుంచిరా ఇది...అన్నం సగించలేదంటే ఏమిటో అనుకున్నాను...'అంటూ ఆదుర్దా అంతా వెళ్ళబుచ్చింది. అలమారలో వున్న ధర్మామీటరు తెచ్చి టెంపరేచరు చూసింది. మీటరు నూటపైన జ్వరం చూపిస్తుంది.

'అయ్యో...అయ్యో' అంటూ కడుపుమీద చెయ్యివేసి చూసింది. ఆ ఆదుర్దాలో వళ్ళు పేలిపోతున్నట్లు కనిపించింది. గోపాలం నవ్వుతూ 'నాకేం సుస్తిలేదమ్మా...జలుబుచేసి కొంచెం వెచ్చగా వుంది. అంటూ వేలాడిపోతూ తనగదిలోకి వెళ్ళిపోయాడు.

వైద్యుడువచ్చి మందిచ్చి వెళ్ళిపోయాడు. గోపాలం అదంతా ఎవరూ చూడకుండా తూములోపోశాడు. దాన్ని ఎవరూ గమనించలేదు. వైద్యం చేతగానివాడని డాక్టర్ని తిట్టిపోశారు.

కనకయ్య వచ్చాడు ఆ రోజున పరామర్శ చేయటానికి. వెంట జానకికూడా వచ్చింది.

ఇద్దరూ నూటిగా గదిలోకివచ్చారు. కనకయ్య ఏవోమాటాడుతున్నాడు. జానకి అలాగే చూస్తూ నిలబడింది.

'కూర్చో జానకీ...' అంటూ ఆమెవంక చూస్తూ అన్నాడు. జానకి ఎక్కడలేని సిగ్గునభినయిస్తూ కూర్చుంది.

'ఏం నాయనా...వంట్లో బాగా లేనప్పుడు విన్నాను మొన్న రాత్రిపూట తిరుగుతున్నావు...అసలే పాడురోజులు...జాగ్రత్తగా ఉండద్దూ...' అన్నాడు కనకయ్య. గోపాలం అవునన్నట్లు నవ్వి ఊరుకున్నాడు. జానకి అతనివంక చూసి ముసి ముసి నవ్వులు నవ్వింది.

'చూడు గోపాలం...మళ్ళా మాఘమాసం వెళ్ళిందంటే లగ్నాలు మనకు కుదిరినవి దగ్గరలో లేవుట...ఈ శుద్ధంలోనే లగ్నం పెటి ఆపని కాస్తా అయిందనిపిస్తే...తర్వాత...'అంటూ వసగటం మొదలుపెట్టాడు కనకయ్య. జానకి పెళ్ళిమాట వచ్చేటప్పటికి అక్కడెందుకని బయటకు వచ్చేసింది. వాళ్ళిద్దరూ చాలాసేపటి వరకూ మాట్లాడుకున్నారు. కనకయ్య ముఖం చిన్నది చేసుకుని బయటకు వచ్చాడు.

వర్ధనమ్మ గుమ్మంలోనుంచే వంటింట్లోకి తీసుకుపోయి 'ఏమిటి...ఏమన్నా డేమిటి...' అంటూ గుచ్చిగుచ్చి అడిగింది.

'కట్నం కావాలిట...'

'ఉహూ...' అంది వర్ధనమ్మ దానిలో తప్పేమున్న దన్నట్లు.

'ఉహూ...అంటావే...కట్నం యిస్తానని నేనెప్పుడన్నా చెప్పానా...అయితే గియితే నా ఇల్లు వ్రాసిద్దామనుకున్నాను... పదిహేను వేల రూపాయలు ఎక్కడినుంచి తెచ్చి కుమ్మరించేది... ఇదేమన్నా మట్టిబెడ్డలా...' అన్నాడు చికాకుపడుతూ.

'పదిహేను వేలు అడిగాడా...తమాషాకి అన్నాడేమో...'

'తమాషా లేదు...గిమాషా లేదు...అరగంటనుంచి నచ్చచెబుతుంటే...కనీసం నా మాట చెవికి ఎక్కించుకున్నాడూ...'

'అలా ఎప్పటికీ కాదూ...నే నడుగుతానుండు' అంది వర్ధనమ్మ గదివైపు అడుగులు వేస్తూ 'నువ్వెందుకు అడగటం...ఆ పదిహేను వేలిస్తే...ఇంతకంటె బ్రహ్మదేవుడు దిగిరమ్మంటే దిగివస్తాడు...మీరు నచ్చచెప్పుకోండి...ఏమయినా చేసుకోండి... నేను పోతున్నాను...రామ్మా జానకీ...' అంటూ జానకి చెయ్యి పుచ్చుకుని, వీధిలోకి తీసుకుపోబోయ్యాడు.

'ఇప్పుడే వస్తా నాన్నా...' అని జానకి గోపాలం వున్న గదిలోకి పోయింది. గోపాలం ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

'నువ్వెందుకు వచ్చావిప్పుడు...పోండి...అంతా బయటకు పోండి....' అంటూ బిగ్గరగా అరుస్తూ ఆమెవంక చూశాడు. ఆమె కంటినుండి చల్లని చూపులు వీస్తూ అతని చీకాకును కొంతవరకు సర్దుతున్నాయి. జానకి మెల్లిగా కుర్చీ పీట మీదనే కూర్చున్నది. గోపాలం పడుకుని దుప్పటి కప్పుకుని అటు పక్కకు తిరిగాడు. అతనికి గడియచప్పుడు వినబడింది. జానకి వెళ్లిపోయిందనుకున్నాడు. అతని ముఖంమీద చల్లని స్పర్శ కలిగింది. కళ్ళు విప్పిచూశాడు. గడియ వేసివచ్చి మంచంపట్టిమీద కూర్చుని వుంది జానకి.

'నేనంటే అంతకోపం ఎందుకు?' మళ్ళీ అదే ప్రశ్న. ఆమె కళ్ళు నవ్వుతున్నాయి. ఆ ప్రశ్న శూలంలా పొడిచేస్తోంది. సమాధానం ఏమిటి. జానకి 'సమాధానం తెలుసు' అన్నట్లు చూస్తోంది.

'మీకు కట్నం కావాలిటగదా...మా నాన్న చెప్పారు... నేను మీకేం అపకారం చేశానని...మీకిష్టంలేకపోతే బలవంతానా మీ ఇంట్లో జొరబడి మీ మనశ్శాంతిని చెడగొట్టదామనిగాదు—నా ఉద్దేశం... నేను ఇలా మాట్లాడటం చాలా ఎబ్బెట్టుగా వుందిగదూ ...సత్యం ఎప్పుడూ కటువుగానే వుంటుంది...మీరు నమ్మనిపని చెయ్యటానికి ప్రయత్నించకండి...నాకేం లోపమని...చదువుకున్నాను...సంగీతం పాడగలను... నేను అంద విహీనురాలినీ కాదు ...ఇవన్నీ ఎందుకు చెప్పానో...తెలుసా నా మూలాన మా నాన్న అవమానపడవలసిన అవసరం లేదుగనుక ... ఆ మాట నేను నమ్మాను గనక ... వివాహం చేసుకోవలసింది మన మయినప్పుడు దాని సాధకబాధకాలు మనలను దాటి పెద్దలకు పోవలసిన దురదృష్టం ఎందుకు కలగాలి...నేనంటే ఎందుకు అంతకోపం మీకు...నాకేం లోపమని...' ఎంతో మృదువుగా అతని నుదురు తాకుతూ అంది జానకి. అతను ఆమె చేతిని అతని హృదయానికి దగ్గరగా తీసుకుంటూ 'నువ్వంటే నాకు కోపంకాదు...' అన్నాడు రుద్ధకంఠంతో.

'మరి మా నాన్న నెందుకు అవమానంచేశారు...'

'నన్ను నమ్ము జానకీ...ఎవర్నీ అవమానం చెయ్యాలనికాదు ... చెయ్యలేదు ... నీకేమీ లోపంలేదు ... నాకు తెలుసు...' అన్నాడు.

'ఆ సంగతి నాకూ తెలుసు...నాకేం లోపంలేదనేగదా మీ అభియోగం...మీ వివాహానికి వినవరాలు, కులట అయితేగాని సరిపోదా...' అంటూ తివ్వన గదిగడియతీసి బయటకు వచ్చేసింది. గోపాలం లేవలేకపోయాడు. 'జానకీ...' అంటూ బిగ్గరగా అరిచాడు.

కనకయ్య జానకి రావటంతోటే 'ఏమిటె జానకీ కబుర్లు, అన్నాడు వ్యగ్రభావంతో. నవ్వింది సమాధానంగా. వర్ధనమ్మ కణతలు నొక్కుకుంది. కనకయ్య జానకిని తీసుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

రమణయ్యకూ, వర్ధనమ్మకూ ఇంట్లో తీరుబడే వుండటంలేదు. జానకి కనకయ్యతో గోపాలం తనకు కట్నం లేకుండా ఈ మాఘ మాసంలోనే పెళ్ళి చేసుకోవటానికి ఇష్టపడ్డాడు అని చెప్పినమాట ఇంతవరకు తెచ్చింది. పెళ్లి ఏర్పాట్లు చకచకా సాగిపోతున్నాయి. ఎవరూ గోపాలాన్ని ఈవిషయంలో తిరిగి సంప్రతించలేదు. రమణయ్య, కనకయ్య కలిసి ఒక నిర్ణయానికివచ్చి పెళ్ళి యేర్పాట్లు ప్రారంభించారు. అతనూ ఈవిషయం తిరిగి ఎత్తలేదు. ఆఖరికి శుభలేఖలు అచ్చుకావటం కూడా గోపాలానికి తెలియదు.

అసలే కల్లోలంగా వున్న నూతిలో పెద్ద రాతిబండ పడితే కలిగే అల్లకల్లోలం ఎవరికీ తెలియనిది గాదు. పార్వతికి ఆడపిల్ల అన్న వర్తమానం ఆ క్షణంలోనే తెలిసింది. ఎవరూ ఆశ్చర్యపడలేదు. వర్ధనమ్మ తిట్టిపోసింది. రమణయ్య శాపనార్థాలు పెట్టాడు. గోపాలం కుళ్ళి కుళ్లి ఏడ్చాడు.

ఆరోజు సాయంత్రం గోపాలానికి ఎవరో చీటి తెచ్చియిచ్చి పోయారు. పార్వతి అతన్ని ఒకసారి చూడాలని అనుకుంటోందట. ఆ చీటి రమణయ్య చేతిలో పడింది. చూడటం కావటంతోనే చించిపారేశాడు. గోపాలాన్ని పిలిచి చీవాట్లుపెట్టి చీటిలో ఉన్న సంగతి చెప్పాడు. ఆపాటున గోపాలం మీదవాక్కా అన్నా లేకుండా పక్కనేవున్న తుండుగుడ్డ భుజాన వేసుకుని పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు. రమణయ్య అలాగే చూస్తూ నిలబడిపోయాడు.

పార్వతి ఇంకా మంచంమీద పడుకొనివుంది. పక్కన పసిపిల్ల లేదు. గోపాలం మెదడులో తుఫాను రేగింది. పార్వతిని సూటిగా చూడలేకపోయాడు. పార్వతి గోపాలం రావటంచూసి 'రండి...' అంటూ పిలిచింది. గోపాలం బిక్కు బిక్కుమంటూ పోయి కూర్చున్నాడు. అతని కెందుకనో మనశ్శాంతి లభిస్తున్నట్లు

తోచింది. ఇంతకాలంగా ఏ అడ్డంకువలన పార్వతిని చూసి సంకోచించాడో ఆ అడ్డంకు తొలగిపోయిందనిపించింది.

'ఎలావుంది...' అని పలకరించాడు. పార్వతి సమాధానంగా నవ్వింది. ఎవరో నర్సువచ్చి మందుసీసా దగ్గరలో పెట్టి వెళ్ళిపోయింది.

'నన్నిప్పుడైనా అర్థంచేసుకోగలిగావా ...' అన్నాడు గోపాలం.

'నాకు సరిగ్గా తెలియటంలేదు...పాపను చూస్తారా...' అని అడిగింది.

'ఆఁ...!!' గోపాలం గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లయింది. పాప...అతని ఆశ్చర్యం చూసి పార్వతి చికాకుపడింది.

'నాకు కళ్ళు తిరుగుతున్నాయి...మళ్ళీ వస్తాను...' అంటూ చకచకా వీధిలోకి వెళ్ళిపోయాడు.

'పిన్నీ...పిన్నీ...' అంటూ అరుస్తూ గట్టిగా తలుపుతట్టాడు. వర్ధనమ్మ పరుగెత్తుకుంటూ వచ్చింది.

'నేను పెళ్లి చేసుకుంటాను పిన్నీ' అన్నాడు వెర్రిగా ఆమె వంక చూస్తూ.

'అల్లాగే చేసుకుందువు గానిలే....ముందర అన్నానికి రా... అసలే పొద్దు పోతోంది! అంది వర్ధనమ్మ.

'అదికాదు పిన్నీ...నాన్నతో గూడా చెప్పాలి...నేను పెళ్లి చేసుకోబోతున్నాను. ఎవరినో తెలుసా...జానకిని పిన్నీ... నా స్నేహితురాలు... అంటూ ఇల్లంతా కలయ తిరగాడు. రమణయ్య వచ్చాడు తర్వాత. విషయం తెలిసింది. వింతగా చూశాడు. కనకయ్య, జానకి వచ్చారు. రెండు రోజుల్లో శుభలేఖలు అచ్చయిపోయినాయి.

గోపాలం వక శుభలేఖ అందుకుని 'బాగుంది... దీనికోసమే ఎంతకాలం నుంచో చూస్తున్నాను... నా కోరిక వెయ్యటంలేదు! అనుకుంటూ గదిలోకి వెళ్ళిపోయాడు.

వర్ధనమ్మ వంటింటిలో నుంచి అరుస్తూంది 'చల్ల పోసుకుని రెండు మెతుకులు తినుబాబూ' అని. గోపాలం ఎవరిమాట వినుపించుకోలేదు. అన్నం తినకుండానే పడుకున్నాడు ఆరాత్రి.

తెల్లవారు తుండగానే లేచి స్నానంచేసి మంచి బట్టలు కట్టుకున్నాడు. శుభలేఖ వకటి జేబులో పెట్టుకున్నాడు. తన ప్రేమను అపార్థం చేసుకున్న పార్వతి ఈశుభలేఖ చూసి ఏమనుకుంటుంది. తానే స్వయంగా వెళ్ళి ఆమెను తన పెళ్ళికి పిలుస్తాడు. అప్పుడు పార్వతి నివ్వెరపోతుంది. ప్రేమ విలువ తెలుసుకుంటుంది. కుళ్ళి... కుళ్ళి...కాదు. తన కానందం కలిగించే సమయంలో తీవ్రమయిన ఆలోచనకు తావీయరాదు...అనుకున్నాడు గోపాలం.

గోపాలం నూటిగా ఆసుపత్రికే పోయాడు. అప్పటికే గేట్లు అన్నీ తెరిచారు గాని లోపలఅంతా వూడుస్తున్నారు. ఆవేదనను కప్పిపుచ్చుకుని గేటు బయటనే నిలబడ్డాడు. ఎవరో వస్తున్నారు. పోతున్నారు. ఆసుపత్రిలోకి ఎవరో కొత్త డాక్టరు వచ్చినట్లున్నాడు. అంతా అతని చుట్టూ మూగి మాట్లాడుతున్నారు. గోపాలం శుభలేఖ పట్టుకుని పురిటిగది దగ్గరకు వెళ్ళి 'పార్వతీ' అని పిలిచాడు.

'ఎవరండీ...' ఆడగొంతు వినిపించింది లోపలనుంచి.

'నేనే పార్వతీ...' అన్నాడు గోపాలం.

'పార్వతిగారు ఇక్కడ లేరండీ...ఇంకోగదిలోకి మార్చినట్లున్నారు! అన్నది లోపలి కంఠం. గోపాలం అక్కడినుంచి బయలుదేరి బయటకు వచ్చాడు. అక్కడ నర్సులంతా ఇంకా గుంపుగానే వున్నారు. ఆ డాక్టరుతో ఏమిటో మాట్లాడుతున్నారు. ఇంతలోకి వక నర్సువచ్చి ఈయనే నండి...' అంది — డాక్టరు గుంపులోనుంచి బయటకువచ్చి 'మీరేనా గోపాలం—అంటే...' అన్నాడు.

'అవును' గోపాలం నసిగాడు.

'పార్వతి తెల్లవారు జామునుంచి కనిపించటం లేదు...' అన్నాడు మాట తొణకకుండా. 'ఆ...' అంటూ తెల్లపోయాడు గోపాలం. కాళ్ళకింద భూమివదిలి పోతున్నట్లనిపించింది. డాక్టరు గోపాలాన్ని పట్టుకుని మెల్లిగా లోపలకు తీసుకుపోయి వక కుర్చీమీద కూర్చోపెట్టాడు. అలమారలోనుంచి వక ఉత్తరం, శుభలేక తీసి ఇచ్చాడు.

'మంచంమీద ఈ రెండు దొరికినాయండీ...' అన్నాడు డాక్టరు గంభీరంగా. వణికిపోతూ గోపాలం ఉత్తరం తీసి చదువుకున్నాడు.

గోపాలం గారికి,

మొన్న అర్థమయిందా అని అడిగారే...ఇవ్వాళే అర్థమయింది...మీలో నీతి నశించలేదనీ, సత్యాన్ని కాలదన్నలేదని అనుకుంటూ ఉండేదాన్ని...దాని నిజస్వరూపం ఈ నాడు బయటపడింది....ప్రేమించిన కన్యను వివాహం ఆడటంలో సిగ్గుపడవలసిన అవసరం ఏమీ లేదు. మీ శుభలేఖ నిన్న సాయంత్రం అందింది...నాకేం ఆశ్చర్యం కలగలేదు...పైగా నేనూహించిన సత్యం నా కళ్ళ ముందరకు వచ్చేటప్పటికి నాకు ఎంతో తృప్తి కలిగించింది....మీరు నన్ను ప్రేమించలేదు...ఆ సంగతి నాకు తెలుసు...నన్ను పెళ్లి చేసుకోవటంవలన కలిగే ఫలితాన్ని ప్రేమించారు....మిమ్మల్ని జానకి ప్రేమిస్తుంది....ఆమెకోసం మీరు పేరు ప్రఖ్యాతులమీద ఉన్న మమకారాన్ని చంపుకోలేకపోయారు...త్యాగం చెయ్యలేకపోయారు...తరువాత నిజం తెలిసిందనుకున్నారు...నిజాలు ఎప్పటికీ, ఎన్నటికీ, ఎవ్వరికీ తెలియవు....మనం అనుకునేవి అన్నీ మనవరకూ సంబంధించిన అనుభూతులే...జానకి ప్రేమ జయించింది....ఇంతవరకు నన్ను ఎవరూ ప్రేమించలేదు. ముందరి సంగతి గూడా గట్టిగా తెలియదు. నాపాపవున్నదే...ఇక్కడనే వదిలి వెళుతున్నాను...నేనిక్కడ బ్రతకలేను...కలుషితమైన వాతావరణం నన్ను తినేస్తుంది. నన్ను నన్నుగా గుర్తించి ప్రేమించగల వాడు దొరికితే అతనితో కలిసి వుంటాను...నా జీవితం అంతం అయ్యేవరకూ నా అన్వేషణ సాగుతూ వుంటుంది...నాకందులోనే సంతృప్తి...ఏ జన్మలో

పాపాలు ఆ జన్మలోనే అనుభవించటం ఉచితం అనుకుంటాను... అందుకనే పాపను మీ చేతుల్లోవుంచి, నేను లోకం చేతుల్లోకి పోతున్నాను...పాపకి అన్యాయం చెయ్యకండి...నన్ను వెతికించాలని వృథాశ్రమపడకండి....పార్వతి."

ఉత్తరం అంతా చదివి నిర్జీవి అయిపోయాడు. ఆసుపత్రి గోడలన్నీ కలిసిపోయి ఒకేఒక నూలమైన వస్తువులా కనపడుతోంది. ఎవరో నర్సు పాపను తొట్టిలో పెటి తీసుకువచ్చింది. పాప ఏడుస్తుంది. పార్వతి ఎక్కడికి వెళ్ళిందో తెలియదు. ఎందుకు వెళ్ళిందోకూడా అతనికి తెలియదు. ఆమె వ్రాసుకున్న కారణాలు అతని ఊహకు సమన్వయంలేదు. తనకు అన్యాయంచేసి వెళ్ళిపోయింది. అందుకు కారణాలు ఒక్కటీ స్పష్టంగా తోచలేదు. పార్వతి కులట అయితే — తనూ అంతే. అందులో వ్యత్యాసం లేదు. పార్వతి తనను 'దగాకోరు' అని అనుకొనివుంటుంది. తను ఆమెనుగురించి ఏ అభిప్రాయాన్ని స్వంతంగా ఏర్పరుచుకోలేదు. పీది ఎలావున్నా పాప నిర్దోషి. ఇక ఆ పాప తనని, పాపను అన్యాయం చెయ్యలేదు.

ఆ పసికందు పెరిగి పెద్దదై 'నాన్నా...' అని తనను పిలిస్తే 'ఏం సమాధానం చెప్పాలి' అనుకున్నాడు. "ఏమున్నది ... 'అవును పాపా నేనే నీనాన్నని' అని చెప్పాలి" అంటూ గొణుక్కున్నాడు.

ఇంతకీ ఎవరు ఎవరిని పెళ్ళిచేసుకున్నారు? అన్నదికాదు ముఖ్యం. ఎవరు ఎవరికి అన్యాయం చేశారు? అని — అడు కావలసింది.



# ఆంధ్ర పితామహుడు

ఇల్లిందల సరస్వతీదేవి

ఆంధ్రప్రదేశ్ అవతరించిన ఈ పదిహేను మాసాల కాలములో గవర్నరు శ్రీ భీమసేన సచార్ రాజధానీ నగరములోని సంస్థలను కొన్నిటిని సందర్శించటము తటస్థించింది. ఈ సందర్భములో వారికి తెలంగాణాను గురించిన కొన్ని విచిత్రోదంతాలు తెలియ వచ్చాయి. కొన్ని దశాబ్దాల క్రిందట స్థాపింపబడిన ఆ సంస్థల ఉజ్వల చరిత్రలను కార్యకర్తలు వారికి విపులీకరించారు. కాని 'ఈపని నేను చేశానని తెలంగాణాలో ఏ కార్యకర్తా చెప్పకోడేమి? వారు చేశారనీ, వీరు చేశారనీ ఇతరులను పేర్కొంటాడేమి?' పర్యటన పూర్తియేవరకూ వారి నీ ప్రశ్నలు ఆలోచనాంబుధిలో ముంచి వేశాయి. వారు సందర్శించిన సంస్థలలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము, వేమన గ్రంథాలయము, బాలసరస్వతీ ఆంధ్ర భాషా నిలయము, రాజాబహద్దరు వెంకట్రామారెడ్డి మహిళా కళాశాల, ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాల, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రసిద్ధిపొందినవి.

శ్రీకృష్ణదేవ రాయాంధ్రభాషా నిలయము 1901 లో స్థాపింపబడ్డది. 1914-15 మధ్య కాలములో భవనానికి అంకురార్పణ జరిగింది. ఈ నిలయములో కొన్ని వేల గ్రంథాలున్నాయి. తాళపత్ర గ్రంథాలు కూడా కొన్ని చేర్పబడ్డాయి. సారస్వత సంబంధమైన సభలూ సమావేశాలూ దీనిలో జరుగుతూ ఉంటాయి. హైదరాబాదులో ఉన్న ప్రతి ఆంధ్రుడూ ఇందుమించుగా సభ్యుడే. అయిదు సంవత్సరాల క్రిందట ఈ గ్రంథాలయము ఆస్థాన కవినీ అమాత్య శేఖరులనూ పండితులనూ భాషాభిమానులనూ ఆహ్వానించి వైభవోపేతముగా స్వర్ణోత్సవము జరిపించుకొన్నది. వేమన గ్రంథాలయము నాంపల్లిలో ఎత్తైన గుట్టమీద స్వంతభవనాన్ని నిర్మించుకొన్నది. దీనికి కొన్ని వేల గ్రంథాలూ, కొన్ని వందలమంది సభ్యులూ, సారస్వత సభలూ సమావేశాలూ ఉన్నాయి. బాలసరస్వతీ ఆంధ్ర భాషానిలయము సుమారు నలభయి సంవత్సరాలనాడు, గౌలిగూడెములో స్థాపింపబడ్డది. ఆంధ్ర సారస్వత పరిషత్తు నగరములో మధ్యగా స్వంత భవనము నిర్మించుకొని నిరక్షరాస్యతా నిర్మూలనకై కృషిచేస్తున్నది. ఆంధ్ర బాలికల ఉన్నతపాఠశాల 1926 లో స్థాపింపబడి, మాతృభాషద్వారా విద్యాబోధనచేస్తూ ఆంధ్ర బాలికలలో విద్యాసక్తిని పెంపొందచేస్తున్నది. దీనికి అనుబంధముగా రాజాబహద్దరు వెంకట్రామారెడ్డి మహిళా కళాశాల 1954లో నెలకొల్పబడ్డది. పాఠశాలకు నారాయణగూడెములోనూ, కళాశాలకు బర్కత్‌పురాలోనూ (ఇప్పుడది వెంకట్రామారెడ్డి వీధి అని వ్యవహరింపబడుతున్నది.) స్వంత భవనాలు నిర్మింపబడ్డాయి. ఈ సంస్థలనీని అత్యుత్సాహముతో అవిరళకృషి సల్పుతున్నాయి.



ఆంధ్రపితామహుడు

చరిత్ర పుటలు మనము ఈనాడు తిరగవేసి చూడగలిగితే, అర్ధశతాబ్దము క్రిందట తెలంగాణా వారి పరిస్థితులెంత అధమస్థితిలో ఉండేవో తెలిసికొనగలుగుతాము. హైదరాబాదు సంస్థానములో ఉర్దూ రాజకీయభాష. ఆంధ్ర కర్నాటక మహారాష్ట్ర భాషలకు ప్రాముఖ్యమే కాదు— గణ్యతకూడా లేదు. ఎవరి మాతృభాషను వారు ఇండ్లలో వాడుకొనవలసిందే. జాతికీ భాషకూ వికాసము లేదు; సంస్కృతికి వికాసనము లేదు. ఆ చీకటికోణాలలో గాఢాంధకారములో ఉన్న తెలంగాణా ఆంధ్రులు

'తెలుగు తనమూ తమకే లేదని
తెలుగు భాషా తమదే కాదని
తెలుగు వారూ తామే కాదని'

(అడవి బాపిరాజు)

భావిస్తూ తమ పతనాన్ని గురించి తామే గుర్తించలేనిస్థితికి దిగజారిపోయారు. తెలుగుభాషమీదగాని, ఆంధ్రజాతిమీదగాని

ఆదరాభిమానాలు పెంపొందించుకోలేని మనజాతి పసఖాట్ల పాలయింది. సుమారు 70 లక్షల ఆంధ్రులుగల హైదరాబాదు రాష్ట్రములో, ఎనిమిదిజిల్లాలలో ఒక్కటిమాత్రమే ఇంగ్లీషు హైస్కూలు, తక్కినవన్నీ ఉర్దూభాషద్వారా విద్యగరపే పాఠశాలలు. ప్రజలలో విద్యాభివృద్ధికి సహకారముచేసేవారు లేరు. అంతటి సదుద్దేశ్యము ఎవరికయినా కలగటానికి తగిన అవకాశమూ లేదు. ఆ స్థితిలో పత్రికాప్రచారమూ, పత్రికా పఠనేచ్ఛ మృగ్యమంటే అతిశయోక్తికాదు. గోషాలో ఉండికూడా మహమ్మదీయస్త్రీలు విద్యావంతులయినారు. విదేశాలకుకూడావెళ్లి కొందరు డిగ్రీలు తెచ్చుకొన్నారు. చుట్టూ పరదాలు కట్టుకొని సభలూ సమావేశాలూ జరుపుకొనేవారు. కాని-అందుకుతగిన ఆర్థికస్తోమతా అవకాశమూలేని ఆంధ్రస్త్రీలు గోషా ఆచారాన్ని మాత్రము అమలుజరుపుతూ అవిద్యలోనే జీవితాలను గడిపారు.

అటువంటి పరిస్థితులలో చిరస్థాయిగల ఇన్ని సంస్థలు హైదరాబాదురాష్ట్రములోనూ నగరములోనూ ఎట్లావెలిశాయి? నిర్వీర్యమయిన ఆనాటి ఆంధ్రజాతిలో శక్తివంతమయిన ఈ భావన ఎట్లాకలిగింది? అపూర్వమయిన ఈ సృష్టి ఏ విధముగా జరిగింది? ఈనాడు హైదరాబాదునగరాన్ని కొత్తగా చూచేవారికి పై ప్రశ్నలు ఉదయింపక మానవు - విస్మయమూ కలుగకమానదు.

ఈ ప్రశ్నలను తెలంగాణాలో ఏవ్యక్తి నడిగినా నిమీలిత నేత్రాలతో చేతులుజోడించుకొని, ఒక మహాపురుషుని సంస్మరిస్తాడు. ఆయనకు జోహారు లర్పిస్తారు.

తెలంగాణాలో సభలు జరిగినప్పుడుగాని ప్రముఖులు విచ్చేసినప్పుడుగాని, ఆ యా సంస్థలు కార్యకర్తలూ పురజనులూ ఒక అమృత హృదయాన్ని, ఒక చల్లటి చేయిని తలచుకొని పులకాంకితు లవుతారు. ప్రతి సంస్థ నివేదికలోను 'పంతులుగారు ఆదేశమిచ్చారు', 'పంతులుగారు సలహా యిచ్చారు', 'వారు సానుభూతి చూపించారు', 'వారు చూపిన మార్గమే యిది'; 'వారు నాటిన బీజమే యిది'; 'ఇది వారి చేతి చలవే' అంటూ ఆ దివ్యనామస్మరణ చేస్తారు.

"మేము ఆంధ్రులము" అని ఎవరి దివ్యప్రబోధమువల్ల తెలంగాణా వాసులు చెప్పుకొనగలిగినారో ఆ మహాపురుషుడు పద్మభూషణ డాక్టరు మాడపాటి హనుమంతరావు పంతులుగారు.

ఇరవయ్యో శతాబ్దములో కూడా దండకారణ్యమునాటి నాగరకతను తలపించే తెలంగాణములో, కొన్ని శతాబ్దాలుగా వెనుకబడిన తెలుగుజాతిని విజ్ఞానదీపిక చేతబట్టి, తెలుగులచేత తెలుగు నోములు నోమించి, పూర్వాంధ్ర చారిత్ర కౌన్నత్యాన్ని స్మృతికి తెచ్చి, తెలుగు నాడులలోని మహోజ్వల మహాంధ్రరేఖల మిరుమిట్లు గొలిపించిన మహావీరుడు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారు.

జీర్ణింపనున్న ఆంధ్రజాతి పునరుద్ధరణ మహోద్యమానికి నడుము కట్టి, ఆంధ్రుల రాజకీయ నైతిక సాంఘిక సారస్వత విషయాలలో నిరుపమానమయిన దక్షతతో కార్యసాధన చేసిన మహానాయకుడు పంతులుగారు.

అవమానము జరిగితేనేగాని కార్యాగ్ని ప్రకోపించి ప్రజ్వరిల్లదు. అది 1921 వ సంవత్సరము ఒక శనివారము రాత్రి. గౌలిగూడెములోని వివేకవర్ధనీ థియేటరులో పూనా నివాసి, సంఘసంస్కార ప్రియుడూ, మహిళా విశ్వ విద్యాలయ ప్రతిష్ఠాపకుడూ అయిన ధోండో కేశవ కార్వే మహాశయుడి అధ్యక్షతక్రింద హిందూసంఘ సంస్కార మహాసభలు జరుగుతున్నాయి. వివేక వర్ధనీథియేటరు మహారాష్ట్ర వాతావరణము కలది కనుకను, అధ్యక్షులు మహారాష్ట్రులయిన కారణముచేతను, ఆ మహాసభను నిర్వహించే వారందరూ మహారాష్ట్రులుకనుకనూ ఆంధ్ర కర్నాటకులు సభ్యులలో అల్పసంఖ్యాకు లయినారు. ఆ మహాసభలలో ఆంధ్ర కన్నడ మహారాష్ట్ర భాషలలో చర్చలూ, ప్రసంగాలు జరుపవలసినదిగా ముందుగానే తీర్మానించుకొన్నారు. కాని ఆంధ్ర భాషలో చర్చ ప్రారంభముకాగానే అల్లరి, సభ్యులలో సందడి ప్రారంభమయింది. అర్థవంతముగా, ధారాళముగా విషయ వైశద్యముతో ఉపన్యసిస్తున్న వ్యక్తి, తన ఉపన్యాసాన్ని నిలిపివేయవలసి వచ్చింది. ఆ సభలో ప్రముఖపాత్రవహించి, పెద్దలతో సమానముగా వేదికమీద ఆసీనులయిన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారు తన అనుయాయులతో సభనువీడి బయటికి రావలసి వచ్చినది. మరెందుకూ కాదు అసమ్మతిని సూచిస్తూ.

ఆ నాటినుండీ పంతులుగారి హృదయము 'నా భాష-నాజాతి పునరుద్ధరింప బడేది ఎట్లా?' అన్న తీవ్ర సంచలనముతో మరగిపోనారంభించింది. వారిది వకీలువృత్తి. ఆ నాటినుండీ కేసులు వాయిదాలు దావాలు వెనకపడ్డాయి. తోటివారి నందరినీ ప్రోత్సహించి, ఉత్సాహపరచి, కూడగట్టుకున్నారు. వారి తీవ్ర సంచలన ఫలితమే ఆంధ్రజన సంఘోత్పత్తి. దానికి కార్యదర్శిగా పంతులు గారు నియమింప బడ్డారు. ఆ నాటినుండీ నిర్విరామముగా కృషిచేసి వరంగల్లు, ఖమ్మము, పరకాల, నల్లగొండ, సికింద్రాబాదు మొదలయిన ప్రదేశాలలో ఆంధ్ర జనసంఘానికి శాఖలను స్థాపించారు. మూడు నాలుగు సంవత్సరాలలో సుమారు 50 వరకూ వాటి సంఖ్య పెరిగిపోయింది.

పంతులుగారు హనుమకొండలో విద్యాభ్యాసము చేస్తుండగా, ముఖ్యముగా మూడు ఉద్యమాలు ప్రజలను ఉఱ్ఱూత లూగించేవి. వాటిలో మొదటిది ఆంధ్ర భాషా వికాసోద్యమము; రెండవది సంఘ సంస్కరణోద్యమము; మూడవది రాజకీయోద్యమము; ఈ మూడూ హనుమంతరావుగారి యువకహృదయాన్ని వశముచేసుకొన్నాయి. ఈ ఉద్యమ త్రయి సంసిద్ధికొరకే వారు తమ శక్తిత్రయాన్ని (ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి) వినియోగించి ధన్యులయారు.

1901 లో హైదరాబాదునగరములో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము స్థాపించటముతో ఆంధ్ర భాషావికాసోద్యమము ప్రారంభమయినదని చెప్పవచ్చు. విద్యా వైజ్ఞానిక సామాజికాభివృద్ధి గ్రంథాలయోద్యమముద్వారా జరిగి తీరుతుందని విశ్వసించే

వారిలో పంతులుగారు ఒకరు. వేయిమంది పండితులు చేయలేని పని ఒక గ్రంథాలయము చేయగలదని వారి నమ్మకము. ఈ ధర్మరహస్యాన్ననుసరించే శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము స్థాపితమయింది. ఈ నిలయము ప్రాథమికమయి, ఆదర్శప్రాయమయి, మకుటాయమానముగా విలసిలు తున్నది. 1914 లో పంతులుగారు ఈ నిలయానికి కార్యదర్శిగా ఉండి భవననిర్మాణానికిగాను సన్నాహము చేయనారంభించారు. జమీందార్లనూ, సంస్థానాధీశ్వరులనూ ఆహ్వానించి, వారందరినీ ప్రోత్సహించి,వారి ఔదార్యముతో భవనాన్ని వెలియింపచేశారు. బాలసరస్వతీ ఆంధ్రభాషానిలయము, వేమన గ్రంథాలయమూ పంతులుగారి సేవాభాగ్యము పొందినవే. బాలసరస్వతీ ఆంధ్రభాషా నిలయానికి నిర్మింపబడిన భవనము పంతులుగారి కృషిఫలితమే. 1904 జనవరి 26 వ తేదీన హనుమకొండలో శ్రీ రాజరాజ నరేంద్ర గ్రంథాలయ భవనానికి శంకుస్థాపన జరిగింది. క్రమముగా అనేక గ్రంథాలయాలు నగరములోను, జిల్లాలలోను స్థాపితములయ్యాయి. ఈ గ్రంథాలయోద్యమము క్రమముగా రాజకీయోద్యమముగా రూపొందింది.

సంఘసంస్కరణోద్యమానికై కందుకూరి వీరేశలింగముగారి జీవితాన్నీ, వారిగ్రంథాలను తిరిగి తిరిగి పరిశీలించిన పంతులుగారు, జయప్రదముగా కొనసాగే పథకాన్ని ఒకటి తయారు చేసుకొన్నారు. ఆ విధంగానే ప్రపంచములోని ప్రజోద్యమాలనుగురించి చదివి, ఇంగ్లండు అమెరికా పరిస్థితులనుగమనించి, ఆర్యావర్తములోని సంచలనానికిగల కారణము ఊహించుకొ గలిగారు. ప్రజాహృదయాన్ని చూరగొని ప్రజాభిలాషను గమనించేవారు మధ్యతరగతి ప్రజలని గ్రహించారు. మధ్యతరగతిప్రజలే సంఘానికి వెన్నెముకవంటివారు. అప్పటికి పంతులుగారికి చెప్పుకోతగిన పాండిత్యముగాని, సంపదగాని పలుకుబడిగాని లేదు. అనుభవమైనా చాలినంత లేదు. అయినప్పటికీ సంకల్పసిద్ధికొరకు కార్యభారము వహించారు. ప్రాచీనాంధ్రుల కీర్తివైభవాలనూ, ప్రతిభా పరాక్రమాదులనూ స్మరించి, పంతులుగారు తమ ఉత్సాహాన్ని సహస్రాధికము చేసుకొన్నారు.

ప్రజలను సమష్టిగా కూడకట్టుకొని పనిచేయటానికి తగిన మార్గము వర్గవర్గాన్నీ పేరుపేరునా పిలచి మేల్కొలపటమే నని పంతులుగారి విశ్వాసము. యాదవ, ముదిరాజ, మున్నూరు, హరిజన, పద్మశాలి, గౌడ మొదలయిన వర్గీయులను మేలుకొలుపసాగారు. ఆంధ్ర విద్యార్థులను ఉత్సాహపరచారు. జీవరక్షా ప్రచారిణీ సంఘము, హిందూ సంఘం సంస్కారభ, ఆది హిందూ సేవాసమితి మొదయిన సంస్థలతో సంబంధము కల్పించుకొని సేవచేయ నారంభించారు. ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, దివ్యజ్ఞాన సమాజము మొదలయిన వాటిలో ప్రత్యక్షముగా పాల్గొనకపోయినా పంతులుగారు తమ సానుభూతి చూపారు.

సుమారు 1921 నవంబరులో ప్రారంభింపబడిన ఆంధ్ర జన సంఘము శాఖోపశాఖలై విస్తరిల్లిన తరువాత, వీటన్నిటికీ పరస్పర సంబంధ మేర్పరచి—నిర్వాహకుల నందరినీ ఒక వేదికమీదికి తీసుకొని రావలెనని పంతులుగారు ప్రయత్నించారు. ఆ ప్రయత్న ఫలితమే ఆంధ్రమహాసభలు. ఈ సభలలో పదిమందికి పాల్గొంటూ ఉండే వారు. రాజభాషయైన ఉర్దూలో ప్రసంగించటమే ఘనమనుకొనే వారందరూ చక్కటి జానుతెనుగులో (తొరక్యాంధ్రముతో ప్రారంభించి) ఉపన్యాసాలు సాగించారు. నిజాంరాష్ట్రాంధ్ర మహాసభలలో ప్రధానమయినది చతుర్థాంధ్ర మహాసభ. దానికి పంతులుగారు అధ్యక్షులుగా ఎన్నికయినారు. ఆ సభ సిరిసిల్లలో జరిగింది. పంతులుగారికి స్త్రీ విద్యాభిమానమూ స్త్రీ జనాభివృద్ధి యెడ అపారమైన ఆసక్తిను. యువజనాభివృద్ధితో బాటు యువతీజనాభివృద్ధికూడా జరుగవలసినదేనని వారి పట్టుదల. ఆంధ్ర మహాసభలతోపాటు మహిళా సభకు కావలసిన హంగులన్ని సమకూర్చేవారు. ఆ సభలలో స్త్రీల సమస్యలన్నీ చర్చింపబడి తీర్మానరూపమును దాల్చేవి. చతుర్థాంధ్ర మహిళాసభకు పంతులుగారి పత్ని శ్రీమతి మాణిక్యమ్మగారు అధ్యక్షురాలుగా ఎన్నికైనారు. ఆమె రూపవతి మాత్రమే కాదు—విద్యావతికూడాను. వినయగుణ సంపన్నురాలు. మాడపాటి సతీపతులు వధూవరులవలె పుష్పహారాలంకృతు లయి జయ జయధ్వనులు చెలరేగుతుండగా, మోటారుకారులో హైదరాబాదునుంచి బయలుదేరారు. ఈ ఆంధ్ర కళ్యాణయాత్ర హనుమాన్ టేక్డిలో ఉన్న పంతులుగారి 'ఆంధ్ర కుటీరము' నుండి బయలుదేరింది. మధ్యేమార్గములో యెదురయిన ప్రతి తెలుగు సీమలలోనూ స్వాగతా లందుకుంటూ సిరిసిల్ల చేరి, సభలను దిగ్విజయముగా నడిపారు.

ఆంధ్రాభ్యుదయము కొరకు ఆంధ్ర మహాసభలతో పంతులుగారు తృప్తి పొందలేదు; దానికై వారు తొక్కని మార్గము లేదు. తడవిమాడని అంశము లేదు. ఆంధ్ర మహిళోద్యమము చక్కగా సాగవలెనంటె స్త్రీలు విద్యావంతులు కావాలి. నిజాం ప్రభుత్వములో ఆంధ్ర బాలికల మాతృభాషాభివృద్ధికి అనేక అవరోధాలు. మాతృభాష ద్వారానే విద్యగరప బడవలెనని పంతులుగారి ఆశయము. ఆ కాలములో ప్రభుత్వానికి వ్యతిరేకమైన సంస్థలను నెలకొల్పటము అసాధ్యమైన విషయము. ఆంధ్ర కన్నడ మహారాష్ట్ర నాయకులకు ఇది గడ్డుసమస్యగ పరిగణమించింది. ఆ సమయములో బారిస్టరు రామచంద్ర నాయుడు, అహల్యాబాయి మల్లన్న, శ్రీమతి సులోచనా బాయి మొదలయినవారు ఒక కమిటీగా ఏర్పడి రెసిడెన్సీ బజారులో (ఇప్పటి సుల్తాను బజారు) ఒక పాఠశాల నెలకొల్పారు. ప్రభుత్వానుమతి దీనికి లభించదు కనుక, బ్రిటిషు రెసిడెంటు అధీనములో ఉన్న ప్రదేశములో నెలకొల్పవలసివచ్చింది. ఆంధ్ర కన్నడ మహారాష్ట్రభాషలలో ప్రైమరీ తరగతులతో ఈ పాఠశాల ప్రారంభింపబడ్డది. కొంత కాలము నడచినతరువాత, ఆంధ్రేతర తరగతులకు తగినప్రోత్సాహము లేక వెనుక బడటము తటస్థించింది. సికింద్రాబాదు వాస్తవ్యురాలైన సీతమ్మగారు తన పేరున కొంతకాలము దీనిని నడిపారు. కాని సికింద్రాబాదులో ఉండి హైదరాబాదులో పాఠశాల నడపటము ఆమె కసాధ్యమయిపోయింది. ఈ కారణము చేతనే కొకుండా తగిన ఆర్థిక సదుపాయము లేకపోవటముచేత పాఠశాలను నిలిపివేయవలెనని ఆ కమిటీ నిర్ణయించింది. ఈ వార్త పంతులుగారికి వినపడినదే తడవుగా బయలుదేరారు. చేతికి చిక్కిన అవకాశాన్ని జారవిడు

తక వినియోగించుకొన్నారు. తమకు విశ్వాసనీయులైన శ్రీ వల్లకొండ నరసింహారావుగారిని తోడు చేసుకొని పాఠశాల నిర్వహణను పూనుకొన్నారు. ఆనాటినుండీ పంతులుగారు తమ వద్దకు వచ్చిన వారిలో ధనికులూ అధికారులూ పలుకుబడి గలవారూ సేవాశక్తి కలవారూ ఎవరా అని పరీక్షకు బూనుకున్నారు. తెలిసినవారికి సరేసరి. తెలియనివారికి తమ ఆశయాన్ని విపులముగా తెలిపారు. వీరిదృష్టిని ఆకర్షించినవారిలో మొట్ట మొదటివారు రాజా బహద్దరు వేంకట్రామ రెడ్డి ఓ. బి. ఇ. గారు. రెడ్డిగారిది వెన్నవంటి హృదయము. తెలంగాణాలో ఏ సత్కార్యానికయినా వారి సహకారము ఉండి తీరవలసినదే. వారు తెలంగాణా వాసులకు పెన్నిధివంటి వారు. అటువంటి రాజా బహద్దరును పాఠశాలకు అధ్యక్షులుగా శ్రీ పంతులుగారు ఎన్నుకొన్నారు. అధ్యక్షులంటే కుర్చీమీద కూర్చుని, పూలహారాలు వేయించుకొని లేచిపోవటము కాదు. ఒకనాటి భారమూ బాధ్యతా కాదు వారిపై తోపినది; ఆ పాఠశాలకు రాజాబహద్దరు వేంకట్రామారెడ్డిగారు తండ్రీ, పంతులుగారు తల్లీను. వీరిద్దరితో (మంత్రి) వెంకటరంగారెడ్డిగారు (కేరళ గవర్నరు) బూర్గుల రామకృష్ణారావుగార్లు చేతులు కలిపారు. మాతృభాషలో విద్యగరపే ఆ పాఠశాలకు ఒక వ్యక్తిత్వము కల్పించాలని పంతులుగారి పట్టుదల. పూనాలోని కర్వే యూనివర్సిటీతో సంబంధబాంధవ్యాలు కల్పించుకొన్నారు. కాని అధికార ముద్రలేని విద్యకు ప్రయోజనము సాధింపబడినా విలువ లభించలేదు; పంతులుగారు కృషి చేయగా చేయగా, 1949 లో హైదరాబాదు ప్రభుత్వానుమతి లభించింది. అంతకుపూర్వము రెండు సంవత్సరాల కాలము కావచ్చు—ఆంధ్రా యూనివర్సిటీ అనుమతి నిచ్చింది. పాఠశాలలో విద్యార్థినుల సంఖ్య దీనితో ఇనుమడించింది. స్వంత భవనము లేని ఈ సంస్థ అద్దె భవనాలనుకూడా భరించలేకపోయింది. పాఠశాలకు అధ్యక్షులయిన శ్రీ రాజాబహద్దరు వెంకట్రామారెడ్డిగారు తన మిత్రుల మంచితనాన్నీ ఔదార్యాన్నీ ఈ పాఠశాలకు వినియోగించారు. ప్రతిదినమూ పంతులుగారు అధ్యక్షులను కలుసుకొని 'వారిని రేపు కలిసి ఈ విషయము ప్రస్తావించి చూడండి; వీరికి తిరిగి వాగ్దానము మాట జ్ఞాపకము చేయండి' అంటూ అందించేవారు. రాజాబహద్దరుగారితో పనిలేని జమీందార్లూ, సంస్థానాధీశ్వరులూ లేరు. ఎవరు కనబడ్డా మొదటిమాట పాఠశాలను గురించే ప్రసంగించేవారు. ఈ విధముగా కృషిచేసి శ్రీ రాజా పన్నాలాల్ పిట్టిచేత పాఠశాల భవనానికి శంకుస్థాపన చేయించారు. అనేకవిధాలుగా విరాళాలు ప్రోగుచేశారు. ఒక మహమ్మదీయ సోదరి కొంత ధనము గుప్తదానము చేసింది. పంతులుగారు వారి సహకారముతో అన్నికష్టలనూ వినియోగించి పాఠశాలకు భవన నిర్మాణము చేశారు. పై అంతస్థు కూడా పూర్తయింది. 1949 నాటికి ఈ పాఠశాలలో కిండర్ గార్డెన్ తరగతులుకూడా ఆరంభించబడ్డాయి. దీనికి తగిన ప్రోత్సాహము ప్రజలవల్ల లభించింది. ఈ పాఠశాల ఆవరణములో విద్యార్థినుల సౌకర్యార్థము ఒక వసతిగృహము నిర్మింపబడ్డది. ఈనాడు పాఠశాలలో రెండు వేలమంది బాలికలు కిటకిటలాడుతూ ఉన్నారు.

హనుమంతరావు పంతులుగారి స్త్రీవిద్యాభిమానము వారిని అంతటితో విడువలేదు; కళాశాల స్థాపించవలెనన్న ఉత్సాహమూ ఉబలాటమూ వారిలో బయలుదేరింది. రాజాబహద్దరు వెంకట్రామారెడ్డిగారి ఔదార్యచిహ్నంగా వారి పేరున ఒక మహిళాకళాశాలను వెలయింపజేశారు. నిజాంగారిని దర్శించి, 48 రూపాయల సుంకముతో 4 ఎకరాల భూమిని సేకరించారు. ప్రభుత్వమువద్దనుండి 25 వేల హాలీరూపాయలను సాంక్షను చేయించుకొన్నారు. పంతులుగారు 18000 రూపాయలను ఆంధ్ర సారస్వత నిక్షేపమునుండి తీసి యిచ్చారు. మహిళాకళాశాల భవననిర్మాణానికి భారత ప్రధాని శంకుస్థాపన చేశారు. ఆ మహోత్సవములోనే 7501 రూ॥లు వసూలయ్యాయి. ఈ కళాశాల అప్పటి బిర్కతు పురా. ఇప్పటి వెంకట్రామారెడ్డి వీధిలో ఉన్నత భవనాన్ని నిర్మించుకొన్నది. ఈ కళాశాలకు పంతులుగారు ఉపాధ్యక్షులు. మంత్రి కొండా వెంకటరంగారెడ్డిగారు సంఘసభ్యులు. ఈ కళాశాలకు ప్రారంభోత్సవము ఇండియా ఉపాధ్యక్షులయిన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారు చేశారు. శూన్యహస్తాలతో ప్రారంభింపబడిన ఈ విద్యాసంస్థలు మహోదారులయిన ఆంధ్ర ఆంధ్రేతరుల అభిమానపాత్రమయి, బలిష్ఠమయి, ఆర్థిక పుష్టి కలిగి, సమస్త వస్తుపరికరసమేతమయి విరాజిల్లుతున్నాయంటే పంతులుగారి సంకల్పబలముతప్ప మరొకటి కాదు.

ఆరోజు శుభసమయము. పార్థివనామ సంవత్సర మాఘశుద్ధ పంచమీ బుధవారమునాడు నిజాం రాష్ట్రాంధ్రులందరూ నగరములో సమావేశమయి కన్నుల పండువయిన ఉత్సవమొకటి జరుపుకొన్నారు. హనుమాన్ టేకేలో ఉన్న పంతులుగారి ఆంధ్ర కుటీరమునుండి ఊరేగింపు బయలుదేరింది. మొదటి కారులో శ్రీ పంతులుగారు వారి సతీమణి మాణిక్యమ్మగారు, ఇదిరి ముఖ్యగా వారి ఒక్కగానొక్క కుమారుడయిన సుకుమారుడూ పుష్పహారాలంకృతులయి ఉన్నారు. దీనిని పురప్రముఖుల మోటారులు అనుసరించాయి. పురజనుల సేనలు కాలినడకనే బయలుదేరారు. త్రూపు బజారులో రెడ్డి హాస్టలులో ఉత్సవము జరిగింది. దానిలో 117 సంఘాలు పాల్గొన్నాయి; సన్మానపత్రాలు సమర్పించాయి. అది పంతులుగారి షష్టి పూర్త్యుత్సవము. ఈ ఉత్సవము కోలాహలముగా రెండు రోజులు జరిగింది; హైదరాబాదు రాష్ట్రమందంతటా తెలుగు వారు ఆనందోత్సాహాలతో స్థానికముగా ఈ పండుగ చేసుకొన్నారు.

ఆలనాడు పుణ్యక వ్రతమాచరించిన సత్యభామ శ్రీకృష్ణుని నారదుడికి దానమిచ్చి, తిరిగి ఆయనను పొందటానికి తన సకలైశ్వర్యాలూ త్రాసులో పోసింది. తిరిగి అటువంటి దృశ్యము పంతులుగారి షష్టి పూర్త్యుత్సవములో నిజాం రాష్ట్రాంధ్రులకు కన్నుల పండువయింది. తెలంగాణావాసులు పంతులుగారిని తక్కెడలో ఒకవైపు ఆసీనులనుచేసి, రెండవవైపు రూకలను కుమ్మరించారు. త్రాసుచుట్టూ మంత్రి కొండా వెంకటరంగారెడ్డిగారు, అక్కినేపల్లి జానకి రామారావుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు, బూర్గుల రామకృష్ణారావుగారు, సురవరము ప్రతాపరెడ్డిగారు నిలబడి 'మరో రూపాయి వెయ్యండి' అంటూ కొసరి కొసరి రూపాయలువేస్తూ పంతులుగారిని తూచారు. అది లెక్కపెట్టగా 6400 హాలీ రూపా

ఉసులు! వాటిని భద్రముగా మూటకట్టి పంతులుగారికి సమర్పించారు. దానిని చిరునవ్వుతో పంతులుగారు స్వీకరించారు. రూకల రాశిని చూస్తున్నంతసేపూ వారి హృదయములో ఒక ఆరాటము బయలుదేరింది; కాని మనసులో ఒక నిశ్చితాభిప్రాయము కలుగగానే శాంతించింది. వెంటనే లేచి నిలువబడి 'ఈ మొత్తముతో ఆంధ్ర చంద్రికా గ్రంథమండలిని స్థాపించుతున్నా'నని ప్రకటించారు. ఆ మొత్తమే మహిళల కళాశాలను స్థాపించేనాటికి 18000 వేలయింది. అదే సారస్వత నిక్షేపముగా పేర్కొనబడ్డది.

మాడపాటి హనుమంతరావు రమ్యారామములో గాని సుఖ సుగంధములో గాని జన్మించలేదు. జీవితపు లోతులను అనుభవించ గలిగే దిసవ మన్నేతరంగిణిలో తారణనామసంవత్సర మాఘ-శుద్ధ షష్ఠి గురువారమునాడు (22-1-1885) జన్మించారు. ఇంచుమించుగా నిప్పచ్చరము వీరిని ఒడిలో చేర్చుకొన్నది. దారిద్ర్యదైన్యము గ్రోలినప్పటికీ, గుండెనిబ్బరముతో జీవితపు ఔన్నత్యాన్ని యెందరు సాధించుకొనగలుగుతారు? ఆనాడు మాడపాటిని దేశకాలపరిస్థితులు చిన్నబుచ్చుకున్న యెడల తన యాత్రయందు పొడగట్టిన కారుచీకట్లను కృషి అనే దీపావళితో ఎదుర్కొనకపోవునేమో! అణువై పుట్టినవానిని మేరువు చేయు శక్తులు ఒక్కొక్క కాలములో ఒక్కొక్క దేశములో సంఘటిల్లుతూ ఉంటాయి. వాటిని సాధకులుగాని వినియోగించుకోలేరు. పంతులుగారు అతి కష్టముతో విద్యార్థిజీవితాన్ని గడిపారు. ఎదురయిన ఇక్కట్టులను అతి నేర్పుతో సవరించుకున్నారు. మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులయి, విద్యాశాఖలో ఇన్‌స్పెక్టరు కచేరిలో గుమాస్తాగా కొంతకాలము పనిచేశారు. దాని తరువాత నిజాంరాష్ట్ర శాసన నిర్మాణశాఖలో ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగుభాషలలో అనువాదకులుగా పనిచేశారు. ఈ ఉద్యోగధర్మము నిర్వహిస్తూ పంతులుగారు వకాలతు పరీక్షలకు చదువ నారంభించారు. వారు వకీలు వృత్తిని ఆరంభించినది 1917 లో; విరమించినది 1941 లో. ఈ మధ్యకాలములో ఉద్యోగ ధర్మముతోపాటు ఆదిలో పేర్కొన్న ఉద్యమ త్రయానికి కృషి చేశారు. దాని కనుగుణ్యమయిన నిష్కళంక సేవాదీక్ష, శాంతభూతి, ఆత్మవిశ్వాసమూ అలవరచుకొన్నారు. అకుంఠిత ప్రజాసేవాపరాయణుడయిన కర్మయోగిగా సంకల్పసిద్ధి పొందారు.

తెలంగాణాలో వార్తాపత్రికలకు హనుమంతరావు పంతులుగారే మూలపురుషుడు. నీలగిరిపత్రిక, గోలకొండ పత్రిక, దేశబంధు, సుజాత వీరిసహాయ సహకారములవల్ల పెంపొందినవే. 'ముషీరదక్కను' ఉర్దూపత్రికకు వీరు చాలాకాలము సంపాదకీయము వ్రాస్తూ ఉండేవారు. పంతులుగారు గద్యరచనలో సిద్ధహస్తులు. వ్యాసరచయితే కాదు — కథారచయితగా కూడా ప్రతిష్ఠనందుకొన్నారు.

పంతులుగారు బుద్ధికి బృహస్పతి. పట్టుదలకు భగీరథుడు. తెలంగాణా ధర్మక్షేత్రాన రాజకీయాలను ప్రశాంతతతో నీతిజ్ఞతతో నిర్వహించి మెత్తని పలుకులతో కఠినమైన ఉత్తరువులనిచ్చిన యుధిష్ఠిరుడు. కార్యకారణ భావవివేచనా సమన్వయ మార్గాననడచి 'అన్యుల మనముల్ నొప్పింపక, తానొవ్వక తప్పించుకొని తిరుగుతూ తనపట్టు నెగించుకొనే విచిత్రవ్యక్తి — అజాతశత్రువు. తెలంగాణా కురుక్షేత్రాన దేవదత్తాన్ని పూరించిన విజయుడు.

లౌకికప్రజ్ఞ, దూరదర్శిత్వము, సమయోచిత ప్రస్తావన, రాజకీయ శాస్త్రమర్యాదలయందు ప్రీతి, రాజ్యాంగ నీతిజ్ఞత, సోపాన పరంపరా నిర్మాణకౌశలమూ కలిగిన సకల జనసమ్మతిగల పురుష పుంగవుడు. ఆంగ్ల ఆంధ్ర ఉర్దూభాషలలో అనర్గళముగా ఉపన్యసించగలిగిన గొప్పవక్త.

కనుకనే హైదరాబాదు పురపాలకసంఘము వీరిని 1951 ఏప్రిల్ 15 వ తేదీన మేయరుగా ఎన్నుకొని సత్కరించింది. భారత ప్రభుత్వము 1955 లో పద్మభూషణ బిరుదాన్నిచ్చి సన్మానించింది. ఉస్మానియా యూనివర్సిటీవారు 1956 లో డాక్టరేటు బిరుదునిచ్చి గౌరవించారు.

డెబ్బదిరెండు సంవత్సరాలు నిండినప్పటికీ వారిలో ఉత్సాహమూ, ఆసక్తీ తగ్గలేదు. ఇప్పటికీ ఉదయము పదిగంటలవేళ కారులో బయలుదేరి, బాలికా పాఠశాలకూ మహిళా కళాశాలకూ వెళ్లి లెక్కలను పరిశీలించి, యోగక్షేమాలరసి, మధ్యాహ్నము ఒంటిగంటకు ఇల్లుచేరుకొంటారు. గడియారాలు వెనుకముందులు నడుస్తాయిగాని వారి దినచర్య క్రమమూ కాలమూ తప్పదు. రూకలరాసులను గవ్వలవలె వెచ్చించటము మాడపాటి కలవాటు లేదు. తనస్వంత లెక్కలయినా ప్రజాసంస్థల లెక్కలయినా సరే — తూచి తూచి వాడటము వారికి అలవాటు. ఒక్కపైస లెక్కకు రాకపోతే అర్ధరాత్రి దాటినా ఆ లెక్క తేల్చి నిద్రపోవటము వారి అభ్యాసము. ఇంత నిష్కర్షగా తాను చేయటమే కాకుండా, తనతో కలిసి పనిచేసే వారిచేతకూడా చేయిస్తారు.

పంతులుగారు బహుముఖాలయిన ఉద్యమాలను నెలకొల్పి ఆంధ్రాభ్యుదయానికి దివారాత్రాలూ పాటుబడి సేవచేసిన మహావ్యక్తి. తెలంగాణాను లేమాగాణిగా చేసిన కృషీవలుడు.

తెలంగాణాలో ఏ వ్యక్తి నేను ఈ పని చేశానని ముందుకు వచ్చి చెప్పుకొని కారణము పంతులుగారి క్రమశిక్షణ ఫలితమే ఇది.



# సహాయులు

హితశ్రీ

పాత్రలు: రంగనాథం, భాస్కరరావు,
సుదర్శనరావు, పోర్టర్, కోమల.

* రైల్వేస్టేషన్‌లో పై తరగతి ప్రయాణీకుల విశ్రాంతి గది. రంగం మధ్యన ఒక బల్ల, దానికి రెండు ప్రక్కల, వెనకవైపున సోఫాలు ఉంటాయి. రంగస్థలానికి ఎడమవైపు గదిలోకి ప్రవేశించే దారి. కుడివైపున గోడకి, సరిగా తలుపుకి ఎదురుగా నిలువుటద్దం బిగించి ఉంటుంది. దానిపక్కన బాత్‌రూమ్‌లోకి వెళ్ళే దారి.

రాత్రి సుమారు తొమ్మిదిగంటల సమయం. విద్యుద్దీపం వెలుగుతూ ఉంటుంది. గదిలోకి ప్రవేశించే ద్వారానికి కొంచెం పక్కగా ఉన్న సోఫాలో కోమల కూర్చుని ఉంటుంది. ఆమె సోఫా పక్కన చిన్న సూట్‌కేస్ ఉంటుంది. ఎవరైనా గదిలోకి వచ్చి రాగానే వెనక్కితిరిగి చూస్తే తప్ప ఆమె కనిపించే అవకాశంలేదు. ఆమె చేతిలో పేపర్ ఉంటుంది. కాని దృష్టి పేపరుమీద ఉండదు. దిక్కులుచూస్తూ ఏదో ఆలోచిస్తూ అప్పుడప్పుడు పేపరు చూస్తూ ఉంటుందామె. బుజంమీద హోల్డాలుతో పోర్టర్ ప్రవేశం. గది మధ్యకి వచ్చి హోల్డాలు దింపబోతూ ఆగి ఎదురుగావున్న అద్దంలోకి చూస్తూ నిలబడిపోతాడు.

కోమల : అద్దంలో ఏముంది పోర్టర్?
(పక పక నవ్వుతుంది.)

పో : (ఉలిక్కిపడి వెనక్కిచూసి కొంచెం సిగ్గుపడి) చిత్రం ఉంది లెండమ్మాయి గారూ.

కో : ఏం చిత్రం?

పో : తనెవరో తన సంగతేమిటో అద్దం చూసుకుంటే అర్థమై పోతుంది కదండి?

కో : (కొంచెం ఆశ్చర్యపడి) అందం చూసుకుంటున్నావన్నమాట. (నవ్వుతుంది.)

పో : బరువుమోసేప్పుడు ఎట్లాఉంటానో చూసుకుంటున్నానండి. (మళ్ళీ ఒకసారి అద్దంలోకి చూసి పొడిగా నవ్వి హోల్డాల్ కింద పడేస్తాడు.)

కో : (కొంచెం చిన్నబోయి) పాపం, అలవాటు లేదల్లేవుంది. కొత్తగా పనిలో చేరావా?

పో : అవునండమ్మాయి గారూ.

కో : అంతకిముందేం పనిచేసేవాడివి?

పో : మిల్లులో కూలిపనిచేసే వాడినండి.

కో : అదేనా మొదటి ఉద్యోగం?

పో : అంతకి ముందు పొలందున్నాను.

కో : మరి ఇప్పుడీ స్థితికి వచ్చావేం?

పో : ఆ ఉద్యోగాలు పోగొట్టుకున్నాను.

కో : తీసేశారా?

పో : లేదండి. నేనే మానేశాను.

కో : ఏం? ఆపనులు నచ్చలేదా?

పో : వాటిలో కష్టసుఖాలు తెలుసుకున్నాను కదండమ్మాయి గారు. ఇంకా హోటల్లో బల్లలు తుడిచేపనీ, ఆఫీసరుగారి డవాలా జవాను పనీ, గాంగు కూలీపనీకూడా చేస్తే బలే అనుబవం సంపాయించుకున్న వాడినవుతానండి.

కో : (తెల్లబోయి) భలేవాడివే. జీవితం అంతా అలా ఉద్యోగాలు మారుస్తూ తిరుగుతావేమిటి?

పో : నాలుగురాళ్ళు తెచ్చుకుని పొట్ట పోసుకునే ఒంటరిగాడికి ఒక్కచోటే ఉండాలనేమిటి లెండి. పట్టుకొద్దీ శ్రమ. కష్టం కొద్దీ ఫలితం. (ద్వారంవైపు చూసి) ఏదీ ఈబాబు గారింకా రాలేదే, ఎటు పోయారో ఏమో (తలుపువైపు వెడతాడు)

కో : పోర్టర్, మెయిల్ ఎన్నిగంటలకి వస్తుందో తెలుసా?

పో : గంట లేటండి.

కో : పాడురైలు ఎప్పుడూ లేటే (విసుగ్గా కుర్చీలో కూలబడి పేపరు చూస్తూంటుంది)

పో : (ముందుకి వెడుతూ ఎదురుగా వస్తున్న వ్యక్తిని చూసి) అదిగో బాబూ, హోల్డాల్, అక్కడ పెట్టాను.

[భాస్కరరావు ప్రవేశం. గిరజాలు ఉంటాయి. లాల్చీ ధోవతీ ధరించి ఉంటాడు. ఇతని ప్రవర్తనా సంభా

ధణలూ, భావ ప్రకటన, హస్త విన్యాసమూ పూర్తిగా నాటక ఫక్కీలో ఉంటాయి]

భా : సరే అలా ఉండనీ.

[పోర్టర్ నిష్క్రమణ]

అవసరాలతో బరువెక్కిన జీవితం—హోల్డాల్!

(తీక్ష్ణంగా హోల్డాల్ వైపు చూసి తలపంకించి విషాదంగా నవ్వి తలపైకెత్తి ఎదురుగా చూస్తాడు. అద్దంలో ప్రతిబింబం కనిపిస్తుంది. దగ్గరగా వెడతాడు. గిరిజాలు సర్దుకొని అద్దంలో రెండుమూడు కోణాల్లో ప్రతిబింబం చూసుకుంటాడు. గొంతుసరిచేసుకొంటాడు. (ప్రేక్షకుల వైపు తిరిగి అద్దంలో చూస్తూ ఆరాధనా పూర్వకంగా) "ఆహా! ఆ కన్నుల తీరేమి? ఆ ముక్కు సొగసేమి? ఆ కనుబొమల వక్రతఏమి? ఆహా, ఏమి చక్కదనము!" (కళ్ళుమూసుకుని కోమలవైపు చెయ్యివిసిరి అదేభంగిమలో నిలబడి మైమరిచిపోతాడు కొన్నిక్షణాలు.)

[కోమల గాభరాగా లేచి నిలబడుతోంది]

హా, దేవదేవీ! (సంశయంతో) "బావా, ఏమది నా దక్షిణ నేత్రము కన్నదరుచున్నది! కాళ్ళు తడబడుచున్నవి. స్వరము గద్గదమగుచున్నది."

(సంభ్రమంతో) "హా హా మహోపద్రవమువచ్చినది, నన్నీ యుపద్రవంబు నుండి యెట్లు తప్పింతువో తప్పించి నా ప్రాణము రక్షింపుము."

(శౌర్యంతో) "నేడీ కరవాలంబున కౌరవుల బలియిచ్చి జగంబునందీ బొబ్బిలి బెబ్బులి యనం దోప జేసి వాని కెక్కడంగాక."

[ఇదంతా గాభరాగా చూస్తున్న కోమల భయంతో గబగబ బయటికి వెడుతుంది.]

(భ్రమలో) ఓ రసాల సాలమా! నాపై దయగలిగి నేని సీత జాడ తెలిసి ర్రోవ నేతెంచెనో యానతిమ్ము.

(దర్పంగా) "గిరీశంగారూ, తమరు దొంగతనం చేశారు, కొద్దిరోజులు వరకొనికి విజయం చెయ్యండి, అని దేవుడు గానీ అన్నట్టాయనా, ఒక చిన్న లెక్చరుకొట్టి, గాభరాయింప జేస్తాను."

[పోర్టర్‌తో కోమల తిరిగి ప్రవేశం. భాస్కరరావు కాలకంమూసి పోర్టర్ చిరునవ్వుతో అతనిని సమీపిస్తాడు.]

(కోపంగా) డామిట్, కథ అడ్డం తిరిగింది.

పో : సారాకెంబు—సారాకెంబు.

భా : (వెనక్కి తిరిగిచూసి) ఛీ! ఏమిటోయ్ ఈ రసభంగం? పేరి గాడిలా పాడు చేశావు స్వారస్యాన్ని.

పో : "డామిట్ కథ అడ్డం తిరిగింది" అని తమరు కోపంగా అన్నారు గాని, ఆ మాటలు గిరీశంగారు విసుగ్గా అంటారు గదండి.

భా : (కోపంగా) చెప్పొచ్చావు లేవోయ్, మహా! విసుగ్గా అనాలి! నువ్వెవడితో మాట్లాడుతున్నావో తెలుసా?

పో : చిత్తం. నాటకాల బాబుగారు కదండి తమరు?

భా : ఊఁ. నా పేరేమిటో తెలుసా?

పో : తెలీదుబాబూ.

భా : (గర్వంగా) వెంకట భాస్కరరావు!

పో : చిత్తం.

భా : రంగోద్ధారక, రంగమార్తాండ, రంగసింహ బిరుదాంకితులు ఎవరో తెలుసా?

పో : తమరేనాబాబూ?

భా : ఆయన స్వయానా నాకు మేనమామ కొడుకోయ్. ఆ కీర్తిశేషుని అడుగుజాడల్లో నడిచి రంగంమీద దుర్నిరీక్ష్యంగా ప్రకాశిస్తుంటే 'రంగభాస్కర' బిరుదంతో ఈ మధ్యే మిత్రులు నన్ను సత్కరించారు. హనుమంతుని ముందరే కుప్పిగంతులు వేస్తున్నావ్?

పో : చిత్తం, పొరపాటయిందిబాబూ.

భా : కొంచెం తాహ తెరిగి మసులుకో.

పో : క్షమించండిబాబూ. సెలవు తీసుకుంటున్నాను.

[పోర్టర్ ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ నిష్క్రమిస్తాడు. కోమల సవ్యాపుకుని పోర్టర్ వెళ్ళినవైపు కొంచెం కుతూహలంతో చూస్తుంది.]

భా : (అకస్మాత్తుగా కోమలనిచూసి కొంచెం గాభరాపడి) మీరు... మీరు... ఇది లేడీస్ వెయిటింగ్ రూమాఅండీ?

కో : (కొంచెం జంకుగా) కాదండీ.

భా : మరి... మరి...

కో : ఇక్కడ ఎవరూ లేరని కూర్చున్నాను. మీకు ఇబ్బందిగా ఉంటే...

భా : అబ్బెబ్బె. నాకేం ఇబ్బందిలేదండి. ఎంతమాట! కూర్చోండి... కూర్చోండి...మీరు...మీరు ఇందాకటి నించీ ఇక్కడే ఉన్నారన్నమాట.

కో : అవునండీ!

భా : నేను చూడనేలేదండీ. మీరు ఏమనుకున్నారో ఏమో!

కో : అనుకోటాని కేముందండీ?

భా : నేనేదో నాటకాల్లో వేషాలు వేసే మనిషినండీ.

కో : అవును. తెలిసింది.

భా : నేనేదో నా గొడవలో పడిపోయాను. అభినయంలో లీనమైపోయినప్పుడు నన్ను నేనే మర్చిపోతానండీ.

కో : సహజమేకదండి.

భా : మీరేమీ గాభరా పడలేదుకదా!

కో : (సందేహించి) మొదట్లో అర్థంకాలేదు. నటన ప్రాక్టీసు చేస్తున్నారని గ్రహించలేక పోయానండీ.

భా : అలాగా? మీరు నాటకాలు చూస్తారా?

కో : ఎప్పుడుగా చూడనండీ.

భా : బహుశా నన్నుగురించి వినేఉంటారు. రంగభాస్కర వెంకట భాస్కరరావు అంటే నేనేనండి.

కో : చాలా సంతోషమండి. మీరు ఏ పాత్రలు వేస్తారో అడగవచ్చా?

భా : హీరో! వచ్చి గీపెట్టినా మరో పాత్ర వెయ్యను. నా అయుర్దాయం రంగస్థలామభవంలో ఒక్కసారికూడా విలన్ పాత్ర వెయ్యనే లేదండి.

కో : సామర్థ్యం ఉన్నవాళ్ళకి ఏ పాత్రయినా ఒకటే అంటారు కదండీ.

భా : నిజం. ఉన్నమాట చెప్పారు. కాని విలన్ అంటే నా కసహ్యం. ఉన్న సంగతి అదీ. దుర్మార్గాన్ని ఏ మాత్రమూ సహించలేనండి. ఇక అలాంటి పాత్రలో ఏం రాణిస్తాను, చెప్పండి?

కో : మీరు సినిమాల్లోకూడా నటిస్తారా?

భా : అందుకే ఈ మద్రాస్ ప్రయాణం.

కో : మద్రాస్ వెడుతున్నారా?

భా : ఔనండి. మీరు.?

కో : నేనూ మద్రాస్‌కే వెళ్లాలండి.

భా : (చుట్టూచూసి) ఒంటరిగా ప్రయాణమైనట్టున్నారు?

కో : (కొంచెం భయంతో) ఔనండి.

భా : సాగనంపటానికి కూడా ఎవరూ వచ్చినట్టు లేదు.

కో : (నిరుత్సాహంగా) ఊహూఁ.

భా : పుట్టింటివారి ఊరు అనుకుంటాను ఇది.

[తల ఔనన్నట్టు తిప్పుతుంది కోమల].

నాన్నగారు ఊళ్ళో లేరా?

[ఉన్నారన్నట్టు తలతిప్పుతుందామె.]

మరి...పోట్లాడి వస్తున్నారా ఏమిటి, కొంపదీసి?

[కోమల ప్రత్యుత్తరం ఇవ్వదు].

క్షమించాలి. అనవసరమైన ప్రశ్నలడుగుతున్నట్టున్నాను.

[కోమల చిన్నబోయినట్టుగా అతనివైపుచూసి తలదించుకుంటుంది.]

మద్రాసులో భర్తగారున్నారనుకుంటాను.

కో : నాకింకా వివాహం కాలేదండీ.

భా : (ఒక్కసారిగా పుట్టెడు ఉత్సాహం కలిగి) అలాగా! మరి మద్రాసులో ఎవరైనా చుట్టాలున్నారా?

కో : ఊహూఁ.

భా : (ఆశ్చర్యంగా) అయితే మీ ప్రయాణంలో ఉద్దేశం?

కో : కాలేజీలో చేరాలని వెడుతున్నానండి.

భా : ఓహో! ఏ కోర్సులో చేరతారు?

కో : బి. ఏ. లిటరేచర్.

భా : నాదీ బి. ఏ. లిటరేచరేనండోయ్. పాసయిపోయినా అయిదేళ్ళయిందనుకోండి. నా పుస్తకాలు పనికొస్తే తీసుకోండి, సంతోషంతో ఇస్తాను.

కో : థాంక్స్. కాని ఎవరైనా బీదవాళ్ళకి ఇస్తే సహాయం చేసినట్టు ఉంటుంది. మా నాన్న లక్షాధికారి.

భా : అఁ! లక్షాధికారా? చెప్పరేం, మీ నాన్నగారి పేరు?

కో : వెంకటరంగనాథంగారు.

భా : (ఆశ్చర్యంతో) ఏమిటీ! (దగ్గరికొచ్చి) రంగనాథంగారు సాక్షాత్తూ మీ నాన్నగారే!

కో : అవునండి, మీకు తెలుసా?

భా : తెలుసా? (రెండు క్షణాలాగి) కన్యాశుల్కంలో గిరీశం పాత్ర ధరించిన మొదటిసారి గ్రీన్ రూమ్‌లో వేషం విప్పేస్తుంటే వచ్చి అమాంతం కౌగలించుకుని "భాస్కర్‌రావ్, అప్పారావుగారి గిరీశాన్ని ఇన్నాళ్ళకి చూశానయ్యా" అని భుజం తట్టి ప్రోత్సాహమిచ్చిన రంగనాథంగారి సంగతేనా మీరు చెప్పేది?

కో : ఆ వివరాలు నాకు తెలియవండీ. కాని మా నాన్నగారు సామాన్యంగా నాటకాలు చూడరు. అందుకే నన్నూ చూడనివ్వరు. అనకూడదుకాని తన అభిప్రాయాలు బలవంతంగా ఇతర్ల మీద రుద్దటం మా నాన్నగారికి ఇష్టమండీ.

భా : ఎంతమాట! ఈమధ్య నాకు సన్మానం చెయ్యాలనికూడా వారు ప్రయత్నం చేశారు.

కో : అలాగాండి? కాని మా నాన్నగారికి ఎంతసేపటికీ రాజకీయాలే తప్ప ఈ విషయాలు పట్టవని అందరూ అంటుంటారు.

భా : అది నా విషయంలో మినహాయింపులెండి. ఇంతకీ మీరే కాలేజీలో చదువుతారు?

కో : ఇంకా తేల్చుకోలేదండీ.

భా : అంటే ఇంకా సీటుకోసం ప్రయత్నించలేదా? చాలా ఆలస్యమైపోయిందే!

కో : ఇప్పుడెవ్వరా?

భా : కష్టమే. ప్రయత్నించాలి.

కో : మీ కెవరైనా తెలుసా?

భా : నాకా? ఎందుకు తెలియదూ? అయినా ఆంధ్రదేశంలో ఇన్ని కాలేజీలుండగా మీరు మద్రాసుమీద మోజు కలిగిందేం?

కో : (వినవట్టుగా) మీరు మద్రాసులో కుటుంబంతో ఉంటున్నారా?

భా : కుటుంబమా? నేనింకా ఒంటరిగాడినేనండీ. అన్నట్టు మీరు మద్రాసులో ఎక్కడ దిగుతారు?

కో : ఇంకా ఆలోచించలేదండీ.

భా : (ఆమె వైపు తీక్షణంగా చూస్తాడు. చప్పున ఏదో స్ఫురిస్తుంది) మీరు ఇంట్లో చెప్పకుండా వచ్చేశారు. అవునా? నిజం చెప్పండి.

[కోమల జవాబివ్వదు.]

ఏం జరిగింది? దాచకుండా చెప్పండి. మీ మేలుకోరే వాడినే నేను.

కో : మా నాన్నకి నేను పైచదువులు చదవటం ఇష్టంలేదు. పోనీ అని పెళ్ళిపెట్టుకుని ఊరుకున్నాను. కాని...కాని

ఏదో గొప్ప సంబంధం కుదుర్చుకోవాలని చూస్తున్నారు. నాకది ఇష్టం లేదు. కాలేజీలో చేరి పోదామని వస్తున్నాను. ఒప్పుకోకపోతే ఉద్యోగం చేసుకుని బతుకుతాను.

భా : (తదేకంగా ఆమె వైపు చూస్తూ ఆలోచనగా) మీ సాహసం మెచ్చుకోతగ్గదే. కాని...

కో : చిక్కుల్లో పడతానేమోనంటారా? దేవుడిమీద భారం వేశాను. అవసరమైతే మీలాంటి మంచివాళ్ళు సహాయం చెయ్యకపోతారా అని ధైర్యం చేశాను.

భా : ఎంతమాట! ఎందుకు చెయ్యను? తప్పక చేస్తాను. సొంత పనికూడా మానుకుని చేస్తాను. పరోపకారార్థం ఇదం శరీరం!

కో : ఎంత మంచి వారండీ!

భా : ఏమీ చెయ్యకుండానే అలా పొగిడేస్తున్నారే!

కో : మాట అన్నారు చాలు. తలవని తలంపుగా మీ సహాయం దొరకటం నా అదృష్టం.

భా : అహాఁ—దానికేంలెండి.

కో : లేకపోతే మద్రాస్‌లాంటి మహాపట్నంలో ఎన్నో అవస్థలు పడాలి కదండీ.

భా : అందులో మీలాంటి అందమైన వాళ్ళకి మరీ ఇబ్బంది.

కో : (సిగ్గుపడి) సీటు దొరుకుతుందంటారా?

భా : సరసీటు-దొరక్కపోతే మాత్రం ఏమండీ—అహాఁ—ఎందుకు దొరకదూ? తప్పక దొరుకుతుంది. ఆ వ్యవహారం నేను చూస్తాగా!

కో : హాస్టల్లో సీటు రానివాళ్ళు ... (బ్లీగా నే లేడీస్ హాస్టల్లో ఉండటానికి పీలవుతుందండీ?)

భా : వీలుకాదే. పోనీ, హాస్టల్లో సీటొచ్చేదాకా మా ఇంట్లో నే ఉండొచ్చు.

కో : మీ ఇంట్లోనా?

భా : అవును. ఏం, తప్పా?

కో : (అనుమానంగా) మీ ఇంట్లో ఆడవాళ్ళున్నారా?

భా : లేరు. భూకొరా, ఆ విషయం నాకు తట్టనే లేదు. పోనీండి. నాకు తెలిసిన వాళ్ళున్నారు. వాళ్ళింట్లో టెంపరరీగా మకాం చెయ్యవచ్చు.

కో : ఎలాగో కాలేజీలో చేరానంటే మీ మేలు మర్చిపోనండీ.

భా : దానికేం.

కో : మీరు కనిపించే దాకా భయంభయంగానే ఉందండీ. ధైర్యం చిక్కబట్టుకోలేక ఇంటికి తిరిగి వెళ్ళిపోవాలని కూడా అనుకున్నాను. కాని ఆ పెళ్ళి సంబంధం సింహస్వప్నంలా మనసులో మెదిలి ఎటూ తేల్చుకోలేక ఇలా కూర్చున్నాను.

భా : ఎవరు ఎంత బలవంతపెట్టినా ఇష్టంలేని పనులు చెయ్యకూడదండీ.

కో : మొదటినించీ స్వాతంత్ర్యం అంటేనండి. పొట్టినుండి దాన్ని అందరూ అంటూండేవాళ్ళు.

భా : హు-హూ-అలాగా? స్త్రీలందరూ అలా ఉంటే కాని దేశం బాగుపడదండీ అన్నట్టు మీరు టికెట్ తీసుకున్నారా?

కో : లేదండీ. మెయిల్ లేటనే సరికి ఎవరో వెయ్యిపట్టుకుని వెనక్కిలాగినట్టయి ఏమీ తోచక ఇలా కూర్చుండిపోయానండీ.

భా : ఇహ మీకు నేను తోడున్నానుకదూ. ఇంకేం భయం?

కో : సమయానికి దేవుడిల్లే కనిపించారు. టికెట్ తీసుకొస్తానండీ (లేస్తుంది)

భా : మీరు వెళ్ళట మెందుకూ? నేను లేనూ. (వెళ్ళబోతాడు)

కో : అక్కర్లేదండీ. నేను తెచ్చుకోగలను.

భా : నేనుండగా మీ కా(శ్రమెందుకండీ?

కో : బాగుంది. ఇప్పటినించే మీకు శ్రమ ఇవ్వమంటారా? మద్రాసు వెళ్ళినప్పటినించీ ఎలాగో తప్పదు.

భా : ఆల్ రైట్. అలాగే కానివ్వండి.

[కోమల వెళ్ళిపోతుంది]

చూడండీ, మీ పేరేమిటో తెలుసుకోనే లేదు.

కో : కోమల.

భా : కోమల! ఓహో! కోమలా!

కో : (వెనక్కి తిరిగి) ఎందుకండీ పిలిచారు?

భా : ఆఁ? పిలిచానా? అహాఁ... అలా అనాలనిపించింది... కోమలగారూ...ఊఁ...జాగ్రత్త సుమండీ...వెనకంజ వెయ్యరుకదూ?

[కోమల తలఊపి నిష్క్రమిస్తుంది]

కోమల! "బాల రసాల సాలనవపల్లవ కోమల"! ఆహా! (అద్దం దగ్గిరికిపోయి గిరజాలు సర్దుకుంటూ వివిధభంగిమల్లో తనరూపం చూసుకుంటాడు) "ఆహా! ఆ కన్నుల తీరేమి? ఆముక్కు సొగసేమి? ఆ కనుబొమల వక్రత ఏమి? ఆహా, ఏమి చక్కదనము" హా, కోమలా! (తన్మయుడౌతాడు)

[హోల్డాల్‌తో పోర్టర్ ప్రవేశం]

పో : సాష్టాంగం. సాష్టాంగం! (దభీమని హోల్డాల్ కింద పడేస్తాడు.)

భా : (ఉలిక్కిపడి చూసి) మళ్ళీ దాపురించావ్ స్వారస్యం చెడగొట్టటానికి?

పో : విప్రనారాయణ నాటకం కదు బాబూ. "హా దేవదేవి" అనాలిసింది "హా కోమలా" అంటారేం బాబూ? తెలీకడుగుతాను.

భా : ఓరి పిడుగా. నువ్వు నాటకాలు తెగచూసేట్టున్నావే! కొంపదీసి నువ్వుకూడా ఒక యాక్టరువై పోవుగద!

పో : చిత్తం. తమదయ బాబూ.

భా : కను ముక్కుతీరు నీకు బాగానే ఉందోయ్.

పో : (సంకోచంతో) చిత్తం.

భా : గొంతుకూడా బాగానే ఉంది.

పో : మూరాజులు సరాసరం అడుతున్నారు.

# ప్రమాద రక్షణకు
# ప్రశస్తమైనది
# భీమా

ఎప్పుడు యే ప్రమాదం వచ్చేదీ, ఏక్షణం ఎలా వుండేదీ
తెలియని ఈ దినాల్లో

అగ్ని ★ మోటార్ కారు ★ కార్మిక నష్టపరిహారం

నౌకా ★ ఫయిడిలిటీ గ్యారంటీ ★ మొదలైన భీమాలకు

మాతో సంప్రదించండి:

## యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్
## జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

"బాంబే లైఫ్ బిల్డింగ్సు"

**9. బ్రాడ్వే - మద్రాసు - 1**

Telephone : 4241    Telegrams : "UNIGEN"

బ్రాంచీలు :

విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా -
కోయంబత్తూరు - కొలంబో - సింగపూర్ - జకార్తా.

భా : (వివరించాలని) ఛ-ఛ. ఉన్నమాటే అంటున్నానోయ్. ఎవడు చూశాడు? రేపటిరోజున నువ్వే ఓ పెద్ద హీరోవై పోతావేమో. అప్పుడు నీ 'పారాకెంబు' పోటీకి నేనుమాత్రం తట్టుకోలేను.

పో : రాజు తలుచుకుంటే దెబ్బలకి కొదవా అన్నట్టు మీరు తలుచుకుంటే నేను యాక్టర్ని కాకపోతానా?

భా : తనకి దూర గంత లేదు మెడకొక డోలన్నాట్ట!

పో : అదేంటి బాబూ, అట్లా అంటారు?

భా : లేకపోతే ఏమిటి? రెండు సంవత్సరాల్నించీ అడ్డమైన వాడి కాళ్లూ పట్టుకున్నా ఇంతవరకూ ఒక్కటంటే ఒక్క ఛాన్సూ రాకపోయె.

పో : ఏం ఛాన్సు బాబూ?

భా : సినిమాలో వేషం వేసే ఛాన్సు.

పో : మీరు సినిమాల్లో వేషంవెయ్యలేదా బాబూ ఇంకా?

భా : ఏదీ! రంగ భాస్కర బిరుదు మొన్నేగా వచ్చింది. ఇహ నా తడాఖా చూపిస్తాను. రేపో కంపెనీలో ఇంటర్వ్యూ ఉందిలే. గిరీశంగారిలా ఢంకా తెగరగొట్టేస్తాను. (కొంచెం ఆగి) ఎటొచ్చీ ఇంటర్వ్యూలతో పనికాదోయ్. అదే వచ్చిన చిక్కు. డబ్బు కావాలి, డబ్బు. కాస్త పెట్టుబడి తెచ్చామా, ఏకధమ్మున హీరో ఐ పోతాం. హీరో!

పో : బాగా సెలవిచ్చారు.

భా : (ఉత్సాహంగా ఆవేశోరణిలో) రొట్టెవిరిగి నేతిలో పడేట్టుందిలే. తలవని తలంపుగా మాంచి ఛాన్సు చిక్కింది. ఊఁ... అవకాశం దొరకాలేగాని ఉపయోగించుకోటంలో నన్ను మించినవాడు పుట్టలేదు. అప్పుడే ప్లాను వేసేశాన్లే.

పో : ఏంటి బాబూ ఆ ప్లాను?

భా : వెన్నెల పువ్వులా మెరిసే అందమైన అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నానోయ్. ఆ అమ్మాయి తండ్రి లక్షాధికారి. ఆ అందాలరాణి సినిమాతారై...

పో : సినిమాతారే! ఎవరు బాబూ ఆమెగారు?

భా : ఇంకా కాలేదులే. ముందు ముందు సినిమాతారై పోతుంది. నేను హీరో. ఆమె హీరోయిన్. కేవలం నా చిత్రాల్లోనే నటిస్తుందిలే. బ్రహ్మాండమైన పేరు, డబ్బు...ఓహ్! అప్పుడు మన కష్టేమిటోయ్!

పో : అప్పుడు నన్ను మర్చిపోకండి బాబూ.

భా : మర్చిపోతే ఈ రాత్రి, ఈ వెయిటింగ్ రూమ్ జ్ఞాపకం చెయ్యవోయ్. వెంటనే జ్ఞాపకం తెచ్చుకుంటాను.

పో : ఈ వెయిటింగ్ రూమ్, ఈ రాత్రి అప్పుడు మీకు జ్ఞాపకం ఉంటాయా బాబు?

భా : ఈ వెయింటింగ్ రూమ్! ఈ రాత్రి! జీవితంలో మర్చిపోలేను. ఇక్కడే మా ప్రథమ దర్శనం.

పో : ఇక్కడా? ఈ రాత్రా?



భా : (చప్పున నాలుక కొరుక్కుని) ఉష్. ఇవన్నీ నీకెందుకోయ్. ఊరుకో.

పో : పెళ్ళి స్థిరపడ్డదా బాబు?

భా : నాకంటే నీకు తొందరగా ఉందేమోయ్?

పో : చిత్తం. విని సంతోషిద్దామని అడిగానండీ.

భా : (కొంచెం కోపంగా) ఆ విషయాలు ప్రస్తుతం నువ్వడక్కూడదూ, నేను చెప్పకూడదూ. అంతే. (ఉత్తేజితుడై కొన్ని క్షణాలు రంగంమీద పచార్లుచేసి అకస్మాత్తుగా నిష్క్రమిస్తాడు.)

పో : (అతనివైపు వింతగా చూసి) ఏదో పాచిక పారినట్టుంది. మాంచి ఉషారుగా ఉన్నాడు పెద్దమనిషి. (ముందుకివెళ్ళి అద్దంలో ఒకసారి తన ప్రతిబింబం చూసుకుని నవ్వుకుంటూ ఉంటాడు.)

[కోమల ప్రవేశం]

కో : ఏయ్, పోర్టర్! ఏమిటా వెర్రి వేషాలు?

పో : సామాన్లు మోసి అలిసిపోయినప్పుడు ఎలా ఉంటానో చూసుకుంటున్నానండి.

కో : అబద్ధాలాడకు.

పో : ఇందులో అబద్ధం ఏముందండీ?

కో : అద్దంలో నిన్నే చూసుకుంటున్నావా?

పో : నన్ను కాకపోతే అద్దంలో చూడట మెందుకండమ్మాయి గారూ? ఎదురుగానే చూడొచ్చుగా.

కో : ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతున్నావే. బయటికి వెళ్లు.

పో : వెళ్లమంటే వెళతానండి. ఈమాత్రం దానికి అరవాలా?

కో : బ్రూట్.

పో : అంటే ఏమిటండమ్మాయిగారూ?

కో : 'పశువా' అని.

పో : పశువా?

కో : ఏయ్ రౌడీలా ఉన్నావే. స్టేషన్‌మాస్టర్‌తో రిపోర్ట్ చెయ్యమన్నావా?

పో : నేనేంచేశానండీ?

కో : మాటకి మాటంటావా?

పో : ఎప్పుడన్నానండీ?

కో : అద్దంలోంచిచూసి వెకిలివేషాలేస్తావా?

పో : రామరామ.

కో : మొదటిసారి పోనీగదా అని ఊరుకుంటున్నాను.

పో : నేనసలు చూడందే.

కో : ఊరికే వాదించకు.

పో : ఇందాక మంచిగా మాట్లాడి ఇంతలో ఇట్లా మారిపోయారేమండమ్మాయిగారూ? పాడుప్రపంచం. అందమైనవోళ్లని చూస్తే కొంతమందికి పాడుబుద్ధులు పుడతయ్యి. ఎవరూ ఏమీ అనలేరుగదా!

కో : అంటే ఊరుకుంటానా ఏమిటి? అరెస్టుచేయిస్తాను. నేనెవరి ననుకుంటున్నావో, వెంకటరంగనాథంగారమ్మాయిని.

పో : ఆఁ. వెంకటరంగనాథంగారా? ఏ వెంకటరంగనాథంగారు?

కో : ప్రఖ్యాత రాజకీయనాయకులు, గొప్ప వ్యాపారస్థులు వెంకటరంగనాథంగారు.

పో : (సంభ్రమాశ్చర్యాలతో) వారమ్మాయా మీరు?

కో : అవును. వారు నీకు తెలుసా?

పో : సరిసరి...మద్రాస్ వచ్చినప్పుడల్లా-మా (ఆగుతాడు)

కో : వచ్చినప్పుడల్లా, మీ...?

పో : అహఁ - ఏంలేదండి....మాకు దర్శనం ఇస్తుంటారు కదండి. వారు వచ్చినట్టు లేదేమండి?

కో : (అతనివైపు కొంచెం వింతగా చూసి) రాలేదు లే.

పో : ఒంటరిగా వెడుతున్నారన్నమాట.

కో : ఊఁ. బంధువులింటికి వెడుతున్నా లే.

పో : బంధువులా? ఎవరండీ వారు?

కో : నీకెందుకోయ్ అవన్నీ.

పో : ఓ...క్షమించండి...ఊరికే అడిగాను. తమరు మెయిలెక్కగానే ఇంటికెళ్ళి అమ్మాయిగారు క్షేమంగా రైలెక్కారని చెబుతాలెండి.

కో : (పిడుగు పడ్డటయి) ఆఁ!

పో : ఇంకేమైనా చెప్పమన్నారా?

కో : నువ్వు వారిని అంత బాగా ఎరుగుదువా?

పో : చిత్తం.

కో : చూడూ. వారు ఊళ్లో లేరు. నువ్వు ఏమీ చెప్పక్కర్లేదులే. ఏం?

పో : సరే నండి.

కో : పాపం నిన్నానవసరంగా కోపడ్డాను. ఏమీ అనుకోకు.

పో : పరవాలేదండి.

కో : మా నాన్నగారు కనిపించినా ఈ విషయం చెప్పవుకదూ?

పో : మీరేమీ అనలేదు లెండమ్మాయిగారూ.

కో : అసలు స్టేషన్లో నీకు కనిపించావని కూడా చెప్పొద్దు. ఏం లేదు. చిన్న తమాషా చేస్తున్నా లే. ఏం, చెప్పవుకదూ?

పో : (అనుమానంగా) సరే లెండి.

[ఆమెవైపు అదోవిధంగా చూసి వెడుతూ ఉంటాడు. సుదర్శనరావు ప్రవేశం. హాట్ సూటుల్లో ఉంటాడు. సామాన్యంగా రెండుచేతులూ ట్రౌజర్ జేబుల్లో ఉంటాయి. కదలికలో ఉచ్చారణలో, సంభాషణలో ఆఫీసర్ హోదా స్ఫురింపచేస్తూ ఉ ట్టిపడుతూ ఉంటుంది]

అదిగో, బాబూ, హోల్డాల్.

: ఆల్ రైట్ (సరాసరి అద్దం దగ్గిరికిపోయి వివిధ రకాల పోజుల్లో చూసుకుంటాడు) గుడ్ మార్నింగ్, సర్. (అ మాటలు అనేక విధాలుగా మార్చి అనేక భంగిమల్లో ప్రాక్టీసు చేస్తాడు.)

అయాం సుదర్శన్ రావ్ సర్.

ఎం. ఏ. పాలిటిక్స్.

ఫస్ట్ క్లాస-ఫస్ట్ రాంక్ సర్.

ఎస్. సర్.

ఎస్. ఎస్.

నో-సర్ -నో...నో.

[వివిధ రకాలుగా ఈ మాటలు ప్రాక్టీసుచేసాక తరవాత కొంచెంసేపు పచార్లుచేసి ఆగి సిగరెట్ ముట్టించి విప్పు పుల్ల పారేస్తూ అకస్మాత్తుగా కోమలని చూసి ఉలిక్కి పడతాడు.]

ఎక్స్క్యూస్ మి...మేడమ్...ఎ...ఏ...మిస...మిస్... ఎ...ఏ.

కో : (నవ్వాపుకుంటూ) కోమల.

సు : మిస్ కోమల...గ్లాడ్.ఎ. ఏ...వెరీ...వెరీ గ్లాడ్ టు మీట్ యు.

కో : కూర్చోండి.

సు : కూర్చోవచ్చా?...ఎ-ఏ-థాంక్యూ...థాంక్యూ. ఎ. ఏ క్షమించాలి...మిమ్మల్ని చూడలేదు. అందుకని అలా...

కో : పరవాలేదు.

సు : రేపు ఇంటర్వ్యూ ఉందండి. జస్ట్-ఎ బిట్...ప్రాక్టీస... అంతే...

కో : అలాగా? ఏ పోస్టండీ?

సు : ఆఫీసర్ ...క్లాస వన్. మరోపోస్టుకి నేను ఖస్తే అప్లయి చెయ్యనండీ.

కో : ఈరోజుల్లో చాలామంది అంతేనండి.

సు : చాలామంది అంతేనా? నో-నో-యు ఆర్ రాంగ్... చాలామంది ఏఉద్యోగానికైనా ఎగబడతారండి.

కో : అయితే నేను పొరబడ్డానన్నమాట!

సు : ఎస్...నేను ఎం. ఏ. పాలిటిక్సండీ...ఎ...ఏ...ఫస్ట్ క్లాస ఫస్ట్ రాంక్ సర్... ఐ. ఐ. మీన్...మిస... కోమలా.

కో : చాలా సంతోషమండీ.

సు : మద్రాస్ యూనివర్శిటీ రికార్డ్ బ్రేక్ చేశానండీ.

కో : మద్రాస్ యూనివర్శిటీ?

సు : ఎ...ఎస్...మద్రాస్ యూనివర్శిటీ.

కో : కంగ్రాట్యులేషన్సండీ.

సు : థాంక్యూ...థాంక్యూ...మెనీథాంక్స్. వెరీమెనీథాంక్స్.

కో : నో మెన్షన్. అయితే మీకు కాలేజి ప్రొఫెసర్లతో ప్రిన్సిపాలుతో బాగా పరిచయం ఉండేఉంటుంది. కదండీ.

సు : పరిచయమేమిటండీ! నేనంటే వాళ్లందరూ పడిచస్తారు. మరీ మా ప్రొఫెసరైతే ఎక్కడ కనిపించినా హలో మిస్టర్ సుదర్శనరావ్, ది గ్రేట్ జీనియస్ అని పలకరించు తుంటాడు. అన్నట్టు మీకు నాపేరు చెప్పలేదు కదూ, అయాం సుదర్శన్ రావ్...సర్...ఐ. ఐ. మీన్...మిస్. మిస్ కోమలా.

కో : మీపరిచయం కలిగినందుకు చాలా సంతోషమండీ, సుదర్శన్ రావ్ గారూ! దయచేసి నాకో చిన్న సహాయం చేసి పెట్టగలరూ?

సు : ఓహో...ఐ ఆల్ మోస్ట్...నా సిస్ఫోర్టుకు కాదు అడగండి.

కో : మద్రాసులో మీ కాలేజీలో ప్రిన్సిపాల్ గారికి చెప్పి నాకు బి. ఏ. లిటరేచర్ లో సీట్ ఇప్పించగలరా?

సు : ఇప్పించగలనా! నా మాటంటే ప్రిన్సిపాల్ కి శిలాక్షర మండోయ్.

కో : ఈ సహాయం చేసిపెడితే మీ మేలు మర్చిపోనండీ.

సు : సంతోషంగా చేస్తానండి. రేపు నా ఇంటర్వ్యూ కాగానే నాతో కాలేజీకి రండి. అన్నట్టు ఇప్పుడు మద్రాస్ కేనా ప్రయాణం?

కో : అవునండి.

సు : అయితే అక్కడ మీ అడ్రస్ చెప్పండి. కలుసుకుంటాను.

కో : ఎక్కడ దిగుతానో తెలియదండీ. అక్కడ నాకు తెలిసిన వాళ్ళెవరూ లేరు. ఇంతవరకూ మద్రాస్ ఎలా ఉంటుందో కూడా ఎరగను.

సు : అయినా ఒంటరిగానే వెడుతున్నారే. మీ ధైర్యం మెచ్చుకోదగ్గదే, కాని మీలాంటి అందమైనవాళ్ళు మరీ జాగ్రత్తగా వుండాలిసుమండీ. (ఆమెవైపు తేరిపార చూస్తాడు. ఆమె ముఖం దించుకుంటుంది) ఏ...ఏ... మీ...మీ నాన్నగారి పేరు?

కో : వెంకటరంగనాథం గారు.

సు : (అదిరిపడి) వాట్! (తేరుకుని) రంగనాథంగారమ్మాయా మీరు.

కో : ఔనండీ!

సు : ప్రఖ్యాత నాయకులు రంగనాథంగారమ్మాయికి నేను కాలేజీలో సీటు ఇప్పించటమా? మి...మిస్...కో. మలా, మీరు నన్ను పరీక్షిస్తున్నారు.

కో : కాదండీ. పరిస్థితులు అలా ఉన్నాయి. నేను పైకి చదవటం మా నాన్నకి ఇష్టంలేదండీ. నాకు మాత్రం చదవాలని పట్టుదలగా ఉంది.

సు : అయితే చెప్పకుండా వచ్చేశారా ఏమిటి?

[కోమల మెల్లిగా తలూపుతుంది]

నిజమే! (కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా ఉండి అకస్మాత్తుగా పోఖా ఆమె దగ్గిరికి లాక్కుని) ఇంకో నయం! సమయానికి నాలాంటి స్నేహితుడు కనిపించాడు కాబట్టి సరిపోయింది. మి...మిస్ కోమలా, నేనున్నంతకాలం మీకేం పరవాలేదు. మద్రాస్ లో మా బావగారింట్లో దిగుదాం. మీకేలోటూ రానివ్వను. మిమ్మల్ని కాలేజీలో చేర్పించే బాధ్యత నాది.

కో : కృతజ్ఞురాలిని. హోస్టల్లో సీటు రాగానే వెళ్ళిపోతాను. మీ ఋణం తీర్చుకోలేనండీ.

సు : హా..హా—దటీజ్ ఆల్ రైట్...దటీజ్ ఆల్ రైట్...

కో : మీరు రాకముందు వెంకటభాస్కరరావు అనేవారు కనిపించి చేతనైన సహాయం చేస్తానని వాగ్దానం చేశారండీ, పాపం.

సు : అబ్బెబ్బే...వాళ్ళూ వీళ్ళూ ఏం కుదరదండీ నేనుండగా. (కొంచెం ఆగి) చూడండి. చెప్పకుండా వచ్చేశారుకదా, మీ వాళ్ళు గాభరాపడిపోరూ?

కో : ఏం చెయ్యను మరి?

సు : ఓ చిన్న కార్డుముక్క రాసెయ్యరాదూ?

కో : కార్డు లేదండీ.

సు : నా దగ్గిరుంది లెండి. (కోటు జేబులోంచి తీసి ఇస్తూ) ఇదిగో, రెండు ముక్కలు రాసెయ్యండి.

కో : (తీసుకుని) ఏం రాయమంటారు?

సు : అవసరంగా ఇలా రావలసి వచ్చిందనీ, గాభరా పడవద్దనీ కులాసాగానే ఉన్నాననీ, వివరాలు తరవాత రాస్తాననీ రాయండి.

[కోమల వ్రాస్తుంది]

ఇలా ఇవ్వండి, పోస్ట్ చేసి వస్తాను.

కో : నేను పోస్ట్ చేసాలెండి.

సు : మీ రెండుకూ, నేనుండగా?

కో : పరవాలేదులెండి. చేతైనపనులుకూడా చేసుకోవొద్దంటారా?

సు : పోనీ పోర్టర్ని పిలుస్తాను. వేసివస్తాడు...పోర్టర్! పోర్టర్!

కో : ఎందుకూ, వొద్దంటే. నేను వెడుతున్నానుగా.

సు : ఆల్ రైట్, మీ ఇష్టం, మరి.

[కోమల నిష్క్రమిస్తుంది]

వాట్ ఎ ఛాన్స్...వాట్ ఎ ఛాన్స్! కంగ్రాట్యులేషన్స్ సుదర్శన్ రావ్! (అద్దంముందు నిలబడి ప్రాక్టీస్ చేస్తూ ఉంటాడు.)

"గుడ్ మార్నింగ్ సర్..." అన్నట్టు ముగ్గురు మెంబర్లు ఉంటారుకదూ! "గుడ్ మార్నింగ్...సర్స్..."

పో : (ప్రవేశిస్తూ) సారాశెంబు...సారాశెంబు.

సు : (ఉలిక్కిపడి) సారాశెంబు ఏమిటోయ్ (ముఖం చిట్లించుకుంటాడు.)

పో : వ్యాకరణంబు చెడిందిబాబూ. శత్తిరిపూట అద్దంలో చూసుకుని గుడ్ మార్నింగ్ చెబుతారేం బాబూ? (పొంచాగా) గుడ్ నైట్ సర్!

సు : (తెల్లబోయి) పోర్టర్ నిఘంటుకూడా చెప్పేవాడే! నీ పాటి తెలుసులేవోయ్ పిచ్చిపుల్లాయ్. ఇదీ... రేపొద్దున సర్వీసుకమిషన్ మెంబర్లతో ఇంటర్వ్యూకి ప్రాక్టీసోయ్. ప్రాక్టీసు.

పో : అదా బాబు? తమరెందుకో పిలిచారు?

సు : అక్కర్లేదులే పో (విసుక్కుంటాడు.)

పో : చిత్తం. అంతేబాబూ, అంతే. అట్టాగే దర్జాగా తీవిగా నిలబడాల. తమరి పేరేంటిబాబూ?

సు : (చిరునవ్వుతో) సుదర్శన్ రావ్! దర్జాగా, తీవిగా ఉన్నానా పోర్టర్?

పో : బలే దాబుగా ఉన్నారండి, సుదర్శన్ రావ్ బాబ్ గారూ.

సు : గెజిటెడ్ ఆఫీసర్ లా కనిపిస్తున్నాను కదూ?

పో : అడి బాబులా ఉన్నారండి.

[సుదర్శన్‌రావ్ తీవిగా జేబుల్లో చేతులు పెట్టుకుని పచార్లు చేస్తాడు.]
తల దించాలిబాబూ!

[అప్రయత్నంగా దించుతాడు.]
మరీ పైచూపయి పోయిందండి.

సు : (కోపంగా) లేకపోతే ఆఫీసర్లు కింద చూస్తారటోయ్? ఏఁవ తెలిపి, నువ్వూ. జో హుకుంలు కొట్టేవాడల్లే కనిపి సే క్లాస్ వన్ ఆఫీసర్ ఉద్యోగం ఎవడిస్తాడూ?

పో : సరుకు మంచిదైతే ఎట్లాగైనా చెల్లిపోతది లెండిబాబూ!

సు : అదే అజ్ఞానం. ఫస్ట్ క్లాస ఫస్ రాంక్. ఏంలాభం? సర్టిఫికెట్స్ చెల్లటంలేదు. ఇన్‌ఫ్లుయెన్స్‌య్—ఇన్‌ఫ్లుయెన్స్. అదిలేనిదే ఘటం పైకిపోదు. అందులో క్లాస్ వన్ ఆఫీసర్‌గిరీ అయితే తాలూకోలీ ఇన్‌ఫ్లుయెన్స్ పనికి రాదు. ఏం వెంకటరంగనాధంగారిలాంటి వాళ్లనోపట్టాలి. ఏమనుకున్నావ్, మరి?

పో : చిత్తంబాబూ.

సు : ఆయన ఒకపట్టాన ఇటువంటివాటిలో జోక్యం కలిగించుకోడట. ఇహ మనకేం సహాయంచేస్తాడు?

పో : చిత్తం.

సు : సొంత అల్లుడైతే చెయ్యకేంచేస్తాడోయ్ పిచ్చిపుల్లయ్యా?

పో : అల్లుడా బాబు?

సు : (వినిపించుకోక) మిస్...కోమలా! ఓహ్! వాట్ ఎ బ్యూటీ! వాట్ ఎ ఛాన్స్-మిస్ కోమలా!

పో : ఎవరు బాబు?

సు : రంగనాధంగారి అమ్మాయి పోర్టర్!

పో : (మెల్లదిగా) రంగనాథంగారి అమ్మాయా? కోమలా?

సు : ఏమిటోయ్ నీ గొణుగుడు?

పో : ఆ అమ్మాయిని మీరు పెళ్ళిచేసుకొంటారా బాబు?

సు : సరే సరి. నువ్వో మందబుద్ధివి. చెప్పేదేమిటి?

పో : (ఆలోచనగా) ఆ అమ్మాయిగారు ఒప్పుకొన్నారా?

సు : ఎందుకొప్పుకోదూ? క్లాస్ వన్ ఆఫీసర్ని ఐపోతుంటే... ఫస్ట్ క్లాస్ ఫస్ట్ రాంక్...రికార్డు బ్రేక్. (పచార్లుచేస్తూ) మిస్ కోమలా! మిస్ కోమలా! ఏమైనా నిన్ను నా చెయ్యి దాటి పోనివ్వను.

(కోమల ప్రవేశం)

వచ్చారా? పోస్టు చేశారా?

కో : చేశానండి.

సు : చాలా అలిసిపోయినట్లుగా కనిపిస్తున్నారు. ఏయ్ పోర్టర్ రెండు కప్పుల కాఫీతీసుకోరా. నిన్నే.

పో : తమరింకా క్లాస్ వన్ ఆఫీసరూ కాలేదు. నేను డవాలా జవాన్నీ కాలేదు. కావాలంటే తెచ్చుకోండి బాబూ

[ఇద్దరూ వింతగా అతనివైపు చూస్తారు]

సు : వాట్! ఎంత పొగరు! చూడు నిన్నేంచేస్తానో!

[కోపంగా నిష్క్రమణ]

పో : (కోమలదగ్గిరికి వెళ్ళి) ఎవరండీ ఈ మోటుమనిషి?

కో : ఏమిటా మాటలు? మర్యాదా మట్టూ ఉండక్కర్లే?

పో : క్షమించండి. మీరీ పెద్దమనిషిని పెళ్ళిచేసుకోబోతున్నారా?

కో : (తెల్లబోయి) నేనా? ఛీ; ఏమిటి నీ వాగుడు?

పో : ఆ వెంకటభాస్కరరావు అనే ఆయన్ని?

కో : ఛీ. ఫో. అవతలికి. నన్నెందుకిట్లా అవమానిస్తావు? నేనేం చేశాను? (కంఠం గద్గదమౌతుంది)

పో : (కోపంగా) రాస్కెల్స్.

కో : (త్రుళ్ళిపడి) ఆఁ!

పో : స్కౌండ్రల్స్.

కో : (నిర్విణ్ణురాలై) ఆఁ! వాళ్ళేం చేశారు?

పో : అధమతరగతికి చెందిన స్వార్థపరులు.

కో : ఆఁ! నువ్వు పోర్టర్‌వికావు. నువ్వెవరివి? (భయంగా) ఎవరివి?

పో : కొంచెం చదువొచ్చిన పోర్టర్‌ని లెండి.

కో : చదువుకుని పోర్టర్ పని చేస్తున్నావా? నేను నమ్మను. నువ్వు సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరువి. అవును. నిజంచెప్పు. సి. ఐ. డి. వి కదూ?

పో : అదేమిటం డమ్మాయి గారూ, అలా అంటారు? నేను పోలీసువాడిని కాదు. మామూలు పోర్టర్ని.

కో : కాదు కాదు. నాకు తెలుసు. ఇన్‌స్పెక్టర్ గారూ, (గద్గదంగా) నేనేం తప్పుచెయ్యలేదండీ. నన్ను అరెస్టు చెయ్యకండి. నేను ఇంట్లోంచి పారిపోవటం లేదు. మద్రాసులో కాలేజీలో బి. ఏ. లో చేరదామని వెళుతున్నాను. అంతే నండీ. మా నాన్నకి నేను చదవటం ఇష్టం లేదండీ. అందుకనే చెప్పకుండా వచ్చాను. (జేబు రుమాలుతో కళ్ళు తుడుచుకుంటుంది.) మీరు ఇంటికి వెళ్ళమంటే వెడతాను. కాని నేను జీవితమంతా నరక యాతన అనుభవిస్తే ఆ పాపం మీకే చుట్టుకుంటుంది. దయచేసి నన్ను మద్రాసువెళ్ళి కాలేజీలో చేరనివ్వండి. ఆ పెద్ద మనుషులిద్దరూ జాలిపడి సీటుకూడా ఇప్పిస్తామని వాగ్దానం చేశారు.

[జేబు రుమాల్లో తలదాచు కుంటుంది]

పో : ఓహో! అదా సంగతి!

[ఆమె వైపు రెండు క్షణాలు చూసి నిష్క్రమిస్తాడు. కాసేపటి తరవాత సుదర్శనరావు రెండు కప్పులుపట్టుకుని ప్రవేశం.]

సు : నిద్ర వస్తోందా? కొంచెం కాఫీ తీసుకోండి.

కో : (తలపైకెత్తి) ఆ పోర్టర్ వెళ్ళిపోయాడా? (చుట్టూ చూసి) అతను మామూలు పోర్టర్ కాదండీ. సి. ఐ. డి. అవును, నిజం.

సు : (నవ్వి) కాఫీ తాగండి, మరీ చల్లారిపోతుంది.

కో : నిజంగా అతను సి. ఐ. డి నేనండి. నానా మాటలూ అనిపోయాడు. నాకు భయంగా ఉందండీ.

సు : వాడి మొహం. మిమ్మల్ని చూడగానే వాడికి మతిచలించి ఉంటుంది. కాఫీ తీసుకోండి.

[కప్పు అందిస్తాడు. ఒకసారి అతని ముఖంలోకి చూసి వాణికే చేత్తో కప్పు అందుకుంటుంది. ఇద్దరూ కాఫీ తీసుకుంటూ ఉండగా భాస్కరరావు ప్రవేశం. ఆ దృశ్యం చూసి స్తంభీభూతుడౌతాడు. చురచుర సుదర్శనరావు వైపూ, అర్థంకానట్టుగా కోమల వైపూ చూస్తూ దగ్గిరికొస్తాడు.]

కో : వీరేనండీ రంగభాస్కరవెంకట భాస్కరరావుగారు. వీరి విషయమే ఇందాక మీతో చెప్పాను. (భాస్కరరావుతో) వీరు సుదర్శన్‌రావ్ గారు ఎం. ఏ. (పరస్పరం అనుమానంగా చూసుకుంటారు)

సు : మిమ్మల్ని గురించి విన్నానండీ.

భా : అలాగా, సంతోషం.

కో : సుదర్శన్‌రావ్ గారు ఎం. ఏ. ఫస్ట్‌క్లాస్ ఫస్ట్ రాంక్ అండీ. రికార్డు బ్రేక్ చేశారు. మద్రాసులో వారు చదివిన కాలేజీలో లెక్చరర్ సీటు ఇప్పిస్తామంటున్నారు వాళ్ళు.

భా : (ఈర్ష్యతో) ఓహో!

కో : క్లాసవన్ ఆఫీసర్ ఉద్యోగానికి రేపు మద్రాసులో ఇంటర్వ్యూకి హాజరౌతున్నారు.

భా : అలాగా! (ఆలోచనగా) సుదర్శన్‌రావుగారు! ఎక్కడో విన్నట్టున్నానండి మీ పేరు. ఓ...మీ రే కాలేజీలో చదివారు చెప్పండి.

సు : ప్రెసిడెన్సీ.

భా : ఓ. అలా చెప్పండి. ఎం. ఏ. ఏ సబ్జక్టు?

సు : పాలిటిక్సు.

భా : ఓహో. పాలిటిక్స్ సుదర్శన్‌రావంటే మీరేనా? మీగురించి మా స్నేహితులు చాలామంది చాలా విషయాలు చెప్పారులెండి.

సు : ఓ, అలాగా!

భా : దయచేసి మీదారిన మీరుపొండి.

సు :
కో : } ఆఁ!

భా : కాలేజీలో ఓ అమ్మాయితో వ్యవహారంజరిపి రస్టికేటైంది చాలక మళ్ళీ వెర్రివేషాలకి దిగావా? జాగ్రత్త. దూరంగా పో, లేకపోతే అరెస్ట్ చేయిస్తాను.

[కోమల, సుదర్శనరావు దిగ్భ్రాంతులై అతనివైపు చూస్తారు.]

సు : ఎవడ్రా నువ్వు? ఇష్టంవచ్చినట్టు పేలుతున్నావ్! తాగావా!

భా : రికార్డుబ్రేక్ చేశాట్ట. ఎందులో? దుర్బుద్ధుల్లోనా? అమ్మాయిలని మోసం చెయ్యటంలోనా?

సు : షటప్. కావాలంటే సర్టిఫికేట్ చూపిస్తాను. కోమల గారూ, వీడిమాటలు నమ్మకండి.

భా : ముందు అవతలకి పోవోయ్!

సు : ఏమిటి నీ దౌర్జన్యం? నాటకం కంపెనీలోచేరి తాగుడూ తిరుగుడూ అలవాటుచేసుకుని మతిపోగొట్టుకున్నావా? ఓ, ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. మొన్న తాగి రోడ్డుమీద దొర్లుతుంటే పోలీసులు పట్టుకుపోయింది నిన్నేకదూ?

భా : మొన్న పట్టుకుంటే అప్పుడే ఎట్లా వొదిలారోయ్ వాజ? అబద్ధంఆడినా అతికినట్లుండాలి.

సు : (తెల్లబోయి) ఔను. నీలా అబద్ధాలు ఆడటం ఎవరికిచేతవుతుంది లే.

భా : అబద్ధాలాడటానికి నాకేం ఖర్మ?

సు : నాకుమాత్రమేం అవసరం? మి. మిస్ కోమలా......ఈ తాగుబోతుని అవతలకి పొమ్మనండి......

భా : కోమలగారూ, ఈ మోసగాడిని దూరంగా పొమ్మనండి.

[కోమల బెదిరిపోయి ఇద్దరివైపూ చూస్తుంది]

సు : గెటౌట్ యూ ఫూల్.

భా : యూ గెటౌట్.

సు : నెట్టేస్తాను. (షర్టు చేతులు పైకి మడుస్తాడు)

భా : గెంటేస్తాను. (లాల్చీ చేతులు మడుస్తాడు)

[పోర్టర్ ప్రవేశం]

పో : ఆగండి! చదువుకున్నవాళ్లూ, చెయ్యీ చెయ్యీ కలుపుతున్నారా? ఎవరన్నా వింటే నవ్విపోతారనికూడా ఆలోచించరేం పెద్దమనుషులు? (గర్జిస్తూ) బయటికి పడతారా? స్టేషన్ మాస్టర్ కి రిపోర్టు చెయ్యమంటారా? ఏం? వినిపిస్తోందా?

[ఉగ్రుడై ద్వారంవైపు చెయ్యి చూపిస్తాడు. ఒకక్షణం తటపటాయించి ఇద్దరూ బయటికి వెళ్లిపోతారు.]

కో : ఇన్‌స్పెక్టరు గారూ, ఏమిటండీ ఇదంతా?

పో : నేను ఇన్‌స్పెక్టర్ని కాను...కాను...కాను.

కో : పోనీలెండి, ఎవరో ఒకరు......ఈ గందరగోళమంతా ఏమిటండీ?

పో : నాటకం. స్వలాభపరుల వయుక్తుల ప్రహసనం.

కో : నిజంగా వాళ్లిద్దరూ అలాంటివాళ్లేనా?

పో : ఎలాంటివాళ్లు?

కో : ఒకడు తాగుబోతట; ఒకడు మోసగాడట.

పో : ఏమో, వాళ్లకే తెలియాలి.

కో : ఇద్దరూ పొరపడ్డారేమోనండీ, పాపం.

పో : పోటీదారులు కదూ, బుద్ధి పూర్వకంగానే పొరబడ్డారు లెండి.

కో : ఏమిటి మీర నేది?

పో : ఎంత చదువుకుంటే ఏం? ఏం సాధిస్తే ఏం? కొంతమంది మనుషులు ఎంత నీచస్థితికైనా దిగజారతారు. మిమ్మల్ని సొంత ప్రయోజనం కోసం అడ్డుపెట్టుకోటానికి వాళ్ళు ప్రయత్నించారంటే నమ్ముతారా?

కో : నిజమా?

పో : కటిక నిజం.

లా : ఏం చేయాలో నాకేం తోచటం లేదండీ.

పో : (నిర్లిప్తంగా) పేపర్ చదువుకోండి. (కింద పడివున్న పేపర్ తీసి అందిస్తాడు. ఆమె యాంత్రికంగా తీసుకుంటుంది. అతను వెళ్లిపోతూ ఉంటాడు. చేతిలో పేపరు చూసుకుని ఆమె కలలోంచి మేలుకున్నట్టు దిగ్గున లేచి "ఇన్‌స్పెక్టరు గారూ" అని పిలుస్తుంది. కాని ఈ లోపున అతను వెళ్లిపోతాడు. ఆమె నిస్పృహతో కుర్చీలో కూలబడి పేపరు తిరగేస్తూ ఆలోచిస్తూ ఉంటుంది. కొన్ని క్షణాలు అలాగే గడిచిపోతాయి. పోర్టర్ మళ్లీ ప్రవేశిస్తాడు.)

మీ నాన్నగారొస్తున్నారు అమ్మాయి గారూ.

లా : (భయంతో) నాన్నగారా! (దీనంగా, గద్గదికంగా) ఎలా? ఇన్‌స్పెక్టరు గారూ, నన్ను రక్షించండి. యేం చెయ్యమంటే అదే చేస్తాను. మా నాన్నగారికి ఎలాగో సర్ది చెప్పండి. నాకు భయంగా ఉందండీ. నాకేం తోచటం లేదండీ.

పో : ఉష్, మాట్లాడకండి. ఆ బాత్‌రూంలో కెళ్లి, తలుపేసుకోండి ముందు. ఊఁ...వెళ్లండి...త్వరగా. (కోమల గబగబ బాత్‌రూంలో కెళ్ళి తలుపేసుకుంటుంది. రంగనాధం గారు ప్రవేశం. యాభైఏళ్ళ వయసు. బట్టతల. ధోవతీ షరుకండువా ధరించి ఉంటాడు. కళ్ళజోడు ఉంటుంది.) నమస్కారం బాబూ!

రం : నమస్కారం.

పో : నన్ను గుర్తుపట్టలేదా బాబుగారూ?

రం : (పరకాయించి చూసి) ఆఁ...ఆఁ...ఎందుకు గుర్తుపట్టలేదూ? (ఆలోచిస్తూ) కులాసాగా ఉంటున్నావా?

పో : చిత్తం.

(సలాము చేస్తాడు. పోర్టర్ నవ్వుకుంటాడు.)

రం : ఇదిగో, పోర్టర్.

పో : బాబూ. (నవ్వుతాడు)

రం : నవ్వుతావేం? నిన్ను...నిన్ను......నిజం చెప్పాలంటే ఎక్కడ చూశానో జ్ఞాపకం లేదోయ్. ఈ దుస్తుల్లో నిన్ను చూడలేదు. ఈ పనిలో కొత్తగా చేరావా?

పో : చిత్తం. తమరు ఇలా దయచేశారేం?

రం : పోర్టర్....అంతా తమాషాగా ఉందోయ్!

పో : ఏమిటి బాబూ?

రం : క్లబ్బునించి ఇంటికిరాగానే ఎవరో టెలిఫోన్ చేశారు. అర్జంట్‌గా స్టేషన్‌కి రమ్మనీ, లేకపోతే చాలా ప్రమాదమనీ. వెంటనే కార్లో వచ్చేశాను. కాని స్టేషన్‌మాస్టర్ని అడిగితే తనకేమీ తెలియదన్నాడు. విచిత్రంగా ఉంది.

(భాస్కరరావు ప్రవేశం.)

భా : నమోనమః రంగనాధంగారూ.

రం : నమస్తే. క్షమించండి. తమరి పేరూ?

భా : రంగభాస్కర వెంకటభాస్కరరావు పేరు విని ఉంటారు.

రం : ఆఁ...ఆఁ...పరిచితమైన పేరే. కూర్చోండి. ఏమైనా విశేషం ఉందా?

భా : ఇలా రండి. ఒక్కమాట.

రం : (దగ్గరికి వస్తూ) మీరేనా ఫోన్ చేసింది?

భా : ఫోనా?

రం : నేను క్లబ్బునుంచి ఇంటికి రాగానే ఎవరో ఫోన్ చేశారండీ.

భా : (పాలిపోయి) ఆఁ...ఆఁ...నేనే చెయ్యమన్నానండీ.

రం : అదేం ఫోన్ చెయ్యటమండీ? హాస్యంగా ఉందా? ఎవరో ఏమిటో, ఎందుకో ఏమీ చెప్పకుండా ప్రమాదం అర్జంటుగా రావాలంటే గుండె ఆగిపోదండీ.

భా : (ఆలోచించి ఏదో గ్రహించినట్టు) వాళ్ళెవరో గాభరాగా అలా చేసిఉంటారండీ. క్షమించండి.

రం : అసలు సంగతేమిటి? త్వరగా చెప్పండి.

భా : ఆ పాలిటిక్స్ సుదర్శన రావున్నాడే...

రం : ఎవరతను?

భా : మీకు తెలియదా? ఉన్నాడులెండి ఒక పరమ దౌర్భాగ్యుడు. దగాకోరు. వాడు మీ అమ్మాయిని బుట్టలో వేసేశాడండీ.

రం : ఆఁ- ఏమిటి అపవాదు! ఆధారాలతో మాట్లాడుతున్నారా, లేక...

భా : అలా కోప్పడకండి. మీ మేలు కోరేవాడినే నేను. సమయానికి నేను అడ్డుపడ్డానుగాని లేకపోతే ఏమయ్యేదో!

రం : ఏం జరిగిందో త్వరగా చెప్పండి.

భా : ఇద్దరూ మద్రాస్ చెక్కెయ్యాలని ప్లాను వేశారండీ.

రం : ఆఁ- ఇదీ అబద్ధమైతే...?

భా : శాంతించండి మరి. ఇద్దరూ స్టేషన్లోనే ఉన్నారుగా. నేను సమయానికి రక్షించకపోతే...

రం : ఏదీ మా అమ్మాయి?

భా : (చుట్టూ చూసి) ఇ...ఇక్కడే ఉండాలి. లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో ఉందేమో చూసివస్తాను. క్షణంలో వస్తాను, ఉండండి. (నిష్క్రమిస్తాడు.)

(రంగనాధం అశాంతితో పచార్లు చేస్తూఉంటాడు. సుదర్శన్‌రావ్ ప్రవేశం.)

రం : ఛీ! ఎంత అవమానం!

సు : నమస్తే సర్.

రం : నమస్తే...నమస్తే...ఏం కావాలండీ?

సు : అయాం సుదర్శన్‌రావ్ సర్.

రం : సుదర్శనరావా!

సు : ఎస్ సర్. ఎం. ఏ. పాలిటిక్స్ ఫస్ట్‌క్లాస్ ఫస్ట్‌రాంక్ మద్రాస్ యూనివర్శిటీ రికార్డు బ్రేక్ చేశానండి.

రం : (దగ్గిరికివచ్చి) యూ స్కౌండ్రల్, మా అమ్మాయేది? (షర్ట్ కాలర్ పట్టుకుంటాడు).

సు : మీ అమ్మాయా? (గుర్తు చేసుకుని) ఉందిసార్-ఉంది.

రం : ఎక్కడుంది?

సు : ఉండండిమరి, చూపిస్తాను. పుణ్యానికిపోతే పాపం ఎదురైందిట. మేలుచేసినవాడికి ఇదా మీరుచేసే ప్రత్యుపకారం?

రం : మేలు చేశావా?

సు : సమయానికి నేను లేకపోతే ఆ అమ్మాయి గతేమైఉండేదో పాపం. ఆ రంగభాస్కర వెంకటభాస్కర రావు ఉన్నాడే...?

రం : ఆం...వాడేం చేశాడంటావ్?

సు : మిస్ కోమలతో మ్యారేజ్ ఊడాయించటానికి సిద్ధమైనాడండీ.

రం : ఏమిటీ? నిజమా నువ్వు చెప్పేది?

సు : అక్షరాలా! మిస్ కోమలనే అడగండి. ఫస్ట్ క్లాస్ ఫస్ట్ రాంక్ సర్ నాది. క్లాస్ వన్ ఆఫీసర్నై పోతున్నాను. అబద్దం చెప్పటానికి నాకేం ఖర్మం?

రం : అయితే ఇందాక ఫోన్ చేసింది మీరేనన్నమాట.

సు : ఫోన్?...ఆఁ...ఆఁ...ఎస్ సర్. నేనే చేశాను.

రం : మా అమ్మాయేది?

సు : (చుట్టూ చూసి) ఇప్పటిదాకా ఇక్కడే ఉండాలండి.

రం : ఇప్పుడు ఎక్కడ ఉందని అడుగుతున్నాను.

సు : ఎస్...సర్...చూస్తాను. (వెళ్ళబోతాడు.)

[భాస్కరరావు ప్రవేశం]

భా : ఎక్కడా కనిపించలేదండీ

రం : కనిపించలేదా? ఏమయ్యా సుదర్శనరావ్?

సు : ఆ ఇమిటేషన్ రంగభాస్కర్ నే అడగండి సార్.

రం : ఏమయ్యా భాస్కరరావు?

భా : చెప్పాను గదండి. ఆ ఫస్ట్ క్లాస్ ఫస్ట్ రాంక్ మోసగాడే ఎక్కడో దాచివుంటాడు.

రం : ఏమిటీ న్యూసెన్స్. ఇద్దర్నీ అరెస్టుచేయిస్తాను, జాగ్రత్త. అమ్మాయిని ఎక్కడ దాచారో చెప్పండి. పోర్టర్, ఇన్స్పెక్టర్ గార్ని పిలుచుకురా.

సు : నిజంగా నేనేం ఎరగను సార్.

భా : నా మాటలు నమ్మండి. నేను నిర్దోషిని.

సు : రేపొద్దున నేను ఇంటర్వ్యూకి వెళ్ళాలండి. నన్ను వదిలెయ్యండి.

భా : నాక్కూడా రేపే ఇంటర్వ్యూ ఉందండి.

రం : ఈ వేషాలేం సాగవు. ఊఁ,...చెప్పండి, త్వరగా. లేకపోతే జైలు తప్పదు.

(భాస్కరరావు, సుదర్శనరావ్ ఒకరినొకరు ఉరిమిఉరిమి చూసుకుంటారు.)

పో : (అందరి దగ్గరికివచ్చి) నేను చెబుతానండీ.

రం : ఇందులో నువ్వూ ఉన్నావూ? ఊఁ. చెప్పుత్వరగా.

పో : వాళ్ళిద్దర్నీ వెంపలేసుకోమనండి ముందు.

భా :
సు : } మేమేం చేశాం? అడిగితే సహాయం చేస్తాం అన్నాం. అదేనా మా తప్పు?

పో : సహాయం చేస్తాం అని ముందు కురికేపాటి మగతనముందా మీకు? సిగ్గులేదూ? ఒక అబల, అసహాయస్థితిలో కొండంత ఆశతో ఒక్క చిన్న సహాయం అడిగితే, అది ఆధారం చేసుకుని ఆమెద్వారా సొంతప్రయోజనాలు సాధించుకోవాలని అధమాధమస్థితికి దిగజారిపోయిన మీరు అసలు మనుషులేనా? ఏమండీ రంగభాస్కర్ గారూ, మిమ్మల్నే క్లాస్ వన్ ఆఫీసర్ గారూ, మాట్లాడరేం? మీ గుట్టు నాకు తెలిసిపోయిందనా?

[ఇద్దరూ కొరకొర చూస్తారు పోర్టర్ వైపు.]

మీకు టెలిఫోన్ చేసింది నేనేనండీ రంగనాథం బాబు గారూ. పైగా అదో అబద్ధం ఆడారు వీళ్ళు.

రం : ఏమిటిదంతా? నాకు అగమ్యగోచరంగా ఉంది. మా అమ్మాయి వీళ్ళని సహాయం అడిగిందా. నా చిట్టితల్లికి నేను ఉండగానే ఆ గతి పట్టిందా?

పో : అవును. ఇతరుల మన స్తత్వాన్ని అర్థంచేసుకోకుండా తా బట్టిన కుందేటికి మూడే కాళ్ళంటుంటే ఏమవుతుంది మరి. ఇలా అన్నందుకు క్షమించండి.

రం : నా చిట్టితల్లి మనసు నాకు తెలియకుండానే కష్టపెట్టానా? పోర్టర్, నువ్వు పోర్టర్వి కావు—ఎవరివో తరవాత ఆలోచిద్దాం-ముందు మా అమ్మాయి ఎక్కడవుందో చూపించు. దానికేది కావాలంటే అది ఇస్తాను.

[బాత్ రూమ్ తలుపు తెరుచుకుని కోమల ప్రవేశం.]

కో : నాన్నా.

[పోర్టర్ తప్ప అందరూ దిగ్భ్రాంతులౌతారు.]

రం : అమ్మా.

కో : నన్ను క్షమించు నాన్నా.

రం : పరవాలేదమ్మా! ఇలారా!

పో : మీ అమ్మాయిని బి. ఏ. లో చేర్పించండి రంగనాథం బాబుగారూ. దానికోసమే ఇంత హడావిడి జరిగింది.

రం : ఓ యెస్, దానికేం. ఇంతే గదా!

పో : మరి నేను సెలవుతీసుకుంటాను (వెళ్ళబోతాడు.)

రం : థాంక్స్...అన్నట్టు—పోర్టర్...సారీ...నిన్ను నేను గుర్తుపట్టనేలేదు.

పో : (ఆగి) పోల్చుకోండి (వేషం సరిచేస్తాడు.)

రం : నువ్వా శ్యామసుందరం!

[అందరూ దిగ్భ్రాంతులౌతారు.]

భా :
సు : } : ప్రఖ్యాత సినిమానటులు శ్యామసుందర్ గారా!

రం : ఇదేమిటోయ్, ఈ వేషమేమిటి?

పో : నా కొత్త చిత్రంలో హీరో పోర్టర్ అండీ. నా సంగతి

మీకు తెలుసుకదూ? పాత్ర ధరించే ముందు ఆ పాత్ర గురించి క్షుణ్ణంగా తెలుసుకోటానికి ప్రయత్నిస్తాను. అందుకే ఈ వేషం.

రం : (దగ్గిరకొచ్చి భుజంమీద చెయ్యేసి) భేష్! నటుడివంటే నువ్వోయ్. అమ్మాయ్, కోమలా, మద్రాసులో హైకోర్ట్ లాయర్ ఒకాయన నాకు బాల్యస్నేహితుడనీ, ఆయన కుమారుడు గొప్ప నటుడనీ నీతో చెప్పేవాడిని కదూ, ఆ అబ్బాయే ఇతను. శ్యామసుందరం.

కో : నమస్తే శ్యామసుందరంగారూ.

పో : నమస్తే – అహఁ – నమస్కారమండమ్మాయిగారూ.

కో : (నవ్వి) మీ చిత్రాలన్నీ చూసినా మిమ్మల్ని గుర్తుపట్టలేదండీ.

పో : చిత్రాలేగాని మనిషిని చూడలేదు కదండీ.

రం : నీ మేలు మర్చిపోలేనోయ్.

పో : ఎంతమాట. నేను చేసిందేముందండీ.

[ఇంజను కూత వినిపిస్తుంది. భాస్కరరావు, సుదర్శనరావూ ఒకరివైపొకరు చూసుకుని ఎవరి హోల్డాలు వారు ఎత్తలేక ఎత్తుతూ ఉంటారు.]

మీ బరువే మీరు మొయ్యలేరు. ఇంక ఇతర్ల బరువేం మోస్తారు, పాపం. (వాళ్ళకి సహాయం చేస్తాడు. తర్వాత కోమల సూట్ కేస్ తీసుకుంటాడు.)

కో : మీరా? ఇలా ఇవ్వండి.

పో : పరవాలేదు. బరువులు మొయ్యటం అలవాటయిందిగా. రండి బాబుగారూ, పోదాం. గుడ్ బై మిస్టర్ రంగ భాస్కర్ – గుడ్ బై మిస్టర్ సుదర్శనరావ్!

[ముగురూ నిష్క్రమిస్తారు. హోల్డాల్ ఈడ్చుకుంటూ భాస్కరం, సుదర్శనరావ్ నిష్క్రమిస్తుండగా తెర.]

---

# వరుణగ్రహప్రభావము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

"నా మేనకోడలిజాతకమండీ ఇది. అంతా నిశ్చయమైన పెండ్లి విఘాతిమైనది. వరుడు మోసముచేసి వేరెపెండ్లి చేసుకొన్నాడు. దయచేసి జాతకము చూడండి. పెండ్లిఫలము ఎప్పుడు ఉన్నదో?"

కొన్ని సంవత్సరములకు పూర్వము ఒకనాడు ఉదయమున నాగటికి దూరదేశపు పెద్దమనుష్యుడొకవ్యక్తి వచ్చి కూర్చుండి, జాతకచక్రము నొకదాని నిచ్చి, అడిగినప్రశ్న ఇది. ఈ క్రిందనున్నదే అనిరయన రాశి కుండలి :—

| | | | |
|---|---|---|---|
| | | గు | కే |
| ల<br>చ | నిరయన రాశి<br>కుండలి | | శు<br>శ |
| | | | బు |
| రా | | కు | ర |

జన్మకాల గురుమహాదశాశేషము 12 సం॥ 4 నెలలు, 17 దినములట! జన్మదినము, జన్మకాలము, జన్మస్థానము మున్నగు వివరములు అతని నడిగి తెలుసుకొని గుర్తు వేసుకొంటిని. సాయన స్పష్టచక్రము గుణించుటకై పథకగ్రంథములను తీసుకొని పని ప్రారంభించునంతలో అతడు,

"ఇప్పుడు శనిమహాదశలో బుధభుక్తి. శని లగ్నాధిపతి; సప్తమములో ఉండే గ్రహము బుధుడు. వివాహప్రయత్నము భంగమగుటకు కారణమేమి?" అని పూర్వపక్షము చెత్తెను.

"బుధునికి అష్టమాధిపత్యదోషము కొంత లేదా?"

అతని ధోరణిలోనే ప్రతి ఇచ్చితిని.

"అయితేమాత్రము? సప్తమాధిపతి రవితో పరివర్తన యోగమున్నదే."

"కొంత ప్రయాసకు తరువాత మంచిఫలము రావచ్చును."

"నిశ్చయమైన వరునితోనే పెండ్లి కాగలదా? వేరేవరుడా?"

"అతని జాతకము తెచ్చినారామరి?"

"జాతకము లేదండీ! నిర్భాగ్యుడు. మోసముచేసి మా అమ్మాయికి భంగతెచ్చినాడు. పోనియ్యండి. ఆమెకు పెండ్లి ఫల మెప్పుడున్నదో చూడండి."

"స్పష్టకుండలి సిద్ధమగుటకు కొంతకాలము పట్టును. సాయంకాలమో, ఉదయమో, వచ్చినచో, తోచినది చెప్పగలను." అంటిని. కార్యస్థానమునకు వెళ్లుటకై సన్నాహము కావలసియుండెను. "సరే." అని అతడు వెళ్లినాడు. ఆ సాయంకాలము సాయనచక్రము సిద్ధపరచితిని. జాతకము చాలా ప్రబలమైనదిగా చూపట్టినది. త్వరలోనే వివాహము జరుగు సూచన కానవచ్చెను. కాని, ఆ పెద్ద మనుష్యుడు మరల రాలేదు. ఎందుకోమరి? శకునము సరిపోలేదు కాబోలు!

మనవారిలో అనేకులకు అవిచారమణీయ మగు అభిప్రాయమొకటి పాదుకొనియున్నది. (1) రాశికుండలి, (2) దశాశేషము, ఈ రెండు ఉన్నచో, జాతకఫలములు చెప్పుటకు ఇతరసామగ్రి ఏమియూ అక్కరలేదని. ఈ అల్పసామగ్రితోనే అడిగిన ప్రశ్నలకు తడుముకోకుండ జవాబులు చెప్పు మహానుభావులు సమృద్ధిగా మన్నారు కనుక, సామాన్యజనులలో ఇట్టి అభిప్రాయము ఊడలు పారినది. జన్మకాలము, జన్మస్థానము, మొదలగువానిని అడిగినచో, వారిదృష్టిలో శాస్త్రజ్ఞానము మట్టమనియే. సాధారణముగా, ఇప్పటి కాలమున జ్యోతిశ్శాస్త్రమునకు పట్టినగతి ఇది. కొంత అవధి కావలయునంటినికదా? ఆ పెద్దమనుష్యునికి ఈ పద్ధతి రుచించలేదు కాబోలు!

పోనిత్తము. ఆమరుసటిదినము సాయంకాలమున అయిదు గంటలవేళ నేను కార్యస్థానమునం దుండగా, ఆ గ్రామపు పురపాలక సంస్థాధ్యక్షుడు ఆత్రముతో వచ్చి,

"ఇంకా పనిముగియలేదా?" అనెను. అతడు నాకు చిరపరిచితుడు. కూర్చుండమని అతని కొక కుర్చీ చూపితిని.

"అయిదు నిమిషాలు." అని, మరల.

"ఏదో ఆత్రము చూపట్టుచున్నదే? ఏమి విశేషము?" అని అడిగితిని.

"ఊరిలో గొప్ప విశేషము జరుగుచున్నదే! వినలేదా?"

"ఏమది?" ఆశ్చర్యంతో ప్రశ్నించితిని.

"మా రావుగారికి ఈలోగానే వివాహమైనదికదా?"

"అవును. 'టీపార్టీ' ఇచ్చినాడు కూడ. ఇప్పుడేమి?"

"అదే గొప్ప రామాయణము!" అని కుర్చీలో కూర్చుండ వచ్చినాడు. పురపాలక సంస్థకు సంబంధించిన ఉద్యోగి ఆ రావు

ముప్పది వసంతములు చూడని వయస్సు. చన్నె మట్టమైనా, చక్కని ఆకారసౌష్ఠవము, దేహపాటవము కల వ్యక్తి అతడు. అమాయక సులభశీలుడు; సాధువు.

కార్యస్థానపు పని ముగించి కాగితముల సవరించుచు, "ఏమండి విశేషము?" అంటిని. అతడు చెప్పిన కథ సారాంశ మిది.

వివాహమునకు తగిన కన్యకను వెదకుటకై దాదాపు మూడు నెలలనాడు సెలవుతీసుకొని రావు స్వదేశమునకు పోయినాడు; అచట ఏదో గ్రామములో స్వజాతికన్యక నొక దానిని చూచినాడు. ఆ కన్యకు సుమారు 18 వయస్సు. అందము బాగున్నది. దేశాంతరములో వ్యాపారము చేయుచు గొప్ప ఆర్థికసౌకర్యముతో నుండిన తండ్రి చిన్నతనమందే గతించియుండెనట. తరువాత ఆశ్రయము లేక తల్లి కూతురుతో స్వదేశమునకు వచ్చి తన అన్న ఆశ్రయములో నిలిచి కూతురును పెంచుచు వచ్చినది. ఆమెకు ఈ కూతురు ఒక్కతే సంతానము. పరిస్థితుల నన్నియు గమనించి రావు ఆ కన్యకను సమ్మతించినాడు. కన్యక సహా సమ్మతించినది. వెంటనే శుభదినము చూచి నిశ్చయతాంబూలముల పంచినారు. ఆ కన్యకకు రావు కొంత సొమ్ము, వస్త్రములు ఇచ్చినాడుకూడ. నెలలోగా ముహూర్తము నేర్పరచి వ్రాతుననియు, వివాహము తాను ఉద్యోగము చేయు గ్రామములోనే జరుగవలెననియు, రావు చెప్పగా, కన్యకపక్షమువారు సమ్మతించినారు. తరువాత, తన బంధువుల నాహ్వానించుటకై రావు స్వగ్రామమునకుపోయి వారలకు ఈ వృత్తాంతము తెలుపగా, వారి హృదయములలో ఆవాలు, మిరియాలు నూరినట్లయినది. తమ ఇండ్లలో రత్నాలవంటి కన్యక లుండగా, పోయి, పోయి, ముక్కు ముఖమూ తెలియనిచోట సంబంధము చేయుటకు పూనుకొన్నందుకు వారందరు అతనిని పట్టి తూలనాడినారు. మాట ఇచ్చినానని అతడు చెప్పగా, వారిలో బుద్ధిమంతులు కొందరు ఆ కన్యక ఇంటివారికి కులములో మచ్చ ఉన్నదని చెప్పి గేలిచేసినారు. మోసపోయి ఇచ్చిన మాటకు విలువలేదని ఆ అమాయకునికి నచ్చచెప్పి, వెంటనే ఆ గ్రామములో నున్న ఇరువది సంవత్సరముల ప్రాయముగల చక్కని కన్యక నొక దాని నతనికి చూపినారు వారు. అందములో, చన్నెలో, మునుపటి కన్యకంటె మెరుగుగా నున్న పడుచును చూచి రావు మురిసిపోయినాడు. తోడనే 'తదేవలగ్న'ముగా ఆ కన్యక నిచ్చి పెండ్లిచేసి, ఆమెను అతని వెంటనే పంపినా రాయుక్తిశాలులు. భార్యాసమేతుడై వచ్చి 'పార్టీ' ఇచ్చి, నూతన వధువుతో ఆనందించుచున్నాడు రావు మహాశయుడు.

నెల గడిచినది. మొదటి కన్యక ఇంటివారికి ఈ సమాచారమే తెలియదు. లగ్నపత్రిక రానందున, వారు జాబులు వ్రాసినారు. కాని రావు వారికి ప్రతి ఈయలేదు. వారి పక్షమునుండి ఎవరో ఇచటికే వచ్చి విచారించగా, కులములో మచ్చయున్నదని తెలిసి వేరే కన్యకను వివాహము చేసుకొంటినని రావు చెప్పినాడు. నాల్గు దినములనాడు ఆ కన్యకతో ఆమె తల్లి, మేనమామ ఈ గ్రామమునకు వచ్చి సత్రములో బసచేసినారు. పెద్దమనుష్యులను కలిసి మేనమామ పంచాయతీచేసి, గత్యంతరము లేక, "అయినదేమో అయినది. నా మేనకోడలిని సహా పెండ్లిచేసుకోండి." అని రావును బలవంతముగా ప్రార్థించినాడు. కాని, రావు సమ్మతించలేదు. పెద్దమనుష్యులు ఎవరు చెప్పినా, "నసేమిరా." అక్కరలేని వారిని ప్రార్థించి ఫలము లేదనియు, వేరుస్థలములో ప్రయత్నము చేయుట యుక్తమనియు పంచాయతీవారు కన్యక మేనమామకు హితము బోధించినారు. చేయునది లేక, అతడు ప్రయాణమునకు సిద్ధపడి, నిన్న రాత్రి రైలుకు వెళ్లుటకై జట్కాబండిని పిల్చుకొనగా, అతని మేనకోడలు "నేనురాను మామయ్యా! మీరు వెళ్లండి." అని మెల్లగా చెప్పినది. తల్లి, మేనమామ సహా, ఎంతో చెప్పినా, "ఎత్తిన కాలు వెనుకకు తీయను. ఏమైనా, సరే. మీరు వెళ్లవచ్చును." అని ఖండితముగా ఆ కన్యక ప్రతి ఇచ్చినదట! నిరుత్సాహియై మేనమామ—అతనికి సెలవు ముగిసినది—స్వగ్రామమునకు వెళ్లగా, [illegible]ముతో కన్నీరు కార్చుచు తల్లిమాత్రము సత్రములోనే నిలచినది. "ఏమి చేస్తావమ్మా?" అని తల్లి అడుగగా, "నాకు తెలియదు. భగవంతుడు పెట్టినట్లు జరుగును. నీవు చింతించక నిద్రపొమ్మా." అని ఆ చిన్నది చెప్పినదట. ఇది చూచి సత్రములో నున్నవా రందరు ఆశ్చర్యపడినారు.

నిన్న రాత్రి 12 గంటలవరకు జరిగిన కథ ఇది. నేడు తెల్లవారి అయిదు గంటలకు పనికత్తె రావుగారి ఇంటిముంగిటికి వెళ్ళగా, ఇంటి మెట్లమీద అవకుంఠనవతియగు తరుణి యొక్కతె కూర్చుండి యుండినది. 'ఎవరు' అని ఆ పనికత్తె అడుగగా, ఆమెకు కొంతదారి వదలి, "నీ పని నీవు చూచుకోమ్మా! నేనెవరయితే నీకేమి?" అని ఆ వ్యక్తి ప్రతి ఇచ్చినది. మూడు దినములుగా జరుగుచుండిన కథ పనికత్తెకు తెలుసును. కనుక, ఆ తరుణి ఎవరో ఊహించుట పనికత్తెకు కష్టముగా నుండలేదు. ఇది ఏమో ప్రమాద మని ఆమె భయపడి తలుపుతట్టి బెదురుపాటు కంఠస్వరముతో పిలువగా, సుఖస్వప్నములో నుండిన రావుగారిభార్య మేలుకొని లేచివచ్చి తలుపు తెరచినది. పనికత్తె తటాలున లోనికిపోయి తలుపులు మూసి గొళ్లెము బిగించి, యజమానురాలితో గుసగుస ఏమో మాటలాడినది. తరువాత ఆ తలుపు తెరచినవారు లేరు. రావుగారు బైట రాలేదు. పెరటి వాకిలిగుండా ఎప్పుడో జారుకున్నాడు. సూర్యోదయానంతరం కథ బైటికి పొక్కగా, జనులు గుంపులు గుంపులుగా వచ్చి ఆ అవకుంఠనవతిని చూచిపోసాగినారు. వీధివాకిలి మెట్లమీద నిశ్చలముగా, ప్రశాంతముగా, గంభీరముగా, తలవంచి కూర్చుండి యున్న ఆ చిన్నదానిని చూచి, జాలిగుండెగల ఇరుగుపొరుగు స్త్రీలు కొందరు తమ యింట కాఫీ పుచ్చుకొని వత్తువు రమ్మని పిలువగా, తనకు అక్కరలేదని వినయముతో ప్రతి యిచ్చినదే కాని, ఆ ధైర్యశాలిని ఆ స్థలమునుండి యించుకంతయినా కదలినది కాదు.

మధ్యాహ్నము కావచ్చినా, కటికఎండలో అట్లె కూర్చుండి యున్నదే కాని, ఆమె స్థితిలో మార్పు రాలేదు. ఎవరు విచారించినా, "మీపని మీరు చూచుకోండి." అనుటే ఆమె ప్రత్యుత్తరము. పొద్దు తిరిగినా, ఇంటితలుపులు తెరచినవారు లేరు. రావుకాని, అతని భార్యకాని, జాడచూపలేదు. స్నానపానములు లేక, భోజనము లేక, ఆచిన్నది చురుచుర కాయుచున్న ఎండలో మాడుచుండగా చూచి సహించలేక, చుట్టుపట్ల గృహిణులు కొందరు భోజనము చేసివత్తువు రమ్మని ఎంత బ్రతిమాలినా,

"నాకు ఆకలి కాలేదండి" అని ఆమె సమాధానము చెప్పినది. ఇంటి వారు సత్కరించని పరిస్థితులలో ఇచట ఉపవాసము చేసి ఏమి ప్రయోజన మని కొందరు వాదించగా, "వారు సత్కరించినా, మానినా, వాస్థానములో నేనున్నాను. నాకేమీ కొదవ లేదు." అని చల్లగా ఆమె ప్రతి ఇచ్చినదట! ఏమి సాహసమో—ఆమెది? తన అవస్థనుగురించి ఎవరితో నైనా ఏమీ చెప్పలేదు. కంట తడి పెట్టదు, ముఖములో విషాదము లేదు. ఉస్సురనదు. ఇప్పటివరకు పరిస్థితులలో మార్పు రాలేదు. ఆ మెట్లమీద ఆమె అట్లనే యున్నది. అమ్మవారి ఉత్సవమును చూచినట్లు జనులు గుంపులుగా వచ్చి ఆమెను చూచి పోవుచున్నారు. ఊరిలో ఎచ్చట, ఎవరినోటిలో వినినా, ఇదే కథయే. రావుగారి అజా పాజా మాత్రము కానరాదు. ముందేమో?

ఇది నామిత్రుడు తెలిపినకథ. ఆ అమ్మాయి జాతకము జ్ఞప్తికి రాగా, ఎంతో సంతోషమయినది.

"రావుగారి పెండ్లిచరిత్ర కొంతవిన్నాను. కాని, నేటికథ నాకు తెలియదు." అంటిని.

"ప్రాయోపవేశము చేయుచున్న ఆ చిన్నదానిని చూచుట కష్టముగానున్నది. సమాధానమైనా చెప్పక రావు తప్పించుకొని తిరుగుచున్నాడు. రాండి. పోయిచూతాము."

నామిత్రుడు లేవగా, నేనతనిని వెంబడించితిని. సూర్యాస్తమానకాలము. రావుగారింటిముందు జనులు మూగియుండిరి. ఆ సమీపమందే యున్న ఒక కార్యస్థానపుశాలలో మేము కూర్చుండగా, కొందరు పౌరప్రముఖులు, చుట్టుపట్ల ఇండ్లవారు కొందరు సహా, వచ్చి చేరినారు. ఆ చిన్నదాని నిరాహారదీక్షను గూర్చి వచ్చిన వారిలో పలువురు సంతాపమును వెల్లడించిరి. కొందరు ఆమె మన స్థైర్యమును పొగడినారు. మరికొందరు రావుగారి పిరికితనమును తూలనాడినారు. ఆమెను రమ్మని నామిత్రుడు ఎవరితోనో చెప్పి పంపగా. "నాభర్తగారి ఆజ్ఞలేనిదే, వారు లేనితోటికి రాజాలను." అని ఆమె చెప్పి పంపినది. అతనిని వెదకి తీసుకొని రండని తగిన వారిని కొందరిని పంపితిని. రాత్రి ఏడుగంటలవేళకు రావు సర సర శాలలోనికి వచ్చి, కోపముతో, చుర చుర చుట్టుచూచి,

"ఏమి ఇది? నన్ను అవమానపరచుటకా, సన్మానము" అనెను.

అతనిని మంచిమాటలతో శాంతపరచి, సమీపమునందుండు కుర్చీలో కూర్చుండచేసి, ఇట్లంటిని:

"ఇతరవిషయములతో నాకు అవసరములేదు. అది మీ ఇష్టము. మూర్ఖురాలనండి, వివేకము లేదనినండి, మిమ్మల్లను నమ్ముకొని వచ్చిన ఆ చిన్నది ఇతర రక్షకులు లేక మీ ఇంటిమెట్లమీద తిండి తీర్థములులేక కటిక ఎండలో మాడుచున్నదే! ఆమెను సమాధాన పరచు బాధ్యత మీది కాదా? ఇంటిలోనికి పిలచి నాలుగు మంచి మాటలు చెప్పరాదా? గృహస్థ ధర్మముకదా?"

అచట చేరినవారు తలకొకమాట మందలించినారు.

"పసిపాపకదండీ, పాపము."

"ఆ ప్రాణము అటు తల్లడిస్తే, మీకు క్షేమమా?"

"ముఖము తప్పించుకొని తిరిగితే, ఏమి న్యాయమండీ?"

"ఎంత కఠిన మండీ మీ మనస్సు? మొదట ఆమెను ఇంటిలోనికి పిల్చుకొనిపొండి."

ఈ మాటలను విని రావు, విసుగుకొని, "మీరేమో చెప్పచున్నారు. కాని ఆ చిన్నది మొండికత్తె. నేనే ఆమెను పెండ్లి చేసుకొవలెనంటె! భార్యపైన భార్య! ఇదెక్కడి గ్రహచారము నాకు! ఇంటిలోనికి పిలుచుకునిపోయిన తరువాత, ఇల్లు వదలకపోతే?" అని తనభయము వెలిబుచ్చినాడు.

"వదలకపోతే, కట్టుకోవలసినదే."

"మీదే అదృష్టము."

అందున్నవారెవరో ఇట్లనగా, చేరినవారందరు గొల్లున నవ్విరి.

'రావుగారు వచ్చియున్నారు. రమ్మని చెప్పి పంపగా, వెంటనే కథానాయకురాలు వచ్చి, సభకు వినయముతో చేతులు మోడ్చి, ఇంచుక దూరముగా గోడకానుకొని తలవంచి నిలుచుకొన్నది. ప్రశాంత గంభీరమగు కోలముఖము, తేజోవంతము లయిన విశాలనేత్రములు, దిద్దితీర్చినట్లున్న భ్రూలతలు, ప్రతిభను సూచించు చక్కని నాసిక, వయస్సునకుతగిన అంగసౌష్ఠవము గల కోమలగాత్రవల్లరి, చామనచాయకంటె కొంత మెరుగైన దేహకాంతి, కల ఆ తరుణీమూర్తి చూపరహృదయములో అపూర్వగౌరవభావమును రేకెత్తింప జాలియుండెననుటలో అతిశయోక్తిలేదు. కాని, మాసిన వస్త్రములతో, ఉపవాసక్లేశము ప్రతిబింబించు ముఖముతో, అలంకారశూన్యము లయిన అంగకములతో ఎంతో దయనీయస్థితిలో నుండిన ఆమె, పూజాపురస్కారములు లేని దేవతావిగ్రహమువలె కన్పట్టుచుండెను. ఇంత వర్చస్సు, ఇంత సంకల్పశక్తి, ఇంత నిబ్బరము కల కన్యకను మోసగించినాడే, అని రావుపైన కొంత అసహ్యం కలిగినది.

"రావుగారూ! అమ్మాయి వచ్చినది. పగలంతా కటికఎండలో మీ ఇంటి మెట్లమీద ఉపవాసము! ఆమెను విచారించు బాధ్యత మీది."

అని ఆ రావును చూచి అంటిని.

"నేను చెప్పవలసిన దంతా మొన్ననే ఆమె మేనమామతో చెప్పినాను. నా చేయి మీరిపోయినది. హఠము సాధించితే నేనేమి చేయగలను?"

ఆ తరుణిభర్త ముఖము చూడకుండా రావు ప్రతి ఇచ్చెను. చూచుటకు ధైర్యము లేదేమో?

"ఉపవాసము కదండీ?" ఎవరో అనిరి.

"పంపమంటే సత్రానికి భోజనము పంపగలను. భోజనముచేసి పోయిగా స్వగ్రామానికి వెళ్ళవచ్చును."

కర్కశస్వరముతో రావుగారీమాట చెప్పగా, కథానాయకురాలు చేతులు మోడ్చి,

"పెద్దలకు నమస్కారము. నేను అన్నభిక్షకై ఈ గ్రామమునకు రాలేదు. పతిభిక్షకై వచ్చుట! వివాహము చేసుకొందుమని నాకు పసుపు కుంకుమలు పెట్టి మాట ఇచ్చినారో, లేదో, దయచేసి వారిని విచారించండి."

అని నిబ్బరముగా చెప్పెను.

"ప్రతి చెప్పండీ." రావుతో అంటిని. అతడు తలవంచి నేలను చూడసాగెను.

"మౌన మర్ధాంగీకారము." నా మిత్రుడు, మరల, "అవును కదండీ ?" అనెను.

"మాట ఇచ్చినాడు. లేదనుటకు నోరురాదు. పాపము." ఎవరో హెచ్చరించిరి.

"మాట ఇచ్చినదేదో వాస్తవమేనండీ. అనేక కారణములతో వేరే వివాహము చేసుకోవలసి వచ్చినది." ఎట్టకేలకు రావు జబాబిడి.

"ఈమెను వదలిన కారణము చెప్పండి." నా మిత్రుడు మందలించెను.

"కులములో వీరికి ఏదో మచ్చటయున్నదని తెలిసినది. మానుకొంటిని."

రావు నోటినుండి ఈ మాట వచ్చినవెంటనే, కథానాయకురాలు ఒక అడుగు ముందుకు వచ్చి ధీరయై నిలిచి, దండతాడిత భుజంగివలె రోజుచు, భ్రూలతల ముడివైచి, చూపులలో తైక్ష్ణ్యము తొణకుచుండ, రావు నొక్కమారు చూచి, మావైపు తిరిగి,

"పెద్దలకు మనవి. ఆ మచ్చ ఏమో ఋజువు చేయమనండి. నా మచ్చ నాకు చూపితే, నిమిషమైనా ఇచట నిలువను."

అని ధైర్యముతో పలికెను. రోషావేశమున కలిగిన శ్వాసవేగముతో ఆమె వక్షోభారము కంపించుచుండినది. రావు తల ఎత్తలేదు; ప్రతి చెప్పలేదు.

"ఏమండీ, మీ ప్రత్యుత్తరము ?" నా మిత్రుడు రావు నదలించినాడు.

"నేనెట్లు ఋజువు చేయగలను?" మావా రెవరో చెప్పినారు" అని రావు నీళ్లు నమలెను.

"మావారిని విచారించకలదా ? ఎవరో మాకు గిట్టనివారిమాటలు విని, సత్యమును విచారించక, ఇచ్చిన మాట తప్పి ఈలాగు మోసము చేయవచ్చునేమో, పెద్దలు విచారించవలెనని నా ప్రార్థన." అని ఆచిన్నది వాదించెను.

రావు మాటలాడలేదు. ఏమి మాటలాడగలడు ? నిమిషకాలము సభ నిశ్శబ్దముగా నుండినది. అపుడపుడు కథానాయకురాలి కడగంటి చూపులు వాడి తూపులవలె రావుపైన పడుచుండినవి. అతడు మూచియుండెనేని, వణికిపోయి యుండును. అంతలో నా మిత్రుడు ఆమెనుద్దేశించి నెమ్మదిగా.

"అమ్మాయీ ! నామాట వినుము. వాస్తవముగా రావుచేసినది లోపమే. అమాయకుడు. ఎవరో చెప్పినమాట విని మోసపోయినాడు. ఇప్పుడేమంటే ఏమిఫలము ? అతనికొరకు నీవు ఆశపడుట వ్యర్థము. అతని తప్పును నిరూపించినావు. చాలు. మీ గ్రామమునకు పోయి తగినచోట వేరేవరుని చూచుకొనుట హితము." అని ఉపదేశించెను.

"ఏమండీ ! మీరు పెద్దలు, వయోవృద్ధులు. ధర్మాధర్మములు తెలిసినవారు. ఇదేనా, మీరుచేసే ఉపదేశము ? హిందువుల ఆచారమా ఇది ? వీ రిచ్చినచీర కట్టుకొన్నాను, వీరిచ్చిన సొమ్ము ధరించినాను; వీరిప్రక్కలో కూర్చున్నాను; సభలో నిశ్చయ తాంబూలములు తీసుకొన్నాను. ఇపుడుపోయి నన్ను ఇంకొక్క పురుషుని ప్రక్కలో కూర్చుండమనుచున్నారే ? న్యాయమేనా ? దయచేసి ఆలోచించండి."

కథానాయకురా లిట్లు నా మిత్రుని ప్రశ్నించగా, నేను నవ్వుచు,

"అయినదికదా, మంగళహారతి ?" అంటిని. ఆమె వివేకమునకు పరమానందమైనది.

"ధర్మమును పరేనమ్మా ! తెలిసో, తెలియకో, అతడు వేరే వివాహము చేసుకొన్నాడు. ఆయనదానికి ఇపుడేమి చేయగలడు ?" అన్నాడు నా మిత్రుడు.

"వారు వివాహము చేసుకొన్నదానికి నే నాక్షేపించలేదే ? వారి ఇష్టమది. ఒకటికాదు, ఇంక నాలుగు వివాహములు చేసుకొన్నా, నా ఆక్షేపణలేదు. నాకు చేసిన వాగ్దానమును చెల్లించమని మాత్రమే నేను కోరుట." ఇది ఆమె ప్రతి.

"ఏమండీ ! ఏమంటారు ?" అంటిని.

"ఏమంటాడు? కట్టుకొంటాడు." అని సభలో ఎవరో కసువము పలికిరి.

"సరే! బాగున్నది. ఇంకొకరిని వివాహము చేసుకొంటే, నా భార్య నన్ను ఇంటిలోనికే రానియ్యదు. అర్ధచంద్ర ప్రయోగమే."

రావు ఈ మాట చెప్పగా అచటనున్న వారికి నవ్వు ఆగినది కాదు, ఎవరో కాని.

"అయ్యో! పాపము" అనిరి.

"అది ఒక తమాషా" ఇంకొకరు. అంతలో కథానాయకురాలు కొంత ముందుకు వచ్చి మా వైపు వినీతయుతో చేతులు జోడించి.

"క్షమించండి. భార్యగారికి ఆక్షేపణ లేకపోతే, మాట చెల్లించుతారేమో, విచారించండి." అనెను.

"ఏమండీ" అంటిని రావుతో.

"నా భార్య ఏ-నా-డూ ఒప్పుకోదు" అని నవ్వుచు రావు తల అడ్డముగా ఆడించినాడు.

"ఆమె సమ్మతించితే...?"

తల కొంచెముగా ప్రక్కకు వంచి వాడి చూపులతో రావుగారిని చూచుచు కథానాయకురాలు ప్రశ్నించెను

"సమ్మతించునంతటి అవివేకి కాదు నా భార్య." రావు నవ్వినాడు.

"సమ్మతించినే?" మరల ప్రశ్న.

"సమ్మతించదు." రావు దీర్ఘము తీసెను.

"సమ్మతించితే?" మరల నెమ్మదిగా ప్రశ్న.

"సమ్మతించకపోతే" రావు సవాలు.

"సమ్మతించకపోతే, క్షణమైనా. ఇచట ఉండను. మీరు తొందరలేదు. కాని, సమ్మతించితే?" అధీరమానిని తీక్ష్ణ

దృష్టికి అతడు నివ్వెరపడినాడు. మాటపలుకు లేదు. దృష్టి మరల్చినాడు.

"జవాబు చెప్పండి." అంటిని. కొంతకాలము ఆకాశమువంక చూచుచు గత్యంతరము కానక,

"ఆమె సమ్మతించితే, చేసుకుంటాను లెండి." అని రావు కసిరినాడు.

తోడనే ఆమె కొంతముందుకు వచ్చి, ముకుళితహస్తములతో,

"సభ వారికి నమస్కారముచేసి వేడుకొంటాను. ఒక్క అరగంట కాలము నాకు అవకాశమీయండి, వీరి భార్యగారితో మాటలాడి వచ్చుటకు. అంతవరకు అందరు ఇచ్చటనే ఉండవలెనని నా ప్రార్థన."

అని ఆమె వేడుకున్నది.

"కానీ పోయిరామ్మా." అని సభ పరముగా అనుమతి ఇచ్చినాడు నా మిత్రుడు.

"కార్యము సాధించుకొని రామ్మా." అంటిని.

"భగవంతుని దయ" అని ఆమె శాలనుండి వెడలిపోయినది.

"పిచ్చిపిల్ల !" అని మరల "కాకపోతే, ఎవరు సమ్మతించగలరండీ సవతి వచ్చుటకు ?" అని రావు నవ్వినాడు.

"ఇది కష్టమే" ఒకరు.

"అసాధ్యము" మరియొకరు.

"మహాసాహసము," ఇంకొకరు.

"తమాషా చూతాము," వేరొకరు.

అందున్నవారు తలకొక్కరీతి వ్యాఖ్యానించిరి. అపుడపుడు గడియారము చూచుచుంటిని. తనకు ఇంతటితో పీడ వదలిపోగలదని రావు ముఖములో ఉల్లాసము కనుపట్టినది. గడియారము చూచి నా మిత్రుడు.

"ఇరవై నిమిషము లయినది. కాని, ఏమి సాహసమండీ ?" అనెను.

"ఆమె జాతకము చాలా ప్రబలమైనది," అంటిని.

"మీ రెక్కడ చూచినారు ?"

"మొన్న ఆమె మేనమామ ఇచ్చినాడు."

"ఏమి కనుగొంటిరి మరి ?"

"త్వరలో పెండ్లి అగుననుకొన్నాను."

"నాతోనా ?" అదరిపడి రావు ప్రశ్నించినాడు, అతనికి భయమైనది.

"మీ జాతకము నా యొద్ద లేదే !" అంటిని.

ఇరువదియైదు నిమిషము లయ్యెను. ఈ నాటకమునకు భరతవాక్యము వినుటకొరకు అందరు ఆత్రముతో ఎదురు చూచుచున్నారు. అపుడపుడు కొందరు పోయి వాకిట తొంగిచూచి వచ్చుచుండిరి. ఇరువది ఎనిమిది నిమిషము లగుచుండగా,

"వచ్చిరి ! వచ్చిరి !" అని రెవరో ! అందరి చూపులు తలవాకిలివైపునకు తిరిగినవి. రావుగారి భార్యను చేయి పట్టుకొని సవిలాసముగ కథానాయకురాలు శాలలోనికి పిలుచుకొనివచ్చి సభకు నమస్కరించినది. అందరు పరమాశ్చర్యభరితులైరి. విచిత్రపు చూపులతో రావు తన భార్యను చూడసాగెను.

మిసిమి పసిండి వన్నెగల సౌందర్యవతి రావుగారిభార్య. ఆ ఇద్దరు తరుణీమణులలో వాస్తవముగా అందమునకు అగ్రతాంబూల మామెదే. కావుననే, ఆమెను చూచి, ఈమెను నిరాదరించినాడు రావు. శుక్రుని దృష్టితో వృషభలగ్నములో పుట్టిన వ్యక్తి కాబోలునని తోచినది.

"అక్కా ! సభవారికి చెప్పండి." కథా నాయకురాలు రావు భార్యతో చెప్పినది.

"మాట ఇచ్చిన ప్రకారము మా వారు ఈమెను పెండ్లిచేసుకోవచ్చును. నా ఆక్షేపణ ఏమీ లేదు."

రావుగారి భార్య ఈ మాట చెప్పగా, సభలో కోలాహలము బయలుదేరెను. "సెబాస్", "భేష్", అని.

ఎవరో కొందరు ఉత్సాహముతో,

"రావుగారి రెండవ భార్యకు జై". అని జయజయ ధ్వని చేసిరి. నా కేమో, చెప్పలేని ఆనందమై, కన్నులు చెమ్మగిల్లెను. నా మిత్రుని ఉత్సాహము పార మెరుగదు.

"ఇప్పు డేమంటారండీ ?" అని నా మిత్రుడు రావును హెచ్చరించగా,

"అనుట కేమున్నది ?" అంటిని. రావు, పాపము, తలవంచుకొన్నాడు.

అతని భార్య ఇంటికి వెళ్ళనుంకించగా, ఆమెను సాగనంపి వచ్చి, కథానాయకురాలు ధైర్యముతో రావుగారు కూర్చున్న కుర్చీ వెనుక ఆనుకొని నిలిచి, వికసించిన ముఖముతో సవిలాసముగా అతని భుజముమీద చేయివేసినది. ఈ దృశ్యమును చూచి అందున్నవా రందరు కరతాళధ్వనులు చేసిరి.

"సమర్థురాలవమ్మా ! గెల్చుకొన్నావు." అని నా మిత్రు డభినందించగా, ఆమె మందస్మిత మధురముగా, వినయముతో,

"అంతా మా అక్కగారి దయ. మీ ఆశీర్వాదము."

అని చల్లగా ప్రతి ఇచ్చినది.

"ఎప్పుడండీ రావుగారూ ! పెండ్లి ?" అని ఎవరో హెచ్చరించిరి.

"ముహూర్తము చూడండి." అని మరియొకరు.

"ముహూర్తము నిర్ణయించెదరు. కాని, మొదట లేచి ఆమెను పిల్చుకొనిపోయి అన్నముముఖము చూపండి. పాపము. ఎండలో ఆహారము లేక నుండినది." అంటిని.

వెంటనే రావు లేచి "పోదాము, రా." అని వెళ్లగా, కథానాయకురాలు సభవారికి అంజలిచేసి, అతని చేయిపట్టుకుని వెంట వెళ్లినది. మోదాంతముగా సభ చాలించితిమి. నాటకము చూచినట్లయినది.

మూడు నాలుగు దినములలోనే అచటనే దేవాలయములో రావు ఆమెను విధ్యుక్తముగా పెండ్లియాడినాడు. పెద్దభార్యయే పెండ్లిపెద్ద. నాటినుండి కృతజ్ఞతతో తన పత్నికి ఇంటిపను లేమియు

నిర్వహించుటకు సామాన్యాకారము. ఇతర గ్రహములకు అంత శక్తి లేదు. వాదుకలోని గ్రహము లన్నియు సంకోచపరచునట్లు శనైశ్చరుడు నిర్మించిన ఆవరణము (కక్ష)లోనే సంచరించవలసి యున్నది. ఆ కారణమున వాని శక్తి సంకుచితము. వరుణు డున్నన్నో, శని సంచార కక్షను దాటి సంచరించు గ్రహము. శనియొక్క నియంత్ర్యత్వాధికారము వరుణునిపైన లేదు. అందుచే, ఇతని శక్తి నిరవధికము; ప్రతాపము, ప్రభావము, గొప్పవి. సమయము వచ్చి, అవకాశము లభించెనేని, మంచికైనా, చెడ్డకైనా, విట్టసినసువలె అసాధారణ ఫలము చూపగలవాడు వరుణుడు.

కథానాయకురాలి ఉపజ్ఞాయుతమగు ప్రతిభ, అసదృశ సాధనమునకై ఎంతటి త్యాగమునకైనా పూనుకొను మనోదార్ఢ్యము, విక్లిష్టపరిస్థితులలోనైనా, ధైర్యములో ఎదుర్కొను సాహసము అదరు బెదరులను లొంగని అచంచలమైన ఆత్మవిశ్వాసము, నిరుపమానమగు కార్యసాధకత, అద్వితీయమగు స్వతంత్ర సంకల్పశక్తి ఈ గుణము లన్నియు లగ్న మందలి వరుణుని వరప్రసాదము.

లగ్నములో వరుణుడు కలవా రెందరో ఉందురు. వారందరు ఇటి ప్రభావమును చూపగల్గినారా? అనవచ్చును. వరుణుడు లగ్నమందున్నచో సూచించు ఆత్మశక్తియొక్క స్వభావ మిట్టిది. ఆ శక్తిని ఉద్బోధించుదశలు, తగిన పరిస్థితులు, అనుకూలించు అవకాశములు, దానికి ఎదిగివచ్చినప్పుడే జగజ్జేగీయమానముగా అది వ్యక్తము కాగలదు. తుపాకిగుండు గర్భములో ఇమిడియున్న మహత్తరశక్తి గురిపెట్టి కాల్చినప్పుడేకదా ఫలకారి కాగలదు? మరియొకటి, వీగ్రహమైనా ఆ యా జాతకములలో దానికి దొరకిన ఇతర గ్రహఫల పరికరముల ననుసరించి భిన్నభిన్న స్వరూపములలో తన ఫలమును చూపగలదు. గ్రామపురీగలో ప్రసరించు వైద్యుతశక్తిని ఉదాహరణముగా గైకొందము. దానికి మనము ఎదిగించి ఇచ్చు యంత్రపరికరముల ననుసరించి అది వేరు వేరు కార్యములు చేయగలదుకదా? గాజుగోళములో వెలిగినా, వీవనలు విసరినా, పిండిమర త్రిప్పినా, బావులలోని నీరుతోడినా, గైలుబండ్లు నడపినా, ఆ శక్తిస్వభావమొక్కటే; స్వరూపములో మాత్రమే భేదము. ఇట్లే గ్రహఫలమునవో.

జాతకురాలికి లగ్నాధిపతి కవి భర్తృభావములో నున్నాడు. భర్తృసంపాదనమునకై గొప్పశ్రద్ధ. తృతీయ వనమాధిపతియగు పరాక్రమశాలి కుజుడు ఈ కవికి తోడు. ధార్మిక ప్రవర్తనములో ఎంతటి కష్టములనైనా ఎదుర్కొనుశక్తి ఈ యోగమువలన వచ్చినది. దాంపత్యసహమము రాజ్యభావ (దశమ) మందువంటేగలదు. వివాహసమస్యతో ప్రయత్నము చేయుచున్నది. దీని అధిపతియగు బృహస్పతి పంచమ కోణములో లగ్నాధిపతికి మిత్రదృష్టిలో నున్నాడు. ప్రయాసపడినా, ప్రయత్నము శుభోదర్కముగా పరిణమించగలదనుట. ఇక, భర్తృసహమము వరుణుని త్రికోణమైత్రిలో నున్నది. భర్తను బలాత్కారముగా ఆకర్షించు సూచన ఇది. భర్తృభావాధిపతి రవి నీచ, దుర్బలుడు. వరుణుని అద్వితీయశక్తి, పై సామగ్రి నుపయోగించుకొని, జాతకురాలికి విజయము చేకూర్చినది. ఇంత నాటకమునకు ఈ సామగ్రి చాలునా? చాలదు. లగ్నములో వరుణునికి ఇరుప్రక్కల సమీపములో రెండు సహమము లున్నవి చూడుడు. (1) మహాత్మ్య సహమము, (2) సామర్థ్య సహమము అని. ఈ రెండింటి సరిమధ్యమందున్న వరుణుడు తన ప్రభావమును ఈ సహమ గుణములతో చేర్చి జాతకురాలికి (లగ్నమునకు) ఇచ్చినాడు. వాని నుపయోగించి కథానాయకురాలు కార్యమును సాధించినది.

ఇది అంతయు వరుణకార్యమే అనుటకు ఏమి నిదర్శనము? అందుకేమో? దశమకేంద్రము (ప్రయత్నము), దాంపత్య సహమమునకు సహా, దేవయానదశలో చలించి ఏ వయస్సున లగ్నమందలి వరుణునితో నికరముగా అర్ధకోణమిత్రదృష్టికి (ధనుస్సులో 20°) రాగలిగెనో, అప్పుడే ఈ నాటికి కథాకలాపము రంగమునకెక్కుటకు భర్త ఇట్లు ప్రవర్తించనేల? అనవచ్చును. అది అతని జాతకదశల ప్రభావము. ఆ సామగ్రి లేనందున అది చర్చించలేము. పోనిండు. కథానాయకురాలి భర్తృసహమమును పరికింపుడు. అదే వయస్సునందే ఈ సహమము చలించి మాయలమారి ఇంద్రునితో కేంద్రసేనకు వచ్చియుండినది—(వృశ్చికములో 8½°). రెండు నెలలనాటి అమావాస్య ఆదేభాగలో ఇంద్రునిపైన పడుటచే, నాటకము ఆరంభమగుట. అప్పుడే చలితశుక్రుడు (ధనుస్సులో 6½°) ఇంద్రునితో కోణదృష్టికి వచ్చియుండెను. చలితబుధుడు (తులలో 11½°) దాంపత్య సహమాధిపతియగు బృహస్పతిలో నిండుకోణదృష్టి. వచ్చుట సహా ఆ కాలమందే. భర్త మాట ఇచ్చి తాను మోసపోయి ఈ మెనసయితము మోసగించి వేరు కన్యను పెండ్లియాడినాడుకాని, తరువాతవచ్చిన పర్వము కథానాయకురాలి చలితకుజుని సమసప్తకములో జన్మవరుణునిపైన పడగా, ఆమె హృదయములో అవమానమువలన, ప్రేమ తిరస్కారమువలన, గొప్ప సంక్షోభము చెలరేగినది. తన మాహాత్మ్యమును, సామర్థ్యమును ప్రదర్శించుటకు, వరుణునికి కావలసిన సామగ్రి, అవకాశము లభించినవి. ఆశ్చర్యకరముగా పిడుగువలె పనిచేసి కథానాయకురాలికి దిగ్విజయము సాధించి ఇచ్చి "రాజ్యమేలుకొమ్మ"ని ఆశీర్వదించినాడు వరుణుడు,

సాధారణముగా, గొప్ప మనస్సంక్షోభము కలిగినప్పుడే వ్యక్తుల ఆత్మమహిమ వెలికి వ్యక్తమగు నని మహాకవి కాళిదాసు చెప్పిన సుభాషితమును చిత్తగింపుడు :—

"జ్వలతి చలితేంధనోగ్నిః,
విప్రకృతః పన్నగః ఫణాంకురుతే.
ప్రాయ స్స్వం మహిమానం
క్షోభా త్ప్రతిపద్యతే హి జనః."

(అభిజ్ఞాన శాకుంతలము.)



# ఇదంతా మీ మంచికే! ..............

## .... IT IS FOR YOUR GOOD! .....



త్వరలో దాటిపోతాము గదా అని రైలుపట్టాలు దాటుట క్షేమంకాదు. ఇలాచేస్తే మీ ప్రాణాలు బలి అవుతాయి. కమ్ములపైగా వేసినవంతెనలను ఉపయోగించుకోండి.

మీరు కొద్ది లగేజితో ప్రయాణము చేస్తే సుఖంగా ప్రయాణం చేస్తున్నట్లు అనిపిస్తుంది. మీ ప్రక్క ప్రయాణీకులుకూడా అల్లే అనుకొనేట్లు చేయగలరు.





అనవసరమైన చెత్తనంతా తీసికొని పోయి, అందుకై వుంచబడిన చెత్త తొట్లలో వేసిన, స్టేషన్ పరిసరములన్నియు చాలా శుభ్రంగా వుండ గలవు.

రైలు పై బైలమెట్లమీద నిలచి ప్రయాణంచేసి, మీ ప్రాణాలకు అపాయం కలిగించుకొనవద్దు. ఇట్లు చేయడం ప్రాణాంతకమైన పనియే కాకుండా, ఇండియన్ రైల్వే చట్టము ప్రకారం శిక్షార్హమైన తప్పిదము కూడా.





బిక్షగాండ్రు, రైళ్లలో వస్తువుల అమ్మేవారు, టిక్కెట్లు లేని ప్రయాణీకులు రైళ్లలో రద్దీ అధికం చేస్తారు. వారిని మీ శక్తికొలది నిరుత్సాహ పరచండి.




ISSUED BY SOUTHERN RAILWAY

దక్షిణ రైల్వేచే జారీ చేయబడినది

# మంచిముత్యం

శ్రీ బలివాడ కాంతారావు

చైత్రశుద్ధ యేకాదశి రాత్రి—సింహాచలవదున స్వామివారి కళ్యాణోత్సవం. ప్రొద్దు ప్రుంగాక, పేదా రోదా, పిల్లా పిచ్చికా, పెద్దలూ పిన్నలూ, పండితులూ పామరులూ, ఉద్యోగులూ సద్యోగులు వగయిరా అసంఖ్యాక ప్రజానీకం నలువేపుల నుంచి కాలి నడకతోనూ, బళ్లు బస్సులమీదను వచ్చి చేరుతున్నారు. దేవాలయం కొండమీద నున్నది. స్వామి దర్శనానికి యించుమించు వెయ్యి మెట్లు ఎగ్రపాకాలి. త్రోవంతా విద్యుద్దీపాలతో పట్టపగల్లా వుంది.

రాత్రి తొమ్మిది దాటినా బస్సులు నిండుగా ప్రజలు దిగుమతి అవుతున్నారు. కొండ దిగువనే యెన్నో దుకాణాలు వున్నాయ్. యాత్రీకుల కోలాహలం, గడబిడలూ, వుత్సాహం, అట్టహాసం హెచ్చుగా వుంది. వింతా వినోదం లేదుగానీ కొంత ప్రజమాత్రం బస్సులాగే స్థలంలోవున్న రావిచెట్టు ప్రక్కనే వున్న లైటు వెలుతురులో మూగుతున్నారు. పిల్లలు గెంతుతున్నారు. పెద్దలు వింతపడి నవ్వుతున్నారు—వీళ్లందరి దృష్టిని ఆకర్షించిందేమిటది? వింతమృగమా అంటె కాదు...సిల్కుచీర కట్టుకొనివున్న ఆడమనిషి. సిల్కుచీర అక్కడక్కడ చిరిగివుంది. ఖద్దరు జాకట్టు పీలిపోయింది. వెలుతురులో ముఖం పాలిపోయున్నా మెరుగులు పెటినట్లు తెల్లగా మెరుస్తోంది—"అబ్బే! పెద్దవయసు కాదే" అని యెవడో అనుకుంటూ పోతున్నాడు.

ఇంకోబస్సు వచ్చి ఆగింది. ఆ దిగిన ప్రజకూడా యిటు తొంగి చూసారు. ఒక పదిమంది ఒక్కుమ్మడిగా వచ్చారు. అందులో ఒక మనిషి. యెర్రబుర్రగా పొగ్గావున్నాడు. నాలుగేళ్ళ క్రితం అయిదు వేలు పుచ్చుకొని పెళ్ళి చేసుకున్నాడు గానీ యింకా పిల్లలు లేరు. పెళ్ళాన్ని వెంట తీసుకరాలేదు. "ఇదా! రండి రండి పోదాం!" అంటూ నడవగానే మిత్రులంతా వెంటపడ్డారు. మాటల్లోనే, ఉపన్యాస ధోరణిలో

"ప్రేమించి పెళ్లంటారుగానీ మన సంఘానికి అది పనికి రాదు. యౌవ్వనంలో మనకు బంగారమేదో, బంగారం మెరుగు పూసిన యిత్తడేదో తెలుసుకోలేం!" అన్నాడా పొక్కైన మనిషి.

ఆగి మాటలు పొడిగించాడు "పెళ్ళి విషయంలో పెద్దలు చెప్పినట్లు పాటించడమే మంచిది!" వాళ్ళలోళ్ళవాళ్ళు వాదాల్లోకి దిగటంవల్ల నడక మందగించింది.

ఇంతలో లైటుక్రిందకూర్చున్న ఆమె లేచి నిల్చుంది. నలుగురి వేపు కళ్లు పెద్దవి చేసి చూసింది. కాలుస్తున్న సిగరెట్ పీకను క్రింద పారవేసి ఆవులింత తీస్తూ ఒళ్ళు విరచింది. ఒక్కసారి పకపక నవ్వి "మీరంతా నాచుట్టూ యెందుకు మూగారు? నేనేం దేవకన్యనా దయ్యాన్నా? నేనేం పిచ్చిదాన్నికానే—బట్టలిప్పి కూర్చోలేదే! నవ్వుతారెందుకూ? పొండి—పోతారా లేదా!" అక్కడే వున్న కంకరాళ్లను చేతపుచ్చుకుంది. ఘొల్లుమని చుట్టూవున్నవాళ్ళు చెల్లా చెదరు కాజొచ్చారు. ఆమె మెట్లువేపు పరుగెత్తుతున్న ప్రజలను వెంబడించసాగింది. వెనకనుంచి కుర్రాళ్లు కుక్కలూ అరుస్తున్నయ్. ఆమెచేతిలోని రాళ్ల ప్రక్కకు నవ్వుతూ విసిరేసింది. ఆ విసిరేసిన రాళ్లలో ఒకటి వుపన్యాసం ఆపిన యెర్ర బుర్రగా పొగ్గా వున్న మనిషికి తగిలింది. తగిలినట్లు ఆమె తెలుసుకుంది. గబగబ దగ్గరకు వెళ్తూ వంచి ముఖం దాచుకున్న అతనితో "క్షమించండి! నా చేతులతో యిదివరకే చాలమందిని గాయపరచాను!"

తను జవాబు చెప్పకండా ముందుకు కదిలిపోతూంటే మెట్ల మొదట్లోవున్న దీపం వెలుతురు ఆయన ముఖంమీద పడింది. ఆమె యింతలో "ఆగు ఆగు" అని కేకలువేస్తూ పరుగెత్తింది. ఏంచేస్తుందో అని అంతా కంగారుపడజొచ్చారు. "నేకొట్టను...పారిపోక...!" అంటూ దగ్గరగావస్తూ "నివ్వా! నిన్నెంతగా ప్రేమించాను. ఎన్ని రాత్రుళ్లు నిన్ను తలంచుకొని నిద్దరలేకండా గడిపాను. నిన్నొక వుత్తేజమైన కథానాయకుడ్ని చేసి ఆరాధించాను!" ఆమె వెకిలిగా నవ్వుతూ చుట్టూ చేరినవాళ్లకు అతనిని చూపిస్తూ "వినండీ వీరుని పరాక్రమం! న్యాయంకోసం తల్లిదండ్రులని ధిక్కరించలేక పోయాడు. ఒక ఆడపిల్లలు గల బీదవాడిభారాన్ని తగ్గించలేక పోయాడు!"

ఆ మనిషి కదలిపోతుంటే "ఆగు!" అంది. "ఆగకపోయావంటే యేంచేస్తానో!" గప్పున ఆమెమెట్లపై మునుకులపై నిల్చొని దీనస్వరంతో "ఈ నావీరుడ్ని కొనుక్కోడానికి అడుక్కోలేక పోయాను. అప్పు చెయ్యలేకపోయాను, చివరకు దొంగతనమైనా చెయ్యలేకపోయాను...నా కథానాయకుడు వుదారుడని యెన్నో రాత్రుళ్ళు యెదురుచూసాను. లేదు ... రాలేదు ... అంతా బూటకం...ఇంకెంతకాలం యిలా పెళ్ళికాకండా నలుగురిచేత వేళ్లు చూపించుకొని బ్రతుకుతాను...తెలతెలవారుతోంది! అమ్మో...యెంత భీకరంగా వుంది...కొండంత కెరటాలు... అందులో నాక్కావలసిన శాంతి దొరుకుతుంది..."

ఆమె చటుక్కున లేచింది. చుట్టూ తిరిగి చూసింది. "ఏడ... రాలేదూ? ఎందుకొస్తాడా మనిషి! ఎక్కడో ఆ తీరంలో ఇసిక మీద హాయిగా పడుకొని వుంటాడు. అబ్బే పడుకోడే! నాలా విసిగి పడిపోయినవాళ్లను రక్షించడానికి చూస్తుంటాడు—నల్లగావున్నా ఎలాంటి వంపులు తిరిగిన కండలు. ఆ క్షణం ఎంత వెచ్చగా హాయిగా వుంది ఆ శరీరం. మళ్ళీ యింకొక్కసారైనా చూడలే దతన్ని. ఆ జాలరి నా వీరుడా? నివ్వా...? ఛచ్ఛ నీ బ్రతుకు. అదే

నీ కౌగలింపు ఇస్తుంది...అదే చివరికి తీసుకుంటుంది...వెళ్లు...వెళ్ళు!"

ఆమె అక్కడనుంచి మీదికి గబగబ కదిలిపోయింది. కొంత దూరం పైకి వెళ్లేసరికి ఆయాసం అనిపించింది. ప్రక్కనే దిమ్మమీద కూర్చుండిపోయింది. ప్రజ మీదికిపోతున్నారు. ఆమె మెల్లగా ప్రక్కగా వుండే త్రోవలోనికి వెళ్లి ఒక చెట్టుక్రింద కూర్చుంది. దిగువకు తోటలు కనిపిస్తున్నాయ్. ప్రశాంతంగా వుంది. దూర దూరాన పొలాలు మెట్లు గుట్టలూ వెన్నెల్లో నిద్రపోతున్నయ్. ఆమె చెట్టుక్రింద చారబడడానికి వుపక్రమిస్తూ మెట్లవేపు చూసింది. చప్పున లేచి "ఓ భక్తుడా! దేముడ్ని చూట్టానికి వచ్చావా? దేముడు నీ లాంటి వాడనుకున్నావా దర్శన మీయడానికి—ఆగు... దొరికావ్...నన్ను పెట్టిన బాధలకి...నిన్ను...యీ కొండమీద నుంచి దిగువకు త్రోసినా...ఆగు...ఆగు!"

ఆమె పరుగెత్త నవసరం లేకుండానే ఆ వ్యక్తి ఆగిపోయాడు. వెళ్తున్నవారుకూడ నిల్చొని ఆత్రుతగా చూడసాగారు. ఆయన ఏదో అనబోతుంటే అవకాశం ఇవ్వకుండా గట్టిగా, "ఆ వుంపుడుకత్తె వలలోపడి మాటలతోనూ చేతలతోనూ నన్ను శవాన్ని చేశాడండీ? నన్ను చావమోదాడు. రెండుసార్లు బలవంతం చావుకు పరుగెత్తి నిచ్చాడండీ!"

ఇంతలో పైకివస్తున్న ఒక వయసుమళ్ళిన మనిషి ఆగి "ఈయన యెవరనుకున్నావ్—యేమిటి?"

"ఎవరా? లోకం నా మొగుడంది. కానీ నే నీతన్ని నా కసాయివాడన్నాను."

"పాపం పిచ్చిదానిలా వుంది" అని అతను కదలబోతుంటే చెయ్యిపట్టుకొని ఆపి "నివ్వా నేనా పిచ్చి!" పకపక నవ్వుతూ "మీరంతా చెప్పండి పిచ్చియెవరికుందీ? ఇందరి ఆడాళ్లను వలలో వేసుకున్నావ్-ప్రేమ అనేది యెలా వుంటుందో చెప్పు!"

ఆమె అదేరడవుగా నవ్వుతుంటే అవయసు మళ్ళిన మనిషి "తోలుకో!" అని కేక వేసాడు. ఆ కేకతో ఆమె ఝల్లుపడి ఆగి పోయింది. తను మందలింపుతో "భారతీ! ఇక్కడికెందుకొచ్చావ్? ఆ పొంగ్రవరాయ కుటుంబంలోపుట్టి నివ్వయ్య పరువుతీసింది చాలదా? ఏమీ తెలియని యీ అమాయకుని పరువుతీస్తావ్? చూడు...సరిగ్గా ఆ ముఖంలోనికి చూడు... నీ మొగుడా? వాడు యింకో పెళ్లిచేసుకున్నాడటలే! పో తిన్నగా క్రిందికి...వచ్చిన దారినే పో!"

నిశ్చలంగా నిల్చున్న ఆమె...ఆయువకుని ముఖంలోముఖం పెట్టి "ఎవరుమీరు? ఆ కసాయికొడుకా?...వాకిలలో యేదో చెడ పురుగులు పుట్టపెట్టాయేమో? దూరానికి అలాగే కనిపించారు... క్షమించండి! నాకింకేంవచ్చు—వకరిని బాధపెట్టడం...క్షమాపణ వేడుకోటం!"

భారతి అక్కడ నుంచిమెల్లగా కదిలింది. మళ్లీ ఆ చెట్టుక్రిందకే పోయి చేరబడింది. క్షణం ఆ గుమిగూడిన వాళ్లామె వేపు చూసారు. ఆ దగ్గరగా యే పామువచ్చి కాటువేస్తుందో అన్నట్టు జాలిగావుంది. అతయువ మళ్లీవచ్చి "క్రిందికి వెళిపో అమ్మాయ్. అక్కడుంటే ప్రమాదం!"

"నాకొ ప్రమాదం? లేదు! నాకోసం యెవ్వరాళ్లవరుంటారు–బాబూ? నే చచ్చిపోతే మావాళ్లకిచ్చిన మచ్చలొన్నాళ్లకి చెరిగి పోతుంది. మీదికి వెళ్లండి! ఆ దేముడ్ని చూసారంటే మీకుకోరింది యిస్తాడు—ఏదికోరినా కోరకపోయినా ఆడపిల్లలు జన్మజన్మలకి వద్దని కోరటం మరచిపోకండి!"

ఆ వ్యక్తి మెల్లగా కదులుతూ "లైబ్రరీలో పుస్తకాలన్నీ చదివేసింది. ఎంతో తెలివైనపిల్ల కానీ దాని నొసట దేముడిలా వ్రాసాడు" అన్నాడు. ఆయన వెళ్ళిపోతుంటే ఆమె "టుబి ఆర్ నాట్ టుబి" అని నవ్వింది. అంతా కదిలారు గానీ యెవరినైతే మొగుడని అనుకుందో ఆ యువకుడు కదల్లేదు. రెండుసార్లు నాలుగు నాలుగు మెట్లుయెక్కి మళ్లీ దిగిపోయాడు. ఆమె అన్న మాటలు తనను గడబిడచేస్తున్నాయ్. కొంతసేపయ్యాక ఆమెకు చేరువలో కూర్చున్నాడు. ఆమె తనలో తనే యేదో అనుకుంటోంది. వింటామని మరి కాస్త జరిగేసరికి ఆమె కమ్మనిగొంతుక యేవో రాగాలను తీసుకొంటోంది. అలా ఆమే కళ్లప్పచెప్పి చూస్తున్నాడు. ఆమె రాగాలు తీసుకుంటూనే శరీరాన్ని కదుపుతోంది. ఆరాగాలు దూరపు కొండల్లోనికి తెల్లని మేఘాలలోకి పోతూ ప్రతిధ్వనించి తనగుండెకు హత్తుకున్నట్లున్నాయ్. ఆమె ముఖం వెన్నెల్లోనికి వచ్చింది. ఆ పెదవులు యెండిన ద్రాక్షపళ్లలా ఆ కళ్ళు పానపట్టిన నక్షత్రాల్లా ఉన్నాయ్. ఆ ముఖమంతా రాలిపోతున్న గులాబిలా వుంది. ఆమెచెయ్యి తనపాదం మీద పడింది. ఏదో తియ్యనిభావం అతని శరీరమంతా అల్లుకుంది.

ఆమె లేచి కూర్చుంది. దిగువ దిగువగా ప్రశాంతంగా వున్న ప్రకృతి కనుపించింది. "చూడు యెంత చక్కగా వుందో!" ఆమె దగ్గరగా వెళ్లాడు. ఆమె చేతులతో ఆకాశాన్ని చూపిస్తూ "ఆ పైకి యెగిరే శక్తి వుంటే యెంతబాగున్ను. చందమామను ముద్దులాడి ఆడించేదాన్ని! ఏమిటో వెర్రి! ఇక్కడ నుంచి గెంతగలనుగా! గెంతి ఆ అందమైన చెట్లను కౌగలించుకుంటే అనంతం లేని—శాశ్వత శాంతి వస్తుందిగా!"

అంటూ ఆమె పడిపోడానికి వురుకుతున్నట్లువుతుంటే అతను ఆమెను పట్టుకొని వెనుకకు లాగి కూర్చోపెట్టాడు. అతనివేపు యెగ్రగించి చూస్తూ "అందరూ నన్ను మంచిమనిషనం టున్నారే! నీమంచి లోనూ చెడుగు నాకు కనిపిస్తోంది."

"ఒక మాటంటాను—" ప్రాధేయపడుతున్నట్లు అడిగాడు.

"చెప్పు!"

"ఇలా క్రిందికి పోదామా?"

"ఆ స్వలాభంతోనే నన్ను పడిపోకుండా అడ్డుకున్నావుగా? అక్కర్లేదు — నేనెందుకొచ్చా నిక్కడికి — పడిపోడానికి కాదు—ఆ ముసలమ్మ చెప్పింది కదూ దానికి. నిన్ను పరీక్షిస్తూ కూర్చుంటే ఎలా? మీదకు పోవాలి" అంటూ ఆమె లేచి మెట్లవేపు వెళ్ళింది—ఆమె పైకి పోతుంటే అతను వెంటపడ్డాడు.

అంత యెత్తునుంచి టపటప నల్లధార పడింది. మీదికి పోయే యాత్రికులు పలచబడ్డారు. ధారకు యెదురుగా రెండోవేపు కొందరు బిచ్చగాళ్ళు కూర్చున్నారు. అందులో తల పెరసిన ముసలిది వుంది. ఆ ప్రక్కనే ఒక కుంటిపిల్లవాడు కూర్చున్నాడు. ఇద్దరి యెదురుగా పరచివున్న మాసిన బట్టల్లో పైసలు, బియ్యం పడివున్నాయ్. ఆమె ఆ కుంటి పిల్లవాని దగ్గరగా కూర్చుండిపోయింది. ఆ యువకుడు వారించడానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. అంతవరకూ "కుంటివాణ్ని బాబూ! ధర్మం చెయ్యండి బాబూ" అని అరుస్తుంటే కుర్రవాడు అరవటం ఆపి కొత్తగా గాబరాపడ్డాడు. కాళ్ళుంటే లేచి పొయ్యేవాడే. ఆమె ఆ కుర్రవాని తల నిమురుతూ "అయ్యో పిచ్చి తమ్ముడూ! ఎందుకలా వీళ్లని సహాయం చేయమని అరుస్తావ్. వాళ్ళ దంతా వేషం, డాబు, దర్పం—ఏ పాపం యెరగని నువ్వు పాపాలకు పుట్టిల్లయిన వాళ్ళ చేతి కానీ పుచ్చుకుంటావా? పద—పద... మీదకి పద..."

లేవ లేని ఆ కుర్రవాని చేతులుపట్టి మీదికి లేవనెత్తుతుంటే "నేరానని" వాడు వెనుకకు లాగుతున్నాడు. "లేస్తావా లేదా? నీ మంచికే చెప్తున్నా—ఆ దేవుని చూసావంటే నాలా కాళ్ళు వస్తాయ్—అప్పుడిలా అడుక్కో అవసరం లేదు. నామాట నమ్మవూ? నీకు దేవునిమీద విశ్వాసం లేదూ?"

అంటూ ఆ కుర్రవానిని యెత్తుకొనిపోతుంటే వాడు గోల పెడుతున్నాడు. ఆ ప్రక్కనేవున్న ముసలమ్మ విడిపించబోతే "ఇంకా నన్ను విడిచిపెటవూ! అబ్బా—ఏదిటీ వృత్తి...సరే... నీమాట వినకపోతే ఆకలితో చంపేవూ..." ఆ కుర్రవాణ్ని అక్కడే వదిలేసి—బట్ట, జుత్తు సర్దుకొని ఠీవిగా నిల్చొంది. ఓ క్షణం పోయాక చిరాకుగా "అందరూ నన్నే యెందు కెంచుకుంటారు? ఇంతమంది నిల్చున్నాంకదా? ఒకరూ నచ్చలేదా? అబ్బా... అబ్బా...ఈ ముసలమ్మ యెప్పుడు మట్టయిపోతుందోగానీ!"

ఆ ముసలమ్మ "నే మట్టయితే నీకేం వస్తుందమ్మా!"

"స్వేచ్ఛ! ఈ పాడుగదుల్లో బయటపడిపోనూ! అబ్బా! ఈ యింటికి యెవరూ అగ్గయినా పెట్టరేం? ఆ మంటల్లో యీ పాపం అంతా మండిపోయేది!"

ఆమె అంతలోనే ఆ యువకునివేపు నిదానంగా చూసి "నువ్వూ నన్నే యెంచుకున్నావా?" అంది.

"ఊఁ" అన్నాడు.

"నన్నే యెంచుకోడానికి నాలో యేముంది?"

"నాక్కావలసినదంతా వుంది..."

ఆమె అడుగులు వేస్తూనే "లేదు లేదు—నా అందమూ పోయింది—నేను చిన్నదాననూ కాను. నా జీవితంలో అంతా పోయింది ఒక్కటి తప్పించి......"

"ఏమిటది?"

"ఆశ..."

"అదెప్పుడు వుందో అంతా వున్నట్లే" అన్నాడు.

ఇంతలో వెనకనుంచి వచ్చే వ్యక్తి ఆ యువకుని పలుకరించాడు. ఆమె ఆయనవెనకే వచ్చే ఆమెమనిషితో "ఎవరమ్మా మీరు? చాల మర్యాదస్థుల్లా వున్నారే!" అంది. ఆమె ముఖం వెలిగించి వూరుకుంది. "తను మీ ఆయనగారేనా" ఆమె అవునన్నట్లుగా తలవూపింది.

"ఈ మగవాళ్ళెంత మంచివాళ్లు. అందులో మీ ఆయనకు మీరంటే భక్తికదూ?"

ఆమె మునిముని నవ్వింది.

"మిమ్మల్ని తప్పించి పరాయి స్త్రీముఖం చూడలేదుకదూ?"

భార్యనంటే గర్వం వ్యక్తపరచడానికి "అవును" అంది తలెత్తి.

"ఎలా చెప్పగలరు?"

"నాకా విశ్వాసంవుంది" గొణిగింది ఆమె. అంతతో వూరుకోక "ఆయన మీ ఆయనే కదూ? నీకు మాత్రం అలా వుండదా?" అంది.

భారతి పకపక నవ్వడానికి మొదలుపెట్టింది. నవ్వు నాపుతూ బేజారయిపోతున్న ఆమెతో "మగవాడు ఆడదాని అందంచూస్తే పిచ్చివాడవడూ? నీకంటె నేను అందంగా లేనూ? అంచేత నీ మొగుడు..."

"ఏవండోయ్" అని కేక వేసిందామె. ఆ మొగుడు ముందుకే పోతున్నాడుగాని వెనుకకు తిరగలేదు. అంతలో ఒక పదిమంది గుంపు వెనకనుంచి వస్తున్నారు. ముందుకు గబగబ ఆమె వెళ్ళిపోతుంటే భారతి రెండుచేతులూ చాపి అడ్డుపడింది. ఆ వచ్చే పదిమంది గుంపును కూడా నిలదించే అడ్డుకుంది. వాళ్లేదో అంటుంటే యీమె పళ్ళుకొరుకుతూ జుత్తంతా విరబోసుకొని "దేవునిదగరకు వెళ్తున్నారు. మీరుచేసిన పాపా లేవో చెప్పండి. లేకపోతే త్రోవ వదిలేది లేదు!"

ఒక మొగాడికి పౌరుషంవచ్చి "మా పాపాలా అడుగుతున్నావ్ పోకిరీదానా! బజారులోపడి—ఆ కులానికే అపకీర్తి తెచ్చావు. పిచ్చిలోయిన కోయిలంపోయి—ఆఖరికి..."

ఆ మనిషితో మాటాడుతూ ముందుకు జరిగిన యువకుడు తిరిగి గబగబవచ్చి "భారతీ! ఇదేమిటిది...లే త్రోవలో లే..."

అలావుంటే "వచ్చారా ఆ యిన స్పెక్టరు..."

"అక్కడే వున్నాడు. ఆవిడని విడిచిపెట్టు, వెళ్లిపోతుంది!"

"ఇక్కడకువచ్చి ఆవిడను తీసుక వెళ్ళకూడదూ?"

"ఎందుకీ గొడవ"

"రమ్మని పిలు!"

"పిల్చాను"

"రాలేదుకదూ...హో...హో...ఎందు కొస్తాడు. నాకు డబ్బు బాకీ కదూ? నన్ను తోసి ఇంటించి చివరకు ఆ నేరం క్రిందనన్నే జైలులో పెట్టాడు."

"మర్యాదగా మాటాడే!

ఏవండోయ్ రండి రండి ... ఈ పిచ్చిది..."

భారతి ఆమె కేకలు అనుకరిస్తూ "ఏకండో రండి రండి మొగుడు మోసాన్ని తెలుసుకోలేని యీ పిచ్చిది...ఆరాధిస్తోంది!"

"శ్రీ అమ్మా—అదేమిటాపని..." ఆగొంతుకవిని తలయెత్తింది. ఆ పదిమంది మధ్యనున్న యెత్తైన సుందరవిగ్రహాన్ని చూడగానే ప్రక్కకు తప్పుకొని చేతులెత్తింది...నమస్కరిస్తున్నట్లు...

"అన్నయ్యా! వదిన, పిల్లలూ బాగున్నారా?" అంది.

"ఆఁ బాగున్నారమ్మా..."

తనతోపాటు ఆమె అలా మెట్లపై కూర్చుండిపోయింది. అందులో ఒకాయన ఆయనతో "శంకరం ఏమిటి అసలుకథ" అన్నాడు. అతనికి ఆమే సమాధానం యిచ్చింది. "కూర్చోండి నాకథ నేనే చెప్తాను" కాని వాళ్లు కదలిపోతుంటే అందర్నీ అడ్డుకుంది. వాళ్ల చేతులు పట్టుకుని కూర్చునేట్టు చేసింది.

కూర్చోపోతే యేంచేస్తుందో నన్న భయంతో ప్రక్కగా వాళ్లంతా మెట్లపై కూర్చున్నారు లేచింది. ఆ దగ్గరగావున్న ఒక చిన్నరాయి చేతపట్టుకొనివచ్చి కూర్చుంది. ఆరాయి శంకరం చేతికిస్తూ" నాది తప్పయితే చెప్పండి. ఈ రాయితో కొట్టి సరిదిద్దండి—ఇదీ నాకథ. నేను మీలానే పుట్టాను. మానాన్న ముద్దుగా భారతిగానే పెంచాడు. ఇందరు కూతుర్లుండగా అమ్మ పోతే మళ్ళీ పెళ్లెందుకు చేసుకోవాలి? మాయెదరగా ఆమెతో నవ్వులాలు, కేరింతలు! అయినా మానాన్న సంఘంలో యెంత మంచి మనిషి?

పెళ్లివాడు ఆమొగుడు యెంత అమాయకంగా కనిపించాడు. అమ్మో రాక్షసుడు. ఇందరుండగా అడ్డుకోలేం? మీకు నాలాంటి పిల్లలులేరూ? అవును—నానోరు మంచిదికాదంటారు. నాకు బ్రతకడం తెలీదంటారు. తప్పంతా నామీదేవేస్తారు. వాడు సరిగ్గా వుంటే నేనెందుకు జబాబులు చెప్తాను? తినివుండలేక మొగుడ్ని వదిలేసి వచ్చిసానట! కన్నవారింట్లో భరించలేని మాటలు ఈ నరకంనుంచి రక్షిస్తానని నన్ను మోసపుచ్చినవాడేడీ. తల చెక్కలుచేస్తాను" అని రాయితీసుకోడానికి ప్రయత్నించింది. కాని యెవరిమీద విసురుతుందనో శంకరం ఆమెచేతికి అందన్వివలేదు. పెనుగులాటవనడి లాభంలేకచ్రువ కోపంతో నాలుగు మెట్లెక్కి,

"నివ్వా! శంకరం అన్నయ్య...నా కొడుకును నివ్వేకదూ చంపేశావ్?"

అంతా నిశ్శబ్దం అయిపోయింది.

"నేనా!" అన్నాడు వూపిరి బిగబట్టి శంకరం. "పిచ్చిదానితో మనకెందుకు. పదవోయ్ శంకరం!" అన్నాడో మిత్రుడు. లేచారు. కాని శంకరం లేవలేదు. లే లే అని ఒకాయన చెయ్యిపట్టుకొని లేవనెత్తాడు.

"ఆ కొడుకుచావే యీ మెనీ పరిస్థితికి తెచ్చింది! కానీ నే చంపానా?" శంకరం అన్నాడేగానీ కాళ్లు కదపలేకపోయాడు. మెట్లుప్రక్కనేవున్న గోడను పట్టుకొని తల ఆన్చి ఆమె అలానే నిల్చుంది. ఆమెతోవున్న యువకుడు కాస్తయెడంగా నిల్చున్నాడు. ఆ దగ్గరగావున్న శంకరంతో "యీమెకు కొడుకుపుట్టాడా?" అన్నాడు.

ఆమె చ్రుకున లేచింది "అవును నా బాబుకుతల్లిని నేనే... మా బాబు నాన్న పేరు నాకు తెలీదు! ఏడీ...నానాయనా...ఇదిగోరా! నిన్ను చంపిన మనిషి వచ్చాడు...మీ మామయ్య... రానాన్నా ఆ ముఖం చూద్దువుగాని..."

ఆమె బొలబొలా యేడ్చేస్తోంది. అంతా అలానే ఆగిపోయారు! శంకరం వాడినముఖంతో "నాకేం తెలీదండీ! వాళ్ళదో జాతి! మాదోజాతి! ఒకసారి చదువుకుంటున్నానని యేదో సహాయం చెయ్యమని కోరింది. చేసాను. ఎవరితో లేచిపోయిందని వాడు అనుభవించి యెటో పోయాడని విన్నాకకూడా వస్తే సహాయం చేసాను."

ఆమె గట్టిగా యేడుస్తూనే "చేసావ్. అసలు సమయానికి యింట్లోవుండి లేదనిపించుకున్నావ్. నివ్వో అయిదురూపాయలిస్తే నా బాబుకి మందుపట్టేదాన్ని—బ్రతికేవాడు. నా ఒళ్లో అమ్మ వుంటూనన్నా పిచ్చిమనిషివని యెవరూ చేరాడుకాదే...నివ్వా నేనా నా బాబుని చంపింది?"

ఈ మాటలు విసరి ఆమె అలా కూర్చుండిపోయి మోకాలు మీద తల ఆన్చి వెక్కి వెక్కి యేడుస్తూనే వుంది. శంకరం కాస్సేపు ఆ దగ్గరగానే కూర్చుండిపోయాడు. ఆమె కొంతసేపయ్యాక లేచి ఎదరగా రెండోవేపు మెట్లుప్రక్కనవుండే ప్రదేశం వేపు నడిచింది. ఆ దారి కొండగుహాలోనికి వుంది. అందులో యిదివరకు ఒక సాధు వుండేవాడట. తల క్రిందికి కాళ్లు మీదకు పెట్టి వెళ్లే యాత్రికుల కంటికి కనుపించేవాడు. ఆయన గురించి యెన్నో కట్టుకథలు లేచాయి. ఒకరోజు తెల్లవారేసరికి సాధు అక్కడ లేడు. ఆ సొరంగం తిన్నగా కాశీకి వుందని అందులోనించి అక్కడకు చేరుకొని వుంటాడని చాలమంది నమ్మకం. ఆ గుహాలోనికి భారతి వెళ్ళింది. ఆమెను ఓదార్చి వస్తానని మిత్రులను పైకి పంపించి శంకరం గుహాదగ్గరకు వెళ్ళాడు. అప్పటికే యాత్రీకులు బాగా పల్చబడ్డారు. ఉండీ వుడిగి ఒకరూ యిద్దరూ అలా పోతున్నారు. ఇంచుమించు నడిరేయి. జల జలా దగ్గరగనే ఒక నీళ్లధార పడుతోంది. గుహాలో చిట్టచీకటిగా వుంది. వెన్నెల వెలుగు వలన యీ ముందుగా ఒక మనిషి కూర్చున్నట్లు గుర్తుపట్టవచ్చు. శంకరం వెంట ఆ యువకుడు కూడా వచ్చాడు. ఆమె వీళ్ళవేపు చూడనేలేదు. శంకరం గుహాలోనికి తలపెట్టేసరికి మట్టెకంపులా వాసన వేసింది. ఆమె కాళ్ళు చాచుకొని ఒకవేపు చారబడి ముఖం అంధకారంవేపు త్రిప్పి తనలో తనే "బాబూ! నివ్వు కడుపులో వున్నపుడు ఆకలితో బాధపడినా...నీ తలపుతో నే కడుపు నిండిపోయేది. కడుపులో కదులుతున్న నీ చిరుపాదాలు...తల...పైనుంచి తాకుతూ నంతోషంగా గెంతులేసేదానను నాన్నా... నీవు పుట్టినరోజున యేమయ్యిందో తెలుసా...వింటున్నావా?...ఓ సందులో కొద్దివారలో తెలివితప్పి పడితే...ఎవరో ధర్మతల్లి ఆసుపత్రిలో చేర్చి వెళ్ళిపోయిందట... తెలివి వచ్చింది...ఈ నీతిలేని మనిషిని, నీతిగల అమ్మ లెన్నిమాటలు పరోక్షంగా అన్నారో...ఎంత బాధ...కానీ అన్ని బాధలూ...నన్ను...యీ గతిలేని మనిషికి అమ్మా అని పిలిచే

నాదుంటాడని...నాదీ అనేది యీ ప్రపంచంలో ఒకటి వుంటుందని ...ఓర్వాను నాయనా! పుట్టావు—నేను తప్పించి నీ పుట్టుకను సంతోషించే దెవరు? నీ పుట్టుకతో నేను యెన్నో ఆశలు పెట్టుకున్నాను—నన్నూ నా పాడుజీవితాన్నీ మరచిపోయాను. ఈ లోకంలో నాయంత గర్వించిన మనిషి లేకపోయిందా క్షణం. నా చీకటి బ్రతుకులో వెలుగొచ్చింది—తుపానులో చిక్కుకున్న నా జీవిత నావకి ఒక ద్వీపంలా అపించావు బాబూ..."

వెనువెంటనే నేలపై దొర్లి యేడవసాగింది. నన్నిలా నువ్వు అన్యాయం చెయ్యటం భావ్యం కాదు నాయనా అంటూనే తల బాదుకుంటుంటే, శంకరం ఆమెను వారించబోయాడు. ఆమె అతన్ని త్రోసివేసినా శాంతంగా "చూడమ్మా! చచ్చినవాళ్లెంత యేడ్చినా రారు! ఈ చీకటిగుహలో వుండటం మంచిది కాదు...... రా......రా......"

"ఈ పిచ్చికాయని తీసుకపోయి యేంచేస్తావ్?" అంది ఆగి, "మందులిప్పించి బాగుచెయ్యిస్తాను" అన్నాడు.

"బాగుచెయ్యించి......యేంచేస్తావ్?"

శంకరంకు సమాధానం దొరకలేదు. ఆమె క్షణంఆగి ఫక్కున నవ్వి "నీ మందూ తిండితో నేను మళ్ళీ చక్కగా తయారౌతాను. చక్కని ఆడదానియందు మగాడిప్రవర్తన యేనాడూ స్వలాభంతోనే కూడుకొనివుంటుందని నా జీవితంలో తెలుసుకున్నాను. వెళ్లండి—వెళ్లండి!"

ఆమె అలాఅంటూ యింకా గుహలోపలికి వెళ్లిపోయింది. వాళ్ళింకా కదలకపోవటంచూసి భయంకరమైన శబ్దాలుచేస్తూ జడిపించబోయింది. శంకరం గుహలోపలికివెళ్ళి "చీకటి. ఇంకా లోపలికి వెళ్ళావంటే పాములు వుండగలవ్......"

ఆమె హఠాత్తుగా అతని మాటలకు అడ్డువచ్చి "ఆ పాము కాటు మనుషులు వేసిన కాటకన్నా అపాయకరమైనవి కావు. నన్నిక్కడ వుండనియ్యి. చీకటికి నేను అలవాటుపడిపోయాను. విచారమే నా నొసటిరాత—పాపమే నా భాగ్యం—నా యీ చెడు గంతాను. యీ చీకటికొట్లోనే భయం, సిగూ లేకండా బ్రతకగలదు...వెళ్లండి ... వెళ్ళిపోండి ... కదలరేం?...నా కొడుకును తిల్చుకోనివ్వరేం......"

శంకరంవచ్చి ఆమెచెయ్యి పట్టుకొని "నామాటవిను, రా!" అన్నాడు. చెయ్యివిదలించుకొని మెల్లగా గుహద్వారంవేపు ప్రాకజొచ్చింది. శంకరం, ఆ యువకుడు బయటనిల్చున్నారు. ఆమె గుహ బయటకువచ్చి నిటారుగానిల్చొని క్రోధస్వరంతో "ఏమి మగవాళ్లు! మీరంతా యెద్దులూ మొద్దులూ! అబ్బా! ఏవిటీ జీవితం తియ్యనిమాత్ర—మన్యను విషం!"

"ఆ విషంలేని మాత్రే యిస్తాను...పద భారతీ!" అన్నాడా యువకుడు. ఆమె పెద్దపెట్టున నవ్వసాగింది. ఆ నవ్వులో గొంతు లేస్తూ "ఆ విషం లేకపోతే నువ్వు చిరంజీవివి కావూ! చావులేని మనిషెడీ? సరేగానీ......" అంటూ ఆమె నవ్వు నాపి భీకరంగా "పోతారా లేదా? చూడండి...యేంచేస్తానో?" అని యింకా కదలని ఆ మనుషులనుచూసి అక్కడేవున్న యెండిన తుప్పనుంచి ఒక కర్ర విరచి వెంట తరమటానికి వుపక్రమించింది. ఆ యువకుడు గబగబ పరుగెత్తి ముందుకుపోయాడు. కానీ శంకరంమాత్రం కదల్లేదు. ఆ కర్రతో ఆమె శంకరం వీపుమీద గబగబ మూడు పార్లు కొట్టింది. ఊఁ అనైనా అనకండా అలా మూడు దెబ్బలూ కాసాక, కర్ర పారవేస్తున్న ఆమెతో వీపు చూపిస్తూ "ఇంకా కొట్టు! రక్తం చిమ్మేటట్లు కొట్టు! నీవు చేసిన అన్యాయానికి కొంతైనా...!"

అతని నోటివెంబడి బాధతో మాట యిక రాలేదు. ఆమె అతని యెదరగా నిల్చొనే సహజంగా రాలుతున్న కన్నీటితో "నే నెంత చెడ్డదాన్ని. నేను నిన్ను కొట్టానా? అదేవిటో నా రాతగానీ... నన్ను ప్రేమించేవాళ్ళనే, నా మాటలతోనూ చేతలతోనూ కష్టపెట్టుంటాను..." ఆమె అతని రెండుచేతులూ పట్టుకొని "వేడుకుంటున్నాను...నీ మంచికోసమే చెప్తున్నా ... యీ బురదను నీ ముఖానికి రాసుకోక...యీ ప్రాణంపోయే మరుక్షణంలో నే యీ శరీరం కంపుకొట్టుంది. నేను నరకంలో వున్నా ప్రేమనేది వుంటే స్వర్గంలో వుంటే ప్రేమించగలవు"

ఆమె ఆగిపోయింది. అతని కనుకొలకుల్లో నీరు నిండిపోయి శరీరమంతా వుద్రేకంతో విజృంభించ సాగింది. ఆమెను తన బాహువుల్లో బంధించి ఆ పెదవులు చేర్చి గట్టిగా మనసుతీరా ముద్దాడాలనిపించింది. కానీ...కానీ...అతను అప్పుడే యింకో స్త్రీ పెదవులతో తన పెదవులు కదిపాడు...యింకో స్త్రీ కంఠాలని తాకాడు. కాళ్లు కట్టుబడుతున్నా తలదించి తిరిగి మెల్లగా అడుగులు వేసుకుంటూ మెట్లమీదకు వచ్చేసాడు. ఆ యువకుడు వేసిన ప్రశ్నలతనికి వినిపించలేదు.

తన వెంటబడుతూ యేదో విషయాలు అడుగుతుంటే శంకరం ఆగి మెల్లగా "నేను నీకు తెలియకపోవచ్చు కానీ నిన్నెరుగుదును. ఎందరో అమ్మాయిల బ్రతుకులను నాశనంచేసిన నీ శీలానికి అసహ్యించుకునే వాడ్ని. కానీ యీ మెమీద నాలో దాగుండిన కోరికలు నీకంటే నన్ను వుత్తముడ్ని చెయ్యలేదు...నన్నింకేమీ అడగొద్దు" అంటూ శంకరం తలవంచుకొని మీదికి వెళ్ళిపోయాడు.

భారతి అలా గుహాద్వారంలో కూర్చుండిపోయింది. దాహం వేసింది. దగ్గరగా వున్న జలధారదగ్గరకు వెళ్ళి నీరు త్రాగింది. కాస్త నీరసం అనిపించింది. ఆవులింతలు వస్తున్నాయ్. నిద్దర ముంచుకొస్తోంది. గుహ మొదట్లో శరీరం వాల్చింది. రెప్పవాల్చటం, యేదో తలపుకొచ్చి రెప్పలెత్తటం జరుగుతోంది. ఉండి వుండి చల్లనిగాలి వీస్తోంది. ఆకాశాన మేఘాలు అక్కడక్కడ చెదరి వున్నయ్. జలజల శబ్దం శ్రావ్యంగా వినిపిస్తోంది. ఆమె నిద్దర నాపుకోడానికి కాసేపు వెల్లకిలా పడుకొని ఆకాశంవేపు చూస్తోంది. ఇంతలో కమ్మనైన సన్నాయిస్వరం ఆ యెత్తునుంచి వినిపించసాగింది. మృదుమధురమై మనసును వుల్లాసంగా ఆ స్వరం అటువేపు లాగుతుంటోంది. ఆమె లేచి కూర్చుని కాస్సేపు చెవులు నిక్కించి విన్నది. తరవాత నిల్చొని ఆ స్వరం వచ్చేవేపే మెట్లమీదనుంచి పైకి నడచింది.

కొన్ని మెట్లెక్కి ఆయాసమనిపించటంవల్ల ఆగుతుంది. అక్కడనుంచి వాద్యస్వరంతో పాటు ప్రజల కోలాహలం వినిపిస్తోంది. మళ్ళీ పాదయాత్ర సాగించగా కంటికి మేర తెగని సమూహం యిసుకవేసినా రాలని మానవులగుంపు అగపడింది. ఆ యెత్తున బంగారుమయమైన దేవాలయగోపురం వెన్నెల్లో మెరుస్తోంది. ఆ వెనుక గోడలా పర్వతం వుంది. దేవాలయానికివతలే మెట్లు దిగవగా మూడంతస్తుల రథం. రథం అనేకరంగుల బట్టల తోరణాలతో అలంకరింపబడివుంది. రకరకాల పువ్వులతోరణాలు రథం చుట్టూ కట్టబడివున్నాయ్. కోవెల మండపంమీదనున్న యెత్తయిన స్తంభాలమీదనున్న కాంతివంతమైన విద్యుద్దీపాల వెలుగు, యీ యాత్రస్థలమంతా పటపగలుగా చేసింది. రథం రెండో అంతస్థులో స్వామివారి విగ్రహం - పూలగుత్తులతో సగానికి కప్పబడివుంది. అర్చకులు స్వామి సన్నిధిని భక్తితో కూర్చున్నారు. రథంముందుగా తాళ్ళను పట్టుకొని లాగటానికి యెందరో సన్నద్ధులైయున్నారు. పెట్రమేక్సులైట్లు వెలుగులో స్వామివారి విగ్రహంలో రమణీయత అగుపిస్తోంది. రథం కదలే సమయం ఆసన్నమైంది.

భారతి ఓక్షణం రెప్పవాల్చకుండా అంతా చూసింది. ఆమె దృష్టి చివరకు రథంలో వున్న దివ్య సుందరమూర్తి వేపు కేంద్రీకరించింది. సమూహానికి యెడంగా ఆ చివరలో నిల్చొనే అక్కడనుంచే చేతులెత్తింది-శరీరమంతా గగుర్పాటు చెందసాగింది. అలా ఆమె జోడించిన చేతులను తలమీదపెట్టి కళ్ళుమూసి

“తండ్రీ! నేను-నీబిడ్డను. పాపిని. అలా అని నన్ను విడిచిపెట్టగలవా? పవిత్రునికన్నా పాపిపైనే నీకు దయ లావట! త్రోవతప్పినవారికే త్రోవచూపిస్తావుగానీ త్రోవలోపోయేవారితో నీకేంపని? భాగ్యభోగాలు అడగను. సుఖంకాంక్షించను. ఒకే ఆశతో వచ్చాను. నా బాబుని నా కిస్తావని...నా కియ్యవూ?”

ఈ చివరిమాటలు ఓ పదిసార్లైనా అన్నది. మనస్సులో యెంత అనుకున్నా బాబుని దేముడు యివ్వలేదు. ఆమె ముందుకు సాగి గట్టిగా “మనసులో అనుకున్నమాటలు వినపడలేదా తండ్రీ? గట్టిగా అంటున్నా...నాబాబుని నాకిచ్చి తండ్రీ!”

రథం కదులుతున్న సమయంలోని ఆ కోలాహలంలో ఆమె కేకలు ఆమెకే వినపడలేదు. ప్రజలు ఒక్కుమ్మడిగా త్రోసుకుంటూ కదిలిపోతున్నారు. ఆ తోపులాటలో ఆమె చిక్కుకుంది. రాపిడి వల్ల ఆమెకు వూపిరిసలపలేదు. అక్కడే కాళ్ళు తెగినట్లు కూలబడిపోతున్న శక్తి తెచ్చుకొని రథంవేపు మనుష్యుల్ని తలతో తోసుకుంటూ ఖాళీ చేసుకొని వెళ్తోంది. “గోవిందా” అన్న కేకలు మిన్ను ముట్టున్నాయ్. ఆమె దగ్గరికి పోతూనే అలా ప్రాకుతూ అతికష్టంమీద రథంలాగుతున్న ఒక మనిషి కాలును పట్టుకోగలిగింది. వాడు ఏదో అనుకొని కాలువిసిరాడు. ఆమెముఖానికి బలంగా తగిలింది. చచ్చిపోయినట్లు ఒక్కసారి కూలబడితే యెవరో యెత్తినట్లయింది. యెవరెత్తింది ఆమె చూడలేదు. ఆ తాడు ఆమెకూ దొరికింది. ఆమె లాగుతూ “గోవిందా” అని అరచింది. ఇంకా రథం దగ్గరగాపోయి ఆ అంతస్థు యెగబ్రాకి స్వామి సన్నిధిలో తల బాది కొట్టుకొని, ప్రార్థించి, మొక్కి, తనబాబుని తెచ్చుకోవాలనే పట్టుదల, విశ్వాసం ఆమెకు శక్తినిస్తోంది. ఆమెను ఎగదిగా పోనివ్వకుండా యెవరో అడ్డుతున్నారు. ఆ అడ్డే వ్యక్తిమీద ఖస్సుమని లేచింది “నా దేముడు నా తండ్రి! నా కష్టాలు చెప్పుకుంటానంటే అడ్డటానికి నివ్వెవ్వడవు?”

“ఒద్దమ్మాయ్ ఆ చక్రాలకింద పడ్డావంటే చస్తావు!”

“అంతనమ్మకంలేకుండా దేవుడి దగ్గరకెలావచ్చావే? నమ్మే వాళ్ళను చంపుతాడా? అలాంటివి వందచక్రాలమీదనుంచి వెళ్ళినా చావురాదే! చూడు కావలిస్తే.”

ఆ పోలీసు జవాను ఆమెను అటు వెళ్ళకుండా అడ్డుకుంటే నానా రభస చేసింది. వాడి టోపీలాగబోయింది. చేయి పట్టుకుని గుంజాటన పడింది. కానీ ఆ జవాను ఆమెను అటువేపు కదలనివ్వలేదు. క్రిందనుంచి ప్రాకి తప్పించుకోబోయింది. ఈ సారి యింకో పోలీసుకూడా తోడయ్యాడు. తను అనుకున్నటు సాగకపోవటంతో గట్టిగా “స్వామితండ్రీ! నీ దగ్గరకు రానివ్వకుండా నన్నెలా అడ్డుకొంటున్నారో యీ రాక్షసులు! నీ చక్రంతో వాళ్లను వాంత మార్చు ప్రభూ” అంటూ ఆమె అంతలో వుగ్రురాలై త్రోవచేసుకోలేక వాళ్ళ చేతులు పట్టుకొని కరవబోయింది— కోలాహలం హెచ్చిపోయింది. రథం ఆగింది. “అదిగో నా కోసమేనా తండ్రీ రథం ఆపావు. వదలండి” ఈమె యీ మాటలు అంటుండగానే యిద్దరూ పోలీసులూ చేరో చేతిని పట్టుకొని జనసమూహంనుంచి ఖాళీ చేసుకొని బయటకు తీసుకుపోతున్నారు. ఆమె గుంజాటన పడుతూ పెద్ద కేకలతో “తండ్రీ...తండ్రీ...వీళ్ళు నన్ను యీడుస్తుంటే చూస్తూ యెలావూరుకుంటున్నావ్? రథం ఆపిన వాడివి యీ మాత్రం కనికరం చూపించవా? నీ కాళ్ళమీద పడి మొక్కుతాను. నా బాబు గురించి నీ దగ్గరగా వచ్చి చెప్పుకోనీయవూ? ఆ బంగారుబాబు! చారదేసికన్నా...” ఇలా కేకలు వేస్తుంటూనే రథం కదలిపోజొచ్చింది. ఆమెను మెట్లెక్కించి కోవెల లోనికి ఆ పోలీసులు తీసుకపోతుంటే కదలే రథం వేపు చూస్తూ “ఇదేనా నీ దయ. నీదంతా బూటకమేనా తండ్రీ! నువ్వు వుత్తి పాషాణమేనా? ఈ పాషాణంలో జగాన్ని త్రిప్పే ప్రాణం వుందని వెఱ్ఱిదాన్నయిపోయాను. నిజంగా నేను వుత్తి వెఱ్ఱిదాన్ని. నువ్వు నిజమైన దేవుడవైతే—నీ కెందుకు ఈ అట్టహాసం—ఈ బాజాలెందుకు భజంత్రీ లెందుకు? దరిద్రనారాయణుడవై నాలాంటి పతితుల కష్టాలు తెలుసుకొనే వుందువు?”

రాను రాను ఆమె గొంతుక పట్టిపోయింది. అరిచే శక్తికూడా లేదు. అలా నోరు మాత్రం మెల్లగా గొణుగుతూ కదులుతూనే వుంది. దేవాలయ గంటస్తంభం వరకు యీడ్చుకొని వెళ్ళిన పోలీసులకు మళ్ళీ యీడ్చే అవసరం లేకపోయింది. ఆమె నిల్చుంది. నిల్చుంటే కాళ్లు స్వాధీనం తప్పినట్లు నీరసంగా వుంది. ఆమె చెరో చేతిని ఆ పోలీసులమీద వేసింది. వాళ్లామెను సంతోషంగా ప్రక్కచూపులతో చూస్తూ ముందుకు నడిపించారు. దేవాలయం ఉత్తర ద్వారంగుండా బయటకు తీసుకవెళ్లారు. అలా మెట్లమీదుగా పోతే త్రోవ ఫుట్టుపాతవద్దకు పోతుంది. ఆ ప్రదేశంలో [illegible]

స్నానానికి పశులు తియ్యించుకోడానికి వచ్చే జనం వుంటారు. ఈ రాత్రిమీద నిర్జనంగా వుంది. ఆమె నమస్కరించేగాని నీరసంతో తెలివి తప్పినట్లవుతోంది. నరాలన్నీ పీకుతున్నాయ్. ఆయాసంగా వుంది. నడుస్తున్న ఆమె దబ్బున కూలిపోయింది. హిస్టీరియా వున్న మనిషిలా ఆమె కేకలు వెయ్యగానే పోలీసులు ఆమెను అక్కడ విడిచి వెనుకకు వెళ్ళిపోయారు.

ఆమెకు తెలివి వచ్చే సరికి ఏకాదశి చంద్రుడు పశ్చిమాంబుధిలో క్రుంకిపోయాడు. ఆకలి...బ్రహ్మాండమైన నీరసం... కాలు కదపలేకుండాపోతోంది. అంతా కలలా వుంది. తను యెక్కడ వున్నట్లు? తెలుసుకోడానికైనా శక్తిలేదు. అలా ఆ మెట్టుపైనే మళ్ళీ తల వాల్చింది.

ఆ సమయాన చల్లనిగాలి వీచింది. ఆ గాలి ఒక స్వరాన్ని మోసుకవచ్చింది. ఆ నిర్మల వాతావరణంలో ఆ కమ్మని స్వరం మెదడులోని సర్వ నాడుల్లోనికి వ్యాపించి జీవం పోస్తోంది. ఆమె తేరిచూసింది. ఎవరూ కనపడలేదు. ముందుకు ప్రాకి వంగిచూసింది. అదిగో అల్లంతదూరంలో ... యెవరో కూర్చొని హరినామ స్మరణ చేస్తున్నారు. పుట్టుధార దగ్గరనున్న విద్యుద్దీపంకాంతి అతనిమీద పడోంది. అక్కడకు వెళ్ళటానికి లేచింది. రెండడుగులు వేసేసరికి కాళ్ళు వణికాయ్. తూలిపోయింది. గుండె గడగడ కొట్టుకుంటోంది. ఐనా మెల్లగా అటువేపు ప్రాకుతూ, ఆగుతూ ప్రాకుతూపోయి ఆ మనిషి కొద్దిగాదూరంలో ఒక సంపెంగచెట్టు మొదలుకు ఆరబడి కూర్చుంది. ఆమె వచ్చిన చప్పుడు అతనికి వినపడనట్లు ఎదరగావున్న ఆమెను చూడనట్లే వున్నాడు.

అతనివేపు చూసింది—ఒకచేత తంబురా యింకోచేత చిరతలు. వల్లనిగడ్డం, విరబోసిన జుత్తు. మెడలో రుద్రాక్షమాలలు, చిన్నపంచె. ఆమె యెంతసేపో అతనివేపు చూడలేదు. ఆ చెట్టు మొదట్లో ఆరబడి చిన్నస్వరంతో "ఆకలి...ఆకలి..."అంది.

పాట ఆగిపోయింది. "ఎవరమ్మా..." అన్నాడు.

"ఆకలి...ఆకలి..."

"రా అమ్మా...రా... ఇదిగో పళ్ళు."

ఆమె అటువేపు కళ్ళు త్రిప్పింది. దగ్గరనున్న జోలినించి మూడు అరటిపళ్ళు తియ్యటం చూసింది.

"లే...యిలా విసిరే బాబూ..."

"తీసుకో అమ్మా..."

"లేదు...ఇలా విసిరే బాబూ."

విసిరిన పళ్లు సరిగ్గా ఆమె ఒడిలో పడ్డాయ్. ఆమె ఒక్కపండునోటిలోపెట్టగానే అమృతంలా రుచించింది. శక్తి చేకూరుతో సాగింది. అలా అతనివేపు చూస్తూనే మిగతా రెండు పళ్ళను తిన్నది. మరుక్షణంలో మెల్లగా లేచి యెదరగావున్న ధార దగ్గరకు వెళ్ళి కడుపునిండుగా నీరు త్రాగింది. తిరిగివచ్చి మళ్ళీ ఆ స్థలంలోనే కూర్చుంది. నక్షత్రాల వెలుగుతున్నాయ్. చల్లనిగాలికి చెట్టు కొమ్మలు వూగుతున్నయ్.

"రా అమ్మా...రా..." అని పిలిచాడు.

"ఈ పాపిని నీలాంటి పుణ్యాత్ముడికి దూరంగా వుండనీయ్ బాబూ!

"పిచ్చితల్లీ! పాపపుణ్యాలు జీవుని కాలాకు రెండు కళ్లమ్మా...రెండు కళ్ళూ ఆ దేవునికి ప్రియమైనవే! అవి లేకపోతే యీ లోకంలో దివారాత్రులుండవు - మనుషులు మనుగడే లేదు. ఇంతకీ నీవు పాపివని యెవరనగలరు?"

ఆమె కొంత ముందుకు జరిగి "నేను పాపినికాక యింకెవరవు తాను బాబూ? తాగుతాను, నా శరీరం అర్పించి బ్రతుకుతాను—నేను వడిచే త్రోవలో నన్నంతగా ప్రేమించిన మనిషిని నడవను కదా?"

అతను చిరునగవుతో ప్రశాంతస్వరంతో "బాధపడ్డావు కాబట్టి నిన్ను ప్రేమిస్తున్నాను. చాలమంది అసహ్యించుకున్నారు కాబట్టే నిన్ను ప్రేమిస్తున్నాను. నివ్వే అందరికంటె హెచ్చుగా ప్రేమింపవలసిన దానవు. అందుకే నిన్ను ప్రేమిస్తున్నాను."

అతని హృదయంనించి స్వచ్ఛమైన కంఠస్వరంతో వచ్చిన యీ మాటలు వినగానే ఒక్కసారి ఆమెహృదయం వుప్పొంగిపోయింది. ఆవేశంతో ముందుకు వంగిపోతూ సాష్టాంగపడి ఆనంద బాష్పాలతో "అయితే నీవే నా తండ్రివి, నీవే నా భర్తవు, నీవే నా బాబువి, నీవే నా దేముడివి. నీవే నా సర్వస్వం బాబూ!"

భర్తను కౌగలించుకోడానికి ఉద్యుక్తమైన భార్యలా, బిడ్డను ముద్దులాడబోయే తల్లిలా, తండ్రిని గౌరవించే కుమార్తెలా, దేవుని పాదాలముందుతల వ్రాలే భక్తురాలిలా ఆమెలో నానావిధములైన అనుభూతులు రేగి అతని చేరువకు కదలిపోయింది.

తంబురా మీటుతుంటే...అతనితో కలసి గొంతుక విప్పింది. నిర్మల వాతావరణం. వసంతపు శోభలో హృదయాలు పరవశమయ్యే ఆ కమ్మని దివ్యసంగీతం భూపరిధులను దాటి ప్రతిధ్వనిస్తోంది. ఆ కమనీయగాత్రం ఆమెదేనా? ఆమెలోవున్న దేవునిది... అది ఒక్కపాటే కాదు—'జీవం! జీవమేకాదు శబ్దస్వరూపంలో వున్న దేముడే!'

ఈ దివ్య సంగీతంతో ప్రకృతంతా శోభించింది. ప్రాణులంతా పరవశమయ్యాయ్. చెట్లు తల లూపుతున్నాయ్. కోయిల ఒకసారి నోర్విప్పి ఆపివేసింది. తెలివితోవున్న పక్షులు పిల్లలతో ముచ్చటలుమాని గూళ్లలో నిశ్శబ్దంగా వింటున్నాయ్. అదిగో ఆదిశేషు పుట్టచాటున నాగరాజు తలాడిస్తున్నాడు. పూలపై వ్రాలిన తుమ్మెదలు మకరందం గ్రోలటం మరచిపోయాయ్. పైలోకాలకి చేరి గంధర్వ కిన్నెర, కింపురుషులు గొంతుకల్లో కదలి మళ్ళీ ప్రతిధ్వనిస్తోంది సంగీతం! మాయ మర్మాలను చీల్చి మానవాళిని పశుపక్ష్యాదుల్ని ఆనందాబ్ధిలో ఓలలాడిస్తోంది! మానవ ప్రవాహం చుట్టూ చేరుకుంది.

ఆమె, ఆవిరాగిచుట్టూ నృత్యంచేస్తూ దేవదేవుని కీర్తనలో తన్మయత్వమై పరమానందాన్ని పొందుతోంది. కళ్ళవెంబడి అదే తడవుగా ఆనందబాష్పాలు రాలుతున్నయ్.

ఉషస్సు యీ సంగీతానికి మంత్రముగ్ధయై పరుగెత్తుకొచ్చింది. ఏం చూసింది? దైవత్వాన్ని పొందిన మానవస్వరూపం ఒక్కసారి ఆవిరాగి ఒడిలో కూలిపోయింది. తంబురా తీగలు తెగిపోయాయి. పక్షుల కలవరం—నాగరాజు పడగ నేలను కొట్టాడు. ప్రజలకళ్లల్లో కన్నీరు చిమ్మింది—

నేత్రాలులేని ఆవిరాగి తన ఒడిలోవున్న కట్టెముఖాన్ని తడుముతూ చేతితో తాకాడు. అతని కన్నీటిబిందువులు ఆముఖంపై రాల్చుతూ "ఈ మంచి ముత్యాన్ని మనిషి ధరించలేకపోయాడు. దేముడు ధరించాడు!"

# అధునాతనమానవుని ఆత్మాన్వేషణ

## శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

ఇది శాస్త్రీయయుగము. శాస్త్రీయదృష్టి లేనివాడు, ఈనాడు వెనుకబడ్డవాడే. జీవితమును శాస్త్రీయదృష్టితో సాగించువాడు ఆరోగ్యవంతుడు, ధన్యుడు. ఈ విషయమై కారల్ యూంగ్ ఒక సిద్ధాంతమును లేవదీశాడు. ఇతను ఊహాలమీద చెప్పినది కాదిది. ఇతను మానసికశాస్త్ర వైద్యుడు. అనేక సంవత్సరాలు ఈ వైద్యంలోని తన అనుభవాలతో ఈ సిద్ధాంతమును ఏర్పాటుచేశాడు. ఇందుకై ఇతను ప్రపంచంలో నలుమూలలవున్న జాతీయుల నందరినీ పరిశీలించాడు. ఆదిమ జాతీయులను పరిశోధించుటకుగాను, ఇతను వారిదేశాలకు వెళ్లి వారితో అనేక సంవత్సరాలు, వారి మధ్య నివసించాడు. ఈ విధంగా వీరు అన్ని రకాల మనుష్యులను పరిశీలించారు. ఎందరినో రోగులను చూచాడు. వారికి వైద్యంచేశాడు. ఈ కృషిలో తాను పొందిన అనుభవములే వీరి సిద్ధాంతము. మానసిక శాస్త్రంలో వీరు నేడు ప్రామాణిక పురుషులు. మన విశ్వవేదాంతి, రాధాకృష్ణగారు, సంవత్సరం క్రిందట Recovery of faith అనే గ్రంథం వ్రాశారు. దీనిని ఇంగ్లండులో ప్రచురించారు. ఇందులో యూంగ్ గారు వ్రాసిన 'Modern man in Search of soul' అనే గ్రంథంనుండి కొన్ని వాక్యములు ప్రమాణములు తీసుకున్నారు. యూంగ్ మానసిక శాస్త్రంమీద అనేక గ్రంథములను రచించాడు. అనేక ఉపన్యాసముల నిచ్చాడు. అప్పుడప్పుడు, వివిధ విషయాలను గురించిన వీరి ఉపన్యాసములను ఒక గ్రంథంగా ప్రచురించారు. వీరి గ్రంథములు, ఉపన్యాసము లన్నీ జర్మనీభాషలో చెప్పారు. దానికి, Modern man in search of soul అనే పేరుపెట్టారు. జీవితమును శాస్త్రీయ దృష్టితో అన్నివైపుల చర్చించి, కొన్ని నిర్ణయములకు వచ్చిన గ్రంథమిది. యూంగ్ ప్రతిపాదించిన సిద్ధాంతములను క్లుప్తంగా మనవిచేస్తాను.

యూరపు దేశంలో, గ్రీక్, రోమక యుగంలోనూ, మధ్య యుగంలోను ఆత్మను వస్తువుగా ఎంచేవారు. మానవాళి అంతా, అనాదినుండి 19 వ శతాబ్ది మధ్యవరకూ ఈ అభిప్రాయంతోనే వున్నారు. 19 వ శతాబ్ద చివరిభాగంలో, మానసికశాస్త్రము ఇంకొక రూపం దాల్చింది. భౌతిక దృక్పథము ప్రారంభమైన రోజు లవి. కంటికి కనుపించనిది, చేతికి తాకనిది అంతా అనుమానమన్నారు. కాదన్నవార్ని ఎగతాళిచేశారు. స్వభావంగా జ్ఞానం పైకి వసుస్తుంది. కాని ఆ కాలంలో పక్కలకు నడిచింది. దీనికి కారణము, ఆ కాలంలో బయలుదేరిన నూతన ప్రపంచాన్వేషణ. భూములను, సంపదలను వెతుకుటకు వారి దృష్టి, భూమిమీదకు ప్రసరించింది. ఆ కాలంలో మనస్సు వస్తువునుండి పుట్టుతుందని నమ్మారు. మనస్సు మాంసగ్రంథుల వ్యాపారమువల్లను, ఆలోచనలు మెదడునుండి కలుగునని అన్నారు. అనగా వారు మనస్సులేని మానసిక శాస్త్రం నిర్మాణం చేశారు. అప్పటివరకు మనస్సు వేదాంతశాస్త్రంలో ఒకభాగం మాత్రమే. వస్తువు స్థలమును ఆక్రమిస్తుంది. ఆత్మవస్తువైతే, అది స్థలాన్ని ఆక్రమించాలి. కాని దానిని ఒకచోట వుంచలేము. ఆలోచనలు మెదడులో పుట్టుతవని అనుకుంటాము, కాని అవి అనుభవంలో వచ్చునప్పటికి కవి హృదయంలో వున్నట్లు అనిపిస్తుంది. ఉద్రేకములు శరీర మంతటా వ్యాపిస్తవి. ప్రతి సామాన్యునికి కూడా అతను హృదయంతో ఆలోచిస్తున్నానని తెలుసునే; అమెరికావారు, ఆలోచనలు తలలో పుట్టుత వంటారు. అమెరికావారు ఏమైనా పిచ్చివారా అని, ప్యూబ్లో ఇండియన్‌లు, డాక్టర్ యూంగ్‌ని అడిగారు. మనస్సు ఒక స్థలంలో లేదు. కనుక దానికి శరీరం లేదు. శరీరములు నశిస్తవి. శరీరంకానిది నశించదు. మనస్సు నిద్రలోకూడా వున్నది. అది వున్నట్లు స్వప్నములు రుజువు చేస్తున్నవి. పూర్వకాలంలో స్వప్నములను విషయసేకరణ కుపయోగించేవారు. అఖండమైన బహుకాల నాగరికత అనుభవించిన హిందూ చీనాజాతీయులు మనస్సు ఆధారంతో వారి సంస్కృతిని బ్రహ్మాండంగా నిర్మించుకున్నారు. ఉన్నతస్థానం పొందినవారి ఆత్మజ్ఞానము మనస్సుమీద ఆధారపడ్డదే. సృష్ట్యారంభంనుండి మానవుని జ్ఞానము వృధాగాపోవుటలేదు. వారి జ్ఞానము అవ్యక్త జ్ఞానములో కలిసిపోతుంది. ఇంద్రియజ్ఞానం వలె, ఈ అవ్యక్త జ్ఞానము కూడా ఆలోచిస్తుంది, చూస్తుంది, అనుభవిస్తుంది, పనులచేస్తుంది, చెప్పుతుంది. ఇందుకు మానసిక వైద్య శాస్త్రములో, స్వప్నముల అనుభవములలో అనేక రుజువులున్నవి. కాని ఈ రెండు రకముల జ్ఞానములలో ఒక భేదంవున్నది. ఇంద్రియ జ్ఞానమును తీవ్రపరుచుట, ఏకాగ్రత కలుగ చేయుటగలదు. అవ్యక్త జ్ఞానమున కాలిస్తులు లేవు. అవ్యక్తజ్ఞానము విశ్వవ్యాపి. దీనిలో పూర్వుల అనుభవాలు కలిసి వున్నవి. కనుక దీనిని సాముదాయక మానవు డనవచ్చు.

ఇప్పటివరకు వ్యాధిని వారణవరకే వైద్యం అనే అభిప్రాయములతో వున్నారు. ఇప్పుడా అభిప్రాయం తప్పు. ఇప్పుడు పూర్తిగా మానవునకు వైద్యం జరగాలంటున్నారు. ఈ అభిప్రాయము మానసిక వైద్యంలోకూడా వున్నది. కనుపించే జబ్బునుండి, మనస్సునూ మానవు నంతటికి త్రిప్పాలి. జబ్బులు మానవుని తప్పు నడకవల్ల వస్తున్నవి. మానసికవ్యాధులు, మానవుడు తప్పుదారిని నడుస్తున్నట్లు చెప్పే సంకేతములు. డాక్టర్ యూంగ్ వద్దకు విద్యావంతుడూ భాగ్యవంతుడు, యువకుడైన ఒక మానసికరోగి వచ్చాడు ఒకసారి. అతనిని పరిశీలించగా అతని జబ్బుకు కారణం ఇదిగా కనుపించింది. ఇతను సైన్ అనే పట్నంలో వుంటుండగా, ఒక ఉపాధ్యాయినితో స్నేహం కలిసింది. ఈమె సంపన్నురాలుకాదు. కాని అతనిని

ప్రేమించింది. అతనికికూడ ఈమే డబ్బు ఖర్చు పెట్టేది. లేక అవస్థ పడేది. ఆమెభర్తను వెనకకూడా పెట్టుకున్నా, ఇతని మనస్సు అంగీకరించలేదు. చూస్తూ వూరుకున్నాడు. ఇది అతనిలో వ్యాధిగా బైలుదేరింది. ఇదికూడా మానసిక వైద్యంలో ఒకసత్యము. జీవిత అర్థము తెలియుటకూడా అవసరము. యూంగ్ రోగి ఒకామె ఎప్పుడూ ఇట్లా అనేదట. తన జీవితపు అర్థమూ, దాని పనీ ఏమిటో తనకు తెలిస్తే, తనకు నెర్వస నరాలబాధ వుండదుగదా అని అంటుండేది.

మానవుడు తప్పుదారివల్ల అనేక కష్టాలకు లోనౌతుంటాడు. అవ్యక్త జ్ఞానము మానవునికి, అప్పుడు కొన్ని సూచనలను స్వప్నములద్వారా ఇస్తుంది. స్వప్నముల అర్థము గ్రహించే జ్ఞానం కావాలి. నేటి మానసిక శాస్త్ర వైద్యులు ఇందుకు సూచనలను ఇవ్వగలరు. వీరు స్వప్నములమీద గొప్ప శాస్త్రమును నిర్మించారు. తీరని కోర్కెలయొక్క ప్రూపాలే కలలని ఇదివరకనే వారు. తీరని కోర్కెలవల్ల కొన్ని స్వప్నము లుండొచ్చు కాని అన్ని స్వప్నము లిటనుటకు వీలులేదు. స్వప్నములు అనేక సత్యములను చెప్పుతున్నవి. అనేకమంది వేదాంతులకు, శాస్త్రజ్ఞులకు, ఋషులకు, ప్రవక్తలకు, ఇతరులకు అనేకసార్లు సత్యమును స్వప్నములు తెలియచేసినవి. ఇది అందరు ఎరిగిన విషయమే. మానసిక వైద్యులకు వారి రోగులయొక్క స్వప్నములు చెప్పేటటువంటి, సత్యముల అనుభవములు అనేకము లున్నవి. రోగులకు కలలు, వారి జబ్బు ఎటువంటిది వాటి నివారణ ఎట్లా చేయవలెనోకూడా సూచన లిస్తుంటవి. డాక్టరు యూంగ్‌కు ఇటువంటి అనుభవములు అనేకములున్నవి.

ఉన్నత పదవిలోవున్న పెద్దమనిషి ఒకసారి డాక్టర్ యూంగ్ వద్దకు వచ్చాడు. ఆ రోగి ఆదుర్దాతో, తలదిమ్ముతో, తిప్పుడుతో, శ్వాస సరీగా తీయలేకుండా వున్నాడు. దీనిని పర్వతవ్యాధి అని అంటారు. ఇతను తాను గతరాత్రికన్న రెండుకలలను గురించి యూంగ్‌కు చెప్పాడు. ప్రథమ స్వప్నంగురించి ఇట్లా చెప్పాడు: అతను తన స్వగ్రామం వెళ్ళాడు. అక్కడ తన చిన్ననాటి స్నేహితులు కనుపించారు. కాని ఇతను వార్ని చూడనట్లుగా నటించాడు. వారిలో ఒకడు ఇతను తరుచు ఇక్కడికి రావటంలేదని అన్నాడు. ఇదీకల. ఇతను పేద రైతుకుటుంబంలో పుట్టాడు. స్వప్రయోజకత్వంతో పైకివచ్చాడు. ఇంకా పైకిపోవలెనని వున్నది ఇతనికి. కాని ఇతనిశక్తి ఉడిగిపోయింది. పోయినా ప్రయత్నం మానలేదు. కనుక ఈ జబ్బువచ్చింది. అతను తక్కువ స్థితినుండి పైకిపోవుట, ఇంక అక్కడినుండి పైకిపోలేకపోవుట, అక్కడినుండి తిరోగమించుట, ఈకల సూచిస్తుంది.

రెండవకలనుగురించి ఇట్లా చెప్పాడు. హఠాత్తుగా ప్రయాణం బయలుదేరాడు. వెంట తీసుకువెళ్ళే సామాను త్వరగా దొరకలేదు. రైలు వెళ్ళేసమయం దగ్గరపడుతుంది. ఎట్లాగో తన సామానును సర్దుకుని బయలుదేరాడు. కాని వీధిలోనికి వెళ్ళేటప్పటికి తన ముఖ్యమైన కాగితాల చిన్నపెట్టె మరచినట్లు తెలుసుకున్నాడు. తిరిగి ఇంటికి వచ్చాడు. చిన్నపెట్టెను తీసుకుని రైలు స్టేషనుకు పరిగెత్తాడు. రైలు అప్పుడే బయలుదేరింది. రైలు 'ఎస్' ఆకారంలో, వంకరగా, మెలుపుతిరిగిపోతున్నది. ఈవంపులో, ముందున్న డ్రైవరు రైలును వేగంగా వదిలితే, చివరపెట్టెలు తల్లక్రిందు లౌతవేమోనని ఇతనికి భయం కలిగింది. అనుకున్నట్లే బోల్తా పడనేపడ్డవి చివరిపెట్టెలు. మహావిపత్తు జరిగిపోయింది. ఆ భయంతో ఇతను మేల్కొన్నాడు. ఈస్వప్నం తాను పైకిపోలేనని ఉద్దేశమును సూచిస్తుంది. ముందున్న డ్రైవరు అజాగ్రత్తగా వేగముగా వదిలినందున, వెనుకపెట్టెలు తల్లక్రిందులైనవి. ఇది నరాలజబ్బును తెలుపుతుంది. క్రిందినుండి పైకివెళ్ళేపనిలో అతనిశక్తి ఉడిగింది. అతను పొందిన స్థానంతో అతను తృప్తిచెంది వుండవలసింది. కాని అతని ఆశ అతనిని ముందుకు నెట్టింది. ఇందుకు అతను తగివుండలేదు. నరాల జబ్బు ముందు సూచన. అతనిని, తన ప్రయత్నం మానుకొమ్మని యూంగ్ సలహాచెప్పాడు. అతను వినలేదు. దానిఫలితము రైలు బోల్తా కొట్టనేకొట్టింది. ఈవిధంగా జబ్బు ఫలానా, నివారణ ఫలానా అని కలలు సూచిస్తవి. ప్రతి కలకు అర్థంవుంటుంది. గడచిన సంగతులు తెలుపు కలలను తెలిసికొనుట సులభమే. కాని భవిష్యత్తును చెప్పేకలలు సులభముగా అర్థముకావు. ఇవి రోజొక సూచన నిస్తుంటవి. మనము అవ్యక్తములో సగంకాలం వుంటాము. అప్పుడు జ్ఞానము, అవ్యక్తములో కలిసిపోతుంది. తర్వాత అవ్యక్త జ్ఞానము, వ్యక్తజ్ఞానంద్వారా పనిచేస్తుంది. అవ్యక్తజ్ఞానముయొక్క భాష ఈ స్వప్నములు. ఈస్వప్నములు కొన్ని సంకేతములద్వారా మానవునికి సూచన లిస్తుంటవి. స్వప్నములు జీవితరహస్యములను చెప్పుతుంటవి. వాటిని అర్థం చేసికొనంతకాలము అవి ఏదోరూపంగా బాధిస్తూనే వుంటవి. మళ్ళీమళ్ళీ ఏదో సంకేతముల నిస్తూనేవుంటవి. స్వప్నసూచనలను గ్రహించుటకు రోగి మానసికస్థితిని అర్థం చేసికొనుట అవసరం. రోగికిచికిత్సారంభంలో వచ్చేకలలు జరిగిపోయిన వాటిని తెలుపుతుంటవి. స్వప్నసూచనలు అతని చావుబ్రతుకులకు సంబంధించినవి. కనుక వీటిని బహు తెలివితేటలతో తెలిసికోవాలి.

జ్యూరిక్ నగరంలో యూంగ్‌కు పర్వతారోహకుడైన మిత్రుడున్నాడు. ఇతని కలను గురించి యూంగ్‌కు ఇట్లా చెప్పాడు: తాను గొప్ప పర్వతంమీద, ఎత్తయిన మంచుశిఖరంమీద ఎక్కుతున్నాడు. ఇట్లా పైపైకి ఎక్కిపోతున్నాడు. అక్కడ విచిత్ర వాతావరణం అతనికి ఎదురైంది. అది అతనికి ఎంతోహాయి అనిపించింది. ఇంకా పైకిపోవలె ననిపించింది. ఇంకా పైకి ఎక్కాడు. శిఖరాగ్రం చేరాడు. అక్కడినుండి వాయువులో అడుగుపెట్టాడు. తర్వాత, మహా పారవశ్యంలో మేల్కొన్నాడు. యూంగ్ ఇతనికి సలహాఇచ్చాడు. ఇద్దరు దారిచూపువారితో కలిసి వెళ్ళమన్నాడు. పర్వతారోహకునికి ఈసలహా చెవుదూరలేదు. రెండునెలల తర్వాత దానిఫలితము తెలిసింది. దారిచూపువారు లేకుండా ఇతను ఒక యువకమిత్రునితో కొండఎక్కి, ఒక మంచుపర్వతం క్రిందపడి చని పోయినట్లు తెలిసింది. ఇతను ఆపర్వతం క్రిందపడ్డ సమయంలోనే, మిలిటరీ కాపలావాళ్ళు చూచుట జరిగింది. వీరు ఇతనిని, మిత్రుని బైటికి తీశారు. ఇతను పర్వతంమీద, అంచున ఎక్కుతూ గాలిలో అడుగు పెట్టాడు. దీనిని ఇతని స్నేహితుడు క్రింద వుండి చూస్తున్నాడు. పై అతను క్రిందనున్న ఇతనిమీద వచ్చి పడ్డాడు. ఇద్దరూ తునాతునకలైనారు, అతను తనకలలో పొందిన పారవశ్యత ఇదే.

మానవునికి తాను చేసేది, పాపమని తెలియగానే దానిని మాయటపు ఉపాయం వెతుకుతాడు. ఇతరులనుండి దాచబడ్డదేదైనా రహస్యమే. రహస్యాన్ని పోషించటం విష సమానము మనస్సుకు. పాపభీతి, అతనిని ఇతరులనుండి వేరుచేస్తుంది. తప్పుచేసిన మనోభావం విస్తృతమౌతుంది. ఇది నాశనహేతువు. అది అతనిమీద పెద్ద భారంగా ఏర్పడుతుంది. సంఘ రహస్యములలో ఇట్టిబాధ లేదు. వ్యక్తి రహస్యమే గొప్పబరువు. మానసిక జ్ఞానం విక్రమించినప్పుడో నిద్రలోనో, దాని స్పర్శపైకి వస్తుంది. దాని ఫలితము కల. రహస్యాలు మనలో కొంతకాలం జ్ఞాపకం వుంటవి. తర్వాత మరిచిపోతాము. మనం మరిచినా అవి మనను మరవవు. అవి మన జ్ఞానావస్థలో వుండవు కనుక, వాటి ఫలితాలు వేరేవుంటవి. కాలు జారటం, నోరు జారటం వ్రాతపొరపాట్లు, జ్ఞాపకాలు రాకపోవటం ఇటువన్ని అతని అవ్యక్తంలోనున్న లోపాల ఫలితాలే. ఇవి అనేకమందిని తప్పుదార్లలో పెట్టటం కూడా కద్దు. ఇట్టివి ఆత్మహత్యలను పురికొల్పుట కూడా జరుగుతుంది. ఈరహస్య ఫలితాన్ని తెలుసుకున్న యెడల, ప్రయత్నంవల్ల తప్పించుకోవచ్చు. స్వరహస్యములు పాప, నేరఫలితాన్ని కలిగినట్లుగానే, ఉద్రేకములను అణచటం, దాచటం కూడా అట్టి ఫలితాల్ని కలిగివున్నవి. వీటి నుండి విముక్తికి ఉపాయమున్నది. ఇదే పాపమును ఒప్పుకొనుట, పశ్చాత్తాపము ప్రకటించుట. ఇది మంచువలె ఫలితాన్నిస్తుంది. గ్రీక్ రహస్య శాస్త్రంలో ఒక వాక్యం వున్నది. "నీవు కలిగివున్న దానిని ఇవ్వు, తర్వాత నీవు పొందుతావు" దీనిని మానసిక వైద్య శాస్త్రంలో ప్రథమ సూత్రంగా ఎంచుకోవచ్చు. అనాదిసత్యాన్ని, మానసికశాస్త్రం శాస్త్రీయంగా కనుగొనటమే. పశ్చాత్తాపము మతంలోని మాట, పరిశుభ్రం చేయుటం మానసికశాస్త్రపు పదము. ఇదికూడ గ్రీక్ మతంలోని శబ్దమే. పరిశుద్ధిపు గమ్యం, పూర్తి పాపపు వప్పుదల. ఈవప్పుదల నాలికనుండి కాదు, హృదయపూర్వకమైనదిగా వుండాలి. దీనిఫలితమువల్ల రహస్యోద్రేకపు బరువు తీరుతుంది. ఇది సామాన్యులలో అద్భుతఫలితాల్ని ఇస్తుంది.

కొందరు రోగుల మానసికాన్వేషణలో, వారి అవ్యక్తజ్ఞాన భూమిలో ప్రవేశందొరకదు. అటువంటివారికి వైద్యుడు పరిస్థితులు తెలియ చెప్పాలి. మంచి సంఘసభ్యుడుగా వుండాలని చెప్పాలి. దీనిని కనిపెట్టింది అడ్లర్. ఇదీ కొందరిలో పనిచేయదు. అటివారికి శిక్షణ కావాలి. ఇది పనిచేయునియెడల రోగిని పరిణామం చెందేట్లు చేయాలి.

మనస్సును కనుక్కొనుటకు, పైనుండి ప్రారంభించాలి. శరీరంనుండి మనస్సుకు వెళ్ళాలి. జ్యోతిష్యం చెప్పుటకు, ఆకాశం వంక చూస్తారు. సాముద్రికం చెప్పుటకు, హస్తంవంక చూస్తారు ఇట్లే మనమూను. శరీరంనుండి ప్రారంభించి, తర్వాత దానిని వదిలి వేయవచ్చు. కనుక మానసిక స్థితులను కనుక్కొనుటకు శరీరం వంక చూడాలి.

కొందరు వక కాలవ దాటవలసి వుంటుంది. అందరూ ఒకే రకంగా కాలవను దాటరు. వారివారి మానసిక స్వభావముల ననుసరించి వారు దాటతారు. ఒకడు ఉల్లాసంకొరకు చూపటంతోనే దూకుతాడు. రెండవవాడు దాటుటకు వేరుదారి లేనందున దాటుతాడు. మూడవవాడు అది తన్ను సవాలుచేస్తున్నట్లు భావించి దాటుతాడు. నాలవవాడు ఇది పనికిమాలినపని అని అసలేదాటడు. ఇంకొకడు అవతల పొందదగినది లేదని పూరుకుంటాడు. ఈ వ్యవహారము మానవుని మానసికదశలను తెలుపుతుంది. ఈమానసిక స్థితులే, వారి వారి జీవితములను తీర్చుతుంటవి. జ్యోతిష శాస్త్రంలో నాలుగు విధాల మానవులున్నారు (1) వాయువు (2) అగ్ని, (3) జల, (4) పృథ్వి విభేదములు. ఇవి మానసిక శాస్త్రంలో కూడా పనికివస్తవి. సంఘంలో అనేక రకాల మనుష్యులుంటారు. రైతు, కూలి, శిల్పి, పండితుడు, యోధుడు మొదలైన వారుంటారు. కాని ఈరకములు మానసిక శాస్త్రంలో ఉపయోగింపవు. మానసిక శాస్త్రజ్ఞులు మానవులను 4 రకాలుగా విభజించారు. (1) ఆలోచన ప్రధానంగా గలవారు, (2) స్పర్శజ్ఞానం, (3) ఇంద్రియజ్ఞానము, (4) అతీంద్రియ జ్ఞానము ప్రధానంగా గలవారు. కాలవదాటే పనిలో ఒక్కొక్కరు ఒక్కొక్క జ్ఞానంతో నడిచారు. ఆలోచన జ్ఞానము భావమును తెలుపుతుంది, స్పర్శ విలువను, ఇంద్రియజ్ఞానము యథార్థమును, అతీంద్రియజ్ఞానము సాధ్యాసాధ్యములను తెలుపుతుంది. ఈ విభేదములు, మానసిక శాస్త్రమునకు, దిక్సూచిలో నాలుగు ముళ్ళవంటివి.

పుట్టుకనుండి మరణంవరకు మానవుని మానసిక స్వభావము వయస్సుతోపాటు మారుతోంది. మనం ప్రకృతిసిద్ధమైన జీవితంలో ఉన్నప్పుడు, అవ్యక్తజ్ఞానంతో ఎక్కువ సంబంధం వుంటుంది. అప్పుడు మనము సహజజ్ఞానరక్షణలో వుంటాము. కనుక ఆలోచించవలసినపని వుండదు. జీవితములోని సమస్యలు ఆలోచనలను పుట్టిస్తవి. ఇందువల్ల జ్ఞానము వృద్ధి అవుతుంది. జ్ఞానము ఏవిధంగా పుట్టుతుందో ఎవరూ చెప్పలేరు. పిల్లలను పరిశీలించే యెడల కొంత గ్రహించవచ్చు. బిడ్డలు వారు ఎరిగివున్న మనిషినిగాని, వస్తువునుగాని, చూచినప్పుడు, మనం కొంత గ్రహించవచ్చు. చిన్నతనంలో జ్ఞానం పూర్తిగా వుండదు. తెలిసిన వాటిని చూచినప్పుడు మాత్రం జ్ఞానం కలుగుతుంది. ఇది సముద్రంలో లంకలవలె, లేక చీకటిలోని దూరపు వెలుగులవలె వుంటుంది. చిన్నతనంలో ఆలోచించవలసిన అవసరం వుండదు. బిడ్డల అవసరములను తల్లిదండ్రులు తీరుస్తుంటారు.

యౌవనావస్థలో మనస్సు (Psychi) పుట్టుతుంది. దానితో అహం ఆవిర్భవిస్తుంది. ఈ వయస్సులోని మానసిక పరిణామమును మానసిక విప్లవం అనవచ్చు. ఈ వయస్సును భరింపరాని వయస్సు అని కూడా అంటారు. ఈ ఈడువరకు, జీవితము ప్రేరణవల్ల నడుస్తుంది. వారికి సమస్యలంటూ వుండవు. కామప్రేరణ కలిగినప్పుడు సమస్యలు కలిగి ఆలోచించవలసిన అవసరం కలుగుతుంది. ఇది మానసికంగా గందరగోళస్థితి. అప్పుడు అతనిలో మార్పువస్తుంది. అతనిని గురించిన అనుభవాలు అతనికి కలుగుతవి.

సామాన్యవిధంగా మానవునికి వయస్సులో నాలుగు అవస్థలుంటవి. (1) చిన్నతనము, (2) యౌవనము, (3) పెద్దతనము, (4) వృద్ధాప్యము. మానవునికి (1) ఉదయము, (2) మధ్యాహ్నము

(3) మధ్యాహ్నాంతము, (4) సాయంత్రములు, వాలుగదశలు. చిన్నతనంలో వారికి తెలియనిదానినిగురించి జంకుతారు. యౌవనం వచ్చిన తర్వాత, రానున్న పెద్దతనమును చూచి భయపడుతుంటారు. పెద్దతనము వృద్ధాప్యమును చూచి, వృద్ధాప్యంలో మృత్యువుని చూచి భయపడుతూ వుంటారు. మధ్య వయస్సు దాటునప్పుడు శరీరంలోవలె మనస్సులో కూడా మార్పు వస్తుంది. 40 ఏండ్లు వచ్చునప్పుడు మనస్సుకు గ్రుంగుబాటు ప్రారంభమౌతుంది. స్త్రీలలో ఇంకా పెందరాళే, 35 సంవత్సరములకే ప్రారంభ మవవచ్చు. ఇది ప్రభుత్వంవారి లెఖ్ఖలవల్ల కూడా తెలుస్తుంది. మానసికమైన మార్పు ఒక్కసారి జరుగదు. క్రమేణా వస్తుంది. అప్పుడు వారికి వున్న ఆశయముల పట్టువదలి, సళ్ళిసుంటవి. వాటి స్థానే, ఇతరములు చోటు చేసుకుంటవి. మానవుని యౌవన మనువు అతని వయస్సు ననుసరించే వుండదు. తలిదండ్రులు బ్రతికివున్న వారికి, వయస్సు మించి కూడా కొంతకాలం యౌవనం వుంటుంది. తలిదండ్రు లున్నవారిలో ఇట్టిస్థితి యూంగ్ అనుభవంమీద చూచాడు. తండ్రి మరణం కుమారునిమీద విపత్తువలె ఫలితాన్నిస్తుంది. ఇతను 20 ఏళ్లున్నప్పటికీ పెద్దవాడుగానే తయారౌతాడు.

మధ్యవయస్సు దాటునప్పటికి పురుషునిలో నున్న పురుషత్వం ఖర్చుకాగా, స్త్రీత్వం మిగులుతుంది. స్త్రీలలోనూ ఇంతే. ఆ అవస్థలో స్త్రీకి, స్వరంలోకూడా మార్పువస్తుంది. మధురమైన స్త్రీ కంఠధ్వని, మగవారి మాటగా మారుతుంది. స్వరం మోటుబారుతుంది. ముఖవర్చస్సు గట్టిపడుతుంది. నూనూగు మీసములు అంకురిస్తవి. పురుషులకు పురుషముఖం మారి, ఆడముఖలక్షణాలు కనుపిస్తవి. ఈమార్పు శరీరంమీదకన్న మనస్సుమీద అధికంగా వుంటుంది. ఆ కాలంలో పురుషుడు తనవ్యాపారములను కటిపెట్టి ఇంట వుంటాడు. స్త్రీలు చిన్న చిన్న వ్యాపారములు ప్రారంభిస్తారు. ఈ మార్పునుగురించి ఒక కథవున్నది. ఇది ఒక హిందూయోధుని గురించిన కథ. ఇతనికి మధ్యవయస్సు దాటింది. అప్పుడు స్వప్నంలో ఆత్మ కనుపించింది. అప్పటినుండి తనను ఆడవారిలో కూర్చొనవలెనని, ఆడవారి వస్త్రములను కట్టుకుని, వారితిండి తినమని ఆత్మ చెప్పింది. ఇతను ఇది తనపరువునష్టమనుకోక, ఆత్మవాక్యం ప్రకారం నడిచాడు. ఈ కల, వయస్సుయొక్క మధ్యాహ్న కాలంలో, మానసిక విప్లవమును, జీవిత చరమదశారంభమును సూచిస్తుంది.

నేడు ఈ మార్పుకు మానవుడు తయారై లేడు. చిన్నపిల్లలకు, వచ్చేవయస్సుకు అవసరమైన విద్యను నేర్పుతారు పాఠశాలలలో. కాని మధ్యవయస్సు దాటేవారి కిట్టి బళ్ళు లేవు. వారు దానికి తగ్గట్లు తయారులో లేరు. ఇది చాలా అపాయస్థితి. ఈ వయస్సులోని వానికి తన (ఆత్మ) పరిశీలన కావాలి. చిన్నతనంలో అట్లా అవసరం లేదు. యువకులు ప్రపంచమును గురించే ఎక్కువగా పరిశీలించాలి. వారి జ్ఞానమును ఎక్కువ బయటకే ప్రసరించాలి. ఇట్లే సూర్యుడు మధ్యాహ్నంవరకు, తన వెలుతురును ప్రపంచమునకు ఇస్తాడు. మధ్యాహ్నము దాటిన తర్వాత, తేజస్సు తగ్గుతూ వుంటుంది. సూర్యుడు కనుపించుటకు నడిపోయే వెలుతురే మిగులుతుంది. వయస్సునుబట్టి మార్పును అంగీకరించాలి. అమెరికాలో తండ్రి, తనకుమారునికి సోదరుడుగాను, తల్లి కుమార్తెకు అక్కగాను నడుచుకుంటారు. అంటే వారు వయస్సుకు వెనుకకు నడుస్తున్నారని అర్థం. ఏరిది గమ్యంలేని జీవితము. మానసికశాస్త్రం వయస్సు మళ్లినతర్వాత జీవితమునకు సలాంపెట్టమని చెప్పుతుంది. ఈ వయస్సులో ఆత్మ పరిశీలన కావాలి. దీనిని మతము ఇస్తుంది. పెద్దతనంలో జీవితమును మార్చుకొనకపోవుట, యౌవనంలో జీవితంనుండి పలాయనం చేయుటకన్న, ఎక్కువతప్పు. యూంగ్ వైద్యానుభవములలో, పెద్దతనంవచ్చినవారికి మరణంలో ఒకగమ్యం ఏర్పరచుకొనుట చాలా ఆరోగ్యప్రదమని తెలుసుకున్నారు. మరణమంటే మార్పని, వారు గ్రహించుట శ్రేయస్కరము. మరణమును గురించి భయంచెందుట మంచిదికాదు. కనుక అప్పుడు వారికి మతము ముఖ్యం. మనం రెండువారాల్లో కూలిపోతుందని తెలిసిన ఇంట్లో వున్నప్పుడు, మనకు శాంతివుండదు. ఎప్పుడు దానిని గూర్చి ఆలోచించుటే సరిపోతుంది. మనం క్షేమంగా వుంటామని అనుకున్నప్పుడు, శాంతి వుంటుంది. యువకులూ, పెద్దవారూ జ్ఞానావరణలో ఎక్కువకాలం వుంటారు. శిశువులూ, వృద్ధులూ అవ్యక్త జ్ఞానావరణలో ఎక్కువకాలం వుంటారు. పెద్దలకు మరణంలో అమృతత్వం శాశ్వతపదవి వున్నదని తెలియుట వూహించలేనంత మంచిది.

ఫ్రాయిడ్, తన జీవితము నంతటిని, మానసికశాస్త్ర నిర్మాణమునకు వెచ్చించాడు. కాని అతనిది ఏకపక్ష సిద్ధాంతము. అతని సిద్ధాంతము ఆరోగ్యప్రదమైనదికాదు. అతను చేసిన తప్పు, వేదాంతమునకు విముఖుడౌటే. జ్ఞానము ఒక్క ఒప్పుమీదే కాదు, తప్పుమీద కూడా ఆధారపడి వున్నది. ఫ్రాయిడ్ స్త్రీ పురుష సంబంధములే (కామము) మానసిక శక్తులుగా, ఆరంభించాడు. యూంగ్ అతనినుండి విడివడ్డ తర్వాత యితర శక్తులకు కూడా సమానస్థానమిచ్చాడు. కామము, మానసికశాస్త్రంలో తక్కువదని యూంగ్ అనడు. ఇదికూడా జీవితప్రేరణలలో ఒకటేనంటాడు యూంగ్. కామమునకున్న ప్రాముఖ్యను ఎవరూ కాదనరు. కాని యూంగ్‌ను మతపిచ్చి అని నిందించారు. అనాది నుండి మానవుడు సమస్తదేశములలోను, తనంతట తాను మతదృష్టి ఏర్పరుచుకున్నాడు. దీనిని గమనించనివారు అంధులే. ఫాదర్ కాంప్లెక్సు అనేది ఫ్రాయిడ్ మారుపేరుగా పెట్టిన మతపు మాటే. ఫ్రాయిడ్ యొక్క అధిఅహం, ఎహోవానుండి దొంగిలించి తన మానసికసిద్ధాంతమునకు తొడిగినతొడుగే. దేనినైనా బయటకు వప్పుకొనుట మంచిది. ఫ్రాయిడ్ చెప్పినట్లుగా అహం, భయమునకు తావు. అది తన మాతాపితృలవద్దకు తిరిగి రావంతకాలమే. (మాతృపితృలంటె ప్రకృతిపురుషులు) యూంగ్ విశ్వపటంలో బైట యెంత ప్రపంచంవున్నదో లోపల అంతే వున్నది. ఈ రెండు లోకముల మధ్య మానవుడు నిలిచివున్నాడు, ఇతను అప్పటిమానసికస్థితులను బట్టి ఒకొక్కసారి బయటి ప్రపంచమే నిజమనుకుంటాడు. ఇంకోసారి లోపలిప్రపంచం నిజమనుకుంటుంటాడు. మనస్సులో నున్న ద్వంద్వముల ననుసరించి అతని మానసికస్థితి వుంటుంది. బయటిప్రపంచంలో

ఎట్లా చిన్నా పెద్ద వేడి చల్లదనములనే ద్వంద్వములున్నవో మానసిక లోకంలో అట్లాగే వున్నవి.

సృష్ట్యారంభంనుండి వున్న జీవులలక్షణాలు మానవుని శరీరంలో వున్నట్లు అనాదినుండివున్న మానవుల మానసిక గుర్తులు నేటి మానవునిలోకూడా వున్నవి. నేటి నాగరిక మానవుని మానసిక పరిస్థితులు చెప్పుట చాలా కష్టము. కాని ఆదిమజాతివారి మానసికస్థితులు చెప్పుట సులభము. వీరిజీవితములు ప్రకృతిననుసరించి వుంటవి. నాగరికులకన్నా, ఆదిమజాతులవారికి అద్భుతశక్తు లున్నవి. వారి ప్రయాణాల్లోగాని, వేట సమయాల్లోగాని, అట్టి శక్తులను మనం చూడోచ్చు. ఆదిమజాతి వారిలో యూంగ్ కొంతకాలం వున్నాడు. యూంగ్‌కు ఉత్తరాలు తెచ్చే ఆదిమజాతి అతను, ఒక్క పరుగున 75 మైళ్ళు పరుగెత్తేవాడు. ఆరు నెలలు నిండిన గర్భిణి ఒకామె, వీపుమీద బిడ్డనుమోస్తూ, పొడుగాటి పొగా '. బూరనుపీలుస్తూ, శీతోష్ణస్థితులు 95° లు వున్నప్పుడు, మంటే సెగడుచుట్టూ, ఒక రాత్రల్లా నృత్యంచేసింది. వారిజీవితములు నిష్కల్మషములు, శిశుప్రాయములు.

మానసిక నిర్మాణమునకు జ్ఞానస్నానము చాలా తోడుపడుతుంది. ఇది ఆత్మబలాన్ని చేకూరుస్తుంది. జ్ఞానస్నాన మనే భావనే, అతనిని ఉన్నతికి తెచ్చి, అతనిలో మార్పును కలుగచేస్తుంది. ఇది ఆధ్యాత్మిక జననము. ద్వితీయ జన్మ.

మానసిక శాస్త్ర మనగా, మనస్సుయొక్క నడకను గమనించే శాస్త్ర మని అందరూ ఎరిగినదే. అన్ని శాస్త్రములకు, కళలకు మనస్సు గర్భంవంటిది. సాహిత్య పరిశీలనలకు మానసిక శాస్త్రం ఉపయోగపడుతుంది. కళ ఏర్పాటు ఏవిధంగా జరిగిందో వివరించుటకు, కళాత్మకమైన సృష్టిని చేయుటకు, ఆ కర్తను ఏవి పురిగొల్పినవో పరిశోధించుటకు మానసిక శాస్త్రం తోడ్పడుతుంది. ఇందుకు ఒక్కచోట అతని చిత్రమును, ఇంకొకచోట చిత్రకారుని మానసిక పరిశీలన తీసికోవాలి. చిత్రంవల్ల, చిత్రకారునిగూర్చి కొన్ని ఊహలు చేయవచ్చు. కాని ఇవే కడపటి సిద్ధాంతాలుగా వుండవు. ఇవి ఊహాప్రతిపాదితములు మాత్రమే. సాహిత్య పరిశీలనలో.మానసిక శాస్త్రపరిశీలనలోనూ, సాహిత్య వ్యాఖ్యాతపరిశీలనలోనూ మూలసిద్ధాంతములలో భేదములున్నవి. గ్రంథకర్త తనగ్రంథంలోని మానవులకు మానసిక వివరణ ఇవ్వని నవలలు మానసిక శాస్త్రజ్ఞుని పరిశోధనకు ఉపయోగకరమైన గ్రంథములు. ఇటువంటి గ్రంథములు, బేనాయిట్ నవలలు, ఆంగ్లంలో రైడర్ హగ్గార్డుని, కొనన్ డాయిట్ డిటెక్టివ్ గ్రంథాలై వున్నవి. మెల్‌వైల్‌యొక్క మోబీడిక్, అమెరికా నవలలో గొప్పదని యూంగ్ భావం. మానసిక వ్యాఖ్యానము ఇవ్వని ఉద్రేకమైన కథ మానసిక శాస్త్రజ్ఞునికి చాలా వుపయోగం. ఇట్టి గ్రంథములలో, కర్త అవ్యక్తజ్ఞానములో వుంటాడు. అవ్యక్తజ్ఞానమునుండి అవి, అతనికి తెలియకుండానే బయటపడుతుంటవి. మానసిక వివరణ ఇచ్చిన గ్రంథాలను, వ్యాఖ్యాతలు పరిశీలనకు తీసికుంటారు.

ఫాస్టు నాటకమును రెండుభాగములుగా విభజించవచ్చు. మొదటి భాగము మానసిక సంబంధమైనది, రెండవ భాగము స్వాప్నిక సంబంధమైనది. ప్రథమభాగంలో మానవానుభవములనుండి రెండో భాగంలో అవ్యక్తజ్ఞానంనుండి వ్రాయబడ్డవి. మొదటిది ప్రేమ కథ. ఇది నిజమైన అనుభవము. స్వాప్నికములోకూడా సత్యం వున్నది. మానవుని అనుభవములు అవ్యక్తజ్ఞానంలో చేరుతవి. ఆ చేరినవాటికి శాస్త్రము ('Psyche') మనస్సు అని పేరు పెట్టింది. అవ్యక్త లోకంయొక్క వాకిళ్ళను, మానవాళికి తెరిచిన దీమనస్సే. అనాదినుండి, మానవుడు అవ్యక్తమునుండి అనేక సత్యములను, తెలిసికున్నాడు. ఇట్టి సత్యములు చిత్రములుగా నేటికీవున్నవి. రాతియుగపు రొడీసియా పర్వతచిత్రములలో ఆశ్చర్యమైనట్టివి ఇప్పటికీ వున్నవి. అవి జీవించిన మృగములుగా చిత్రించబడ్డవి. ఇవి సున్నాలో రెండు శిలువలు గీసి మృగంగా చిత్రించబడ్డవి. అప్పటి నుండి ఇట్టి చిత్రములు అంతటా అన్ని కాలాల్లో చిత్రిస్తూనే వున్నారు. ఇట్టివి క్రిస్టియన్ చర్చీలలోనేగాక, టిబెట్టు మఠములలోకూడా వున్నవి. ఇవి సూర్యచక్రంవలె వున్నవి. చక్రమంటే ఎరుగని ఆ శిలాయుగంలో, చక్రమును చిత్రించుట ఆశ్చర్యంగా వుంటుంది. ఇది బయటి ప్రపంచంలో చూచి చిత్రించినదికాదు. ఈ చిత్రము మానసిక గమనమునకు సంకేతము. అనాది చిత్రాల్లో ఇటువంటి రహస్యాలెన్నో వున్నవి. ఇవి కాలక్రమేణ గురుశిష్యన్యాయంగా ఇప్పటికీ మనకు అందచేయబడుతున్నవి. గ్రీక్ రోమన్ పురాణ చిత్రములు ఇట్టివే. కనకనే, కవి తన కథను పురాణంనుండి తీసికుంటాడు. దర్శనములలో కనుపించేదంతా సామూహిక అవ్యక్త జ్ఞానములోనిది. ఇందులో మన పూర్వుల జ్ఞానం కలిసివున్నది. జ్ఞానం మరుగైనప్పుడో, కలలలోనో, నిద్రలోనో, పిచ్చిలోనో పూర్వుల మానసిక లక్షణాలు పైకివస్తుంటవి.

చిత్రకారునిలో ఇద్దరు వ్యక్తులున్నారు. ఒకడు అతని మానవ స్వభావపు వ్యక్తి, రెండవవాడు అతని సృజనాత్మకవ్యక్తి. కళ మానవుని వశపరుచుకుని, అతనిని తన పనిముట్టుగా చేసుకునే సహజ శక్తి. చిత్రకారునికి స్వంత ఇచ్ఛలేదు. కళకు అతనొక పరికరం. మానవుడుగా, అతనికి మానసికస్థితులు కోరికలు గమ్యములు ఉండోచ్చు. కాని చిత్రకారుడుగా వున్నతస్థితిలో వున్న నరుడు, అవ్యక్త జ్ఞానమును వహించుతూ, మానవాళియొక్క మానసిక జీవితమును తీర్చే సామూహిక మానవుడతను. ఇది చాలా కష్టమయిన ఉద్యోగము. ఈ ఉద్యోగనిర్వహణకు, కొన్ని సమయాల్లో స్వసుఖమును జీవితమునకు కావలసిన వాటిని త్యాగంచేయవలసివుంటుంది. చిత్రకారుడు, లోపల ద్వంద్వయుద్ధం జరుగుతున్న మనిషి. అతనిలోని స్వసుఖము, సృజనశక్తులు విరోధపడుతుంటవి. ఇందులో స్వసుఖము అణగద్రొక్కబడుతుంది. కనుకనే, చిత్రకారుల జీవితములు చాలా అసంతృప్తికరములుగా వుంటవి. సృజనాత్మకశక్తి మానవప్రేరణలను ఇంకింపచేస్తుంది. ఇందువల్ల అతనిలో కొన్ని దుర్గుణములు చేరుటకు తావుకలుగుతుంది. క్రూరత్వం, స్వార్థం, గర్వం మొదలైనవి అతనిలో ప్రవేశిస్తవి. ఒక ప్రత్యేక కార్యమునకున్న సామర్థ్యమంతా వ్యయంచేయుటంవల్ల, ఇతర సామర్థ్యములు లోపిస్తవి. అందువల్ల సైపరిణామములు కలుగును. ఫాస్టును సృష్టించింది గేటేకాదు. గేటే ఫాస్టు సృష్టించింది. ఫాస్టు అనగా సంకేతము. జ్ఞానము ఒకవైపుకు నడచినప్పుడు అవి కలలోనో, దర్శనంలోనో కళాకారునికి ఋషికీ కను

పి స్తవి. అతను మానవసంఘ అవసరములను తీర్చుతాడు. తన చిత్రములద్వారానో, గ్రంథములద్వారానో, ఇందులో ప్రయోజనముకన్న, తనకౌశల్యం ఎక్కువైనది. గొప్పచిత్రం కలవంటిది. అట్టిచిత్రం దానంతటది అర్థమునివ్వదు. తను సృష్టించుటకు, తనకర్తను అది ఎట్లుతీర్చినదో, చూచువానికికూడా అట్లు తీర్చనివ్వాలి. అప్పుడు అది అర్థమౌతుంది. కవి మంచివాడు కావచ్చు చెడువాడూ కావచ్చు. దీనివలన అతని కౌశల్యమునకు సంబంధం వుండదు.

నేటి మానవు డనబడేవాడు నూతనంగా ఏర్పాటైనవాడు. నేను అనే ప్రశ్న ఇప్పుడు పుట్టింది. దీనిఫలితము భవిష్యత్తులో దాగివున్నది. గతమైన కాలమును ఆకళింపు చేసికున్నవాడు సామాన్యుడు కాడు. వెనుకవైపున గతంలో సంపాదించిన అనుభవ పర్వతములున్నవి. ముందు ఏమిదాగివున్నదో తెలియని భవిష్యత్ అఘాతము. ఈ రెంటిమధ్య నేటిమానవుడు నిలబడివున్నాడు. ఇట్టివారు కొద్దిమందే. ఈనాడు జీవించివున్నవారి నందర్నీ నేటి మానవులని అనుటకు వీలులేదు. నేటిని ఎవరైతే అర్థం చేసికొనగలరో వారే ఈ నాటి వారు. నేడు, నిన్నటికీ రేపటికీ, భూతకాలమునకు భవిష్యత్కాలమునకు గొలుసువంటిది. నేడు మార్పుకు ప్రతినిధి. చాలామంది నేటివారమని పిలుచుకోవచ్చు. నిజంచెప్పాలి అంటే, పూర్వకాలపు వాళ్ళమని చెప్పుకునే వారిలోనే, నేటి మానవులున్నారు.

నేడు మనకు వృద్ధియైన శాస్త్రములు, బలవంతములైన ప్రభుత్వములు, కట్టుదిట్టములైన సంఘములు, ఉన్నతాశయములుగల మత సంఘాలూ వున్నవి. ఇన్నివున్నా నేడు మానవునికి శాంతి లేదు, యుద్ధ భయం తాండవిస్తూనే వున్నది, ఈ స్థితి నేటి మానవుని గొప్ప దెబ్బకొట్టింది. మానసిక శాస్త్రపరిభాషలో చెప్పవలెనంటే, నేటిమానవుడు అయోమయ స్థితివంటి అఘాతంలో పడిపోయువాడు. అవసరం జ్ఞానమును పుట్టిస్తుంది. యూంగ్ వద్దకు వచ్చినవారి అనుభవాల దృష్ట్యా అవసరాలదృష్ట్యా ఒకసిద్ధాంతమును, ఏర్పరచుకున్నాడు. వీరి అవసరములే మానసికశాస్త్ర నిర్మాణమునకు కారణములైనవి. ఇప్పుడు మానసికశాస్త్రం లేకుండా ముందడుగు వేయలేము. ఒకటి, అంతుబట్టనివైన మానసిక ప్రవాహములు మనిషిలో అరికట్టబడటంతోనే, ప్రవాహం వెనుకతిరుగుతుంది. ఏదో లోపం జరిగిందని అతనికి తెలుస్తుంది. ఈలోపం ఏమిటోవాడు కనుక్కోలేడు. అప్పుడు, లో బయటి మానవులకు సంఘర్షణ జరుగుతుంది. అప్పుడూ, మనస్సును కనిపెట్టేది. అప్పుడు అవ్యక్తశక్తుల తీవ్రతలను, వాటి ఫలితాలను మనం కొలవలేము.

ఇప్పటివరకు మానవునికి ప్రపంచాన్వేషణతో సరిపోయింది. ఈ భూఖండం ఎక్కడవున్నదో అంతా గాలించి తెలుసుకున్నాడు. ఇంకను వారు భూమిమీద తెలుసుకోదగ్గ ప్రదేశములు లేవు. కనుక ఇప్పుడు అతని దృష్టి ఆకాశముపైపు, వాతావరణ అవతలవైపుకు తిరిగింది. చంద్రమండలంలో ఏమున్నదో అన్వేషించ ప్రారంభించారు. వ్యక్తావరణ అవతల, అవ్యక్తంలో ఏమున్నదో తెలిసికోవటానికి పాటు పడుతున్నాడు నేటి మానవుడు. ఫ్రెంచి విప్లవం తర్వాత, 19 వ శతాబ్ద ప్రారంభంనుండి మనస్సుకు ప్రాముఖ్యత వచ్చింది. 19 వ శతాబ్ద ప్రారంభంలో ఒక విశేషం జరిగింది. అప్పుడు ఫ్రెంచి పండితుడు యాంక్వెటిల్ డు పెరాన్ అనే ఆయన ఇండియాలో వున్నాడు. అతనికి భారతీయుల ఉపనిషత్తులు చూచుట తటస్థించింది. ఇతను 50 ఉపనిషత్తుల తర్జుమాలను ఫ్రెంచిదేశమునకు తీసికొని వెళ్ళాడు. ఇవి యూరపు ప్రజలకు భారతీయ మానసిక శాస్త్రములను గురించి గొప్ప అభిప్రాయములను కలుగచేసినవి.

యూరపువారు తమ బహిర్ముఖమైన భౌతిక జ్ఞానముతో తూర్పు దేశమును నింపివేస్తున్నారు. తూర్పుదేశములు వారి మానసిక ఆధ్యాత్మిక శాస్త్రములతో పడమటిదేశములను నింపుతున్నవి. దీనికి 'జయించుట' అని పేరుపెట్టడం పొరపాటు మాట. రోమన్ సామ్రాజ్యచరిత్ర ఏమి నేర్పింది? రోమన్లు ఆసియామైనరును జయించిన తర్వాత రోముదేశము ఆశియా దేశంగా మారింది. దీని ప్రభావం యూరపుకుకూడా పాకింది. ఇది ఇప్పటికీ శాశ్వతంగా నిలచివున్నది. రిచర్డు విల్ హెల్మ్, మనకు కొరుకుడు పడని మానసిక ప్రశ్నలకు చీనా వారు పూర్వకాలంలోనే వారి గ్రంథాలలో సమాధానములు వ్రాశారని యూంగ్ తో చెప్పాడు. యూరపువారి మానసిక శాస్త్రం, తూర్పు దేశముల ఎదుట ప్రారంభంలో వున్నట్లున్నది. అధునాతన మానసిక శాస్త్రమునకున్నూ, హిందూదేశపు యోగమునకున్నూ సాదృశ్యం వున్నట్లు ఓస్కార్ ఏ. హెచ్. ష్మిజ్ పండితుడు పరిశోధించి వ్రాశాడు. ఇప్పుడు మనం ఆధ్యాత్మిక విజ్ఞానపు వాకిట నిలచి వున్నాము. ఉల్లాసంతో, కావలెనని, జీవితమును మార్చ ప్రారంభించరు. ఎంతో బాధపడి, అవసరం కలిగితే అప్పుడు ఇంకొక జీవితమును ప్రారంభిస్తారు. ఇప్పటి సినీమాలు, డిటెక్టివ్ నవలలు, ఎంతో ఉద్రేకమును, అపాయములను కలుగచేస్తున్నవి. ఇవి మానసికావస్థకు సంబంధించినవి. నేటి పరిస్థితులు నూతనత్వాన్ని రూపొందిస్తున్నవి. ఇవి గతంకన్న, ఇప్పుడు ఆధ్యాత్మికాన్వేషణను తీవ్రపరుస్తున్నవి. ఇందుకు హోల్డర్లిన్ కవి చెప్పిన వాక్యాలు ఎంతో తగివుంటవి.

“అపాయమే తననుండి తప్పించుకునే ఉపాయమును శోధిస్తుంది. నేటి మానవునికి ఆత్మశాంతి లోపించింది. అందువల్ల అనేక వ్యాధులు సంభవించును. నరాలవ్యాధి చాలా అపాయకరమైనది, జీవిత మధువును అనుభవించలేని అభాగ్యజీవి ఇతను. ఇట్టివారికి మందులు పనిచేయవు. వైద్యుని చిన్న సలహాగాని, ఆదరణ వాక్యం గాని ఎంతో మేలుచేస్తుంది. ఇట్టి మాటలు మానవునిలోని మానసగ్రంథులు ద్రవించునట్లు కూడా పని చేస్తవి. ఈ మాటలూ వాయువులోని తరంగములే. కాని అవి అర్థమును చేరవేయ కలిగినంతవరకు వాటిలో శక్తి ఉన్నది. ఇందువల్ల అర్థములో శక్తి ఉన్నదని తెలుస్తుంది. అర్థము మానసికమయినది, ఆధ్యాత్మికమయినది. ఈ విషయం తెలిసికున్న తర్వాతనే మానసిక శాస్త్రం ప్రారంభమైనది.

'యూంగ్ 80 సంవత్సరములు మానసిక వైద్యం చేశాడు. అప్పుడు ఎందరిరోగులకో రోగనివారణ చేశాడు. వైద్యంలో ఎంతో

అనుభవమును సంపాదించాను. ఈ 30 సంవత్సరాల అనుభవంలో యూంగ్ కేసులలో, ఎక్కువమంది ప్రొటెస్టెంటులు, కొద్ది సంఖ్యలో యూదులు, 5 లేక 6 సనాతన కాథలిక్కులు ఎక్కువ లేరు. 35 ఏండ్లు దాటిన కేసులలో, మతనమ్మకం ఉన్నవా డొక్కడూ లేడు! అనాదినుండి మానవునికి మతం ఇచ్చిన శాంతి, నేడు లేక పోవుటవల్లనే ఈ జబ్బులు కలుగుతున్నవని చెప్పితే బాగుంటుందని యూంగ్ అన్నాడు. ఇప్పటికయినా మత గురువులూ మానసిక వైద్యులూ చేతులు కలపడ మెంతో అవసరం. ప్రపంచం అన్ని వైపులనుండి ఇతనివద్దకు అనేకమంది పండితులుకూడ వచ్చేవారు. వారు వచ్చింది వ్యాధినివారణకు గాదు. జీవితంయొక్క అర్థం తెలియక వచ్చారు, యూంగ్‌కు ఏదో గారడీ తెలుసునని వచ్చారు. ఇది చెప్పమని యూంగ్‌ను ఎంతో వత్తిడి చేశారు. ఆఖరికి తనకూ తెలియదని చెప్పాడు. ఇది నేటి పరిస్థితిని తెలుపుతుంది. రోగికి, వైద్యుడు తెలియదని చెప్పితే, వైద్యునిమీద నమ్మకం పోతుంది. జీవితపు అర్థము తెలియనప్పుడు, లోపల తిరుగుబాటు బైలుదేరుతుంది. రేపు వుండముకనుక, ఇవ్వాళే తిని త్రాగుదామనే బుద్ధి పుట్టుతుంది. అర్థం తెలియనిస్థితి అవ్యక్తజ్ఞానంలో ఆందోళనలను బయలుదేర తీస్తుంది. లోపల ద్వంద్వ యుద్ధం, కల్లోలం కలుగుతుంది. ఇది ఆధ్యాత్మిక, ఇంద్రియ వ్యక్తుల మధ్య జరిగే పోరాటము. దీనినే ‘ఫాస్టు’ లో ఇలా అన్నాడు.

“అయ్యో, రెండు ఆత్మలు నా గుండెల్లో కాపురం చేస్తున్నవి!”

ఇట్టిది భయంకర మానసిక వ్యాధి. మానసిక వ్యాధి నివారణలో ఏదో అదృశ్యశక్తి ఉన్నదని వైద్యులు అనుభవం మీద కనిపెట్టారు. దీనికి psyche అనే గ్రీకు శబ్దమును పేరు పెట్టారు. ఇది psyche అనే శబ్దమునుండి పుట్టింది. దీని అర్థము శ్వాస పీల్చుటని. శ్వాసనే జీవిగాను, ఆత్మగాను తీసుకున్నారు పూర్వీకులు. లాటిన్ శబ్దములయిన animusspirit న్ను, animasoul న్ను గ్రీకుశబ్దమయిన anemoswind న్ను, అరబ్ శబ్దములయిన rihwind, ruhఆత్మ, అనే అర్థముల నిస్తవి. నూతనంగా బయటపడ్డ ఈశక్తిని పూర్వుల అనుభవముల ప్రకారము, మనస్సు లేక ఆత్మ అని పిలిచారు. నేటి మానవుడు ప్రతిదీ తన అనుభవము మీద తెలిసికోవలెనని ఉత్సాహపడుతున్నాడు. నేటి పరిస్థితులు ఆత్మాన్వేషణకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నవి. విశ్వాత్మ ప్రపంచోన్ముఖమగుటకు, మనుష్యులను ఎన్నుకుంటుంది. తననుగురించి ప్రపంచమునకు చెప్పునట్లుగా, ఆత్మ మానవుని పురిగొల్పుతుంది. మానవాళి చరిత్రలో ఇది అనేక విధాల తన గమ్యం చేరింది. దాని ఫలితముతో పోలిస్తే, ఆత్మజ్ఞానమును ప్రపంచమున కిచ్చినవారి సంఖ్యను వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చు. కల్పతరువు కొమ్మమీద, పుట్టి రాలిపోయే ఆకులు పుష్పముల వంటివారు.



# చదవండి! ఉత్తమ నవలలు

| | | |
|---|---|---|
| ఛంఘీజ్ ఖాన్ — | | రు.నపై॥ |
| తెన్నేటి సూరి | ... | 4—50 |
| ఉదయకిరణాలు — | | |
| పోతుకూచి సాంబశివరావు | ... | 3—00 |
| సింహ సేనాపతి — | | |
| రాహుల్ సాంకృత్యాయన్ | ... | 3—00 |
| మట్టిమనుషులు — | | |
| కాళిందీచరణ పాణిగ్రాహి | ... | 2—25 |
| పునరాగమనం — | | |
| బోరిస్ పోలెవోయ్ | ... | 1—75 |
| మానవుడి పాట్లు — | | |
| మైఖేల్ షోలొఖోవ్ | ... | 0—50 |
| మానధనులు — | | |
| హోవర్డుఫాస్ట్ | ... | 2—75 |
| కూలీ — | | |
| ముల్కరాజ్ ఆనంద్ | ... | 4—00 |
| గోదాన్ — ప్రేమ్‌చంద్ | ... | 3—75 |
| గబన్ — ,, | | 3—00 |
| ప్రతిజ్ఞ — ,, | | 2—50 |
| మంగళసూత్రం — ,, | | 0—75 |

(పోస్టేజి అదనం)



ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

పీపుల్స్ బుక్ హౌస్, హైదరాబాద్.

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్

స్థాపితం — 1923

(షెడ్యూల్డు బ్యాంకు)

హెడ్డాఫీసు—మచిలీపట్టణము.

| | | |
|---|---|---|
| చెల్లింపబడినమూలధనం, రిజర్వులు ... | రు. | 58,47,595 |
| డిపాజిట్లు ... | రు. | 9,50,00,000 |
| అమలులోనున్న వ్యాపారం | రు. | 13,00,00,000 |

హైదరాబాద్ ఆఫీసు — బి/10-711 సుల్తాన్ బజారు

సికింద్రాబాద్ ఆఫీసు — 1359 జనరల్ బజారు

మద్రాసులోని శాఖలు— (1) 6-లింగిశెట్టివీధి, మద్రాసు-1. (2) 77-కచేరీరోడ్డు, మైలాపూరు, మద్రాసు-4. (3) 87-త్యాగరాయరోడ్డు, త్యాగరాయనగర్, మద్రాసు-17.

## ఇతర బ్రాంచీలు, సబ్‌ఆఫీసులు

అమలాపురం, అనకాపల్లి, బాపట్ల, భీమవరం, చీరాల, ఏలూరు, గుడివాడ, గూడూరు (నెల్లూరుజిల్లా), గుంటూరు. అరండల్‌పేట (గుంటూరు)- కర్నూలు, కాకినాడ, రామారావుపేట (కాకినాడ). మచిలీపట్టణము, నరసరావుపేట, నెల్లూరు, ఒంగోలు, పాలకొల్లు, రాజమండ్రి, శ్రీకాకుళం, తెనాలి, కొత్తపేట (తెనాలి): తుని, విజయవాడ. గవర్నరుపేట(విజయవాడ). గాంధినగర్ (విజయవాడ), విశాఖపట్టణము, మహారాణిపేట (విశాఖపట్టణము), విజయనగరం సిటీ, ఆమదాలవలస (శ్రీకాకుళంజిల్లా), అనంతపురం, అనపర్తి (తూ.గో జిల్లా), భట్టిప్రోలు (గుంటూరుజిల్లా), బళ్లారి, బొబ్బిలి (శ్రీకాకుళంజిల్లా), చల్లపల్లి (కృష్ణాజిల్లా), చోడవరం (విశాఖజిల్లా), కడప, దుగ్గిరాల, గొల్లప్రోలు, గుంటకల్, ఇచ్ఛాపురం (శ్రీకాకుళంజిల్లా), జగ్గయ్యపేట (కృష్ణాజిల్లా), కొవ్వూరు (ప.గో.జిల్లా), ఖమ్మంమెట్టు, మండపేట (తూ.గో.జిల్లా), మాచెర్ల, నరసన్నపేట (శ్రీకాకుళంజిల్లా), నిడదవోలు, పామర్రు (కృష్ణాజిల్లా), పార్వతీపురం, పెడన (కృష్ణాజిల్లా), పెద్దాపురం, పెనుగొండ (ప.గో.జిల్లా), పిఠాపురం, సాలూరు, సామర్లకోట, తణుకు (ప.గో.జిల్లా), తాడేపల్లిగూడెం (ప.గో.జిల్లా), తిరుపతి, వినుకొండ, వుయ్యూరు (కృష్ణాజిల్లా), వరంగల్.

ఆకర్షణీయమైన వడ్డీరేట్లకు డిపాజిట్లు అంగీకరించబడును.

సెక్యూరిటీలు, బంగారునగలు, బులియను మరియు తదితర సరకులమీదను అప్పులు యివ్వబడును.

వివరములు బ్యాంకుయొక్క ఏఆఫీసులోనైనను తెలిసికొనవచ్చును.

| | |
|---|---|
| తాడేపల్లి శ్రీరాములు,<br>మేనేజింగు డైరెక్టరు. | తుంపూడి రంగనాథభగవత్,<br>బి. ఏ., బి. యల్.,<br>ఆక్టింగ్ జనరల్ మేనేజరు. |

# మ ధు సూ క్త ము

## శ్రీ సంపత్కుమార

ఇక యేదో అనిదంపురావిదిత హాసూర్మి ప్రసారమ్ముతో
ప్రకృతిన్ క్రొత్తదనమ్ము విచ్చినటులై, ప్రచ్ఛన్నమైనట్టి జీ
వికలో రేఖలు రేఖలై మధురతా విస్ఫూర్తియున్ గల్గి న
ట్లు కనన్ వచ్చును.—గాలి తాంకలగు వెల్గుల్ కోష్ణ హాసంతలో.

తన లేగుండియ బొంగి పోయెడు మృదుత్వమ్ముల్ స్వరూపమ్ము గై
కొని నట్లుండిన యీ ప్రవాళకరమున్ గొంచెమ్ముగా సాచి, మో
హాన రీతిన్ మధువొల్కు పుష్పచషక మ్మందించు, నీదారి ని
ల్చిన, సౌందర్యపు మారుపేరయిన వల్లీ ముగ్ధ, సస్మేరయై.

ఎదలో, సందుల సందులం దెచటనో, ఏ మూలనో నిద్ర ను
న్నది ఆర్ద్రత్వము సర్వులందు, అది యీనైక ప్రసూనాక్షి కో
ణ దరస్మేరములం ప్రబుద్ధమయి, స్పందత్వమ్మునుం బొంది, శు
ష్క దహాంత్వమ్మును బచ్చిచేసికొని, ఆస్వాద్యమ్ము నౌ తప్పకన్.

ధిషణా తీవ్రత రెచ్చిపోయిన కొలందిన్ గుండెలో నిండి ఈ
తృష పచ్చిందన మెల్ల చీల్చుటకు నంతేలేద, ఇక్లై నభః
కపమై, సర్వ విదాహక మ్మగుచు రేగన్ వచ్చు, కానన్ సుమత్
చషకమ్ముంగొని, తన్మధుద్రవముతో శాంతీకరింప న్వలెన్.

ఈ తృష లేదటంచు మరి యెవ్వడు చెప్పిన నేమి యౌను? ని
ర్యాతము వానికిన్ హృదయ మన్నదియే నిజమౌను, వాని ఊ
హాతిగ మైన దేదియు సుఖాదృతి సూపదు, ఊహా కంది భా
రాతత మైన దెల్లయు దృషార్తతకున్ వెలినుండబోవదున్.

దూరముగా దూరముగా
చేరదేసి కనుల జూచు చిన్నది ఇట పెం
పారిన, పేరిన మంచుల
లో రేపిన వెల్ల మంటలో? మాధురులో ?

ఏది సధర్మమై హృదయ మిచ్చిన పృచ్ఛకొసంగ జాలు భా
వావృతి, దానినిన్ బాదివినట్టి మెరుంగుల కళ్లదాన! ఆ
మోద భరమ్ముతో లోనికి పోయెదు నీ మధువున్ ద్వదార్ద్రితా
పాదిత లోచనాంకముగ పాన మొనర్చెదు నట్లు చేయవే!

ఈ మధువందు నీదు కనులే యని మాత్రముకాదు, హాసినీ!
కోమలమైన యీ ప్రకృతి కూడను బింబితమౌను, ఇట్టులే—
ఏ మగు? త్రావినన్, ప్రకృతి ఎక్కడనుండు? మదంతరమ్ము నం
దా? మరి నేనె యీ ప్రకృతి యంద? మరి ద్వితయమ్ము నేకమా?

ఈ ప్రకృతి ప్రవృత్తి నట నెచ్చటనో వెదుకంగనేల? నీ
లోపలి అచ్ఛభావమె అలూత సుమమ్మయినంతజాలు నెం
తే పొలుపుల్ వెలార్చునది యెల్లయు నీ కనులందె నందన
శ్రీ పరిణాహమై చిలుకరించును ఊహ చివళ్ల యందముల్.

ఊహసాగినదాక ఉన్మత్తభృంగీ ర
వమ్ము లాశా ప్రతి ధ్వనితములగు,
ఊహ ఆగినయంత ఉచ్ఛృంఖలాంధ్య భా
వమ్ము లంతట నిరవధికములగు,
మొనలు విచ్చిన మొగ్గలను గదల్చెడు గాలి
కొలుచు నెడందలోతులను, తెరలు
విచ్చిన కనుల మావిచివుళ్ళ చివరల
తరళత లందాల మెరుగు లొలుకు.

మనిషి యని యేమి, ప్రకృతి యంచనియు నేమి,
ఒకరి మొగములోనుండి వేరొకరు చూడి
పడిన యటులుండిరి గదవె, వెడద కంటి!
ఒకరు లేక వారికి మరి యొకరు లేరు.

ఈ యఖిలమ్ము మిథ్యయనియే తలపంగను వచ్చునోసి! కా
నీ, యఖిలమ్మునున్ విడిచి, 'నే' ననుమాటయు నుండన్గాన? కా
దా, యిదియున్ ఖిలమ్మయిన అంతయు సున్నయ యౌను, కావునన్
పాయని యీ మృదు ప్రకృతి భావము సర్వము నిత్యవృత్తమౌ.

అట సుమ వర్ణ రంగములయందు మనోహర దివ్య నర్తన
స్ఫుట తనువా మిళింది, కనుచూపులతో నెడదన్ గ్రసించుటన్
వటువగు నీమిళిందు డట పల్లవ పీఠికపైన, ఇంక నే
మిటి మరి కావలెన్, సకల మిథ్యలతో బనియేమి వాకికిన్.

వారల్ మాదిరె డెందమార్పులకు క్షిప్రవమ్మౌ జగమ్మెల్ల నం
స్సారమ్మందుట తప్పరానిదవు విశ్వవ్యాప్త తన్మాధురీ
సౌరభ్యమ్ములు నప్పుడే హృదయ నిష్ఠమ్మైన సత్యస్థితిన్
శ్రీ రమ్యమ్మగు నచ్చతా గుణము పారించున్ గదే శ్రీమతీ!

వినమత్ శీర్ష రస ప్రపంచములు తన్వీ! చక్రవృత్తమ్ముగా
నిను నన్నుం గనుచున్న వీ స్థితిని సంధిత్సాత్మతన్, చిర్నవుల్
చినుకం జూడుమ వాని నన్నిటిని, ఓలిన్ యుష్మదస్మన్మధు
ప్రణయ స్వాదుత వానిలో పరిచయ ప్రౌఢత్వముల్ చిందెడున్.

చిరంతన విలాసినీ! మధు నిషిక్త పీయూధునీ!
చరింపవె యెడంద, లౌకిక మిషల్ విదారిల్లగన్
నిరంతములు కాలికాంశలు ననేకముల్ గూర్చి, ఏ
కరాగ మధుసూక్తముల్ సకల కంఠముల్ విచ్చగన్.



# కవిత్వము - కావ్యము

శ్రీ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

నా దృష్టిలో కవిత్వ మన నేమో ముందు చెప్పి తరువాత ఇది కావ్య స్వరూప మని మనవి చేయుదును. నా దృష్టియన నేమన నా దర్శించిన దర్శనమని. అసలు నా దృష్టిలో కవిత్వమని ఇంత వాచ్యముగా ప్రారంభించుట యేలయన కవిత్వ మనగా నిది - ఇది కాదు - అని ప్రాచీనకాలమునుండి చెప్పబడుచున్నది. వర్తమానార్థ విశేష గమనింపదగినది. ఆ చెప్పబడుచున్న దానిలో వైవిధ్య మున్నది. ఉండుట సహజము. ఆ సహజత్వముయొక్క ఆంతర్యము నవగతము చేసికొనలేక అల్ప మనస్కులు తమ యిష్టాయిష్టములను రాగద్వేషములను పురస్కరించుకొని ఫలానాదే సిద్ధాంతము—మిగిలిన వసందర్భ ప్రలాపాలు—అని అనుకొనుచున్నారు. అనుచున్నారు కూడాను. ఈ అనుకొనుట—అనుట రెండింటికిని మూలమజ్ఞానము—ఏ వస్తువునైనను ఆత్మ ప్రత్యయము ఉచితేతరము గాని స్థితిలో నుంచుకొన్న వారందరును, ఒకే విధముగా దర్శింపరు. తమ దర్శనమే దర్శనముగా భావింపరు. కాని సృష్టిలో మనిషిని బోలిన మనిషి యున్నట్లే ఒక వస్తువునకు సంబంధించిన ఒకరిద్దరి దర్శనము లొక విధముగా నుండవచ్చును. మనిషిని బోలిన మనిషి యందును స్థిమితముమీద భేదము స్థిరపడినట్లే ఒకే విధముగానున్న ఆదర్శనములందును వైవిధ్యముతో కూడిన వైశిష్ట్యమును గుర్తించుట సంభవము—ఇంతకును చెప్పవచ్చిన దేమనగా వ్యక్తిత్వముయొక్క ప్రథిమ మూలముగా దర్శనము పుష్కలమగును. ఈ పుష్కల దర్శనములోని వైవిధ్యమాధారముగా అందు హెచ్చు తగ్గుల నిర్ణయము చేయరాదు. చేయుట లోకము స్వభావము. ఆ స్వభావ జ్ఞానముతో నంటిని నా దృష్టిలో కవిత్వమని.

దీనినిగూర్చియైనను మూడు విధముల చెప్పవచ్చును. ఒకటి: తనకు తోచినది తోచినట్లు చెప్పుట. రెండు: పూర్వులు చెప్పిన విషయముకే తిరిగి తాను చెప్పుట. మూడు: తాను దర్శించి చెప్పుట. మొదటిది నిరాధారమై గాలిలో తేలియాడుచున్నట్లుండును. పైగా దాని కతివ్యాప్తి దోషమున్నది. తోచుట అన్నది సర్వమానవ సామాన్యము. ఉన్మాదుడున్నాడు. వానికిని తోచుటయున్నది—రెండవది ఎక్కములువల్లె వేయుచున్నట్లుండును. అందు ప్రతిభ లేదు. పైగా అచ్చు యంత్రము వచ్చి విరివిగా గ్రంథములు ముద్రితములగుచున్న ఈ కాలమున కేవల మసందర్భమది. అనగా పూర్వులెవ రెవరు కవిత్వమునుగూర్చి ఏమేమి చెప్పినదియు నేను నేడు తిరిగి వల్లింపనవసరము లేదని. మూడవది: ఉత్తమమును—అత్యంతము అవసరమును నైనది. పూర్వులు దానినిగూర్చి చెప్పిన అంశముల నన్నింటికిగాని — అందులో నొకదానికిగాని అంటిపెట్టుకొనక వాని అన్నిటిద్వారా అసలైన ఆ వస్తువును మనముగా మనము దర్శించినచో ఆ యా పూర్వులు చెప్పినవానికంటె భిన్నమైన ఒకానొక గుణ విశేషముతో గాని లేక అన్నింటియొక్క సమాహార స్వరూపముగాగాని ఆ వస్తువు మనకు కనిపించును—ఒకడు తనకు కనిపించలేదన్నచో నెట్లందురు. అది వాని యదృష్టము—ఆ కనిపించిన దానిని కనిపించినట్లుగా పూర్వులేవిధముగా ప్రమాణములను కూర్చి తమ తమ దర్శనములను ప్రతిష్ఠించిరో అట్లే మనమును, సప్రమాణముగా దానిని ప్రతిష్ఠింపవలయును. దీనినే దర్శించి చెప్పుట యని యంటిని.

కవిత్వమనియు కావ్యమనియు అన్నాను. రెండింటికిని భేద మున్నదను విశ్వాసముతో అన్నాను. కవిత్వమే కావ్యముగాదు. కావ్యమున కవిత్వ ముండి తీరవలయును. మేధాశక్తిచేత సంయతమును సంభావితమును నై లయాన్వితమైన సుష్ఠు శబ్దములద్వారా వ్యక్తీకరింపబడిన మనోహరమును ఉత్కృష్టమును నైన ప్రతిభ కవిత్వము. ఈ ప్రతిభ నాలు విధములు. 1. చమత్కారము. 2. ఊహము. 3 భావము. 4. భావన. మొదటి రెండింటిని ప్రజ్ఞామూలములనియు తరువాతి రెంటిని ప్రతిభామూలములనియు అనుట నాకిష్టము. ఏమనగా "ప్రజ్ఞగలవారలై యప్రతిభులైన"వా రున్నారు. ఏమైనను ప్రతిభ నాల్గు విధములంటిని. ఈ ప్రతిభా ప్రదర్శనమువలని పరమప్రయోజన మానందానుసంధానము. ఈ ఆనందమన్నది వెత్తికినివలె వేయి విధములు. స్థిమితముగా నున్న మనస్సు వికారపడుటకు ప్రారంభించినది మొదలుకొని తనను తాను మరచి ఏదో పరమార్థభావనమునయందు తృప్తినిపొందువరకు ఆనంద మన్న పేరుతో అనుభవమునకునగు, దానిది బహుముఖస్వరూపము. దీనిని అదుపులోనుంచి స్పష్టము చేయవలయునన్న ఆలోచనతోనే దీనికి మూలమైన ప్రతిభను నాల్గు విధములని చెప్పినది. ఆ నాల్గింటిలోగల తారతమ్యము తెలియు స్వాతంత్ర్యము మాకున్నదను విశ్వాసముతో నిక వివరింతురు.

చమత్కార మన్నది ఉక్తి వైచిత్రి నాశ్రయించుకొని యుండును. శబ్దార్థభావము లాధారముగా నీ వైచిత్రియుండును. మనము శ్లేష కవిత్వ మనుకొనుచున్న దంతయు నీ చమత్కార కవిత్వమే. తెనుగు కవులలో చేమకూర వెంకన్నను మించిన చమత్కార కవి నాకు తెలిసినంతవరకు మరొకడు లేడు. ప్రజ్ఞను ప్రతిభగా రూపు కట్టించుటకు యత్నించిన పూర్వ కవులలో చేమకూర కవి ఎన్నదగినవాడు. ఎన్నదగినవాడని ఏల యనుచున్నాననగా తన శక్తి తా నెరిగినవా డాయన. తనకున్న శక్తి ఇది యనుజ్ఞానమున్న తరువాత—అదే సర్వోత్కృష్టమనుకొన్నను సేగి లేదు. ఆ యెరుక లేక తాను మహాప్రతిభావంతుడ ననుకొనువానితో గట్టి చిక్కున్నది. వెంకన్నతో

అట్టి నిక్కాలేగు "ప్రతి పద్యమునందు చమత్కృతి గలుగ జెప్ప నేను . నీ మూరి మెవరికిన్ రాదు సుమీ" అని వాని నిష్కర్షం. మొదటిది తనను తా నెరిగి చెప్పకొన్నది. రెండవది తనయందు తనకు విశ్వాస మేర్పడుకొరకు చెప్పకొన్నది—ఉన్నదానినే మనో విశేష ప్రతిపాదన సమర్థముగా జెప్పట చమత్కారము.

కడు హెచ్చు కొప్పు దానిం
గడవం జనుదోయి హెచ్చు కటియన్నిటికిన్
కడు హెచ్చు హెచ్చు లన్నియు
నడుమే పస లేదు గాని నారీమణికిన్.      విజయ 1-80

ఇందులో కవి సుభద్రయొక్క వ్యక్తిత్వమును ప్రత్యేకముగా చూపించు ప్రయత్నమేమియు చేయలేదు. కేవలము స్త్రీ జనసామాన్యములైన అవయవములనే గ్రహించి, వానిని పూర్వులు చెప్పినట్లే చెప్పచు, ఆ చెప్పటలో చమత్కారము చేసినాడు. శబ్దాశ్రయమైనదియు దీనివలెనే యుండును. శబ్దము నాశ్రయించి దాని విరుపులమీద ఆధారపడి చమత్కారమును సాధించుట ఇందు గమనింపదగినది.

అరచందమామ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
బరువంపు మొల్ల మొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్.

ఎన్నుగురు - నెన్నుదురు; పల్కుదురు - పల్ (పల్లు) కుదురు; ఈ శబ్దముల కూర్పే చమత్కారకారి. అర్థాశ్రయమన్నదానిలో, ఆ వాక్యముల నాశ్రయించుకొన్న అర్థము గడుసుదనముతో ప్రస్ఫుటమగుటయే చమత్కారము. అర్జునుని ఉలూచి నాగలోకమునకు మాయతో తీసికొనిపోయినది. అర్జునుడు తెలివొంది భూప్రదక్షిణ వ్రతమును పూని తిరిగెడు తనను కామించుట తగదనియు, అదియును గాక పరసతి నెనయుట ధర్మము కాదనియు అన్నాడు. తాను పరసతిని కానని చెప్పటకు ఉలూచి

"కన్నియఁగాని వేఱొకతెఁగాను మనోహరరూప నీకు నే
జన్నియ పట్టియుంటి నెలజవ్వని యంతయు నెటిదాక"

అని అని—ఇంకను నమ్మకము కలిగించుటకై

"నా
కన్నులయాన నా వలపుకస్తురి నామము తోడు నమ్మ."

అని ఒట్లు వేసికొన్నది. ఈ ఒట్లు లెక్కకురానిచో ప్రమాణము చేయుటకు సిద్ధపడినదా ఉలూపి. నిజమునకా ఒట్లు చాలును అర్జునుయనిందా మెరుగల అనురాగాతిశయమును చూపుటకు. ఈ నీ మనోహరాకారము వేనివలన నామనస్సున హత్తుకొన్నదో—ఈకన్ను లుండుటను బట్టియేగదా నిన్ను చూచుట పొసగినది—అకన్నులు నిజముగా నీ కొరకని నా జవ్వనమును మూటకట్టి యుంచని పక్షమున పోవును గాక. ఈ కన్నులు పోవుటయేగాదు ఈ నా అంతర్యము నందలి నీమీది వలపును ఎరుకపరచు చిహ్నమైన ఈ కస్తురిబొట్టును పోవును గాక అనగా నా ఐదువతనము మీదనే ఒట్టుపెట్టుచున్నానన్నదామె. అర్జును డింకను వెనుకొడుచున్నాడు; ఇక ప్రమాణము చేసి చూడవలయును. అసలా రెండవ ఒట్టును మించిన ప్రమాణముండదు. అయినను చేయవలసి వచ్చినది. ఉలూపి అనుచున్నది.

"శ్రా
దన్నను నీమువోవి మధురామృతి మానిట బాస చేసెదన్ 1-97

ఇది గడుసుదనము పొసుపెత్తిన చేయిడి ప్రమాణము చేయుట యున్నది. అగ్నిని ముట్టుకొని చేయుటయున్నది. జలమున మునిగి వచ్చి చేయుటయున్నది. దేవుని యెదుట నిలబడి చేయుట యున్నది. ఇవేవియు కాదు. అధరామృతి మాని ప్రమాణము చేయుట వింత. అసలర్జునునినుండి ఆమె కోరుచున్న దదియే. తాను కోరుకొనుచున్న దానిని ప్రమాణము చేయుటకన్న మిషతో అనుభవించుట కుద్యమించుటయే గడుసుదనము. ఆ గడుసు దనమును గడుసుదనముగా వ్యక్తీకరించుటయే చమత్కారము. భావాశ్రయమనగా భావము నాశ్రయించిన చమత్కారమన్నమాట. భావమననేమో ముందు చెప్పబోవుచున్నాము గనుక ఇట చేమకూర వాని పద్యమొకటి ఉదాహరించి వదలుదును—చిత్రాంగదా అర్జునుల ప్రథమ సమాగమము—కేళిభవనమున వారిరువురే ఉన్నారు. ఆమెకు క్రొత్త. మోహము నిల్పుకొనలేనివా డర్జునుడు. వారి అప్పటి అవస్థలోని చేతలకు రూపమిచ్చి చమత్కరించుచున్నాడు.

ఇగెడు వెన్కకుం బయికి నీడ్చిన పైట దొలంగఁజేయ కే
లొగ్గెడు రమ్మి పోకముడి యూడ్చిన గ్రుంగిలి రెండు కొంగులున్
బిగ నడంచుచున్ విడిచి పెటదు బాల ననం బనేమి ఆ
సిగ్గుకు సిగ్గులే దటులు సేసిన పిమ్మట నుండవచ్చునే.      2-30

ఇక ఊహము. ఇది రెండురకములు. ఒకటి అంతర్య నిర్ణయము. రెండు అనుసంధాన కౌశలము—లోకమున ఒక వస్తువున్నది. అది అట్లేయుండుటకు హేతువైన మూలతత్వ మొకటున్నది. అమూల తత్వమే దాని అంతర్యము. అది ఫలానా అని నిష్కర్షగా చెప్పటయే అంతర్య నిర్ణయము, ఆ ఫలానా అన్నది ఊహమీద ఆధారపడినది. ఈ ఊహాశక్తి అత్యధికముగా గల తెనుగుకవి—రాయలు. వ్యుత్పత్తియన్నది బహుజ్ఞతయే అనుచో రాయలవారిని మించిన వ్యుత్పన్నుని వేరొకనిని పేర్కొనుట నాతరముకానిది. అవ్యుత్పత్తి ఆధారముగా రాయలవారి ఊహము సర్వతః ప్రసారము కలది—లోకమున యుక్తవయస్కలైన బాలికలకు వక్షోజము లేర్పడి క్రమముగా ప్రవృద్ధములగుట యున్నది. అట్లేర్పడుటకును—అట్లు క్రమముగా ప్రవృద్ధములగుటకును హేతువైన మూలతత్వమును తదాంతర్యమును రాయలూహించి నిర్ణయించుచున్నాడు.

ఒదవెడు జవ్వనంబు వెలికొత్తగ, పయ్యెద సిగ్గుకూడి చి
ట్టదుముగ లేతలేట దిగనాకకు మీఱను లేక వక్షపుం
జదుమున ప్రక్కలన్ మెఱసి చప్పటలై మఱి లావుగూడ పై
పొదలె ననంగ పిక్కటిలె పొల్తుక చన్నులు నాడునాటికిన్. 5-21.

ఆ వక్షోజము లామె కంతకుముందేయున్నవి. వెలికిగాక లోనివున్నవి. ఆమెకిపుడు క్రొత్తగా యౌవనము దేహమున పుట్టి పెరుగుచు లోననున్న ఆవక్షోజములను వెలికి నెటినది. అవి సిగ్గువలన వెలికి రాలేకను పయ్యెదవలనను అట్లే అదుముబడి లోనికి వెళ్ళుటకు వీలులేవందున వక్షమంతయు వ్యాపించి, ఇక లాభము లేదని ఆ సిగ్గును

విడిచి మర్యాదను లెక్కసేయక బయటపడినదట. ఇంత తతంగమే లేనిచో అవి క్రమముగా నానాటికి ప్రవృద్ధము లగుటలో నాంతర్య మేమున్నదని రాయలవారు రాయలవా రూహచేసి నిర్ణయించిన మూలతత్త్వము కాదనుటకు వీలులేదు. మరొకడు మరొక ఊహ చేయవచ్చును. అది వేరువిషయము. రాయలు తనకున్న బహుజ్ఞతను సర్వమును ఆధారముగా సర్వవిషయముల మూలతత్త్వమును నిర్ణయించును. ఆయన చేయు ఊహల కొక దిక్కని త్రోవయని లేదు. అవి సర్వతః ప్రసారముగలవి.

రెండవదైన అనుసంధాన కౌశలమన్నది—తా నెరిగిన వస్తు సంచయమును తత్సంబంధి సాధర్మ్య వైధర్మ్యము లాధారముగా ఒకచో చేర్చి ఏకసూత్రమున సంధించి కౌటోలువనిపించుట—లోకమున వర్షకాలమున మిణుగురు పురుగుల సంచారమున్నది. లోకమున చిన్నచిన్న నిప్పుకణికలు ఉన్నవి. గ్రహకూటమిలో అంగారకుడు ముందునకు వచ్చినచో వర్షము కురియదు. ఆ గ్రహమట్లు వచ్చుటను పురోంగారక యోగమన్నది శాస్త్రము. వర్షము కురియుట మేఘముల ధర్మము. పురోంగారకయోగముపట్టి మేఘముల వర్షింపనీయదు. ఆ క్షుద్రపురుగులకును అగ్నికణములకును సామ్యమున్నట్లు మేఘమునకును అంగారకునకును భేదమున్నది. ఈ రెండింటిని ఆధారముగా చేసికొని రాయలవా రొకచో చేర్చి ఏకసూత్రమున సంధించుట కుపక్రమించి ఆముక్తమాల్యద నాల్గవ ఆశ్వాసమున. (107)

సారెకు మింట మేఘుడు నిజస్ఫురణంబున క్రూరమా పురో
గారక యోగమాడి తిరుగన్ సకుటుంబము తద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ అంతలును ఇంతలునై పడు తన్నభశ్చ్యుతాం
గార శిశు ప్రతానముల కైవడిరాలె సురేంద్ర గోపముల్.

అనివారు—తన ధర్మమును నెరవేర్చనీయక అడ్డుపడినందున అంగారకునిమీద మేఘునకు కోపము వచ్చినదట. వచ్చి వానిని సకుటుంబముగా నాశనము చేయతలచి యనుకొని పడనెట్టగా బలవంతములుగాని తదంగార శిశువులు అట తట్టుకొని నిలువలేక నేలపైబడుచున్నట్లుగా మిణుగురు పురుగులున్నవట. అంగారకమన నగ్నికణము. అంగారక గ్రహవర్ణ మరుణము. శాస్త్ర మాధారముగా నా గ్రహమును మేఘము పడనెట్టుట నూహించి—గ్రహము పడిపోయినట్లు ప్రమాణము లేదుగనుక—తత్సంతానము పడిపోయినట్లు చెప్పిన విరోధము లేనందున—దాని నూహించి, తత్సంతాన మనుటతో తద్గ్రహమును వాని కనుసంధించి—తత్సంధానా నంతరము వాని వర్ణము గమనించి—ఆ వర్ణము మిణుగురు పురుగుల వర్ణమువలె నుండుట గ్రహించి—ఈ పురుగులయందు తదంగారశిశువులకు నభేదము నూహించి స్థాపించుటలో గల కౌశలమే గమనింపదగినది. ప్రజ్ఞా మూలములని నేను కొనిన చమత్కారమును—ఊహను స్థూలముగా మీకు మనవిచేసినాను.

ఇక కేవలము ప్రతిభామూలములైన భావమును—భావనను వివరింప బోవుచున్నాను. ఈ రెండింటిని నొకచో నేల చేర్చితి ననగా! ఇంతకుముందు చెప్పిన చమత్కారమునకును ఊహకును గల దూరము వీనికి లేదు. ఇవి అంతగా దగ్గర పడియుండును. భావమునకు మూలము నిశిత పరిశీలనాత్మకమైనద్వంద్వ జ్ఞానము. ద్వంద్వ మనుటవలన సుఖదుఃఖాదు లూహ్యములు. ఈ భావము జడచేతన వస్తు సంబంధముచేత ద్వివిధాభూతము. జడసంబంధియైన భావము రూపభావమని అవస్థాభావమని రెండు రకములు. చేతనవస్తు సంబంధియైన భావము ఆధ్యాత్మికమని ఆధిభౌతికమని ఆధి దైవిక మని మూడు విధములు. జడవస్తు సంబంధిభావము బొమ్మ కట్టుకొని ఎదుట కన్పించుటలో పర్యవసితము. చేతనవస్తు సంబంధభావ మాలోచనామృతమై బోధలో పర్యవసించును. దీనిని భావన యన్నాను. ప్రత్యేకముగా స్పష్టముచేసి చూపుట కన్నాను.

జడవస్తు సంబంధియైన రూపభావమున కుదాహరణ మిచట నీయ నక్కరలేదు. భారతము విరాటపర్వములోని శమీవృక్షము, మనుచరిత్రము నందలి శీతశైలము, కాశీ ఖండమునందలి వింధ్యమును పరిశీలించినచో బొమ్మకట్టుకొని నిలుచుట అనుభూతమగును. దీనికిని అవస్థాభావమునకును గల భేదము మనోవికృతి కలుగకుండుటయు కలుగుటయు మాత్రమే. మనోవికృతుల ననుభవించుట మాత్రమే చేయగలవి జడములు. అనుభవించుటతోపాటు వ్యక్తీకరింపగలిగినవి చేతనములు. కేవలము స్థావరములకు మనోవికృతి యెట్లుండు నన్నచో కవిచేత ఆపాదింపబడి యుండును. ఈ ఆపాదించుట అవసరమునుబట్టి ఈ ఆపాదింపబడిన మనోవికృతిగల జడములుగాని లేక సహజముగా మనోవికృతులు గల జడములయొక్కగాని అవస్థాభావమును దర్శించుటకు నిశితపరిశీలనాత్మకమైన ద్వంద్వజ్ఞాన మెంతయున్న అంతరక్తి. విరహ చంచలయైన చక్రవాకియొక్క తదవస్థాభావమును పెద్దన మనుచరిత్రమున నిట్లు చూపినాడు.

ఏ విహంగముగన్న ఎలుగిచ్చుదును సారె
కును సైకతంబుల కూసెదారు
తారి కన్గొని అది తనజోడు గాకున్న
మెసరెత్తి కలయంగ మింటవరయు
అరసి కన్నీటిలో మరలి తామరయొక్క
వదన మెండగ సరోవారివద్దు
అద్రితావగ సైపకట్టిట్టు కన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యులుకు
ఉటికి రెక్కలు తడియ వేళ్ళొక్కతమ్మి
కదుగు అరిగి రవంబుతో తిరుగ తేంట
పాడుచు ముస్కున మటియును బోవు వడక
సంజ ప్రియుఁబాసి వగనొక్క చక్రవాకి. 3-16.

దీనిని వివరింపవలసిన అక్కరలేదు.

చేతన వస్తుసంబంధభావము ఆధ్యాత్మికమని—ఆధిభౌతికమని, ఆధిదైవికమని వెనుక చెప్పినాను. తాపత్రయమని చెప్పబడు వానినే ఇట్లు గ్రహించినాను. ఏలయనగా ఈలోకమున చేతన వస్తుగతమైన ద్వంద్వభావ మా తాపత్రయము నాధారము చేసికొనియే యున్నది. నేను మాటాడుచున్నది వేదాంతము కానందునను—సుఖదుఃఖములు రెండింటిని సూచింప దలచుకొనుటచేతను, వానిని భావత్రయ మనుచున్నాను. ఈ భావములతోను—వ్యాదికభావములతోను ఇట ప్రసక్తిలేదు. ఈ భావత్రయమును దర్శించునది భావన. అంతఃకరణ చతుష్టయమును (చిత్తము—బుద్ధి—మనస్సు—అహం)

యొక్క వృత్తిమీద ఆధారపడి భావనలోని బలముండును. మనము మహాకవులను అనుకొను వారిలోను దోషములుండుటకు హేతువు ఏ అంతఃకరణ చతుష్టయ సంబంధి వృత్తిలో ప్రాముఖ్యము లేకపోవుటయే. ఆ లేకపోవుటయే మానవుడు మానవుడుగా నుండుటకు మూలము. అంతఃకరణ చతుష్టయములోని అహం అన్నదే వ్యక్తిత్వమన్నది (Individuality) సృష్టిలో గల వస్తువిషయములలో ప్రవేశించి—పరిశీలించి-దాని యాథార్థ్యము నెరిగి—అనుభవించి—ఆ యనుభూతిని అనుభూతిగా ప్రక్కన పెట్టి తాను తానుగా నిలుచుటయే వ్యక్తిత్వమన్న దాని లక్షణము. ఆయనుభూతిని చింతనచేసిచేసి చిత్తము తనదిగా బుద్ధి కందీయ అది దాని సత్త్వమును విచారించి మనస్సు ముందుంచగా అది దాని కొక రూప మిచ్చి వాగ్ద్వారమున వెలికిపంపును. ఆ వచ్చినదే కవిత్వము. ఆ వ్యక్తిత్వముగలవాడే కవి. నేడు కవులుగా ఏ యశశ్శరీరులను మనము గుర్తించుచున్నామో వా రందరును అట్టి వ్యక్తిత్వముకల వారు. చిత్తము బుద్ధిమనస్సు—వీనిలోని దార్ఢ్యము లేమిని పురస్కరించుకొనియే వారిలో దోషములుండుట సంభవించుచున్నది. ఈ దోషములలోకూడ అధిక భాగము బుద్ధిబలము తక్కువగుట మూలముగా నేర్పడినవే. బుద్ధివలన వస్తువుయొక్క సత్త్వము విచారింప బడునంటిని. అనగా ఆ విచారణమువలన బోధకలుగును. బోధ అనగా అచ్చ తెలివి. ఇది కలుగుటతో రతి రతివలన శాంతి, శాంతివలన తృప్తి. తృప్తియన్నదే రసానందమని అధ్యాత్మోపనిషత్తు. ఈ బోధ లేకపోవుటయే చాలమందిలో గల లోపము. లేదని మన కెట్లు తెలియుననగా అధికారముగల పాఠకుల కది కలుగుట లేదు గావున. ఈ అధికారమును నిర్ణయించు వారెవ్వరనిన ఎవరికి వారే. సాత్త్వికబుద్ధులైన పాఠకులకు కవిత్వము అనుభూతికి వచ్చినట్లు రాజస తామస బుద్ధులకు రాదు. సాత్త్వికబుద్ధి యనగా—అది ఏదైనను దాని అంతరతత్త్వమును సప్రమాణముగా గుర్తెరిగి—ఇది ఫలానా అను నిర్ణయము చేసుకొనునది. రాజసబుద్ధి ఎంతటిదాని నైనను తృణముగా చూచుస్వభావము గలది. తామసబుద్ధి ప్రతి దానిని తల్లక్రిందులుగా చూచునది. కవిత్వ మందరకు నర్థము కావలయుననుట—అనుభూతికి రావలయుననుట శాస్త్ర మంగీకరింపని విషయములు. శాస్త్రమనగా మన తత్త్వ శాస్త్రము. అందరు సాత్త్వికబుద్ధులగుట పొసగదు. అందువలన కవిత్వమే కాదు ఏ విషయమైనను అధికారులకు మాత్రమే. అయినచో సాత్త్వికబుద్ధులైన పాఠకులు తమ తమ అనుభూతులను వ్యక్తము చేయుచున్నారు గదా — వాని కేకవాక్యత కుదురుట లేదేమి అనవచ్చును మీరు. వారు సాత్త్విక బుద్ధులన్నది అంగీకరింపబడిన తరువాత—ఏకవాక్యతకు రాని వానిని అభిప్రాయ భేదములుగా గాక వైవిధ్యముగా తెలిసికొనవలయును. వైవిధ్య ముండుట సహజమనియు-వాంఛనీయమనియు ఇంతకుముందే చెప్పియున్నాము గదా.

చేతన వస్తువులనగా మానవులు. మానవునకు తననుగురించి, తన బంధుమిత్రులను గురించి, తాను వసించు లోకమును గురించి మూడు భావములున్నవి. అసలు భావమునకు మూలము నిశిత పరిశీలనాత్మకమైన ద్వంద్వజ్ఞానమని—ద్వంద్వమనగా సుఖదుఃఖాదులని తిరిగి సవరు చేయుచున్నాను. వీని బోధ లక్ష్యమునకే భావనయని పేరు. ఈ భావనయు వానివానికే అంతు చిక్కనిది. కవి, తాను భావనచేసిన దంతయు అట్లే చెప్పడు. చెప్పుటకు తగినంత యవకాశమును లేదు. అవకాశ మున్నంతలో అట్లు చెప్పగల శక్తి తెనుగు కవులలో తిక్కనకును విశ్వనాథకును ఉన్నంత నా ఎరుకలో మరొకరికి లేదు. అందుకు కారణము మరేమియు లేదు. నాకెంతటి కవులలో అంతటి విమర్శకులు—అసలే కవిత్వమున్నది ఒక ఆట. కవియు సాత్త్వికుడైన పాఠకుడును కలిసి యాడవలసిన యాట. కవి మనకును అవకాశము కల్పింపవలయును. మన మాడవలసిన యాట కూడ ఆయనయే ఆడినచో వాని శక్తి మరింత గొప్పదగును; కాని మన కెక్కువ అవకాశ మిచ్చినవాడు కాకపోవుచున్నాడు. నేను సహృదయుడనుటను వదలి సాత్త్వికుడైన పాఠకుడనుచున్నాను. ఎందుకనగా, నేడధికముగా ఆ శబ్దము పత్రికల బసవన్నకువలె తల లూపు సాహిత్యకుల నుద్దేశించి వాడబడుచుండుటవలన. అది నా కిష్టము కాదు. నేను చెప్పిన సాత్త్వికబుద్ధిగల పాఠకుడే అసలు సహృదయుడు—కవి తన భావన నంతయును వ్యక్తీకరించుట కవకాశము లేనందునను—సాత్త్విక బుద్ధిగల పాఠకున కవకాశము కల్పించిననే గాని తన శక్తి బహిర్గతము కాకుండుటను పురస్కరించుకొని కవి ధ్వని మార్గము పట్టినాడు. కవి ఈ మార్గము నాశ్రయించుటతో అసలాట అంతయు ఆ సాత్త్వికబుద్ధియే ఆడుచున్నటయినది. వీని ఈ ఆట తన భావన కనుగుణము కానిచో తన పని యంతయు వ్యర్థము. అందువలన తన ఉనికిని అనగా భావనను కొంత వానికి వదలవలసి వచ్చినది. ఏది ఇచ్చిన ఆసాత్త్వికబుద్ధి పూర్తిగా అందుకొనగలదో నిర్ణయించుకొనవలసి వచ్చినది కవికి. ఆ నిర్ణయమే కవియొక్క గొప్పతనమైనది. అనగా ఆ నిర్ణయముతో కూడిన భావనను వ్యక్తీకరించుటయే కవిత్వమైనదన్నమాట. వ్యక్తీకరించుట వచ్చినపుడు శబ్దము నాశ్రయింపక తప్పదు. ప్రతిశబ్దమునకును లోకమున నొక అర్థ మున్నది. ఇందులో తాను వ్యక్తీకరింపదలచుకొన్న భావనను సాత్త్వికబుద్ధిగల పాఠకున కందీయగలవానిని కవి ఏరుకొనవలసి వచ్చినది. వెనుక నే నిచ్చిన కవిత్వ నిర్వచనమునను సుష్ఠుశబ్ద మన్న దిందుకే. ఎంత యత్నము చేసి ఏరుకొందమన్నను తన భావన నందీయగల శబ్దములు లేనందున ఉన్నదానికో మరొక యర్థమును అంటగట్టినాడు కవి. ఒక పదార్థముయొక్క ఒక గుణము నాశ్రయించి దానికి సంకేతముగా నొక శబ్దమేర్పడగా మరొక గుణమును తాను చెప్పదలచి అందుకు సమర్థమైన మరొక శబ్దము నా పదార్థమునకే సంకేతము చేసినాడు కవి. అనగా శబ్దములకు నానార్థములు—వ్యుత్పత్త్యర్థములు సృష్టింపబడినవన్నమాట. ఈ వ్యుత్పత్త్యర్థముతో నిమిత్తము లేకుండ ఒక పదార్థమునకు సంకేతములైన పదము లన్నియు పర్యాయపదము లనబడును. కవి తానెంత వ్యక్తిత్వము కలిగి, అనుభూతిని పొంది, చిత్తముతో చింతనచేసి, బుద్ధితో తొందరపడక ఉచితానుచితములను విచారించి—ఇది సాత్త్వికబుద్ధి గల పాఠకుల మనస్సును రంజింపజేయుటయేగాక లోకమున నొక పరమోత్కృష్టమైన జీవనమార్గమును కూడ సూచించునని తన భావన మీద తనకు ఎంత విశ్వాసమున్నను—దానిని వ్యక్తీకరించునపుడు తదనుగుణ సమర్థమైన సుష్ఠుశబ్దమును గ్రహింపనిచో అంతయు వ్యర్థము. తొందరపడక ఉచితానుచితములను విచారించి యని

ఇప్పుడున్నది వెనుకటి నిర్వచనములోని 'సంయతమును సంభావిత మును' అను వాని అంతర్యముగా గ్రహింపవలయును. ఆ నిర్వచనమున నున్న లయాన్వితి మన్నది ఛందమునకు సంబంధించినది. ఛంద మనగానే పద్యమని భ్రమ పడరాదు. భావనవలన అనుభవమునకు వచ్చిన వస్తుస్వరూప స్వభావాదుల చింతనమువల్ల తీవ్రమై— సంభావిత సమయమున వేగవంతమై—మనస్సుచేత రూపము కట్టు కొని వెలికివచ్చును. వెలికివచ్చిన ఆ రూపములోని ఆ వేగముచే లయ అంటిని. ఛందమని దానినే ప్రాచ్యులనిరి.

చేతనవస్తుసంబంధభావ భావనను అభివ్యక్తము చేయు టకు కవి కనేక మార్గము లున్నవి. అందు రూపకల్పన చేసి వదులుట—అవస్థా ప్రపంచనము చేసి చూపుట—ఈ రెండింటిని ఇమిడ్చి ఆలోచనామృతమై బోధలో పర్యవసించునట్లుగా చెప్పుట ఇత్యాదులు కొన్ని గమనింపదగినవి—ఇచ్ఛా విహారులైన హరగిరిజలు సురతాతురులై గాఢాలింగనమున నొదిగినారు. ఆ ఒదుగుటవలన నైన అనుభవము వారి నవన్యాభిజ్ఞులను చేసినది. తాను భావనవలన దర్శించిన దర్శనమునకు కేవలము రూప మిచ్చి వదలినాడు నన్నెచోడ దేవుడు.

కరలత లందంద కామపాశంబుల
వదిమి సంధించుచున్నట్లు బిగియ
నొఎవఁ బేర్చిందులఁ బదనైన పూఁతలం
గమునకు వజ్రలేపములుగాఁగఁ
బులక లొండొరుల మేనుల నుచ్చిపోయి ద
గ్గఱ మొలవిచ్చినకరణి గాగఁ
గనకంపు ప్రతిమలు గాఁచి యంటించిన
ట్లొడఁగూడి తనువు లొండొంటిఁ గదియ
తగఁగ నొక్క తలకు మొగములు రెండైన
పగిది తలలు మారు మొగము వడఁగ
గీఱి మేనుమేనఁ దూఱి గాఢా లింగ
నంబుచేసి రంగనయుఁ బ్రియుండు.

కు. సం. ఆ. 9. ప 149.

శ్రీ మద్రామాయణ కల్పవృక్షము అయోధ్యాకాండము అభి షేకఖండమున కోపగృహమును చేరిన కైక తనకోరికను వెనుకటి వర ములనెపమున వ్యక్తముచేసినప్పటి దశరథుని మాటలుగా "అని మఱియు నిట్లనియె" "అని మఱియు నిట్లనియె" "అని మఱియు" "మఱియు రాజుకోపోద్దీపితుడై" మఱియు రాజు పరమదైన్యంబున" "తుదకు రాజు నిస్సాహాయుండై యిట్లనియె" ఇత్యాది సూచనలతో సాగిన 30-36 పుటలలో గల 46 పద్యములు దశరథుని అవస్థాప్రపం చనార్థము వ్రాయబడినవి. ఇట్లు వ్రాయుటకు మానవః మన స్తత్త్వ సంబంధి బహుసహస్రవిషయ పరిజ్ఞానమును సూక్ష్మసూక్ష్మవిషయ గర్భ విశ్లేషణ పటిష్ఠమైన ధీ విశేషమును కావలయును—భారత యుద్ధమైపోయినది. ధర్మరాజు రాజై నాడు. ధృతరాష్ట్రుడు ఆశ్రమ వాసి కాగోరి అందరినుండి అనుజ్ఞ తీసికొన్నాడు. ఇష్టము లేకపోయి నను వ్యాసునిమాటమీద ధర్మరాజు రాజుగా ధృతరాష్ట్రుని పోవు టను అనుమతించినాడు. గాంధారీసహితము బయలుదేరినాడు ధృత రాష్ట్రుడు. ధర్మరాజునకు తెలియని నాత డెదటకు పోవుచున్నది యనుచు సాగనంపుటకు వెంటవచ్చుచున్నాడు. ఇదంతయు వ్రాసి కొని వచ్చుచున్న తిక్కన ధృతరాష్ట్రుడు నగరు వెడలునప్పుడు— అనగా రాజప్రసాదపు తలవాకిలి గడప దాటగానె—దాటి చనుచుండ

పాండవాగ్రజు డక్కురుభర్త వలను
శోకవిముడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజ ముఖ్య! యెం దరిగె దనుచు
నొడలు కంపింప చదికిల బడియె నధిప.

భార. ఆశ్రమ. ఆ. 1 ప. 140

అని వ్రాసినాడు. ఈ వ్రాయుటలో రూప కల్పనతో పాటు అవస్థాపాపనము చేసి ఆలోచనామృతమై బోధలో పర్యవసించు నట్లున్న భావన ఉన్నది. నన్నిచోడ దేవు డూరక రూపమును చూపి తదంతర్గతమైన అనుభవభావతీవ్రతను భావనకు వదలినాడు. విశ్వ నాథ దశరథుని మాటలు మాటలుగా చెప్పి అప్పటి వానిచేతలను, అంతస్సును పట్టి పించుచున్న దిక్కు తోచనీయని భయమువలననైన విహ్వలతను భావనకు విడిచినాడు. తిక్కన ధర్మరాజు అంతశ్చేతన కొన్ని నిలువుల లోతునుండి ఆవర్తములై ఊర్ధ్వముగా కొట్టుకొని వచ్చు బంధు సంబంధములయిన ప్రేమానురాగ-భక్తి గౌరవ దయా దాక్షిణ్యాది బహుభావ సముద్ధతిని భావనకు విషయముగా చేసి నిలిపినాడు. భారత మాద్యంతము చదివి ధర్మజుని అంతరాత్మను పరిశీలించుచు వచ్చిన సాత్వికబుద్ధి కా విషయము బోధపడును. నేను వ్యాఖ్యానము చేసి చూపుట కిది గాదు అదను.

చేతనవస్తుసంబంధి భావము త్రివిధ మంటిని. ఆంగ్లేయుల దృష్టిని కవిత్వమును చూచినపు డాధ్యాత్మిక భావభావన మాత్మా శ్రయ కవిత్వముగాను మిగిలిన రెండింటి భావభావనము పరాశ్రయ ముగాను కనిపించును. అస లాంగ్లేయుల దృష్టి స్థూలము. సూక్ష్మ పరిశీలనా పటువు భారతీయము. అది కవిత్వము నంతయు ఆత్మా శ్రయముగానే చూచుకొన్నది. త్రివిధ భావ భావనమును విడివిడిగా నుదహరింపను అవసరము లేదు. అసలేదయినను భావన చేయుటలో ఉన్నది. దానిని వ్యక్తీకరించుటలో ఉన్నది. శ్రీ గార్లపాటి రాఘవ రెడ్డిగారి 'పరిదేవనము' (వేణుగోపాల శతకము) నుండి ఒక ఉదా హరణము చూపుదును.

దేవా నాదగు దృష్టి నీవగుము - ఆ దృష్టిన్ విలోకింతు నే
నీ విశ్వంబును నాదు కేలగుము తండ్రీ దాన లోకానకున్
సేవల్ చేయుదు నాదు చిత్తమగు మా చిత్తాన సత్యార్థ బో
ధావిర్భావము కూర్తు నీ జగతికన్నా వేణుగోపాలకా.

ఈపద్యము మీకర్థమగుచునే ఉన్నది. ఐనను నేనుచెప్పెదను. పరమేశ్వరుని శక్తియే మానవున కున్నచో ఈలోకమున ఆయనకంటె మానవుడే యెక్కువ ఉపయోగపడునన్న భావము మూలమా పద్య మునకు. ఆ పరమేశ్వర శక్తిని మానవుడు తనకుతానై పొందవలెను. అనగా పరమేశ్వరునిలో తనను గాక—తనలో పరమేశ్వరుని లీనము చేసికొనవలయును. ఈ చేసికొనుట ఎట్లు సాధ్యమనగా విశ్వ శ్రేయస్సు కాంక్షించిన త్రికాలదృష్టితో తత్సంబంధి సేవాసక్తిని

పొందిది అనగా కర్మయందు నిష్ఠతోడి ప్రవృత్తిని కొరపి సదసద్వివేక కలిగి అఖండానంద మను నింకు తృప్తిని మానవుడు కూర్చుకొనుట వలన. మానవుని సర్వశక్తియు ఈ తృప్తిని కూర్చుకొనుటకును— కూర్చుటకు మాత్రమే ఉపయోగపడవలయును గాని తద్వ్యతిరిక్తముగా అది పనిచేయరాదు. ప్రతి ఒక్కనికిని తనయందు తనకు పరమేశ్వరభావముండి, మిగిలిన ఎదిరి మనుష్యులయందు గల ఆ పరమేశ్వర భావమును భావన చేయవలయును. విశ్వవ్యాప్తమై ఈ భావనయున్నచో అంతకుమించినది లేదు. పరమేశ్వరుడన్న వాడు మానవునిలో తక్క మరొకచోట ఉండడు. మానవుడు లేక పరమేశ్వరున కస్తిత్వము లేదు. మానవుడే ఒక పరిసితిలో పరమేశ్వరుడు. ఆ పరిస్థితిని మానవుడు సమకూర్చుకొనవలయును. దృష్టియున్నందుకు సర్వవస్త్వంతరము చూచుట — కేలున్నందుకు సత్కర్మచేయుట—చిత్తమున్నందుకు సదసద్వివేక కలిగించుకొనుట మానవుడు చేయవలసినది. కవి ఈ భావనవంతయు వ్యక్తము చేయలేదు. దాని నింకను భావన చేయవచ్చును. "అధికార బోధయుక్తేషు విద్యతే భావభావనా, అక్షీణేషు సమస్తేషు విశేషజ్ఞానకర్మసు"— దేవా నీవు నా దృష్టివగుము, నే నీ లోకమును చూతును. నీవు నా కేలగుము, నేను సేవచేయుదును. నా చిత్తమగుము, నే నీ లోకమునకు సత్కార్యబోధ కలిగింతును—అని మాత్రమే కవి చెప్పెను. దీనిని మనము భావనచేయవలయును. ఈ చేయుట ఆయన ఉపయోగించిన శబ్దముల అర్థములలోని లోతుల నాధారముగా చేసికొనియే. ఇందుకే సాత్త్వికబుద్ధిగల పాఠకునకే కవిత్వమని మనవిచేసినది— ఇందులో కేవలము భావభావనయే గాక ఊహము చమత్కారమును కూడ ఉన్నవి. భగవంతునకు కూడ మనవలెనే కన్నులును చేతులును—చిత్తమును ఉన్నవని చెప్పట ఊహ. ఔనని గాని, కాదని గాని అనుటకు వీలులేనిదె ఊహము. అట్టి పరమేశ్వా నని నీవు నా దృష్టివగుము-నా కేలగుము - నా చిత్త మగుము - అపుడు చూతువు గాని నా శక్తియని యనుట ఉక్తి చమత్కారము. ఇందులో, అన్ని సాధనములుండియు నీ వసమర్థునివలె ఉన్నావుగాని ఆ సాధనములే యున్న నే నట్లుండ ననుట తదంతర్గత చమత్కారము. చతుర్ముఖమైన కవితాప్రతిభ ఎట్లు మేధాశక్తి (ధిషణ - బుద్ధి) చేత సంయతమును సంభావితమును ఐ లయాన్వితమైన సుష్ఠుశబ్దముల ద్వారా వ్యక్తీకరింపబడి మనోహరమగుటతోపాటు ఉత్కృష్టతను కూర్చుకొన్నదో ఇప్పటికి కొంత బోధపడియుండు ననుకొనుచున్నాను. సాత్త్వికబుద్ధులైన మీమీద నిర్ణయభారమును పెట్టి— ఇక కావ్యమునుగురించి చెప్పెదను.

కవిత్వమునకును కావ్యమునకును భేద మున్నదనువిశ్వాసముతో నున్నాననియును, కవిత్వమే కావ్యముగాక కావ్యమున కవిత్వముండుననియును వెనుక చెప్పియున్నాను. భావము భావముగా భావనచేయబడివ్యక్తీకరింపబడ్డది కవిత్వము. భావము కథ నాశ్రయించుకొన్నదై భావనచేయబడి నిర్వహింపబడినది కావ్యము. అనగా కావ్యమన్న దానియందు కథ — నిర్వహణము అను రెండు, భావమును భావనను ఇముడ్చుకొని ఏకముఖమున భాసించుచున్న వన్నమాట. ఆ ప్రభాసయే కవిత్వమునుండి కావ్యమును పృథక్కరించి చూపునది. కథయన నేమో మీకు నేను చెప్పనక్కరలేదు. ఇట్లనుటవలన లోకములోని ప్రతి కథయు కావ్యమున కుపయోగించునని కొనరాదు. ఉపయోగించుననుకొన్నను బాగులేదు. అసలు కథయనగా నేమి? కొందరు వ్యక్తులు కొన్ని మాటలు మాటాడుచు కొన్ని పనులు చేయుటవలన తమ్ము తామభివ్యక్తము చేసికొనుటను మొదటినుండి చివరదాక తెలుపుట వారికథ తెలుపుట. కావ్యమున కథయనగా, కవిచేత ఒకచో చేర్చబడిన కొందరు వ్యక్తుల కొన్ని మాటలు కొన్ని చేతలు కలిసి వారి స్వరూపస్వభావాదులు ఫలానా అని అనిపించునది. ఈ ఫలానా అని అనిపింపవలసినది ఫలానా అన్నది కవి నిర్ణయించుకొనును. ఆ నిర్ణయముతో కొందరు వ్యక్తులను సృష్టించి వారి మాటలుగా వారి చేతలుగా కొన్నింటిని కల్పించి తాను కృతార్థుడగువరకు రచన సాగించును. వ్యక్తి ఊరక మాటాడడు. పనిచేయడు. ఒక అభిరుచితో — ఒక ప్రత్యయముతో — ఒక ప్రయోజనముతో — ఒక ప్రత్యాశతో వ్యక్తి మాటాడుటయు పనిచేయుటయు జరుగును. వ్యక్తుల జీవనవిధాన మంతయు అట్లే సాగుచున్నను అందరి అభిరుచులు — అందరి ప్రత్యయములు — అందరి ప్రయోజనములు — అందరి ప్రత్యాశలు ఒకటిగా నుండక పోవుట లోకజ్ఞతమూలమున స్పష్టము. అందువల్ల కవిచేత ఒకచో చేర్చబడినవ్యక్తులును భిన్నభిన్నములైన అభిరుచ్యాదులు కలవారే అగుచున్నారు. అనగా వారిప్రవృత్తులు తత్తదనుగుణముగానే ఉండును. భిన్నములైన ప్రవృత్తితత్త్వములు ఏకముఖముగాగాని సమానాంతరముగా గాని ఉండక ఎదురుముఖములై నిలచును. నిలచినవి నిలిచినట్లుగా ముందుకు సాగుటతో పరస్పర మొరసికొనును. ఈ ఒరిపిడినే కాన్ఫ్లిక్టు అందురు. ఇది వ్యక్తుల మాటలు చేతలు మూలముగా తీవ్రమును తీక్ష్ణమును అగును. వ్యక్తు లెంత బుద్ధిమంతులైన వారి చేతలు—వారి మాటలు అంతగా నీ తీవ్రతకు తీక్ష్ణతకు దోహదము చేయును. ఈ దోహదము జరుగకొలది కథ దానంతట అది రూపుకట్టుకొని శక్తమై పరమ రమణీయమగును. కవి తాను నిర్ణయించుకొన్న ఫలానా అన్న దాని కనుగుణముగా ఎదురు ముఖములై నిలిచిన ఆ ప్రవృత్తులను నడిపింపవలయును. ఆ ఫలానా అన్నదే వస్తువు. ఆ వస్తు జ్ఞానములలో ఈ ప్రవృత్తుల నడుమలోనుంచి నడుపుటనే వస్త్వైక్యముతోడి నిర్వహణమందుము. తిక్కన "కథార్థంబు ఘటితపూర్వాపరమై యలతి యలతి తునియల కోవాళ సంధించిన విధంబు నమరగవలయు" నన్న దాని యర్థము నే అట్లు చెప్పినాను. కథార్థ మనగా ఆ కథవల్ల కావలసిన అర్థబోధయన్న మాట. అదే కవి నిర్ణయమైన వస్తువంటిని. దానిని సాధించుటకు కవి భిన్నములైన ప్రవృత్తులను, అనగా మాటలను చేతలను, దేని తరువాత దేనికి ఎంతెంత అవకాశ మిచ్చిన అనుకూలపడునో అంతంత మాత్రమే యిచ్చుటను అలతి అలతి తునియల కోవాళ సంధించుటతో తిక్కన పోల్చినాడు. అర్థబోధనే—వస్తువునే—ఆలంకారికులు కావ్యాత్మ అనిరి. దానియందు సాత్త్విక బుద్ధులకు రతి కలుగుటను బట్టియే అందలి రసమున కస్తిత్వము. ఆ స్థితిని పొందించుటకు కల్పింపబడినవే విభావానుభావాది ప్రవృత్తులు. కావ్యాత్మ ఫలానా అని—అందున్న రసమిది యని వాచ్యము చేయక తన్ముఖముగా సర్వప్రవృత్తుల ననుసంధించి సాత్త్వికబుద్ధికది ఫలానా అని యనిపింప చేయుటకే రసధ్వనియని వ్యవహారము. రసధ్వనియనుట

యేలనన గా నదీనదములు సముద్రమునకైనట్లు బహ్వాన్వయమున శిలమైన ధ్వని ప్రపంచమంతయు రసమందే పర్యవసించుటవలన. రసగ్రహణము రతిమూలము. రతివ్యక్తినిష్ఠము. వాడున్నదన్నతో నున్నది. లేదన్నతో లేదు. అందుకే సాత్త్విక బుద్ధిమైన వానికి మాత్రమే కావ్యమనుట. కావ్యమును గ్రహించుటకు సహృదయుడు కావలయునన్న ఘోష ఈనాటికాదు. ఉన్నదనుటకును లేదనుటకును స్వాతంత్ర్యము వ్యక్తుల కున్నదని యెఱిగి యెఱిగి కాను కావలయు నని స్థాపింపదలచుకొన్నదానిని ధ్వని మార్గము పట్టించిన కవికి వ్యక్తులమీదనున్న గౌరవవిశ్వాసములు వాగతీతములు. మన నిజాయితీని కవి శంకింపనపుడు దానిని నిలబెట్టుకొనవలసిన బాధ్యత మనది. ఆ బాధ్యతను స్మరించియే మనము కావ్యములను చదువుచున్నాము. మన బాధ్యత నిర్విఘ్నముగా నిర్వర్తింపబడుటకే ఆనందవర్ధనాచార్యులవారు ధ్వనిప్రపంచమును విద్యున్మయము చేసి ధ్వన్యాలోకమును కూర్చెను. తదాలోకన సమర్థమైన లోచనము అభినవగుప్త పాదాచార్యుల వద్దయున్నది. వారిరువురకు మన మెంత దగ్గర పడియున్న అంతగా కావ్యాత్మను దర్శింపగలము.

కథయన నేమో కొంత మనవి చేసినాను. ఈ కథాసృష్టి ఊహాశక్తిమూలము. తత్కల్పన మొక శిల్పము. అది ధీశేముషీ విశేషానేక మార్గాభిరామము. ఇంతకుపూర్వము చెప్పిన కాన్ఫ్లిక్టన్నది బాహ్యాభ్యంతరభేదముచేత రెండు విధములు. అసలు కాన్ఫ్లిక్టున్నట్లు కనిపించని కథలును ఉన్నవి. అతిలోకమైన ఏకదేశమును కథార్థముచేసినపుడు కనిపించదది. కథలో కనిపించదుగాని ఆకథ రక్తికట్టుట మాత్రము కాన్ఫ్లిక్టువల్లనే. కథార్థ మతిలోకమగుటతో లోకమున కెదురుముఖమై నిలిచినది లోకము దాని అతిలోకత్వముతో ఒరసికొని విలువలేక ప్రక్కకు నొదిగి నిశ్చేతనమగును. లోకమట్లగుటవల్లనే అది రక్తికట్టుచున్నది. ఆ అతిలోకమునకే అద్భుతమని పేరు. అద్భుతము వేయిరకములు. ఆ అతిలౌకిక దేశమును కవి తానుద్దేశించిన పరమార్థమున కభిముఖముగా నడిపించుకొనును. సంభ్రమాశ్చర్యసమ్మిశ్రితోద్వేగముతో నట్టి కావ్యరసమును అనుభవింతుము. కాన్ఫ్లిక్టు స్ఫుటముగా కనిపించని కథలు గూడ ఉన్నవని సూచించుటకే అతిలోకమన్న మాటతో కలిపి చెప్పినాను. అతిలోకము కేవలమతిలోకముగానే యుండదు. అందును కొంతలోక ముండును. లోకమునందు మాత్రము కొంత అతిలోకము లేదా యేమి?—అట్లు చూచుకొనవలె.

కావ్యమునకైన కథను ఏ పరమార్థమును దృష్టిలో నుంచుకొని కవి గ్రహించినాడో సాత్త్వికబుద్ధి విచారించును. దాని నిర్వహణము ననుసరించియే విచారణ. కావ్యమునకు కథలు రెండు రకములు. ఒకటి నూతన సృష్టి. రెండు వెనుకటిదే గ్రహింపబడుట. ఈ వెనుకటికథను గ్రహించుటలో మూడు మార్గము లున్నవి. విశిష్టమైన కవియొక్క వ్యక్తిత్వపు ముద్రతో చెప్పబడునదొకటి. గతకాలికమైన విస్మృతకథను గ్రహించిచెప్పుట రెండవది. దేశకాలావసరములను పురస్కరించుకొని అవసరమైన కథను కూర్చుకొనుట మూడవది—ఇట్లనుట హెచ్చుతగ్గుల నుద్దేశించుట కాదు. కేవలము కావ్యగత కథా వైశిష్ట్యమును పరిశీలించు మార్గమును చూపుటకే స్పష్టత కొరకు మూడువిధము లన్నాను గాని ఒక్కొక్క కథయందు మిగిలిన రెండింటిని లీనమొనర్చి చెప్పుటయున్నది. ఉన్నను స్థూలదృష్టికి పైకి కొట్టవచ్చినట్లు కనిపించు గుణవిశేషములను ఆధారముగా చేసికొని మూడువిధములని చెప్పినాను. కేవలము విలక్షణమైన తన వ్యక్తిత్వపు ముద్రతో వెనుకటి కథను చెప్పనేర్పు ఒక్క కవిత్రయము వారికే ఉన్నది. తరువాత యున్నది నన్నెచోడదేవునకు, పెద్దనకు—చేమకూర వెంకన్నకు—విశ్వనాథ సత్యనారాయణకు. రెండవరకమన్న కథను ఇమిడ్చి వ్రాయబడిన కావ్యము లాంధ్రపురాణము-కర్పూర వసంతరాయలు. మూడవ రకపు కథను గ్రహించినవి రాణాప్రతాపసింహ చరిత్ర—శివభారతము—సౌందరనందము. ఇట్టివి యింకను కొన్ని చెప్పవచ్చును.

కావ్యమున కథ యెట్లుండునో చెప్పినట్లైనది. ఇక నిర్వహణము. కవి తానే దృష్టితో నా కథను గ్రహించినాడో తదుత్కర్షను మాత్రమే ప్రతిపాదించు సర్వభావములను భావనచేసి చూపుటయే నిర్వహణము. సర్వభావములనుట యేలయనగా కథ ఫలానా దానిని దృష్టిలో పెట్టుకొని అన్న నిర్ణయము కవిదిగాని మనదికాదుగదా. అందుకని. తదుత్కర్షమాత్రమే యని నొక్కినది. ఆ భావము సంభావితము కావలసియుండుటవల్ల. కావ్యమున సాధారణముగా దోషము ప్రవేశించునది ఆ సంభావనలోని బలహీనత సాధారముగా చేసికొనియే. ఆ దోషమునే క్షేమేంద్రుడు అనౌచిత్యమన్నాడు. ఈ దోషమును దోషముగా లెక్కకు తీసికొనని పూజ్యులైన పెద్దలున్నారు. వారు పూజ్యులన్న పెద్దలన్న జ్ఞానముండికూడ ఈ విషయమున నేను వారితో నేకీభవింపలేను. అది దోషమే. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు పోతన కవిత్వమునుగూర్చి ప్రసంగించుచు (ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు పుటలు 164-167) "ఔచిత్యమనగా నేమి? ప్రపంచమున నెట్లుజరుగుచున్నదో అట్లే చెప్పుట. ఎట్లు జరుగుటకు వీలున్నదో యట్లు చెప్పుట" అనిరి. ఇది కాదౌచిత్యము. దేనికేది తగినట్లుగా ఉండునో అది ఉచితము, తద్భావమౌచిత్యము. కవి ఏ పరమోత్కృష్టమైన ఆశయమును దృష్టిలో పెట్టుకొని రచన కుపక్రమించినాడో తదుత్కర్షకు హేతుభూతమైన సర్వభావ భావనమౌచిత్యము. అందుకే క్షేమేంద్రుడు శబ్దమున—వాక్యమున—ఛందమున—దేశకాలములను—చివరకుపసర్గయందును ఔచిత్య ముండవలయునన్నాడు. ఎంత రసవత్కావ్యమైనను అనౌచిత్యము హేతువుగా భంజింపబడును. దానిని సహింపనివాడు గనుకనే క్షేమేంద్రుడు కావ్యజీవిత మౌచిత్యమన్నాడు. ఆ యనుటలో కూడ కేవలము కావ్యమునక రసవత్కావ్యమనుట గమనింపదగినది. (ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్) ప్రతి విషయమునను ఔచిత్యమును పాటించుట కష్టమని శ్రీ నారాయణాచార్యుల వారు. నిజముగా కష్టమే. అని పాటింపకుండుటయా చేయవలసినది? అందని ద్రాక్షపుల్లన అని మనమనుకొనరాదు. "ఒక కావ్యమును విమర్శించునపుడు— దాని హృదయతత్త్వమేదో చక్కగా గ్రహింపవలయును" అవును. నిజమే. కావలసినదే అది. ఆ హృదయతత్త్వము గ్రహింపబడుటకు వీలుగా ఆ కావ్యము రచన నిర్వహింపబడవలయును. అనగా

ఆ హృదయపరత్వమున రసకర్షణాదు ఏ చిన్ని విషయమైనను అందు చేరరాదు. చేరినచో అనౌచిత్యమే. సామాన్యముగా కవులు తాముగా చెప్పదలచుకొనిన పరమమైన విషయమున పర్యావస్థల యందును జాగ్రత్తులైయుండక—తమ అనుభవమును పురస్కరించుకొని తమకేర్పడిన యోహలను భావములను- చమత్కారములను ఆ కావ్యమున చొనుపుదురు. ఆ చొనుపుటయే అపకర్షకు హేతువు. ఈ అనౌచిత్య దోషమునుండి పూర్తిగా తప్పుకొన్న కావ్యము సృష్టిలో ఉండజాలదనిపించును. కాని అంత అనివార్యమైన దోషమును శక్తిసంపన్నుడైన కవి అనగా ధిషణగలవాడు నూటికి తొంబదియైదువంతులు తప్పించగలడు. అట్టివారున్నారు. వారే మహాకవులు. తెనుగు కవులలో నన్నయ తిక్కన లట్టివారు. కనుకనే ప్రతివిషయమునను ఔచిత్యమును పాటించుట కష్టమేయైనను పాటింపవలయునన్న నిశ్చయనిష్ఠకవియైన వానికుండవలసిన ప్రధానలక్షణములలో నొకటి. "ఔచిత్యమే కావ్యస్వరూపమైనచో నిన్నియేండ్లనుండి- యీజాతికి (ఆముక్తమాల్యద) చెందిన గ్రంథముల నిందరు సహృదయు లెందుకుఁ జదువుచున్నారు?" అని శ్రీ నారాయణాచార్యులవారి ప్రశ్న. ఇచట ఒకవిషయము మనవి చేయవలసి యున్నది. ఇతిహాసములు- కావ్యములు- పురాణములు- ప్రబంధములు- ఖండకావ్యములు- శతకములు- ఇత్యాదులన్నియు కావ్యమన్న రాశిలో చేరవు. వానికి కొన్ని సాధర్మ్య వైధర్మ్యము లున్నవి. తద్ధర్మ రహస్యవిచారము మనకంత స్పష్టముగా లేదు. పూర్వులు చేయలేదు. మనము చేసికొనవలయును. ఆ విచారణ లేకపోవుటయు చేసికొనకపోవుటయు మన సాహిత్యకులను చాల మందిని కిరాణాకొట్టువంటి విమర్శకులనుగా చేసినది. కిరాణా కొట్టున ప్రతివస్తువును కొద్దిమోతాదులో నుండును. అట్లే ఏ గ్రంథమును తీసికొన్నను కథ—దానికి మూలమున్న మూలకథ— నవరసములు- ప్రకృతివర్ణనలు- ఋతువర్ణనములు- అలంకారములు- సమాసములు- తెనుగుమాటల కూర్పు- వ్యాకరణ విశేషములు వీనికి తోడు కవికాలచర్చ- గ్రంథకర్తృత్వ నిర్ణయము- ఇత్యాది శీర్షికలక్రింద విడగొట్టి కొన్ని యుదాహరణము లిచ్చి అది ఆ గ్రంథము మీది విమర్శగా చెలామణి చేయుట జరుగుచున్నది. అందువల్లనే ఏ గ్రంథమును గూర్చి చెప్పుచున్న అదే మహాకావ్యమనియు తత్కర్తయే మహాకవియనియు వినబడుచుండుట. ప్రతిది మహాకావ్యము కాదు. ప్రతికవి మహాకవి గాడు. ఈ పరమసత్యము మన బుద్ధికెక్కకుండుట శోచనీయము—భారత మితిహాసము. కావ్యము కాదనినాను నేను. వెంటనే ఒకాయన అడిగినాడు. 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని ...' నన్నయ వ్రాసిన పద్యమును గురించి మీ అభిప్రాయమేమని. ఆ పద్యముననే 'కవి వృషభులు మహాకావ్యమనియు'-'ఐతిహాసికు లితిహాసమనియు' ఉన్నందున కావ్యమన్నను ఇతిహాసమన్నను ఒకటేఅని ఆయన విశ్వాసము. ఆ పద్యమున ఈ రెండే కాదింకను ఉన్నవి. ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, మహాకావ్యము, లక్ష్యసంగ్రహము, ఇతిహాసము, పురాణసముచ్చయము ఇన్ని యున్నవి. ఇందు కావ్యేతిహాసపురాణములు మాత్రమే అభేదము లెందుకు కావలయును? ఆ లెక్కకు వచ్చిన అన్నింటికి అభేదమే. అనగా కావ్యమనుటయు వేదాంతమని, నీతిశాస్త్రమనియు లక్ష్యసంగ్రహమని ఇత్యాదిగా ఇచ్చుమార్గమున అన్వయించుకొన వచ్చును. అది కాదు. అవన్నియు వేరువేరుగా వేనికవి అస్తిత్వము గలవి. అందొక్కొక్కదాని యందభిమానముగల ప్రతివాడును భారతమును తనదైనదానినిగా చూచుకొని కొనియాడుచున్నాడు. అందువల్లనే అది విశ్వజనీనమైనది. భారత మితిహాసము కాదు. పురాణము. కాదు మహాకావ్యము. కాదు ధర్మశాస్త్రము. ఇట్లు ఎవరు విశ్వసించినదానిని వారు ప్రమాణములు చూపి చెప్పవచ్చును. చెప్పవలయును కూడను. అంతేకాని వానికి భేదమే లేదు. అవన్నియు ఒకటే అనిమాత్ర మనరాదు. అనుకొనరాదు. ఇతిహాస పురాణ కావ్య ప్రబంధములు వేరువేరు సాహిత్యప్రక్రియలు. ఆముక్తమాల్యద కావ్యజాతిలోనిది కాదు. అది ప్రబంధము. ఒకదృష్టితో చూచినచో అది ప్రబంధమును కాదు. "రాయలు తన వర్ణనా వైశారద్యమును గన్పించుటకు కవిత్వమును (ఆముక్తమాల్యదను) రచియించెను" అయినచో ఆకథ లెందుకు?! రాయలు వైష్ణవమతాధిక్యమును స్థాపించుటకే కథలు వ్రాసెను. అయిన ఆవర్ణన లెందుకు? తన వర్ణనా వైశారద్యమును కన్పఱచుటకును, వైష్ణవమతాధిక్యమును స్థాపించుటకును ఆముక్తమాల్యదను వ్రాసెను. అట్లన్నచో ఆ రెండును తీర్థమునకు తీర్థము. ప్రసాదమునకు ప్రసాదమువలె గాక ఒకదానితో నొకటి చెరసి పరస్పర ముత్కర్షహేతువులుగా నిర్వహింపబడ వలయును. "అతని ఋతువర్ణనముల గొడవలో యామునాచార్యు డేమైనాడో రాయలకుఁ గాబట్టదు" అనుట రాయల వారి గొప్పతనమును స్థాపింపదు. అంతపట్టనివాడా యామునాచార్యుని గొడవ ఎందుకు పెట్టుకొనవలయును అని ప్రశ్నింపవచ్చును—ఆ వర్ణనలకును-ఆ కథలకును సంబంధము లేదు, రెంటింటిని ప్రత్యేకముగా వేనికవిగా చదువుకొని ఆనందింపవలయును. అయినచో వర్ణనము లొకచోట—కథ లొకచోట వ్రాయవలయును. రాయల వారట్లు వ్రాయలేదు. మనము కనీసము గ్రంథమునట్లు ముద్రించుకొనను లేదు—అయినను ఆ గ్రంథము నెందుకు చదువుచున్నారనగా రాయల వారికున్న వ్యుత్పత్తిమూలక ఊహాశక్తి మరొకరికి లేనందున ఆ శక్తిని గ్రహించు నుద్దేశమున్న వారే ఆ గ్రంథమును చదువుదురు. ఇంతకాల మా గ్రంథము నిలుచుటకుగల కారణమదే. ఒక గ్రంథము నిలువ ద్రొక్కుకొని పఠనపాఠనాదులలో ఉండుట అన్నదా గ్రంథగత దోషమును గుణము చేయజాలదు.

కథా ప్రాధాన్యము కలిగి ఔచితీ మర్యాదకు లోబడిన సుష్ఠుభావభావనామయమైన గ్రంథము కావ్యము. కేవలము వస్తుభావభావనారమ్యమై అంతస్సూత్రముగా కథనిముడ్చుకొని నిర్వహింపబడిన గ్రంథము ప్రబంధము. ఈ దృష్టితో చూచినపుడు తొంబదిపాళ్లు కావ్యధర్మముల నిముడ్చుకొనిన పూర్వగ్రంథము నన్నెచోడదేవుని కుమారసంభవము. నూటికి నూరుపాళ్లు ప్రబంధధర్మముల నిముడ్చుకొన్నది. రామరాజభూషణుని వసుచరిత్రము. ఆధునిక కాలమున వచ్చిన కావ్యములు రాణాప్రతాపసింహచరిత్రము, శివభారతము—సౌందరనందము. ఇత్యాదు లింక కొన్ని యున్నవి. ప్రసిద్ధములై ఆధునికములైన ప్రబంధము లంతగా

కానకావు. ఇంతకు మించి ఇచట సాహిత్య ప్రక్రియల సాధర్మ్య వైధర్మ్యములను నిర్ణయించుటకు నా కవకాశము లేదు.

కవిత్వము కథనాశ్రయించుకొని తన్ముఖమై నిర్వహింపబడి కావ్యమన బరగినదైనది. కథ యనగానే పాత్రములు వచ్చినవి. పాత్రోన్మీలనముతో పాటు కథా కథనము. ఈ రెండింటిని కొనసాగించుట సన్నివేశ కల్పనము ద్వారా జరుగును. ఆ సన్నివేశము పాత్రముల అంతశ్చేతన వృత్త్యభిభావభావనా ప్రదర్శనమున కున్ముఖముగా కల్పింపబడవలెను. తత్సన్నివేశమున కౌత్కృష్ట్యము నాపాదించుటకు జడమునందు చేతనతను కవి తన ఊహాశక్తివలననైన భావన చేత ప్రాదుర్భవింపచేసి తత్సర్వమును చేతన వస్తుతత్త్వమున లీనమొనర్చు నొక మహాశిల్పమును ప్రదర్శించును. ఏ తన్మహాశిల్పప్రక్రియా దక్షుడే మహాకవి శబ్దవాచ్యుడు. ఆ శిల్పము నాశ్రయించి జాగృతుడుకాని కవి పప్పులో కాలు వేయుట యున్నది—సతీ పరమేశ్వరుల సంగమమునకు ఫలముగా గజానన నోత్పత్తిని నిరూపింప దలమకొన్న సన్నిచోడ దేవుడు రజతగిరి ప్రాంత వనభూమిని గజక్రీడా భావమును భావన చేయుటలో గల యౌచిత్యము, వరూధినిని తిరస్కరించిపోయిన ప్రవరుని అహంకారగర్వ గర్భమైన క్రూరతను సహింపలేక రోష భీషణ స్ఫురణ వహించినట్లుగా ఆ సంగతుడు కానున్న సూర్యుని అరుణిమను భావన చేసిన పెద్దనలో లేదు. ఏమనగా పెద్దనదృష్టి ప్రవరుని నిగ్రహ శక్తి గల మనిషిగా చూపుట. కాని చో ప్రవరుడు వరూధినీ సంగమమున కనుకూలుడైనాడని చెప్పవచ్చును. మొదటినుండియు ప్రవరుడు నిగ్రహ నిష్ఠగలవాడుగానే చెప్పినాడు పెద్దన. అట్టివానిని క్రూరుడుగా మరొకరు భావించినారని తాను చెప్పరాదు. చెప్పుటవలన తాను దానికి సమ్మతించినదైనది. నిజమునకు తాను సమ్మతించుట లేదు. అందువలననే ఔచిత్యము పోయినదనుట. కలంచునే సతుల మాయలు ధీర చిత్తులనని ప్రవరుని విషయమున వాని నిగ్రహమును ప్రశంసించి నిష్కర్ష చేసిన పెద్దన తత్పాత్ర కపకర్ష హేతుకముగా జడవస్తు సంబంధభావమును భావించి అనుసంధానముచేయు టనుచితము. ఇంతగా ఎందుకు దీనినిగూర్చి చెప్పుచున్నాననగా కీ॥ శే॥ దువ్వూరి రామిరెడ్డిగారు ఈ దోషమునే గుణముగా గ్రహించి ఇదే పెద్దనకు మహాకవిపట్టమున కర్హునిగా చేసినదని అనినందున [కవికోకిల గ్రంథావళి నాల్గవభాగము. [పుటలు 128-129] ఇంతవరకు చెప్ప వచ్చిన దేమనగా కావ్యమును కథాకథన పాత్రోన్మీలన సన్నివేశ చారుత్వాది సర్వ ప్రధానాంశములను, కవి తన సృష్టిలోనున్న పరమాశయ సిద్ధిని (కావ్యాత్మను) అభిలషించి, తదభిముఖము చేసి తన ప్రతిభ ననుసరించి నిర్వహించును. నిర్వహింపవలయును. ఈ నిర్వహించుటకే శక్తి యనిపేరు. అవ్యుత్పత్తి కృతమునకంటె అశక్తి కృతము దోషము దొడ్డది. ఈ శక్తి బుద్ధిసాధ్యము. బుద్ధి సంభావన దక్షము. ఆ దక్షతలోని బలహీనత నాధారముగా చేసికొనియే అనౌచిత్యము. రసభంగమున కనౌచిత్యమే కారణము. రసభంగమునకు మించిన దోషములేదు. కనుకనే అశక్తికృతము దోషముదొడ్డదనుట. ఏవం విధమైన కవికృతకావ్యమును సాత్త్విక బుద్ధియైన పాఠకుడు అభ్యంతర విషయ విమర్శన పూర్వకముగా కావ్యాత్మ స్వరూప స్వభావాదులను దర్శించి కావ్యరసము ననుభవించును. తన యనుభవమునుబట్టి, కవి శక్తిని అ, కావ్యమునుండియే ప్రమాణములనుకూర్చి చేర్పుతో నిర్ణయించుటకే విమర్శనమని పేరు. కవులలో శక్తిహీను లున్నట్లు విమర్శకులలోను నుందురు. ఒక అశక్తుడైన కవిని - ఒక అశక్తుడైన విమర్శకుని - మహాకవిగా - మహా విమర్శకునిగా ఎంతకాల మీజాతి భావించునో అది అంతకాలమును నిర్వీర్యమును - వ్యర్థమును నైపోవుచున్నది. అచ్చమైన కవులను, విమర్శకులను తక్కువచూపు చూచుటయు నట్టిదే. జాతిజాతిగా తేజోశూన్యమును-చైతన్యరహితమును అనుట వాంఛనీయము.

మహాకవి యన్నాను కనుక మరొక విషయము—మహాకవి లక్షణములను చెప్పబోవుటలేదు. మహాకావ్యమన్న వ్యవహారమున్నది. ఇంతవరకును నేను కావ్యమనియే అనుచున్నాను. మహాకావ్యమునకు కావ్యమునకుగల భేదమేమనవచ్చును. నాటకమునకు ఏకాంకికకు—నవలకు, కథానికకుగల సాదృశ్య వైదృశ్యములతో మహాకావ్యమునకును కావ్యమునకు నున్నవి.

ఈ శతాబ్దమున ఖండకావ్యమన్నదొకటి వచ్చినది. తెనుగు దేశమున ఖండకావ్య రచయితలు చాలమంది యున్నారు. శ్రీ జాషువా కవిగారి ప్రక్రియ కాద్యులనుటలో గాని—కొక మూల సంధిమునుటలో నే-కొకవారి ప్రశస్తి దినిపై యాధారపడియున్నదని గాని అనుటలో విప్రతిపత్తి యుండదనుకొందును.-విశ్వనాథ కవిరాజు సాహిత్యదర్పణమున (పరి. 6. 466) ఖండకావ్యమునగా కావ్యముయొక్క ఏకదేశము ననుసరించి వ్రాయబడిన దన్నాడు. ఏకదేశమనగా వాటి కావ్యలక్షణములలో నొకటి. ఈ శతాబ్దమున మనకు వచ్చిన ఖండకావ్యముల స్వరూప స్వభావాదు లట్లులేవు. ఉన్నవని సమన్వయము చేయవచ్చునని కొందరన్నారు. అది నా కంత ఇష్టము కాదు. కథామాత్రముతో సంబంధము పెట్టకొనని- కనీసమే యొక అంశమును గ్రంథమునంతకును ప్రాతిపదికగా గ్రహింపని,—చమత్కారములు-ఊహలు - జడచేతన వస్తుసంబంధ భావములు వేనికవి వ్యస్తముగా వ్యక్తీకరింపబడి సంపుటీకరింపబడినది ఖండకావ్యము. కనీస మేయొక అంశమును గ్రంథమునంతకు ప్రాతిపదికగా గ్రహింపని అని అనుట శతకములనుండి ఖండకావ్యమును వేరు చేసి చూపుటకు, శతకములలో ఏ దైవమో గ్రంథమున కంతకు ప్రాతిపదిక అగుటయున్నది. ఏమి చెప్పినను వాని నుద్దేశించియే అందు చెప్పబడును — కావ్యముయొక్క ప్రత్యేకాస్తిత్వమును హేతుభూతములైన కథాకథన పాత్రోన్మీలనాదులు ఖండకావ్యమున నుండవు. ఉండుటకు వీలులేదు గనుక ఉండవు. ఉన్నచో కావ్యమే అగునుగదా. ఖండకావ్యమున కింత పరిమితి యను నిష్కర్షలేదు. అందొక ముందు నిర్ణయమైన పరమార్థ నిరూపణమున కావశ్యకము లేదు గనుక ఆ నిష్కర్ష లేదు.

కవిత్వమును గురించి—కావ్యమును గురించి ఎవరేమి చెప్పినను అవి వారు వానిని దర్శించి బోధపరచుకొనిన మార్గములేగాని మరొకటిగాదు. ఆ మార్గములను సప్రమాణముగా సహేతుకముగా నిరూపించుట నీ చేత కావ్యరసము ననుభవింపజేయుటకు గాదు. తదనుభవమునకు నిన్నాయత్తము చేయుట—ఉత్సాహపరచుట—ప్రోద్బలము చేయుట మాత్రముగానే వానిని గ్రహింపవలయును. ఈ సంపత్తితో ఆ యా మార్గములబడి నీకు నీవై వానిని దర్శించి తదంతర్గత పరమ సౌందర్య నిక్షిప్తమైన రసభావమును భావనచేసి ఆనందింపవలయును. అపుడు తెలిసివచ్చును ఆ యనుభవములోని చిత్సౌందర్య స్వరూపము.

తానై చూచిన యేది కలుగునో హృదంతః ప్రీతి తత్ప్రీతి న
ట్లైనీకుం ఘటియిల్ల జేయుటకునై యత్నించు నా
ఖ్యానంబు ఆ వచియింపగా బడిన దాదారంబుగా నీవు చి
త్తానం జూచిన "దానిలోని" దగు సౌందర్యంబు సువ్యక్తమౌ.

—శ్రీ విశ్వనాథ.



# యడవల్లి వారి దుర్యోధనుడు

శ్రీ బండా కనకలింగేశ్వరరావు

దుర్యోధనుణ్ణి గురించి సామాన్యజనంలో అనేక అపోహ లున్నాయి. భారతం చదివిన వాళ్లూ చదవకపోయినా విన్న వాళ్లూ అతణ్ణి ఆడిపోసుకుంటూంటారు. ఇంచుమించు రాక్షసుల్లో జమ కడతారు కూడా కొందరు. అతడు ఈర్ష్యాళువని, దుర్మార్గుడని చెడుస్నేహంవల్ల చెడిపోయిన ఆకతాయి అనీ, అన్యాయంగా పాండవుల రాజ్యం కాజేయనెంచిన లోభి అనీ, స్త్రీ జనంపట్ల గౌరవం లేనివాడనీ, కుతంత్రాల్లో అందె వేసినచేయి అనీ, పారిపోయి మడుగులో దాక్కున్న పిరికిపంద అనీ అనేక విధాలుగా అతణ్ణి నిందిస్తూ అతనికి అపజయం కలిగితే మంచిదని వాంఛిస్తూ ఉంటారు. ఆ చెవినీ ఈ చెవినీ కాస్తా కూస్తా భారత కథ విన్నవారికి దుర్యోధనుడు అసలు పేరు కాదనీ సుయోధనుడనీ అసలే తెలియదు. కపట జూదం ఆడించి, ద్రౌపదీ వస్త్రాపహరణ కారకుడైన దుర్యోధనుడే వారి కనులకు సాక్షాత్కరిస్తాడు. అందుకనే తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ విజయాల్లో ప్రత్యక్షం అయ్యే దుర్యోధనుణ్ణి గురించి ముందుగా చెప్పదలచాను. పాండవవిజయంలో తిరుపతి కవులు దుర్యోధనుడి నోట ఒక పద్యం పలికించారు స్వీయచరిత్ర లాగ...

సీ. చదివినాడను వేదశాస్త్రంబు లర్థుల
కిచ్చినాడను మనోభీప్సితమ్ము
లేలినాడను భూమి యేకాత పత్రంబు
ప్రజలను సంతోష పరచినాడ
జరపినాడను పెక్కు జన్మము ల్పుత్రుల
గాంచితి పున్నరకంబు వాయ
మెచ్చించినాడ సు మిత్రుల నార్జించి
పొందినాడను సర్వ భోగములను
క్షత్రియుల చేత మిగుల బొగడ్త గన్న
కదన మరణంబు గంటి, నాకంటె భాగ్య
శాలి సుకృతి వదాన్యుండు చతురమతియు
బండితుం డెవ్వడేమి లోపంబు నాకు.

ఇది విన్న తర్వాత శ్రోతలు పై అభిప్రాయాలు మార్చుకుని తీరాలి. ప్రజల్ని మెప్పించి సత్పరిపాలనం చేసి, దానధర్మాల, యజ్ఞయాగాది క్రతులుచేసిన సంపూర్ణ మానవుడు విధి బలవంతంవల్ల ఆజిలో కుతంత్రాలవల్ల మాత్రమే జితుడైనట్లు సాక్షాత్కరిస్తాడు. పాండవుల రాజ్యభాగాన్ని తను వాంఛించడం లేదనీ, తనభాగాన్నే పాండవులు వాంఛిస్తున్నారని న్యాయము తనదేనని తండ్రివద్ద చక్కగా వాదించి ప్రేక్షకులకు నిజమేనా అనే అభిప్రాయము కూడా కలిగిస్తాడు. "తమ్ముని తనయులకుం

పాలిమ్మనెద వరయా—య మాని లేంద్రాశ్వినిలో
తమ్ములు—పాండు నృపాలుడో
తమ్ముడు వివరింపుమయ్యా తండ్రీ—నీకున్.

అని సంశయం లేవదీస్తాడు—రాజ్యము జ్యేష్ఠ కుటుంబము లోనిదని, ధృతరాష్ట్రుని అవివేకంవల్ల పాండవులకు భాగంవచ్చిందనీ భాగించరాని రాజ్యమనీ (Undivided Estate) అనీ వాదిస్తాడు. 'ఇదువురు స్వతంత్రులు—ఒక దేశ మేలగలరా' అని ప్రశ్నిస్తాడు. తన వాదము నచ్చకపోతే యుద్ధంలో తగవు తీర్చుకుంటామంటాడు. తన బలంలెక్క చూపుతాడు—తనంత శౌర్యశాలి లేడనీ, మరణమంటే తృణప్రాయంగా మాట్లాడుతాడు. రాజరాజనే మాట సార్థకం చేసుకో దలచానంటాడు. ఆఖరి అంకంలో కూడా ధర్మరాజు దుర్యోధనుడి విషయం చెప్పడంలో 'మనకంటె శత్రువుగాని ప్రజలను చక్కగా పరిపాలించి—ఇతర ప్రాణి కలభ్యమైన సిరిచే ఏకాదశాక్షౌహిణీపతియై' అంటాడు. ధర్మరాజు ధర్మప్రవర్తనలో దుర్యోధనుడి కూడా అపార గౌరవం. ప్రజలకు వీడ్కోలు చెపుతూ ధర్మరాజు నాశ్రయించమంటాడు. ద్రౌపదిని తాను పరాభవించానని అందుచేత క్రోధంతో భీముడు భానుమతిని తన తదనంతరం అవమానిస్తాడేమోనని సంశయంతో భానుమతినిధర్మరాజు శరణు బొందమని సలహాయిస్తాడు. ధర్మరాజు తనకన్న ధర్మమూర్తి యని తానేఅంగీకరిస్తాడుఇటువంటి దుర్యోధనుణ్ణి సాక్షాత్కరింప జేశారుతిరుపతికవులుమనకు. ద్రౌపదీవస్త్రాపహరణంలోదుర్యోధనుడికి ఉద్యోగవిజయాలలోని దుర్యోధనునికి పోలిక లేదు. వస్త్రాపహరణం లోని దుర్యోధనుడు ఈర్ష్యాళువు—అవమాన పరాభూతుడు—క్రోధోన్మత్తుడు—ఔచిత్య రహితుడు—కపటద్యూత ప్రియుడు. ఉద్యోగ విజయాల్లోని దుర్యోధనుడు శౌర్యశాలి, నిరాడంబరుడు ప్రజాహిత చక్రవర్తి, వినయ సంపన్నుడు, మాతాపితభక్తిగలవాడు వేద వేదాంగ శాస్త్రములు చదివినవాడు—కుతంత్రంతో రణములో కూల్చబడ్డవాడు—ప్రకృతి తనపై కత్తికట్టి విధికి చేయూత ఇచ్చింది నే మృత్యువును చిరుహాసంతో ఆలింగనం చేసుకున్నవాడు.

'వస్త్రాపహరణం' లోని దుర్యోధనుని పాత్రకు కీ. శే. యడవల్లి సూర్యనారాయణగారు ప్రసిద్ధి. సమాస పూరితములైన గద్యాను వారినోట వింటోంటే—ఆ పాత్రకు వారికి వారేసాటి అనిపించేది. చక్కని ఇంపైన విగ్రహం—భోగియైన దుర్యోధనుణ్ణి ప్రత్యక్షం చేసేవారు. అసలు బంధుమిత్రులతో—అపార సంపదలతో తుల దూగుతూ ఐశ్వర్య మధువును మిక్కుటముగా గ్రోలి మత్తెక్కిన దుర్యోధనుడు అలా ఉండాలి అని అనుకునే వాళ్ళం. ఎవరి మనస్సులో చిత్రించుకున్నా దుర్యోధనుణ్ణి యడవల్లి సూర్యనారాయణగారి విగ్రహాన్నే చిత్రించుకునే వారు. తరువాత కొంతకాలానికి బళ్లంకొండ సుబ్బారావు గారి కృష్ణుడుతో పాండవోద్యోగ విజయాలు తెలుగుదేశంలో దిగ్విజయయాత్ర సాగించాయి. అందులో చూచారు క్షాత్రరూపం కల దుర్యోధనుణ్ణి ప్రజలు. దుర్యోధనుడంటే ఇలా ఉంటాడని మనసులోని దుర్యోధనుని చిత్రఫలకాలను దిద్దుకోవడం ప్రారంభించారు ప్రేక్షకులు. కొంతమంది యడవల్లే దుర్యోధనుడన్నారు. కొంతమంది మాధవపెద్దే దుర్యోధనుడన్నారు. క్రమంగా యడవల్లి దుర్యోధనుణ్ణి మరచిపోవడం ప్రారంభించారు. యడవల్లికి కించ కలిగి ఏలూరులో రాయబారంలో దుర్యోధనుని పాత్ర ధరించి

విఫలుడైనాడు. మాధవపెద్ది శస్త్రోపహరణంలో నేనుమాత్రం వెయ్యి లేనా అని సాహసించి విఫలుడైనాడు. ప్రజలకు ఏ తేడా తెలిసిందేమిటంటే యడవల్లివారి దుర్యోధనుడు ఈర్ష్యాళువు. మాధవపెద్ది వారి దుర్యోధనుడు శౌర్యశాలి. వారికి వారేసాటి—వీరికి వీరేసాటి—ఈ తీర్పును నాటికీ నేటికీ తిరుగులేదు.

అవి నాటకరంగానికి ఉజ్జ్వలమైన రోజులు. బెల్లంకొండవారి కృష్ణుడు, మాధవపెద్దివారి దుర్యోధనుడు, పలివేటివారి కర్ణుడు, అద్దంకివారి ధర్మరాజు, పంచాంగంవారి అర్జునుడు, మద్దాలివారి భీముడు-బండారుపల్లి ఆంజనేయులు అశ్వత్థామ, దైతగోపాలంగారి ధృతరాష్ట్రుడు—ఆ నాటకం మాచాను బందరులో నే చదువుకునే రోజుల్లో—మంచి యౌవనంలో ఉన్న మాధవపెద్ది—శరీరానికి అంతా రంగు వేసుకుని—క్షత్రియులు కట్టినట్టి పంచె విరిచికట్టి—తళతళలాడే కిరీటాన్ని ధరించిన శిరస్సు విసురుతూ—భుజంమీద గద ధరించి—కండలు తేలిన శరీరం—ఛాతి విరుచుకుంటూ "రాధేయుండును నేను తమ్ములును సంగ్రామంబులో నిల్వ—నాకౌ ధీశుండరుదెంచుగాక-ఎగురకెక్క్యంటే"—అని ప్రశ్నిస్తే కాదనటానికి పాండవులకూ గుండె లేకపోయినయి. కృష్ణుడే అవునని అంగీకరిస్తూ-ఇతని మాయోపాయంవల్ల కాని జయించడం సాధ్యంకాదని నిర్ణయానికి వచ్చాడు. ఆ మాధవపెద్దివారి ఆనాటి దుర్యోధన మూర్తి నాటికీ నేటికీ నాకు క్షణ క్షణం సాక్షాత్కరిస్తోంది. "సమరము సేయరే బలముచాలిన" అని ఆనాటి మాధవపెద్ది సింహగర్జన నాటికీ నేటికీ నా కర్ణపుటాల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది. చేతులు జోడించి వినయం ఉట్టిపడుతూ శిరసికి లోటు రానీయకుండా ద్రోణాచార్యునివద్ద నిలిచి "కొనిందు మహాత్మ మీకు కృప ఈగతి వచ్చిన ఏమి సేయుదున్" అనే పలుకులు గురువు శిష్యుల సంబంధాన్ని తూచి చెప్పాయి. సహాయం కోరడానికి వచ్చినా పొరపాటున కృష్ణుని పాదాలవైపు ఆసీనుడై తలపరికించి తిరిగి శిరస్సు వైపున ఆశీనుడైన మాధవపెద్ది జన్మతః అంతటి ఔచిత్యశాలి యేమో ననిపించింది. ధర్మరాజు ఆఖరిరంగంలో "నీకే ఆయుధము కావలసిన అది ఇచ్చెదము-అది గైకొని మాఏవురిలో నీ ఇచ్చ వచ్చిన వారితో పోరి విజయము గైకొమ్ము" అని ఔదార్యం చూపిస్తే అంతకంటె ఔదార్యంతో "వచ్చిన భీమసేనుని చేతనే చచ్చెదను—గెలిచిన భీమసేనునే గెలిచెదను" అని నిర్ణయించిన మాధవపెద్ది సహజంగా అభిజాత్యసంపన్నుడని అందరికీ స్పష్టమైంది. ద్వంద్వయుద్ధానికి ముందు—దుర్యోధనుడు భీమునితో "చేతిలావున్, బుద్ధికౌశలమును మండవలయుగాని పూజా పురస్కారములతో గదాధారణశోభితుండ వగుదువా" అని ఎకసక్కెము లాడినప్పుడు మాధవపెద్ది సహజంగా నిత్యం కసరత్ చేస్తూ కుస్తీలలో ప్రావీణ్యం కలవాడని అందరికీ తేటతెల్లమైంది. రాయబారంలో ధృతరాష్ట్రునితో పాండవుల జన్మహక్కును శంకిస్తూ "యముని ఇంద్రాశ్వినిలో తమ్ములు" అని చదువుతూ తన మాటల ప్రభావం కృష్ణునిపైన ఎలా వుందో అని ఒక చురుక్కుమనే మెరపులాటి చూపు కృష్ణునివైపు విసిరేసరికి వేలాది ప్రేక్షకులుకూడా ఆ చూపుకు దాసులై దాన్ని అనుసరించి తాముకూడ కృష్ణునివైపు చూచేవారు—వెంటనే మాధవపెద్ది మచ్చు తెలిసిన మాంత్రికుడనుకునేవారు. ఊరుభంగమై—మూర్ఛాక్రాంతమయినను గమనిస్తూ తన శరీరమునకై కాచుకున్న నక్కలను హెచ్చరిస్తూ తండ్రి నుద్దేశించి కన్నీరుతో "ముసలితనమున దిక్కు లేకుంటి విధి లిఖితంబు" అనే మాటలు పలుకుతూంటే ప్రేక్షకులంతా కన్నీరు విడుస్తూ దుర్యోధనుని స్థితికి జాలిపడేవారు—అతని ఒక్క చూపులో—ఒక్కమాటలో—ఒక్క కదలికలో—ప్రేక్షకులకు రసోదయమయ్యేది.

నటులు అనేక పద్ధతులు అలవరచుకుంటారు. భరత శాస్త్రం మొదలు ఈ నాటి స్టానిస్లావిస్కీ శాస్త్రందాకా అనేక నటనాపద్ధతులు నిర్వచించబడ్డాయి. అన్ని శాస్త్రాల్లోనూ చివరకు చెప్పబడింది ఏమిటంటే—మేం ఇన్ని పద్ధతులు చెప్పినా ఇవి శాశ్వతమైనా ఆదేశాలు కావు. ప్రతి నటుడు తనకు తానె ఆలోచించి తన పద్ధతులు తానే స్వతంత్రంగా ఆలోచించుకోవాలి అని వ్రాశారు. శాస్త్రానికి నటుడు అంటిపెట్టుకోవడం అంత మంచిది కాదని నిత్య నూత్న అనుభవవిజ్ఞానంతో తాను ధరించిన పాత్రకు వ్యాఖ్యానం చేస్తూ—తాను వ్యాఖ్యానించిన మూర్తిని ప్రేక్షకులకు సాక్షాత్కరింప చేయాలన్నారు. నిన్నటి నాటకంలో చేసిన విధంగా ఈ నాడుకూడా నటుడు అభినయిస్తే అతనికి అనుభవ లోపం అన్నారు. అతని విజ్ఞానం పెరగడం లేదన్నారు. అతని పాత్రకు చైతన్యం కొరతపడిందన్నారు. మాధవపెద్ది దుర్యోధన పాత్రలో నిత్యం నూత్న పోకడలు కనిపించేవి. నటుడు సర్వాంగసుందరుడై—మంచి జన్మ కలిగి—జన్మాంతర సంస్కృతి కలిగి

"రూపవాన్, మధురాభాషీ...కృతీ వాగ్మీ పటుస్తథా
కులాంగో నాసుతశ్చైవ—శాస్త్రజ్ఞో మధురస్వరః
ప్రతిభావాన్"

ఉండాలన్నారు నందికేశ్వరులు. అవన్నీ మాధవపెద్దిలో మూర్తీభవించినయి. ఒకానొక పాశ్చాత్య శాస్త్రవేత్త—"పాఠ్యం వల్లించడమే కాదు — పాఠ్యం వినకాలంటే భావాన్ని — భావోద్రేకాన్నికూడా వల్లించాలి నటుడు" అన్నారు. ఇది చాలామందినటులకు చేతకాదు. భావోద్రేకాన్నికూడా వల్లించి ఎప్పుడు కావాలంటే అప్పుడు దాన్ని ప్రేక్షకులకు వివిధించి చూపించేవాడు మాధవపెద్ది. సాత్త్వికాభినయరీతుల్లో "సంభ్రమశ్చ రోమాంచ స్వేదో వైవర్ణ వేపధూః అశ్రువై స్వరంచ" అని నిర్వచించారు. ఇవన్నీ మాధవపెద్దికి కరతలామలకాలైనాయి. అంగ ఉపాంగ ప్రత్యంగాలతో తన ఇచ్చవచ్చినట్లు అదుపులో నటించడమే కాక — సహజ ఆహార్యంలో విశిష్టమై వాచికంలో—అద్వితీయమైన సాత్త్వికం ప్రదర్శించేవాడు. సాధారణంగా స్నేహితులతో మాట్లాడినా రోమాంచం సాక్షాత్కరించేది. అతని దుర్యోధను ఘటనితోనే అంతమైంది. అది మన దౌర్భాగ్యం.

మాధవపెద్ది మధురహృదయుడు. అతనితో స్నేహం కట్టడానికి యువకులు ఉవ్విళ్లూరేవారు. క్షణం పలకరిస్తే ఆదరించి ఆప్తులుగా చేసుకునేవాడు. యువకులంటే అతనికి అమిత ప్రేమ. అన్నదాతులకు పెద్ద అండగావుండి పితృవ్యుడై మా తప్పుటడుగులకు చేయూతనిచ్చి దిద్దుతూ ముందుకు తీసుకుపోయేవాడు. నేను కృష్ణ పాత్ర ధరించడానికి ఆయనే కారణం. బెల్లంకొండతో వున్న ఆయన మైత్రిని ప్రక్కనపెట్టి నాకు చేయూత నిచ్చి ప్రోత్సహించి అవకాశం ఇచ్చి గుంటూరులో రసికజన సమక్షంలో—నా కృష్ణపాత్రను బహిరంగపరచి ఆశీర్వదించి, పేరు కట్టి, ముందుకు తీసుకువచ్చిన అమరజీవి మాధవపెద్దికి నా జోహారులు. మనకు నేడు మాధవపెద్ది లేడు. అతనితోపాటు దుర్యోధనుడూ లేడు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna
at The Andhra Patrika Press, 6 & 7, Thumbu Chetty Street, Madras-1,
Editor S. Sambhu Prasad.

శ్రీరస్తు — శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ విళంబినామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్యసిద్ధాన్తిన స్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతమ్

విఘ్నేశ! విధిమార్తండ చంద్రేంద్రోపేంద్రవందిత ! నమో గణపతే! తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణ స్పతే॥

వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం।

మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం॥

## గమనిక

ఈ సంవత్సరమున రాజు శుక్రుడు. మంత్రి సూర్యుడు. ౮ కుంచములు వర్షము. సర్వసస్యసముదాయ మగు ౧౬ వీసములలో ౯ వీసములు పంట ఫలించును. శ్రీ కృష్ణుడు పశుపాలకు డగుటచే పశువులు తృణక్షీరాదిసమృద్ధి గలవి యగును.

చైత్ర బ. అమా. శ. అర్ధాధికగ్రాస సూర్యగ్రహణమున్ను, ఫాల్గున శు. పూర్ణి. మం. పాదగ్రాస చంద్ర గ్రహణమున్ను సంభవించును. అధిక శ్రావణ శుక్ల పంచమీ సో. న కావేరీ నదియందు సార్ధత్రికోటితీర్థసహిత పుష్కర ప్రవేశము.



## మౌఢ్యములు

ఆశ్వయుజ శుక్ల తృతీయా బు. ప్ర॥ మార్గశిర శుక్ల ద్వితీయా శు. వరకు శుక్రమౌఢ్యము.

ఆశ్వయుజ శుక్ల అష్టమీ సో. ప్ర॥ కార్తిక శుక్ల సప్తమీ సో. వరకు గురు మౌఢ్యము.

| | |
|---|---|
| కలాద్యబ్దాః | ౫౦౬౦ |
| శాలివాహన శకః | ౧౮౮౦ |
| ఫసలీసన్ | ౧౩౬౭–౬౮ |
| హిజరీసన్ | ౧౩౭౭–౭౮ |
| ఇం. సం. | 1958–59 |

శ్రీః శ్రీః శ్రీః

ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము గంటలలో చూపబడినది. తిథి, నక్షత్రము ఘటికలలో గూడ చూపబడినవి. దినమానము భుక్తి గ్రహపాదప్రవేశములు ఘటికలలో చూపబడినవి. గంటలు అర్ధరాత్రినుండి చూపబడినవి. పగలు మధ్యాహ్నానంతరము 1–2 మొదలగు గంటలు 13, 14 మొదలగు సంఖ్యలచే చూపబడినవి. అనగా 12 గంటలకు లోపుగ నున్న కాలము మధ్యాహ్నమునకు పూర్వ మనియును 12 గంటలకంటె అధికముగనున్న కాలములో 12 ను తీసివేసి మధ్యాహ్నానంతర మనియు గ్రహింపవలయును. రాత్రి 12 గంటలు 24 గంటలుగ నుండును. రాత్రి 12 గంటలనుండి పరదిన సూర్యోదయమువరకు కాలము 1, 2, 3 మొదలగు గంటలు 'రా' అను గుర్తుచే వ్రాయబడినవి. 5–7 గంటల మధ్య నను కాలము 'రా' అను గుర్తులేనిచో సూర్యోదయానంతర కాలముగ తెలియవలయును. సూర్యోదయమునుండి పరదిన సూర్యోదయమువరకు పూర్తిగ నున్నచో 'పూర్తి' అని వ్రాయబడెను.

భారతప్రభుత్వముచే నియమింపబడిన పంచాంగసంస్కరణ సంఘము (కాలెండరు రిఫారమ్ కమిటీ) వారి నిర్ణయప్రకారము పంచాంగ మంతయు చేయబడినది. ఇందలి తిథినక్షత్రాదులును గ్రహసంచారము మొదలగు గణితవిషయము అన్నియును నూతన సంస్కారములచే దృగ్గణితపద్ధతిగ వ్రాయబడినవి. కాని తిథి, నక్షత్రము బీజసంస్కృత సూర్యసిద్ధాంత పద్ధతి (పూర్వపద్ధతి)చే సాధింపబడినవి యున్ను వేరుగ చూపబడినవి. మాధ్వసంప్రదాయమువారు సూర్యసిద్ధాంత పంచాంగమునందు సంస్కార విశేషములను చేసి పాటింపబట్టియే ఏకాదశ్యాదికము నాచరింతురు. కావున మాధ్వమతీయులకు పుణ్యదినములును రామానుజ సంప్రదాయముచే నగు తిరునక్షత్రములున్ను పూర్వపద్ధతి పంచాంగమునందే చూపబడినవి. పంచాంగ సంస్కరణసంఘమువారిచే నిర్ణయింపబడిన అయనాంశలును, నిరయనమేషాదియు వేదాంగజ్యోతిషాదిప్రమాణసిద్ధములు. కాలభేదముచే మారిన ఋతుపరిణామము మున్ను తెలియచేయబడినది. వర్షయోగములు, ధరలు, గోచారఫలములు, ధర్మశాస్త్ర నిర్ణయములు మొదలగునవి బాగుగ వ్రాయబడినవి. పంచాంగము నంతను చూచి గ్రహింపవలెను.

శ్రీః శ్రీః శ్రీః

## వర్షములు—ధరలు

చైత్రమాసము :—బ ౫ మం. ప॥ శ్రవణాంగారకుడు. బ ౧౩ బు. ప॥ పురోబుధ రవి మధ్యము. బ ౩ ఆ. ప్ర॥ బుధ గురు శని గ్రహత్రయ వక్రము. బ ౧౦ ఆ. ప్ర॥ రవి గురు సమసప్తకము. బ ౧౪ సు. ప్ర॥ కుజశుక్రుల తౌకరాశి. ఇవి అనావృష్టి యోగములు.—బ ౩ ఆ. ప్ర॥ బుధ వక్రము. బ ౨ శ॥ ప్ర॥ మూలలోని శని వక్రము బ ౧౪ సు. కుంభమున కుజుడు. బ ౧౪ సు. ప్ర॥ శుక్రాగ్ర బుధుడు ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందు శుక్లమున ఎండలు తీవ్రముగ నుండును. బహుళమున యెండలుగాయుచు నచటచట వర్షములును గలుగును. అమాప్రాంతమున గాలితో గూడియుండును.

ధరలు:—ధాన్యము వస్త్రములు ధరగలవియై యుండును. కొబ్బరి అరటి పసుపు క్రమముగ ధరగలవి యగును. బెల్లము శర్కరవద్రవస వస్తువులు క్రమముగ ధరగలవి యగును. పప్పుజాతులు ధర నిలకాటుగ నుండును. వెండి బంగారములకు అమాప్రాన్తమున ధర చురుకగును.

వైశాఖమాసము :—వైశా 21 కృత్తి ౧ రవిః.

శు ౧౧ బు. ప॥ గ్రహత్రయ వక్రం. బ ౧౧ బు. ప॥ రవి గురు సమసప్తకం. శు ౧౦ మం. ప॥ కుజ శుక్రుల తౌకరాశి. బ ౧౪ శ. ప్ర॥ గురు శుక్ర సమసప్తకం (ఇది వర్షయోగమున్ను గావచ్చును) ఇత్యాద్యనావృష్టి యోగములుగలవు. శు ౧౧ బు. ప॥ బుధ వక్రము. శు ౧౦ మం. ప్ర॥ బ ౬ శు. ప॥ బుధ శుక్రుల కేకరాశి. శుక్రాగ్ర బుధుడును, మూలలో శని వక్రమున్ను మాసమంతటను గలవు. (బ ౧౪ శ. నుండి బుధ శుక్రులమధ్య కేతువ్యవధానము.) ఇత్యాది వర్షయోగములును గలవు. ఎండలు గాయుచున్నను మధ్య మధ్య నచటచట గాలితోగూడిన వర్షములు గలుగుచుండును.

ధరలు :—ధాన్యము, వస్త్రములు, పత్తి నిలకాటుగనుండి అమాప్రాంతమున కొంచెము చురుకగును. బెల్లము, శర్కర, ద్రవస వస్తువులును ధర క్రమముగ చురుకైనవగును. పప్పు పదార్థములును తైలములును క్రమముగ ధర తగ్గి సులభములగును. కొబ్బరి అరటి పసుపు ధర మందమైయుండును. వెండి బంగారములు సులభములగును.

జ్యేష్ఠమాసము :—జ్యేష్ఠం 8 రోహి ౧ ర్క॰, జ్యేష్ఠం 17 మృగ ౧ ర్క॰.

శు ౯ సో. ప॥ గురు శుక్ర సమసప్తకము. బ ౧ సో. ప్ర॥ బ ౧౩ శ. ప॥ రవి శని సమసప్తకము. బ ౧ సో. ప్ర॥ ఉత్తరాభాద్రా కుజుడు. బ ౧ సో. ప్ర॥ జ్యేష్ఠలో శని వక్రము. ఇత్యాద్యనావృష్టి యోగములు గలవు—మాస మంతయు శుక్రాగ్ర బుధుడు. (శు ౧౩ శ. ప॥ కేతు వ్యవధానం) బ ౧ సో. ప॥ మూలలో శని వక్రము. బ ౧ సో. వృశ్చికమున శని. శు ౯ సో. ప్ర॥ బ ౧ సో. ప॥ బుధ శుక్రుల కేకరాశి, శు ౧౦ బు. మీనమున కుజుడు ఇత్యాది వర్షయోగములు గలవు. జ్యేష్ఠం 4, 12, 16, 26, 27 నాడీ యోగములు. వైశాఖం 31, జ్యేష్ఠం 1, 4, నుండి 12 వరకును 15, 16, 17, 20, 21, 22, 25, 26, 27 లందును చాంద్రయోగములు గలవు. ఇందు శుక్లమున గాలితోగూడిన మంచి వర్షములు గలుగును. బహుళమందును సస్యానుకూల వర్షములు వాయుమిశ్రితములై గలుగును. పై తేదులును గమనింపదగినవి.

ధరలు:—ధాన్యము, వస్త్రములు కొంచెము చురుకుగనుండును. కొబ్బరి, అరటి, పసుపు ధర నిలకాటుగనుండును. బెల్లము, శర్కర ద్రవసవస్తువులు క్రమముగ సులభములగును. పప్పు పదార్థములు తైలములు కొంచెము చురుకగును. బంగారమునకు ధర మందమగును. వెండికి ధర క్రమముగ మందమగును.

ఆషాఢమాసము:—జ్యేష్ఠం 31 ఆర్ద్రా ౧ రవిః, ఆషాఢం 14 పున ౧ రవిః.

శు ౧ బు. ప్ర॥ మాసమంతయు పురో బు రవి మధ్యము. శు ౪ శ. ప॥ ఉత్తరాభాద్రలో కుజుడు. ౬ ౧౫ మం. ఆర్ద్రాది పంచకమున బుధోదయము. బ ౯ సు. ప్ర॥ కుజకేతువుల కొకరాశి (ఇది సస్యహానియోగము) మాసమంతయు జ్యేష్ఠలో శని వక్రము. ఇత్యాద్యనావృష్టి యోగములు.—బ ౯ సు. మేషమున కుజుడు. బ ౧౦ శు. బుధవరుణ యుతి. మాస మంతయు బుధాగ్ర గురుడు ఇత్యాది వర్షయోగములు గలవు. జ్యేష్ఠం 28, 29, 30 ఆషాఢం 1, 2, 4 నుండి 9 వరకును 11, 12, 14, 15, 19, 21, 22 నుండి 25 వరకును నాడీయోగములు. జ్యేష్ఠం 29, 30, 31, ఆషాఢం 4, 7 నుండి 11 వరకును, 13, 14, 16, 17, 21, 22, 23, లందును చాంద్ర యోగములు. ఇందు శుక్లమున నచటచట సాధారణ వర్షములు గలుగవచ్చును. బహుళమున క్రమముగ నచటచట మంచి వర్షములు గలుగును.

ధరలు :—ధాన్యము, వస్త్రములు మందముగనుండి అమాప్రాంతమున కొంచెము చురుకగును. పసుపు, అరటి, కొబ్బరి, అమాప్రాంతమున చురుకగును. పప్పుజాతులు తైలపదార్థములు నిలకాటుగ నుండును. బెల్లము శర్కర మొదలగు ద్రవసవస్తువులు మందమగును. వెండి ధర క్రమముగ మందమగును. బంగారమునకు ధర క్రమముగ హెచ్చగును.

అధిక శ్రావణమాసము:—ఆషాఢం 28 పుష్య ౧ ర్క॰, శ్రావణం 11 ఆశ్రే ౧ ర్క॰.

మాస మంతటను పురో బుధ రవి మధ్యము. బ ౫ సో. ప॥ ఆర్ద్రాది పంచకమున బుధుడు, మాస మంతటను మేషమందు కుజ కేతువులు. జ్యేష్ఠలో శని వక్రము. శనికి ద్వాదశమున రాహువు ఇత్యాద్యనావృష్టి యోగములుగలవు—బ ౯ శ. ప॥ బుధాగ్ర గురుడు. సిమ్హట రాహు వ్యవహిత బుధాగ్ర గురుడు. బ ౯ శ. ప్ర॥ బుధ వక్రము. ఇత్యాది వర్షయోగములు.

శ్రావణం 1, నుండి 5 వరకును, 14 నుండి 19 వరకును, 21 నుండి 24 వరకును నాడీయోగములు-ఆషాఢం 26 నుండి 29 వరకును శ్రావణం 1 నుండి 9 వరకును 12, 13, 14, 17, 18, 19, 22, 23, 24 లందును చాంద్రయోగములు గలవు. ఇందు అచటచట సాధారణ వృష్టి గలిగినను కొన్ని తావులందు వర్షలోపముచే సస్యహాని కలుగును. బహుళములో నుత్తరార్థమున నచటచట మంచి వర్షములు గలుగును.

ధరలు:—ధాన్యము, వస్త్రములు ధర మందముగ నుండును. పసుపు, కొబ్బరి, అరటి, కొంచెము ధర చురుకుగలవి యగును. బెల్లం శర్కర మొదలగు ద్రవసవస్తువులు క్రమముగ మంద మగును. పప్పు పదార్థములు తైలములు నిలకాటు ధరగలవియగును. వెండి బంగారములకు ధర మందమగును.

నిజ శ్రావణమాసము:—శ్రావణం 25 మఘ ౧ రవిః. భాద్రం 8 పూఫ ౧ రవిః భాద్ర 22 ఉఫ ౧ ర్క॰.

శు ౯ శ. ప॥ పురోబుధ రవి మధ్యము. శు ౧౦ ఆ. ప॥ జ్యేష్ఠలో శని వక్రం. శు ౯ శ. ప్ర॥ పురోగురుడు (రాహు వ్యవధానం) గుర్వగ్ర శని ఇత్యాది అనావృష్టి యోగములు,—బ ౪ మం. ప॥ బుధ వక్రము. శు ౬ గు. ప్ర॥ బుధ శుక్రులకు ఏకరాశ్యంశ సమాగమము. శు ౯ శ. ప॥ బుధాగ్ర గురుడు (రాహువ్యవధానం) (శు ౯ శ. బుధగాఢాస్తం). శు ౯ శ. ప్ర॥ బ ౩ శు. ప॥ శుక్రాగ్ర బుధుడు. శు ౯ శ. శుక్ర వరుణ యుద్ధం బ ౩ సో. వృషభమున కుజుడు. బ ౬ గు. ప్ర॥ ప్రాబ్యఘాదిపంచక శుక్రుడు. బ ౩ శు. బుధ శుక్రయుతి. బ ౩ శు. ప్ర॥ బుధాగ్ర శుక్రుడు ఇత్యాది వర్ష యోగములు గలవు. శ్రావణం 25, 26, 29, 30, 31, భాద్రం 4, 6, 7, 10 నుండి 14 వరకును, 19 నుండి 22 వరకును నాడీయోగములు. శ్రావణం 25, 26, 28, 29, 30, భాద్రం 1 నుండి 16 వరకును, 18, 19, 20, తేదులందును చాంద్రయోగములు గలవు. ఇందు యెండటి

భాగమునందు గాలితోగూడిన వర్షము లచటచట గలుగును. తక్కిన రెండు భాగములందును మంచి వర్షము గలిగి గోదావర్యాది నదులు బాగుగ ప్రవహించును. పూర్ణిమా ప్రాంతమున గాలితోగూడిన మంచి వర్షములు గలుగును.

ధరలు :—ధాన్యము, వస్త్రములు ధర నిలబడియుండును. కొబ్బరి, అరటి, పసుపు ధర మందముగ నుండును. బెల్లము శర్కర మధురసవస్తువులును క్రమముగ మందముగ నుండును. పప్పుపదార్థములును తైలములును నిలబాటుగ నుండును. వెండికి శుక్లములో ధర చురుకగును. బంగారమునకు ధర మందమగును.

భాద్రపదమాసము :—ఆశ్వినం 4 హస్త ౧ ర్కః. 10 చిత్రా ౧ ర్కః.

బు ౮ అ. ప॥ పురోగురుడు (రాహువ్యవధానం) సుర్యాగ్ర శని. బ ౮ అ. ప్ర. పురోబుధ రవి మధ్యము, అనావృష్టి యోగములు—మాస మంతయు ప్రాఙ్మఘాది పంచక శుక్రుడు. శు ౬ గు. ప. బుధాగ్ర శుక్రుడు. శు ౧౩ గు. ప. బుధశుక్రుల కేక రాశ్యంశ యుతి. శు ౬ గు. బుధ శుక్ర యుద్ధము. శు ౬ గు. ప్ర॥ బ ౮ అ. ప॥ శుక్రాగ్ర బుధుడు. బ ౧ అ. ప్ర॥ బ ౩౦ అ. ప॥ బుధశుక్రుల కేక రాశి యోగము బ ౮ అ. ప్ర॥ బ ౩౦ అ. ప॥ బుధాగ్ర గురుడు (రాహువ్యవధానం). బ ౧౨ శు. కుజ వక్రారంభము. ఇత్యాది వర్షయోగములు గలవు. భాద్రం 24 నుండి 27 వరకును. ఆశ్వినం 4 నుండి 10 వరకును 15, 16, 17, 20 లందును నాడియోగములు. భాద్రం 23, 24, 27, 28, 31 నుండి ఆశ్వినం 7 వరకును, ఆశ్వినం 10, 11, 12, 15, 16, 19, 20 లందును చాంద్రయోగములు గలవు. ఇందు మాసాదియందును మాసాంతమందును ఖండవృష్టిగనుండినను, మధ్యకాలములో పూర్ణిమా ప్రాంతమున శుక్లమందును బహుళమందును మంచి వర్షములు దేశ మంతటను బాగుగ గురియుచుండును. అమా ప్రాంతమున వాయుభీతియు గలుగవచ్చును.

ధరలు :—ధాన్యము, వస్త్రములు, ధర మందముగ నుండును. కొబ్బరి, అరటి, పసుపు, కొంచెము ధర చురుకగును. బెల్లము, శర్కర, మధురసవస్తువులు కొంచెము ధర చురుకుగనుండును. పప్పు పదార్థములు ధర మందమై సులభములగును. వెండికి బహుళములో ధర హెచ్చగును. బంగారమునకు ధర మందమగును.

ఆశ్వయుజమాసము:—కార్తికం 1 స్వాతి ౧ రవిః, 15 విశా ౧ రవిః.

మాసాదినుండి శు ౯ మం. ప॥ పురో బుధ రవి మధ్యము. (శు ౪ గు. ప॥ రవి బుధుల మధ్యను, పిమ్మట రవి శుక్రుల మధ్యను రాహు వ్యవధానము. శు ౧౦ బు. ప్ర॥ బ ౭ బు. ప॥ పురోగురుడు. శు ౧౦ బు ప్ర. మాస మంతటను బుధాగ్ర శని॥ శు ౧౫ సో. ప్ర॥ బ ౩౦ మం॥ ప॥ ప్రాక్స్వాతీత్రయ శుక్రుడు. బ ౪ శు. ప్ర॥ బ ౧౧ శు. ప॥ బుధ శనుల కొక రాశి. బ ౧౦ గు. ప్ర॥ బ ౩౦ మం. ప. పురోబుధ రవి మధ్యము ఇత్యాద్యనావృష్టి యోగములు—శు ౧౫ సో. ప. ప్రాఙ్మఘాదిపంచక శుక్రుడు. శు ౧ సో. ప్ర॥ శు ౧౦ బు. ప॥ బుధాగ్రగురుడు. గుర్వగ్ర శని. శు ౧ సో. ప్ర॥ బ ౪ బు. ప॥ బుధ గురుల కేకరాశ్యంశయోగము. శు ౩ బు. శుక్రాస్తం. శు ౭ సో. గుర్వస్తము. శు ౧౦ బు. బుధ గురు సమాగమము. శు ౧౦ బు. ప్ర॥ బ ౭ బు. ప॥ గుర్వగ్రమున బుధుడు. శు ౧౦ బు. ప్ర॥ గురు శుక్రుల కేకరాశ్యంశయుతి. శు ౧౦ బు. ప్ర॥ బ ౪ శు. ప॥ బుధ శుక్రుల కేకరాశి. బ ౭ బు. గురు గాఢాస్తము. బ ౯ గు. గురు శుక్ర యుద్ధము. బ ౧౧ శు. ధనుస్సునందు శని. బ ౩౦ మం. శుక్ర గాఢాస్తము, ఇత్యాది వర్షయోగములు గలవు. ఆశ్వినం 21, 23, 24, 28, 29, 30 కార్తికం 1, 5, 6, 7, 12, 13, 14, 15, 18, 20 నాడీయోగములు. ఆశ్వినం 21, 23, 24, 25, 27 నుండి కార్తికం 14 వరకును, 16, 17, 18, 20 చాంద్రయోగములు. ఇందు శుక్లమున క్రమముగ నచటచట మంచి వర్షములు గలుగును. బహుళమున గాలితోగూడిన సాధారణ వర్షములు అమా ప్రాంతమున నచటచట గలుగును.

ధరలు:—ధాన్యము, వస్త్రములు మందముగనుండి అమా ప్రాంతమున కొంచెము చురుకగును. కొబ్బరి, అరటి, పసుపు ధర నిలబాటుగ నుండును. బెల్లము శర్కర మొదలగు మధురస వస్తువులు క్రమముగ బహుళమున మందమగును. పప్పుజాతులు తైలపదార్థములు క్రమముగ ధరగలవి యగును. వెండి బంగారములకు ధర క్రమముగ మందముగనగును.

కార్తికమాసము:—కార్తికం 28 అనూ ౧ రవిః.

బ ౧౧ అ. ప॥ బుధాగ్ర శని. శు ౬ అ. ప్ర॥ శు ౮ సో. ప॥ రవి కుజ సమసప్తకము. శు ౧౩ సో. ప్ర॥ బ ౭ శు. ప॥ బుధ శనుల కొక రాశి. బ ౧౧ అ. ప్ర॥ శుక్రాగ్ర శని. బ ౧౧ అ. ప్ర॥ బ ౩౦ బు. ప॥ పురోబుధుడు. బ ౧౪ మం. ప్ర॥ శని శుక్రుల కేక రాశ్యంశ యోగము. బ ౩౦ బు. ప్ర॥ పురశ్శుక్ర రవి మధ్యము—ఇత్యాది అనావృష్టియోగములు—శు ౧౫ శ. ప॥ గురు శుక్రుల కేక రాశి. ఆశ్వ బ ౩౦ మం. ప్ర॥ కార్తిక బ ౧౧ అ. ప॥ పురశ్శుక్రుడు, శుక్రాగ్రబుధుడు. (బుధాగ్ర శని). ఆశ్వ బ ౩౦ మం॥ ప్ర॥ కా బ ౨ శు ప॥ పశ్చిమస్వాతీత్రయ శుక్రుడు. శు ౫ శ. ప్ర॥ శు ౧౩ సో. ప॥ బుధ శుక్రుల కొక రాశి. శు ౮ సో. మేషమున వక్రకుజుడు. గురూదయమున్ను, బ ౪ అ. ప్ర॥ బుధవక్రము. బ ౮ బు. శన్యస్తము. బ ౯ శు. ప్ర॥ బ ౧౪ మం. ప॥ బుధ శుక్రుల కేకరాశ్యంశ యోగము. బ ౧౧ అ. పడమట బుధ శుక్రయుతి. బ ౧౧ అ. ప్ర॥ బ ౩౦ బు. ప॥ బుధాగ్రశుక్రుడు, ఇత్యాది వర్షయోగములు గలవు. కార్తికం 22, 25, 26 అగ్రహాయణం 2 నుండి 8 వరకున్ను, 11, 16, 17, 18 లందును నాడీయోగములు. కార్తికం 21, 22, 25, 26, 29 నుండి అగ్రహాయణం 9 వరకును 11, 12, 13, 16, 17లందు చాంద్రయోగములున్ను గలవు. ఇందు అచటచట వాయుమిశ్రితములగు వర్షములు గలుగుచుండును. పూర్ణిమావాస్యా ప్రాంతములందు ఒక్కొకచో వాయుపీడ గలుగవచ్చును.

ధరలు:—ధాన్యము, వస్త్రములు, శుక్లముకంటె బహుళమునందు క్రమముగ ధర తగ్గుదల గలవియగును. కొబ్బరి, అరటి, పసుపు క్రమముగ ధర చురుకుగలవి యగును. పప్పు పదార్థములు ధర గలిగి దుర్లభము లగును. బెల్లము, శర్కర, మధురస పదార్థములు ధర నిలబడి యుండును. అమా ప్రాంతమున వెండికి ధర గలుగును. బంగారమునకు క్రమముగ ధర చురుకగును.

మార్గశిరమాసము:—శు ౨ శు. ప॥ పురశ్శుక్ర రవి మధ్యము. శుక్రాగ్ర శని. శు ౨ శు. శ శుక్ర శనియుతి. బ ౮ గు. ప॥ శుక్ర శనుల కేకరాశ్యంశయుతి. శు ౨ శు. ప్ర॥ శుక్రాగ్ర కుజుడు (కేతు వ్యవధానము) శు ౨ శు. ప్ర॥ శు ౧౦ శ. ప॥ రవ్యగ్రశని. శు ౫ సో ప్ర॥ రవి శనుల కేకరాశియోగము. శు ౧౦ శ. ప్ర॥ బుధాగ్ర శని. బ ౧౧ సో. ప్ర॥ బుధ శనుల కేకరాశ్యంశయుతి. ఇత్యాద్యనావృష్టి యోగములు—శు ౧౦ శ. ప॥ బుధ వక్రము. శు ౨ శు. శుక్రోదయము. శు ౧౦ శ. శని గాఢాస్తము. శు ౧౦ శ ప్ర॥ పురశ్శుక్రుడు (శుక్రాగ్రకుజుడు) బ ౨ అ. ప్ర॥ బ ౧౧ సో. ప॥ బుధ గురుల కేక రాశి. బ ౧౨ మం. శన్యుదయం. ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందు అచటచట సాధారణ వర్షములు, మేఘాడంబరము, గలుగుచుండును. దక్షిణదేశమున మంచి వర్షములు గలిగి కావేర్యాది నదులు బాగుగ ప్రవహించును.

ధరలు:—ధాన్యము వస్త్రములు కొంచెము హెచ్చుచు తగ్గుచు నుండును. బెల్లము శర్కర మధురసవస్తువులు ధర నిలబాటుగ

నుండును. పప్పు పదార్థములు తైలములు ధర చురుకుగ నుండును. కొబ్బరి, అరటి, పసుపు మాసాంతమునకు ధర మందమైనవగును. వెండి ధర తగ్గును బంగారమునకు బహుళములో ధర హెచ్చగును.

పౌషమాసము:—శు ౨ ఆ. ప॥ బుధాగ్ర శని. బ ౨ సో. ప॥ బుధ శనుల కేక రాశ్యంశయుతి. శు ౨ ఆ. బుధ శనియుతి. మాస మంత టను శుక్రాగ్ర కుజుడు (కేతువ్యవధానము) శు ౨ ఆ. ప్ర॥ సుర్వగ్ర శని. పురశ్శుక్ర రవి మధ్యమము. ఇత్యాద్యనావృష్టి యోగములు— మాస మంతయు పురశ్శుక్రుడు. (శుక్రాగ్ర కుజుడు) బ ౧౪ శ. వృషభమున కుజుడు. ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందపుడపుడు మేఘాడంబరము గలుగుచుండును.

ధరలు:—ధాన్యము వస్త్రములును బహుళమున ధర గలవి యగును. కొబ్బరి అరటి పసుపు మందముగ నుండును. బెల్లము. శర్కర, మద్రస వస్తువులు. కొంచెము చురుకు గావచ్చును. పప్పు పదార్థములు దుర్లభములుగ నుండును. బంగారమునకు ధర మంద మగును. వెండికి బహుళములో ధర చురుకగును.

మాఘమాసము:—శు ౬ శ. ప॥ పురశ్శుక్ర రవి మధ్యము. బ ౧౮ ఆ. ప॥ శుక్రాగ్రకుజుడు. (కేతు వ్యవధానం) మాసమంతయు సుర్వగ్ర శని. శు ౬ శ. ప్ర॥ పురోబుధుడు. శు ౯ మం. ప్ర॥ రోహిణీ కుజుడు. బ ౧౮ ఆ. ప్ర॥ కేవల శుక్రాగ్రకుజుడును అనావృష్టి యోగములు—శు ౬ శు. ప్ర॥ శు ౧౦ బుధ శుక్రుల కేక రాశి. శు ౬ శ. ప్ర॥ బుధాగ్ర శుక్రుడు. (శుక్రాగ్రకుజుడు) బ ౩ ఆ. ప్ర॥ బుధ శుక్రుల కొక రాశి ఇత్యాది వర్షయోగములు గలవు. ఇందు అపుడపుడు స్వల్ప మేఘాడంబరము గలిగి తేలుచు గాలి వీచుచుండును.

ధరలు:—ధాన్యము, వస్త్రములు, ధర గలిగి యుండును. బెల్లము, శర్కర, మద్రస వస్తువులును క్రమముగ ధర గలవి యగును. కొబ్బరి, అరటి, పసుపు, మాసాంతమునకు కొంచెము ధర చురుకైనవి యగును. పప్పు పదార్థములు తైలములు క్రమముగ సులభము లగును. పూర్ణిమా ప్రాంతమున వెండికి కొంచెము ధర గలుగును. బంగారమునకు ధర నిలబాటుగ నుండును.

ఫాల్గునమాసము:—మాస మంతయు శుక్రాగ్రకుజుడు. సుర్వగ్ర శని. బ ౫ ఆ. ప॥ పురోబుధుడు. శు ౯ సో. ప॥ రోహిణ్యంగారకుడు. బ ౫ ఆ. ప్ర॥ వత్సరాంత పర్యంతము పురశ్శుక్ర రవి మధ్యము. ఇవి అనావృష్టి యోగములు—బ 3 శు. ప॥ బుధాగ్ర శుక్రుడు (శుక్రాగ్రకుజుడు) శు ౬ ఆ. ప॥ బుధ శుక్రుల కేక రాశి. శు ౩ సో ప్ర॥ వత్సరాంతపర్యంతము మృగశీర్షాంగారకుడు. శు ౯ గు. ప్ర॥ వత్సరాంత పర్యంతము బుధవక్రము. బ ౫ ఆ. మిథునమున కుజుడు. ఇత్యాది వర్షయోగములును గలవు. ఇందు పూర్ణిమా ప్రాంతమునుండి అచటచట మబ్బులు అధికముగ నుండును. గాలి వీచుచుండును. అమా ప్రాంతమున నచటచట పర్వత ప్రాంతములందు మంచి వానలును గలుగవచ్చును.

ధరలు:—ధాన్యము వస్త్రములు క్రమముగ ధర గలిగి దుర్లభము లగును. బెల్లము శర్కర మద్రస వస్తువులు కొబ్బరి, అరటి, పసుపు, మొదలగునవి ధర నిలబాటు గలిగియుండును పప్పు పదార్థములు కొంచెము చురుకుగను. బంగారమునకు ధర మందముగ నుండును. వెండికి ధర బహుళములో మొదట చురుకగును.

**N. B.** పై గ్రహయోగములందు పురోబుధుడు, పురోగురుడు పురశ్శుక్రుడు మొదలగు యోగములందు ముందువెనుకలు రవిని బట్టి యని గ్రహింపవలయును.

---

## గోచార ఫలములు

ఈ ఫలములు జన్మకాలిక నక్షత్రమునకైన రాశి (చంద్రలగ్నము) వలనగాని, నామనక్షత్రమునకైన రాశివలనగాని తెలియవలయును. కాని జన్మలగ్నమునుబట్టి గ్రహఫలములను చూచి రెండిటికి నగు ఫలమును కలిపి గ్రహించుట యుక్తము.

### మేషము (అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)

ఈ రాశివారికి సగటున రాబడియు, సౌఖ్యములును బాగుగనే యుండును. కాని గురున కష్టమను స్థితి జనవరినుండి గలుగుట రాహుకేతువులు శనియు మంచివారైనను అనారోగ్యము ప్రయాణములచే క్లేశము గలుగుచుండును. జ్యేష్ఠాషాఢములలో వీరు నూతన కార్యములను ఆరంభింపక పోవుట మంచిది. అధిక నిజశ్రావణములలో ఉదుకు సంబంధమైన అనారోగ్యము గలుగవచ్చును. వర్తకులకు వ్యవసాయదారులకు శ్రమాధిక్యమున్నను ఫలితము కొంచెము గలుగును. ఉద్యోగులకు అక్టోబరు నవంబరు డిశెంబరులలో అభివృద్ధి గలుగవచ్చును. విద్యార్థులకు సెప్టెంబరు అక్టోబరులు పరీక్షలకు తగినవి.

### వృషభము (కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా)

ఈ రాశివారికి మనోవ్యాకులత, వృథాకలహములు, శరీరానారోగ్యము తొలుత 2 మాసములు కలవరపెట్టునుగాని తర్వాత మధ్యకాలములో 2 మాసములు ప్రయాణములు తరుచు గలిగినను విశ్రాంతి యుండును. అధికశ్రావణమునుండి తిరుగ 2 మాసములు బొత్తిగ విశ్రాంతి లభింపని స్థితి యేర్పడినను తర్వాత క్రమక్రమముగ ఒకవంక శరీరమందును కుటుంబమందును అనారోగ్యాదులు గలుగుచున్నను కుటుంబసౌఖ్యముచే నవియన్నియు సమసిపోగలవు. భాద్రపదాశ్వయుజములందును మాఘ ఫాల్గునములందును శరీరానారోగ్యము కొంచెము గలుగును. వర్తకులకు వ్యాపారము కర్షకులకు వ్యవసాయము విశేష లాభకరముగ నుండకపోయినను ఉత్తరార్థమున మిశ్రమఫలము గలిగి కొంచెము లాభముగ నుండును. ఉద్యోగులకు జనవరినుండి కొంత ఉపయోగము గలదు. విద్యార్థులు అనారోగ్యాదులచే విశేషశ్రమ పడినగాని స్వల్పఫలమునైన నందజాలరు.

### మిథునము (మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా)

ఈ రాశివారికి మొదట 2 మాసములవరకు ప్రయాణక్లేశము ధనవ్యయము గలిగినను మధ్యకాలములో ధనలాభము కార్యసిద్ధి, వివాదములందు జయము, సంతతి సౌఖ్యము గలుగును. తిరిగి జనవరినుండి ధనవ్యయము, మనఃక్లేశము ప్రయాణాదులచే శ్రమయు గలుగును. మధ్యకాలము చాల మంచిది. ఉద్యోగులకు వేతనాభివృద్ధి లభించును. వర్తకులకు మధ్యకాలములో మంచి లాభములు గలుగును. వ్యవసాయదార్లకు మొదటి పంట మంచి లాభప్రదము. రెండవ పంటలో లాభనష్టములు సమముగ నుండును. జనవరినుండి పెట్టుబడి హెచ్చును. విద్యార్థులకు సెప్టెంబరు అక్టోబరులు మంచి ఫలితము నియ్యగలవు. సగటున ధనవ్యయ మీ రాశిగలవారికి అధికమగును.

### కర్కాటకము (పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈ రాశివారికి గ్రహసంచారము మంచి ఫలితము నిచ్చును. సగం కాలమువరకు సామాన్యముగ నున్నను ఉత్తరార్థము కార్యసిద్ధి, కళత్రసౌఖ్యము, శత్రుజయము, ఉత్సాహము మొదలగు అనేక శుభఫలముల గలుగచేయును. విద్యార్థులకు విద్యాభివృద్ధి, వ్యవసాయదారులకు మంచి పంటలు, ఉద్యోగులకు ఉన్నతాధికారము వేతనాభివృద్ధి ఉత్తరార్థమున గలుగును. మొదట కళత్రానారోగ్యము, మధ్యకాలములో సంతతికి అనారోగ్యము కొంచెము గలిగినను అవి గణింపదగినవి గావు.

### సింహము (మఘ, పూఫ, ఉఫ 1 పా)

ఈ రాశివారికి పూర్వార్ధకాలము చాల మంచిది. కాని అందు వైశాఖాదిగ 3 మాసములు కళత్రసౌఖ్యము తక్కువగ నుండును. కాని కార్యసిద్ధి ధనలాభము గౌరవము గలుగును. ఉత్తరార్ధ కాలములో ధనమునకు వ్యయమధికము. సుఖము అల్పముగ నుండును మనోవ్యాకులత్వము గలుగుచుండును. కాని వ్యవసాయదార్లకు పంటలు అనుకూలముగ నుండును. వర్తకులకు వ్యాపారమువలన లాభములు గలుగును. ఉద్యోగులకు మధ్యమముగ నుండును. విద్యార్థులు పరిశ్రమ చేయవలయును. ఉత్తరార్థమే విద్యార్థులకు ప్రమోజనకరముగ నుండును.

### కన్య (ఉఫ 2, 3, 4 హస్త, చిత్త 1, 2 పా)

ఈ రాశివారికి మిశ్రమముగ నుండును. ఒకవైపు మనోవిశ్రాంతి లేకున్నను, అప్రయత్నముగ కార్యసిద్ధి, ధనలాభము గలుగుటచే మనోధైర్యము గలుగుచుండును. జ్యేష్ఠాషాఢాధికశ్రావణములందు కళత్రమునకుగాని తనకుగాని అనారోగ్యాదులు గలుగుటచే కళత్రసౌఖ్యము తగ్గుచుండును. ఉత్తరార్ధకాలమున కార్యవిఘాతము, స్థానచలనము, బంధుమిత్రులతో ఎడబాటు, శరీరానారోగ్యము మొదలగువాటిచే మనశ్శాంతి లేకున్నను విశేష శ్రమలేక దేవతారాధనచే సుఖమునందుట గలుగును. ప్రారంభకాలమున ధనవ్యయమైనను విశేష లాభము సంతతి సౌఖ్యము, శుభకార్యములు వీటిచే ఆనందము గలుగును. పూర్వార్థకాలమున వ్యాపారముచే వర్తకులకు లాభము గలుగును, వ్యవసాయదారులకు కృషి ఫలించును. ఉద్యోగులకు ఉన్నతాధికారప్రాప్తి, విద్యార్థులకు విద్యాభివృద్ధి. ఉత్తరార్థకాలమున విద్యార్థులకు పరిశ్రమ చాల ఆవశ్యకము. గ్రహచారము నమ్మదగినది గాదు.

### తుల (చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

ఈ రాశివారికి పూర్వార్ధ కాలముకంటె నుత్తరార్ధ కాలము మంచిది. అందు మధ్యకాలము ఆషాఢ, శ్రావణ, భాద్రపదాశ్వయుజములు సుఖకరములుగావు. మొదట చైత్ర వైశాఖములు జ్యేష్ఠంలో కొంతవరకును అంత శ్రమకరముగాదు. ఆ కాలము మిశ్రముగ నుండును. ఈ మిశ్రకాలములో ధనవ్యయము దేహశ్రమ మిత్రకలహములు గలుగుచున్నను. విశేష ధనలాభము, అభీష్టకార్యసిద్ధి గలుగును. ఉత్తరార్థకాలమునందు ఉద్యోగులకు వేతనాభివృద్ధి, విద్యార్థులకు విద్యాభివృద్ధి, వివాహాది శుభకార్యప్రాప్తి, గౌరవము సన్మానము జరుగును. వర్తకులకు విశేష లాభములు వ్యవసాయదారులకు మంచి పంటలు గలుగును. మధ్యకాలములో ఎవరైనను దేవతాపూజాదులచే గ్రహశాంతి చేసికొనుట మంచిది. సగటున ధనలాభము శుభకార్యములు మొదలగు మంచి ఫలములు గలుగుచున్నను భాద్రపదమాసమునకు ముందునుండి సంవత్సరాంతమువరకు తనకుగాని భార్యకుగాని అనారోగ్యము మొదలగునవి గలుగుటచే కళత్రసౌఖ్యము తక్కువగ నుండును.

### వృశ్చికము (విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ రాశివారికి ఇంకను శ్రమపడవలసిన రోజులు గలవు. శనిచారము మంచిది గాదు. కాని జ్యేష్ఠాషాఢములలో గురుడు శుభుడు. ఉత్తరార్ధ కాలమునందు రాహుచారము శుభము. గావున దేహశ్రమ ధనవ్యయము గలుగుచున్నను, ధనలాభము, కార్యసిద్ధియు కొంత గలుగుచుండును. మధ్య మధ్య కళత్రసౌఖ్యమునకు విఘాతము గలిగినను కార్యసిద్ధి శత్రు జయములున్ను గలుగుచుండును. వర్తకులకు వ్యవసాయదారులకు ఉద్యోగులకు శ్రమ అధికమైనను కొంచెము ఫలము గూడ గలుగుచుండును. విద్యార్థులకు సంవత్సరాంత్యకాలము కొంత మేలుచేయగలదు. ఉత్తరార్ధ కాలములో లాభప్రాప్తి బుద్ధివికాసమున్ను దేహశ్రమ మనోవ్యాకులతయున్నను గలుగుచుండును.

### ధనుస్సు (మూల, పూషా, ఉషా 1 పా)

ఈ రాశివారికి పరదేశప్రయాణములు బంధుజన దూరస్థితి, మిత్రవిరోధము గలుగుచున్నను, పుణ్యతీర్థయాత్రలు, తన్మూలక